FAS

# 'అంబా' దర్శన గ్రంథమాల

## మహారాజ పోషకులు :

1. శ్రీమతి క్రొ. యామినీదేవిగారు (కూచిపూడి)
2. శ్రీ సేఠ్ బెద్ద జగదీశ్వరయ్యగారు (సికిందరాబాద్)
3. శ్రీ కొ. మాధవయ్యగారు (తెనాలి)

## రాజపోషకులు :

శ్రీ కా. సంగయ్యగారు (కూచిపూడి)

శ్రీ వెంకట్రావుగారు (వరంగల్)

శ్రీ బి. శంకరలాల్ గుప్త (హైదరాబాద్)



శ్రీ కొత్తపల్లి యామినీ దేవి

స్వ. కో. వెంకటసుబ్బయ్య, అచ్చమ్మగార్ల పుత్రిక. ఈయమ మా గ్రంథమాలకు ముఖ్య పోషకురాలు. ఈ గ్రంథమును హిందీలో మాతాపితరుల స్మారకముగా ముద్రింపజేసిన యుదార నారీమణి.

# అర్థ - ధర్మ - మీమాంస

## ( अर्थ - धर्म - मीमांसा )

**पण्डित ईश्वरचन्द्रशर्मा**

పండిత గోపదేవ్

అనుకర్త

# అర్థ - ధర్మ - మీమాంస

## ( अर्थ - धर्म - मीमांसा )

पण्डित ईश्वरचन्द्रशर्मा

పండిత గోపదేవ్

అనుకర్త

# ‘అంబా’ దర్శనగ్రంథమాల

## మహారాజపోషకులు :

1. శ్రీమతి క్రో. యామినీదేవిగారు (కూచిపూడి)
2. శ్రీ సేఠ్ బెల్దె జగదీశ్వరయ్యగారు (సికిందరాబాద్)
3. శ్రీ కో. మాధవయ్యగారు (తెనాలి)

## రాజపోషకులు :

శ్రీ కా. సంగయ్యగారు (కూచిపూడి)

శ్రీ వెంకట్రావుగారు (వరంగల్)

శ్రీ బి. శంకరలాల్ గుప్త (హైదరాబాద్)



శ్రీ కొత్తపల్లి యామినీ దేవి

స్వ. శ్రీ. వెంకటసుబ్బయ్య, అచ్చమ్మ గార్ల పుత్రిక. ఈయమ మా గ్రంథమాలకు ముఖ్య పోషకురాలు. ఈ గ్రంథమును హిందీలో మాతాపితరుల స్మారకముగా ముద్రింపజేసిన యుదార నారీమణి.



స్వ|| కోగంటి వెంకట సుబ్బయ్యగారు  స్వ|| కోగంటి అచ్చమ్మగారు

स्व० कोगण्टि वेंकट सुब्बय्या  स्व० कोगण्टि अच्चम्मा

# అర్థ - ధర్మ - మీమాంస

## (ధనిక - సామ్య - వాదముల విమర్శ)

గ్రంథకర్త:

పండిత ఈశ్వరచంద్రశర్మా

అనుకర్త:

పండిత గోపదేవ్

ఆర్యసమాజము - కూచిపూడి

తెనాలి తాలూకా, ఆంధ్రప్రదేశము.

**1957**



పండిత ఈశ్వరచంద్రశర్మగారు

पण्डित ईश्वरचन्द्र शर्मा

# గ్రంథపరిచయము

ఈ క్రింది గ్రంథకర్తృవచనముల ద్వారా పాఠకు లీ గ్రంథ మహాత్వ్యమును గుర్తింతురు గాక !

"అర్థమును వ్యక్తిగత జీవనమునకు, సామాజిక జీవనమునకు నని వార్య సాధనముగా నెంచు భారతీయార్థశాస్త్రజ్ఞులు క్రయ విక్రయాది వ్యవహారములను నిరూపించియున్నను నర్థ సంబంధమగు ప్రతి వస్తువును గూర్చియు విశేషముగ వివేచించి యుండలేదు. సాంఖ్య, న్యాయ వైశేషికాదుల రచయితలు ప్రత్యక్షాది ప్రమాణ ములను గూర్చియు, నాత్మాది ప్రమేయములను గూర్చియు సూక్ష్మాతి సూక్ష్మ విచారణ నొనర్చినట్లు భారతీయార్థశాస్త్ర కర్తలు, పణ్యములు, మూల్యము, మూలధనము, వృద్ధి మున్నగు విషయములను లక్షణ పరీక్షణలద్వారా సూక్ష్మ వివేచన చేసి యుండ లేదు. పాశ్చాత్య విద్వాంసు లీ విషయములను బాగుగ నిరూపించి యున్నారు. అందువలన నర్థ వ్యవస్థ విషయమున ననేక మతములు పశ్చిమ దేశములందు వ్యాపించి యున్నవి.

ఆత్మ, పరలోకము, మున్నగు విషయములలో భారతమున ననేక సంప్రదాయము లాచరణలో నున్నవి; కాని, యర్థ విషయ మున వివిధ మతములు కానీ, వాని ననుసరించు సంప్రదాయములు కానీ యిట నుద్భవిల్లవయ్యె. గత శతాబ్దమున మార్క్సు అర్థ విషయమున యుగాంతరకరము లగు నాలోచనలు ప్రకటించి యున్నాడు. నేడన్ని దేశములందును వాని ప్రచారముకూడ జరుగుచున్నది.

మార్క్సు, అతని యనుచరులు నయిన యర్థశాస్త్రిల సమాజ వాద (సామ్యవాద) మాత్మరహితమై యున్నది. మార్క్సు

వారు లే యే దేశములం దున్నారో యా దేశములందు వారు బలపూర్వకముగ సామ్యవాదమును నాచరణలో బెట్ట జూచు చున్నారు. అందుల కుచితానుచిత సాధనములను ప్రయోగింప వెనుకాడ కున్నారు. తమ విరోధులలో హత్యల ద్వారా భీతిని గలిగించుటకును సంకోచింప కున్నారు. సామ్యవాద ప్రచారము నకు ధర్మము నడ్డుగా దలంచి దానిని నాశన మొనర్చుటకు సంపూర్ణ బలము నుపయోగించు చున్నారు. వర్గ కలహములను ప్రజ్వలింప జేయుట సామ్యవాదులకు ముఖ్య కర్తవ్యమైనది. ఇట్టి యాందోళనలు భారతమునందు తీవ్ర వేగముతో వ్యాపించు చున్నవి. ఇయ్యవి హానికారకములు. అంధానుకరణ మొనర్చు కొందఱు వ్యక్తులు జనులలో భయమును వ్యాపింప జేసినందున సమాజ శ్రేయస్సు కలుగజాలదు.

ఈ గ్రంథమున సామ్యవాదమునకు సంబంధించిన యాలోచనలు పరీక్షింపబడినవి. మూలధనము, వృద్ధి, మూల్యము మున్నగునవి యర్థధర్మములు. పరలోకము, కర్మఫలము మున్నగునవి యాత్మ ధర్మములు. వీనిలో పరస్పరము నెట్టి విరోధమును లేదు. మార్క్స్ పారలౌకిక వస్తువును గూర్చి విచారింపడు. అర్థ ధర్మ మీమాంస, యాత్మసిద్ధాంతమును సమాజసంబద్ధ మగు నర్థవ్యవస్థకు శుభము కలిగించునదిగా ఋజువు చేయును. మార్క్స్ శ్రమ. యుపయో గిత రెండును మూల్యమునకు కారణము లనును. వాస్తవమున నా రెండే కాక జ్ఞానము కూడ మూల్యమునకు కారణ మగుచున్నది. మార్క్స్ ముఖ్యముగా శ్రామికుల శ్రమయే మూల్యమునకు కారణ మనుచున్నాడు. కాని మూల్యోత్పత్తికి శ్రామికుని శ్రమతో బాటు, మూలపతియొక్కయు, నుపభోక్తలయొక్కయు శ్రమ కూడ కారణ మగును. ఆత్మవాదులలో కొందఱు దారిద్ర్యమును పూర్వ

జన్మ కర్మ లుత్పన్నము చేయు నందురు; కాని, కేవలము పూర్వజన్మ కర్మలే దారిద్ర్యమును కలిగింపవు. ప్రస్తుత మాచరణములో నున్న యర్థవ్యవస్థ సహాయముతో పూర్వజన్మ కర్మలు దారిద్ర్యమునకు కారణము లగును.

ఎంగల్సు, అతని యనుచరులును 'మానవు లందఱు ప్రప్రథమమున గమ్యాగమ్య వివేకము లేనివా రనియు, వివాహాది పవిత్ర సంబంధముల నెరుగ రనియు' నమ్ముచున్నారు. వారి మతము ననుసరించి చూచిన నాదికాలమున సజ్ఞానులయిన మనుష్యు లందఱు వన్యదశలో నున్నపుడు వారిలో గల యర్థార్జన పద్ధతుల మూలమున తదుపరి వివాహాదు లేర్పడినవి. కాని, యిది యేకాంత సత్యము కాదు. ప్రాచీనార్యులలో సర్గారంభము నుండియు వివాహ మాచరణములో నున్నది. వివాహ ధర్మమునకు మూలము వేదముల తత్త్వజ్ఞానము. యుగయుగములలో పరివర్తనము చెందుచు వచ్చిన యార్థిక వ్యవస్థ యార్యులలో వివాహ బంధనము నుత్పన్నము చేసియుండలేదు. ముఖ్యముగా నీ గ్రంథమున నీ విషయములే పరిశీలింపబడినవి. మార్క్సు క్యాపిటల్, ఎంగల్సు డ్యూరింగ్ మతఖండనము, పరివారము, వ్యక్తిగత సంపత్తి, శ్రీపాద అమృత డాంగేగారి 'భారత్' మున్నగు గ్రంథము లందు ప్రదర్శించిన యాలోచనల నీ గ్రంథమున విమర్శించి యున్నాము. విచారకులైన పాఠకు లీ గ్రంథము నామూలాగ్రము పఠించి తత్త్వనిర్ణయమును చేయుదురుగాక. తత్త్వ గ్రహణము బుద్ధి స్వభావము."

ఇట్టి విషయములతో నీ గ్రంథము నిండియున్నది. శ్రీ పండిత ఈశ్వరచంద్ర శర్మగారు గ్రంథమును హిందీభాషలో రచియించి యుండిరి. అది యీ తెలుగు రచనకు మూలము. విషయ గౌరవము

ననుసరించి నే నా గ్రంథమునకు విశేషించి శబ్దానువాదమునే చేసి యున్నాను. అందువలన రచనలో నక్కడక్కడ కొంచెము క్లిష్టత యేర్పడి యుండవచ్చును. పాఠకులు మన్నింతురు గాక. శర్మగారు తమ మూల గ్రంథమును (హిందీ) మా గ్రంథమాల తరఫున ప్రకటించుటకును, తెలుగులో ననువదించుటకును నా కధి కార మొసంగినందులకు వారికి నే నెంతయు కృతజ్ఞుడను.

కాగితముల మూల్యము మాత్రము గ్రహించి యత్యంతస్వల్ప కాలములో నీ గ్రంథము నతి సుందరముగా ముద్రింపజేసి మా గ్రంథమాల కెంతో సహకార మొనర్చిన శ్రీ కొసరాజు మాధవయ్యగారికి నేను శతశః ధన్యవాదముల నొనర్చుచున్నాడ. వారి యీ సహకార భావము మిక్కిలి ప్రశంసార్హము. వారికి భగవంతు డాయురారోగ్యముల నొసంగి వర్ధిల జేయు గాత! మిత్రభావముతో శ్రీ కొసరాజు మాధవయ్యగారు మాకు చేసిన మహోపకారమునకు మేము సర్వదా కృతజ్ఞులమై యుందుము.

తెలుగు సాహిత్యమున కీ గ్రంథ మనేక దృష్టులతో నవీనము. కావున పాఠకులు పుస్తకమును చదువునపుడు (గ్రంథాంతమున నున్న) పారిభాషిక పదముల కర్థములను ముందుగా చదువుదురు గాక! అట్లు చేయకున్న పుస్తకము సుబోధకము కాదు. విషయ మును బట్టి నవీన పదములు పుస్తకమున ప్రయోగింపక తప్పినది కాదు. ఓపికతో చదువువారి కీగ్రంథ మొకింత జ్ఞానాభివృద్ధిని కలిగించు ననియు, సామ్యవాదమునకు చెందిన యర్థవ్యవస్థ ధర్మ విరుద్ధము కావలసిన యవసర ముండ దనియు పాఠకులు గుర్తింతు రని మా విశ్వాసము.

గోపదేవ్

# శ్రీ బి. శంకరలాల్ గుప్త

జనకుడు : స్వర్గీయ రామదయాల్ సేడ్ మల్

జనని : ,, సురజీబాయి

అగ్రజులు : శ్రీ జ్వాలాప్రసాద్<br>
భగత్ రామ్ గుప్త<br>
సత్యనారాయణ

సతీమణి : సరజూబాయి

ఈయన హైదరాబాద్ నగరమున అగ్రవాల్ వ్యాపారులలో ప్రతిష్ఠిత సంపన్న గృహస్థుడు. సిరిపుర్ పేపర్ మిల్సుకు, ఆల్విన్ మెటల్ వర్క్సుకు ఏజంట్లు. మా స్నేహమునకు పాత్రుడు. ధార్మిక సంస్థలకు సహకార మొనర్చుటలో వెనుకంజ వేయడు. ఈ గ్రంథము నచ్చొత్తించుటకు వలయు కాగితముల వ్యయము నొసంగి మా గ్రంథమాలకు చేసిన సేవ ప్రశంసనీయము.

భగవాను డాయురారోగ్యముల నొసంగి కాపాడు గాత!

గోపదేవ్

# श्री. बि. शङ्करलाल गुप्त

आप स्व. रामदयाल सेडमल और सुरजी बाई के कनिष्ठ पुत्र हैं। हैदराबाद नगर की कई धार्मिक संस्थाओं के संचालन में आप का महत्व पूर्ण सहयोग रहता है। व्यापरी वर्ग में अत्यन्त प्रतिष्ठाप्राप्त व्यक्ति हैं। इस पुस्तक के निमित्त कागज़ का समस्त भार आपने उठाकर आन्ध्र साहित्य प्रचार में सहयोग दिया है। परमेश्वर आप को दीर्घायु और सुख शान्ति देवें।

गोपदेव



బి. శంకరలాల్ గుప్తగారు

बी० शंकरलाल गुप्त

# వి ష య సూ చి క

పేజి

# అర్థ - ధర్మ - మీమాంస

## మొదటి యధ్యాయము

## విషయప్రవేశము

శ్రుతిస్మృతుల ననుసరించి యెల్లపుడు ధర్మమును పాలించుట మనుజుల కవసరము. ధర్మపాలన మొనర్పని వారికి నిహపర లోకములందు సుఖము లభింపనేరదు. ధర్మమును గూర్చి మను విట్లు నుడివి యున్నాడు :

"ధర్మ ఏవ హతోహన్తి, ధర్మోరక్షతి రక్షితః
తస్మా ద్ధర్మో నహంతవ్యో మానో ధర్మో హతో వధీత్"॥

మను. శ్లో. 15

'ధర్మమును నాశమొనర్చువాని నది నాశముచేయును. రక్షించువాని నది రక్షించును' అని శ్లోకాభిప్రాయము. కణాద మహర్షి, ధర్మము సర్వవిధములగు నున్నతికి, మోక్షమునకు కారణమని వచించి యున్నాడు.

"యతోఽభ్యుదయ నిః శ్రేయససిద్ధిః స ధర్మః"

కణాద-సూ. 1-1

ఈ ధర్మము కొండొక వస్తునామము కాదు. నానావిధములగు నాచారవిచారములు ధర్మ మనబడును. ఒకానొక యాచారమువలన నొకానొక లౌకికసుఖము కలిగిన మరియొకదానివలన మరియొక సుఖము లభించును. అనేక విధములగు నభ్యుదయ మొక్క కర్మకుగాని, యొక్క జ్ఞానమునకుగాని ఫలము కానేరదు. మోక్షప్రాప్తికి ననేక సాధనము

లవసరములు. అభ్యుదయమునకు, నిఃశ్రేయసమునకు సాధన ములగు నాచార విచారము లనేకములు కలిసి సామాన్య ముగ ధర్మ మనబడును.

ధర్మము నిట్లు నిర్వచించినపు డర్థము (ధనము) కూడ ధర్మ మగుచున్నది. కాని, ధర్మార్థములను వేరువేరుగా గ్రహించినపుడు ధర్మశబ్దమున కింత విశాలార్థము గ్రహింప ననువుకాదు. భగవంతుని ధ్యానము, బ్రహ్మచర్యము, యజ్ఞదానాదుల యనుష్ఠానము ధర్మ మగును. లౌకిక సుఖముల నందజేయు ముఖ్యసాధన మర్థ మగును.

మనుజునకు ధర్మము, అర్థము రెండును నవసరములే. మనుజు డన కేవల భౌతికశరీరము కాదు. ఆత్మతో గూడిన శరీరము మానవు డనబడును. శరీరసౌఖ్యముల కర్థము, ఆత్మిక సౌఖ్యములకు ధర్మము సాధనములు. భారతీయ ధర్మ శాస్త్రములందును, నర్థశాస్త్రములందును ధర్మార్థముల వివేచనము చూడనగును. ధర్మశాస్త్రమునందు ధర్మము ముఖ్యముగాను, నర్థము గౌణముగాను వివేచింపబడినది. అర్థశాస్త్రమునం దర్థము ప్రధానముగాను ధర్మము గౌణము గాను వర్ణింపబడినది. ధర్మశాస్త్రము ననుసరించి యర్థార్జనము ధర్మానుకూలముగా చేయవలెను. కాని యర్థశాస్త్రము పలుతావులందు ధర్మసీమ నుల్లంఘించుచుండును. అందువలన ధర్మశాస్త్రముల కర్థశాస్త్రములతో విరోధము కలిగిన తావులందు ధర్మశాస్త్రమే బలవత్ప్రమాణమని ధర్మశాస్త్రము నందు నిర్ణయింపబడినది.

"అర్థశాస్త్రాత్తు బలవద్ధర్మశాస్త్ర మితిస్థితిః"

యా. స్మృ. ౨. ౧౨

ధర్మార్థముల స్వరూపమునందే వాని విరోధమునకు కారణమున్నది. ధర్మ మింద్రియగోచరము కాదు. ఇతరుల కది కష్టము కలిగింపకయే సంపాదింపదగినది. ఇతరులకు హాని కలిగించిన నది ధర్మమే కాదు. అర్థ మట్లుకాక యది యింద్రియములకు గోచరించును. కన్నులతో చూడదగి యుండును. ఇతరులకు కష్టము కలిగింపక ధనము నార్జించుట యసంభవము కాకున్నను దుర్ఘట మనక తప్పదు. అర్థము నార్జించుటలో నిరంతరము తత్పరత చూపిన ధర్మరక్షణ కాజాలదు. వ్యాపారి తన వస్తువులను విక్రయించి లాభము నందజూచినపు డతడు తన వ్యవహారమునందు సత్యాహింస లను కాపాడజాలడు. అతడు కొలదిగానో గొప్పగానో సత్యాహింసల నియమముల నుల్లంఘించి యసత్యమునకు, హింసకు లోనగును. అర్థముమీద ముఖ్యదృష్టి నుంచినందున నర్థశాస్త్రముతో ధర్మమున కనేక తావులందు విరోధము కలిగినది. ఇట్లు విరోధ మేర్పడిన తావులం దర్థశాస్త్రము నుపేక్షించి ధర్మరక్షణ చేయవలెనని ధర్మశాస్త్రము బోధించును. ధర్మమునకు దూరముగ నుండియైనను నర్థార్జనము చేయదగు నని యర్థశాస్త్రము ప్రేరేపించును. ధర్మముతో నాత్మకు, శరీరమునకు రెంటికిని సంబంధము గలదు. కేవ లాత్మ శరీరముతో సంబంధములేక ధర్మాచరణము చేయ జాలదు. శరీరము ధర్మసాధనములలో మొదటిది. కేవలము బ్రహ్మచర్యము, సత్యము, అహింస, అస్తేయము, అపరి గ్రహము ననువానితోనే శరీరము స్థిరముగా నుండజాలదు. దాని కన్నము, వస్త్రములు మున్నగు భౌతిక సాధనములు

కావలసి యున్నవి. ఆ భౌతిక సాధనము లర్థములేక ప్రాప్తిం పవు. అందువలననే ధర్మశాస్త్రమున ధర్మముతోబాటు అర్థార్జనమును గూర్చియు విచారింపబడినది. వీలయినంత వరకు ధర్మశాస్త్ర మర్థమును ధర్మానుకూలముగ నార్జింప మనును. అయినను నర్థముద్వారా కలుగు ధర్మాతి క్రమణము నత్యంత సూక్ష్మపరిమాణములో నపరిహార్య మని యెంచి యది సహించును.

కావున వ్యాపారము ధర్మశాస్త్రదృష్టిలో ఋతా నృతము - సత్యాసత్య - మనదగును. అర్థార్జనము కూడ సత్యాహింసాదులను బొత్తిగా త్యజించిన కలుగజాలదు. జనులలో విశ్వాస మనునది లేకున్న వ్యాపారము నడువ జాలదు. సత్యాహింసలు పాలింపకున్న విశ్వాసము కలుగదు. వ్యాపారాదుల యున్నతికొఱకు సత్యాహింస లావశ్యకములు. ఈశ్వర విశ్వాసము, బ్రహ్మచర్యము మున్నగు ధర్మములు సత్యాహింసలకు ప్రబల సాధనములు. కావున నె యర్థ శాస్త్రముకూడ సత్యాహింసాదుల నావశ్యకములుగా నెంచి నది. అయ్యది వర్ణాశ్రమవ్యవస్థను తరుచు ధర్మశాస్త్రము ననుసరించి యంగీకరించినది. అర్థశాస్త్రమునకు ధర్మశాస్త్ర ముతో గల విరోధ మతి స్వల్పము. కాని యా విరోధ మెల్లప్పుడు స్వల్ప మాత్రలోనే యుండదయ్యె. అనేక పర్యా యము లది మిక్కిలి తీవ్రరూపము ధరించి యుండెను. కౌట లీయ-అర్థశాస్త్రమున రాజ్యోన్నతి కొఱకు నిర్దేశింపబడిన క్రూరోపాయములను తలంచినంత మాత్రమున ధర్మమును ప్రేమించువారి కోమలమైన మనస్సులు కంపింపకుండ నేరవు.

దాండకర్త్రికము, కోశాభిసంహరణము మున్నగు నధ్యాయములం దిట్టి యుపాయము లెన్నో సూచింపబడినవి. ఇష్టసిద్ధి కొఱకు ఘాతుకోపాయముల నాశ్రయించినందుకే కాక, మఱి యితర కారణములవలన గూడ నర్థశాస్త్ర-ధర్మశాస్త్రములలో విరోధ మున్నట్లు చూడనగును.

ధర్మశాస్త్రము ననుసరించి శరీరముకంటె భిన్నముగా నొకచేత నాత్మ యున్నదనియు, జంగమస్థావరముల స్రష్ట, పరమాత్మ యొకడు గలదనియు నంగీకరించుట యావశ్యక మగుచున్నది. జీవుడు తాఁజేసిన కర్మఫల మిహాపర లోకములందు భోగింపవలసి యున్నది. జీవుడు పుణ్యాపాపముల రెండింటి ఫలము ననుభవింపక యుండజాలడు. యజ్ఞము, దానము మున్నగు సత్కార్యము లెన్నడు నిష్ఫలములు కావు. ఈ జన్మమున కాకున్న మఱియొక జన్మమునందైనను వాని ఫలములు తప్పక లభించును. అనేక ధర్మశాస్త్రములం దింద్రియముల కందరాని యింద్రాది చేతన దేవతల పూజకూడ నుల్లేఖింపబడి యున్నది. ఇట్టి విషయములను నిషేధింపకయే యర్థశాస్త్ర మర్థనిరూపణము చేయగలిగి యుండెను. కాని, యది యీ ధార్మిక విషయముల నప్రామాణికము లనియు, నసత్యము లనియు నిర్ణయించినది.

అర్థస్వరూపము స్థూలము. దాని నింద్రియములు తెలిసికొనగలవు. కొండొక యర్థస్వరూపము ప్రత్యక్షము కానపుడు ప్రత్యక్ష మూలకమగు ననుమానముచే నిశ్చయింపనగును. ప్రత్యక్షముద్వారా గానీ, లేక ప్రత్యక్షాశ్రితమగు ననుమానముద్వారా గానీ స్థూలార్థమును విచారించుట

కలవాటుపడిన కారణమున నెల్లపుడు నతీంద్రియములై యుండు నాత్మాది విషయములం దర్థశాస్త్రమునకు గల విశ్వాసము శిథిలమై యుండవచ్చును. 'ధర్మమున కాధారము లగు పదార్థము లెన్నడు ప్రత్యక్షములు కాలేవు; కాబోవు' అని యర్థశాస్త్రము నుడివి యుండెను. వానిని నమ్మి వ్యవహరించినందున హాని ననుభవింపవలసి వచ్చును. వాని నంగీకరింపకుండుట మంచిది. అతి ప్రాచీనములగు నర్థశాస్త్రములు నే డుపలబ్ధములు కాకున్నవి. వానిలోని విషయములను సంకలనముచేసి కౌటల్యుడు తన యర్థశాస్త్రమును రచియించి యున్నాడు. అది లభించుచున్నది. దానిలో జీవాత్మ, యజ్ఞము మున్నగు విషయముల నిషేధము కానరాదు. కాని, ధర్మశాస్త్రము కేవల శబ్దప్రమాణముచే సిద్ధమగు కొన్ని విషయముల నంగీకరించును. శుభనక్షత్రమును చూచి కార్య మొనర్పవలె నని చెప్పును. అందువలన పరిశ్రమము వ్యర్థము కాదు. 'నక్షత్రములవంక చూచుచు కూర్చుండిన కార్యసిద్ధిలో విఘ్నము వాటిల్లును. అర్థమున కర్థమే నక్షత్రము. తార లేమి చేయగలవు?' అని కౌటలీయార్థశాస్త్ర మనును. (కౌ. అ. సం. 3. అధి. 9. అ 4.)

కౌటల్యుడు తన యర్థశాస్త్రమునందు శుక్రాచార్యుని, బృహస్పతిని మిక్కిలిగ నాదరించి యున్నాడు. శాస్త్రారంభమున నీ యిరువురకు నమస్కరించి యున్నాడు. మహాభారతము ననుసరించి శుక్రు డసురుల కాచార్యుడు. అసురుల యనాత్మవాదము ప్రసిద్ధము. కౌటల్యుని మతమున శుక్రుడు దండనీతి తక్క మరియొకటి విద్యగా నంగీకరింపడు. 'సర్వ

విద్యలు దండనీతి నాశ్రయించును.' ఇది యతని మతము. పరంపర ననుసరించి బృహస్పతి చార్వాకమతమునకు ప్రధానాచార్యుడు. చార్వాకు డాత్మను, పరమాత్మాది పదార్థములను నిషేధించును. అతడు యుక్తిసంగతములు కావను కారణమున వేదములు ప్రమాణములు కావనును. చార్వాక మతాచార్యుడైన బృహస్పతియే యర్థశాస్త్రమును రచియించి యుండవచ్చును. బృహస్పతి యనుచరుల ననుసరించి వ్యాపారములు, దండనీతియు నను నీ రెండే విద్య యని కౌటిల్యుడు చెప్పినమాట పై సంభావన కాధార మగుచున్నది. లోకవ్యవహారవిదునకు వేదము లావరణ మాత్రము లని చార్వాక విద్యాభిప్రాయము. అన్యప్రాచీనార్థశాస్త్రములనాత్మవాద ప్రతిపాదకములు కాకున్నను, శుక్ర-బృహస్పతుల యర్థశాస్త్రమునం దనాత్మవాదము ప్రతిపాదింప బడినట్లు తెలియుచున్నది. భారతీయార్థశాస్త్రములలో కొన్ని యాత్మవాదమును, మరికొన్ని యనాత్మవాదమును నంగీకరించును. వీని ననుసరించియే భారతీయులు వేలకొలది సంవత్సరముల నుండి వ్యవహరించుచున్నారు. ఎట్టి యర్థశాస్త్రము ననుసరించినను, నాత్మవాద ప్రచారమును కానీ, యనాత్మవాద ప్రచారమును కానీ బలవంతముగ నడ్డగించినవారు లేరు. జనులు ధర్మప్రధాను లయినపుడు సురాపానమాంసభక్షణాదులు తగ్గిపోయెను. అర్థప్రధాను లయినపుడు వీని ప్రచార మెక్కుడయ్యెను. రాజ్యము కొఱకొకప్పుడు క్రూరోపాయములు, మఱియొకప్పుడు మృదూపాయములు ప్రయోగింపబడెను. ఆత్మానాత్మ వాదముల ననుసరించు నర్థశాస్త్రముల ప్రభా

వముువలన లోకుల జీవనమున కేవల మింత భిన్న పరిణామ మేర్పడి యుండెను. భూత చేతనవాదము, అభౌతిక చేతన వాదము, వేదప్రామాణ్యాప్రామాణ్యములు నర్థము నిచ్చి పుచ్చుకొనుటలోను, పారివారిక వ్యవహారములందును స్పష్టము, ప్రత్యక్షము నగు భేదము నుత్పన్నము చేసియుండలేదు. విశ్వాసములలో - నమ్మకములలో - కలిగినంత భేదము వ్యవహారములందు కలుగలేదు.

బౌద్ధులు, జైనులు వేదముల నప్రమాణము లనిరి. వేదమూలక మని జనులు విశ్వసించు వర్ణవ్యవస్థను వారు విరోధించిరి. జైనులయు, బౌద్ధులయు రాజ్యములు కూడ నెలకొనెను. వారి యర్థశాస్త్రములు నుండెను. కాని, వారి రాజ్యములందును జనుల లౌకిక వ్యవహారములలో మార్పు రాలేదు. రాజవంశములు మారినవి; పారలౌకిక విషయముల విచారణలో మార్పులు వచ్చినవి; కాని, యర్థార్జన మొకే విధముగ నగుచుండెను. దానిలో కొంచెముకూడ మార్పు రాలేదు.

నేడు భారతదేశమున కార్లమార్క్సు యొక్క యర్థశాస్త్రప్రచార మతివేగముగ నడుచుచున్నది. ఐరోపా, ఆసియా ఖండపు దేశములందీ శాస్త్రప్రచార మెంత వేగముగ జరిగినదో దానినిబట్టి యీ శాస్త్రప్రభావము నెల్లరు నెరుగుచున్నారు. మార్క్సు - అర్థశాస్త్ర మన్నింటికంటె విలక్షణమైనది. భారతీయులు అర్థశాస్త్రమును, ఆత్మను, పరమాత్మను ధర్మశాస్త్రములోని భాగములుగా నంగీకరించి నడుచుకొందురు. మార్క్సు - అర్థశాస్త్రము దీనికి మిక్కిలి

భిన్నమనుట స్పష్టము. ఆత్మవాదము నంగీకరింపని భారతీయార్థశాస్త్రములకంటెను నది మిక్కిలి భిన్నముగా నున్నది. దీనికంటె పూర్వమున ప్రచలితమై యున్న పాశ్చాత్యార్థశాస్త్రములతోను దీనికి పోలిక లేదు. ఇది యన్నింటికంటె విలక్షణముగా నుండుటకు దీనియం దొక విలక్షణతత్వమున్నది. అది యర్థము నార్జించు పద్ధతి. ధనార్జనమునకు చెందిన ప్రాచీనోపాయములను నిశ్శంకముగా తగినవని యెంచి యర్థశాస్త్రజ్ఞు లందరు వానివలన గలుగు హాని లాభాదుల విచారింపదొడగుదురు. కాని యది ప్రయోజనకరము కాదు. లోకమున నాచరణలో నున్న ధనోత్పాదనశైలి మార్క్సునకు దూషితముగా కనబడినది. ఏ దేశమునందైనను కొలదిమంది ధనికులైయుండి వారితోబాటు నివసించు లక్షలాది జనులు దరిద్రులై యుండుటకు కారణ మతనికి పురాతన ధనార్జన పద్ధతియే యని తోచినది. కావున నతని దృష్టిలో ప్రాచీన పద్ధతిని నాశనమొనర్చి, దానితావున క్రొత్తపద్ధతి నొకదానిని ప్రతిష్ఠించుట యావశ్యక మయ్యెను. దానివలన నత్యాచార కారణముగా నేర్పడిన అర్థవైషమ్యము దూరము కాగలదు. జనులలో సమత్వ మేర్పడ గలదు. ఈ విధముగ సమాజమున నన్యాయమూలకముగ నేర్పడిన ధనవైషమ్యమును తొలగించి, యర్థసామ్యము నేర్పరుపజాలునను దృష్టితో మార్క్సు మతమును సామ్యవాద మనియు లేక సమాజవాద మనియు నందురు.

మార్క్సు వాదము ననుసరించువారి దృష్టిలో సమాజవాదము రెండు కారణములవలన ప్రమాణసిద్ధతత్వ మగు

చున్నది. పెట్టుబడిద్వారా యుత్పన్నమగు నతిరిక్తమూల్యము (సర్ప్లస్ వాల్యూ) మీద పెట్టుబడిదారునకు గల యధికారము మొదటి కారణము. ఇతిహాసమును భౌతికవాదము ననుసరించి నిరూపించుట రెండవ కారణము. దీని నైతిహాసిక భౌతికవాద మనియు నందురు. వాస్తవమున సామ్యవాదోత్పత్తికి కారణము వర్గవిరోధము. ఫ్రెంచి దార్శనికులు క్రీ.శ. పదునెనిమిదవ శతాబ్దమున విచార పరంపరా రూపమున సామ్యవాదమూలమును ప్రతిష్ఠించి యున్నారు. ఆకాలమున దార్శనికులు ఫ్రాన్సులో యుగములను మార్పగల యాలోచనలు ప్రకటించుచుండిరి. వారు తర్కము తక్క మరియొక దానిని ప్రమాణముగ నంగీకరింపకుండిరి. సంప్రదాయము, ప్రకృతిస్వరూపము, సమాజము, శాసన విధానము మున్నగు వాని నన్నింటిని తర్కముద్వారా తీవ్రముగ నాలోచించుచుండిరి. వస్తువును యథార్థముగ తెలిసికొనుటకు వారికి తర్క మొక్కటియే సాధనమై యుండెను. ప్రాచీనకాలపు సమాజము, రాజ్యము రెండును తర్కప్రతికూలములుగ చెప్పబడెను. నాటినుండి యట తర్కము మార్గప్రదర్శకమైనది. అందువలన మిథ్యావిశ్వాసములు, నన్యాయము, దుర్బలుల నణగద్రొక్కుటయు నను మూడింటి స్థానమున త్రికాలాబాధితము లగు సత్యమును, న్యాయమును, సామ్యమును ప్రతిష్ఠింప జేయవలసి వచ్చినది.

కాని నాటి తర్కరాజ్యము ధనికుల యాదర్శరాజ్యము కంటె మిన్నకాదు. న్యాయముకూడ ధనికుల న్యాయమే. రాజ్యవిధానము ననుసరించి నాటి సమానతయు ధనికు లంగీక

రించిన సమానత్వమే. తమకు పూర్వులైన తత్త్వజ్ఞుల వలెనే పదునెనిమిదవ శతాబ్దపు గొప్పగొప్ప దార్శనికులుకూడ తమ యుగసీమల నుల్లంఘింపజాలక పోయిరి. నాడు సామంతు లతో ధనికులకు విరోధ మున్నట్లు, సోమరు లైన ధనికులతో రాత్రింబవళ్లు పరిశ్రమ మొనర్చు దరిద్రులకు విరోధము ప్రబల సాగెను. అప్పుడు ధనికులు సమస్తమానవజాతికి ప్రతినిధులై నిలబడిరి. ధనికులు నాడు శ్రామికుల హితమును రక్షించు చున్న ట్లభిమానము చూపుచున్నను, శ్రామికులలో ధనికుల యెడ విరోధ మప్పుడప్పుడు తలయెత్తు చుండెడిది.

జర్మనీలో కర్షక సంఘర్షణ మేర్పడెను. ఇంగ్లండు, ఫ్రాన్సు దేశాలలో విప్లవములు జరిగినవి. ఈ విప్లవములతో బాటు క్రొత్త క్రొత్త యాలోచనలుకూడ ప్రకాశమునకు వచ్చెను. పదునారవ, పదునేడవ శతాబ్దములలో అశాస్త్రీయ త్వము (ఎక్కడను లేని) కాల్పనికమైన సామ్యవాద మొకటి మానసవీథిలో చిత్రింపబడినది. పదునెనిమిదవ శతాబ్దములో మోరేలీ, మేవలీ అనువారు యథార్థమయిన సామ్యవాద సిద్ధాంతమును ప్రకటించిరి. అశాస్త్రీయ సామ్యవాదమును ముగ్గురు మహావిద్వాంసులు నిరూపించి యుండిరి. వారిలో ప్రథముడు 'సైమన్'. నాటి ధనికులయు, దరిద్రులయు స్థితి యతనిని ప్రభావితు నొనర్చినది. ఫోరియర్, ఓవెన్ అనువా రిరువురు నింగ్లండు నివాసులు. అక్కడ పెట్టుబడిదారుల పద్ధతి ననుసరించి యుత్పాదన పరిష్కారము మిక్కిలిగ చేయబడి యుండెను. వారు పెట్టుబడివిధానమూలకముగ నేర్పడిన వర్గవిరోధమును తొలగింప ఫ్రెంచి భౌతికవాదము నాధార

ముగ తీసికొని వ్యవస్థల నొనరించిరి. పైన చెప్పిన మువ్వురు దార్శనికులును తాత్కాలికపు టవస్థలద్వారా ప్రకటమగు దరిద్రుల కష్టములను మాత్రమే తొలగింప ముఖ్యరూపమున యత్నింపక, సమస్త మానవజాతిని దుఃఖములనుండి విడిపింప నెంచిరి. తర్కసిద్ధమై, త్రికాలాబాధితమైన నిత్యన్యాయమునకు చెందిన రాజ్యమును స్థాపించుట వీరి యభిలాష. కాని, వీరి రాజ్యము ప్లేటొంచి దార్శనికుల రాజ్యముకంటె మిక్కిలి భిన్నమై యుండెను. వీరి దృష్టికి నా దార్శనికుల సిద్ధాంత పరంపర ననుసరించి ప్రతిష్ఠింపబడిన ధనిక సమాజము యుక్తిసంగతము కానీ, న్యాయసంగతము కానీ కాకుండెను. అందువలన సామంత పద్ధతివలెను, లేక యితర ప్రాచీన సమాజ పద్ధతులవలెను నీ ధనిక సమాజముకూడ లోపింప సిద్ధముగా నుండెను. నాటివరకు శుద్ధ తర్కమునకు, న్యాయమునకు చెందిన రాజ్య మేర్పడకుండుటకు కారణము జనుల యజ్ఞానమే. జను లింతవరకు తర్కమును, న్యాయమును యథార్థ రూపమున నెరుగకుండిరి. ప్రతిభావంతుడైన మనుష్యుడు నాడు లేకుండెను. ఆ స్థితి మారిపోయినది. నేడు అర్థదశను పరీక్షించువా డేర్పడినాడు. అతడు సత్యమును గుర్తించినాడు. ఇప్పు డేర్పడిన సత్యజ్ఞాన మపరిహార్యమగు నైతిహాసికశృంఖలాపరిణామము కాదు. ఈ సత్యద్రష్ట నేటి కైదువందల సంవత్సరములకు పూర్వమునగూడ పుట్ట గలిగి యుండెను. ఆతడు జనుల నీ యైదువందల సంవత్సరముల నుండి వచ్చిన యజ్ఞానమునుండియు, దుఃఖమునుండియు రక్షింపగలిగెడివాడే.

ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ దేశములలోని నాటి సమాజ వాదు లయిన విద్వాంసు లందఱు నిట్టి యాలోచనలే చేయు చుండిరి. వీరి కందరికి సమాజవాదము శుద్ధసత్యమును, తర్కమును, న్యాయమును వెల్లడించునదియై యుండెను. దాని ప్రకాశన మవసరమై యుండెను. తరువాత నది స్వయముగ తనశక్తితోనే ప్రపంచమును జయింప గలదు. శుద్ధసత్యము దేశకాలములచే బంధింపబడదు. అది మానవుల యైతిహాసిక రూపాంతరములకు లోనుగాదు. అది యెప్పు డెక్కడ ప్రకట మగునో తెలియదు. అది కేవల మాకస్మిక ఘటనము.

శుద్ధసత్యము, తర్కము, న్యాయము ననునవి మత ప్రతిష్ఠాపకుల ననుసరించి భిన్నములగునను విషయము మఱువ రాదు. ఆ కారణమున వారిలో పరస్పరము విరోధ మేర్పడు చుండును. అందువలన సమస్త వాదముల సారమును గ్రహించి సమాజవాదము మిశ్రితరూపమున నుద్భవించుచున్నది. కాని యంతమాత్రముననే సమాజవాదము ప్రామాణిక తత్వము కానేరదు. ప్రామాణికము కావలయుననిన నది యథార్థమైన యాధారముమీద ప్రతిష్ఠితము కావలసి యున్నది.

పదునెనిమిదవ శతాబ్దమున ఫ్రెంచి దర్శనముతోబాటు దానితరువాత జర్మనీలో క్రొత్తదర్శన ముదయించినది. అయ్యది హెగల్‌తో సమాప్తమైనది. ఇందు కథా (వాద ప్రతివాదముల) పద్ధతి మరల నంగీకరింపబడినది. ఈ పద్ధతి యీ దర్శనమున కొక విశేషగుణ మననగును. ప్రాచీనపు గ్రీక్ విద్వాంసుల కీ కథాపద్ధతి జన్మసిద్ధము. అరిస్టాటిల్ బహుకాలమునకుముందే యీ కథాపద్ధతితో విషయమును

పరీక్షించుట కవసరములగు నంగములను నిరూపించియున్నాడు. ఈ కాలమున క్రొత్త దర్శన పద్ధతి ఇంగ్లండు ప్రభావమువలన అతిభూతవాదీయతర్కరీతితో గట్టిగా బంధింపబడినది. వాద ప్రతివాదాత్మక (కథా) పద్ధతి స్వరూపమును, అతిభూత వాదీయశైలి స్వరూపమును నిట కొంత తెలిసికొనవలెను.

జడప్రకృతినిగురించి కానీ, మానవుని యితిహాసమును గూర్చి కానీ విచారించి చూచిన వస్తురూప మేదియును స్థిరము కాదని తెలియుచున్నది. లోకమున ప్రతివస్తువు పుట్టుచున్నది; దానిలో ననేక పరిణామము లేర్పడుచున్నవి; అంతమున నది విలయము నందుచున్నది. ప్రాచీనపు గ్రీకు దార్శనికుల యీ మతము యుక్తమే; కాని, యీ మతము వికసింపక బీజరూపమున నుండెను. ప్రప్రథమమున హేరాక్లిటిజ్ యీ మతముయొక్క స్పష్టమైన యాకారమును ప్రకటించి యుండెను. అతని మతము ననుసరించి ప్రతివస్తువు నొకే క్షణమున నున్నదనియు, లేదనియును చెప్పవచ్చును. ఎల్లప్పుడు నది గతికలదై రూపాంతరములను బొందుచుండును. నిరంతరము ప్రకటమగును; విలీనము నగును. ఇది సమస్త ప్రకృతి స్వరూపమైనను, దీనివలన నవాంతరరూపములు స్పష్టముగా కనిపింపవు. మన కీసంగతి తెలియనంతవరకు సమస్త రూపముల పూర్ణసాక్షాత్కారము కలుగజాలదు. అవాంతర రూపముల నెరుగుటకు వానిని ప్రకృతి సంబంధమునుండి కానీ, ఐతిహాసిక సంబంధమునుండి కానీ వేరుచేయవలయును. ఒక్కొక్క దానిని వేరువేరుగ పరీక్షింపవలయును. వస్తువుయొక్క ప్రకృతి యెట్టిది? దానికి కారణ మేమి? కార్యమేమి? అని

చూడవలసి యున్నది. ఈ పని ప్రాకృతిక జ్ఞానమునకు, ఐతిహాసిక జ్ఞానమునకు చెందియున్నది.

అలెగ్జాండ్రియా కాలపు గ్రీక్ విద్వాంసులు ప్రకృతిని యథార్థముగ పరీక్షింప నారంభించిరి. తరువాత మధ్యకాలమున నరబ్బులు దానిని విస్తరింపజేసి యున్నారు. వాస్తవమున ప్రకృతికి సంబంధించిన తాత్త్వికవిజ్ఞానము పదునైదవ శతాబ్దములో నుత్తరార్ధమున ప్రారంభ మగుచున్నది. అప్పటి నుండి శీఘ్రగతితో నియ్యది వృద్ధిజెందినది. మొదటి నాలుగు వందల యేండ్లలోనైన ప్రాకృతిక విజ్ఞానవృద్ధివలన ననేక తత్త్వములు నిర్ణయించబడినవి. ప్రకృతిని వేరు వేరు భాగములుగ విభాగించుట, ప్రాకృతిక క్రియల వర్గీకరణము, శరీరములోని యాభ్యంతర రచనకు సంబంధించిన విభిన్నరూపములు ననునవియే యా తత్త్వములు. ఈ పరీక్షాపద్ధతివలన ప్రాకృతిక పదార్థములను వేరువేరుగా జనులు చూడసాగిరి. ఇంతేకాక ప్రాకృతిక పరిణామముల ప్రక్రియను వస్తువుల సమస్త సంబంధములనుండియు వేరుచేసి చూడ నారంభించిరి. ఆ కారణమున గతిరూపములోకాక స్థిరదశలోను, నొక పరిణామమునుండి మరియొక పరిణామమును బొందిన తరువాతకాక యా పరిణామమును బొందుదశలోను, జీవనసమయముననేకాక మరణమునందును వస్తు పరీక్షణ జరుగసాగినది. ఈ విధమైన పరీక్ష ప్రాకృతిక జ్ఞానమునుండి దర్శనమున సంక్రమించిన నాటి నుండియు విచారణ పద్ధతిలో సంకుచిత మనోవృత్తి యేర్పడినది. అతిభూతవాదీయశైలియు రూపొందినది.

అతిభూతవాది కొఱకు వస్తువులు, వాని జ్ఞానము రెండును వేరుచేయబడినవి. ఒకదానినుండి మరియొకటి వేరుచేసి వానిని విచారింపవలసియున్నది. అతని దృష్టిలో వస్తువు విద్యమాన రూపముననో, లేక అవిద్యమాన రూపముననో యేదో యొక రూపముననే యుండును. ఒకే కాలమున నొక వస్తువు ఉన్నదనియు మరియు లేదనియు (విద్యమానము, అవిద్యమానము) చెప్ప సంభవము కాదు. విధినిషేధములు రెండును పరస్పర విరుద్ధములు. అనగా — వస్తువొక సమయమున నున్నదందుమేని, యా సమయముననే యది లేదన వలనుపడదు.

కార్యకారణములు రెండును భిన్నములు. అవి యొక్కటి కానేరవు. సాధారణ దృష్టితో నియ్యది యుక్తియుక్తముగానే యున్నదనిపించును. కారణము, బుద్ధి కనుకూలముగ నుండుటయే. కాని, విశాలమగు నీ ప్రాకృతిక ప్రపంచమున లోతుగా దిగి చూచినపు డాధ్యాత్మిక శైలికి చెందిన దార్శనికు డాశ్చర్యమున బడును. అతిభూతవాదీయ శైలి ననుసరించు ఆలోచన త్వరగానో లేక యాలస్యముగనో చరమసీమను చేరును. వాని ననేక వ్యాఘాతము లెదుర్కొనును. వానిలో నతడు మార్గము తప్పును. వస్తువులను చూచునపుడు వాని పరస్పర సంబంధమును కన్నులనుండి మరుగుపరచినచో నిట్టి దశయే కలుగును. అతడు వస్తువుల యునికిని చూచునపుడు వాని యావిర్భావ తిరోభావములను చూడడు. అతనికి వస్తువు కనబడును; దాని గతి కనబడదు. వృక్షము కనిపించును; శాఖలు కనబడవని భావము. శరీరధారియైన ప్రతి

ప్రాణియు నొకక్షణమున తాను తానుగా నుండదు. మారి పోవునని భావము. ప్రతిక్షణమునందును శరీరము వెలుపల నుండి ప్రాకృతిక భాగములను తీసికొని తనలో కలుపుకొను చుండును; మరియు నదే క్షణమున తనలోని కొన్ని భాగములను వెలుపల పారవేయును. ప్రతిక్షణమునందును శరీరములోని కోశములు మరణించును; క్రొత్తవి యుత్పన్నము లగుచుండును. అల్పకాలములోనో యనల్పకాలములోనో శరీరము సంపూర్ణ ముగ క్రొత్తదగుచుండును. క్రొత్త పరమాణువులు ప్రాతపర మాణువుల స్థానము నాక్రమించును. విధి నిషేధములవలె రెండు సీమలు పరస్పర మెంత విరుద్ధములో అంతగా నవి యొకదానినుండి మరియొకటి విడదీయ వీలులేని వనియు సూక్ష్మపరీక్షవలన తేలుచున్నది. విరోధము లెన్నియున్నను నవి యొండొంటిలో నిముడుచున్నవి. కార్యకారణముల స్థితియు నిట్టిదియే. రెండు పదార్థములలో నొకటి కార్య మనియు, రెండవది కారణ మనియు నందుము. కాని వానికి ప్రపంచముతో గల సంబంధమును చూచినపుడు కార్య కారణము లెల్లపుడు తమ స్థానములను మార్చుకొను చుండును. ఒకప్పు డొకట నేది కారణమో యది యప్పు డక్కడే కార్యముగూడ నగును. అట్లే కార్యముకూడ కారణ మగును.

అతిభూతవాదము ననుసరించి చూచిన నీ శైలికిచెందిన ప్రక్రియారూప మేదియు సంగతము కాదు. కథాత్మకమగు నాలోచనలోని మంచిచెడుగులను తెలిసికొనుటకు ప్రకృతి యొరపిడిరాయిగా నుపయోగించును. నేడు ప్రాకృతిక

జ్ఞానము మిక్కిలి వృద్ధిచెందినది. క్రొత్తక్రొత్త యొరపిడి రాళ్ళు నా జ్ఞానము సమకూర్చుచున్నది. ఈ విషయమున నేరికిని సందేహము కలుగజాలదు. ప్రాకృతిక పరిణామములు పరీక్షించినమీదట నవి కథాత్మక యాలోచన కనుకూల ములై యతిభూతవాదమునకు ప్రతికూలము లగుచున్నవి. విశ్వము, దానియం దేర్పడు క్రమిక పరిణామములు, మానవ జాతికి చెందిన నూత్నావస్థలు, వానివలన మానవ మనస్సునం దేర్పడు ప్రతిబింబములు నన్నియు నెరుగుటకు కథాత్మకమగు నాలోచన నాశ్రయింపవలసి యున్నది. అత్యంత మాధునిక మగు జర్మన్ దర్శన మీ రీతినే గ్రహించినది. ఈ దర్శనము కాంట్‌తో ప్రారంభమై హెగల్‌తో నంతమైనది. ఈ దర్శ నమువలన ప్రాకృతికము, నైతిహాసికము, నాధ్యాత్మికము నైన ప్రపంచ మంతయు పరిణామమునకు చెందిన నిరంతర గతి, రూపాంతరము, వికాసము నను రూపములతో నెదుట బడుచున్నది. ఈ దృష్టితో చూచినప్పుడు మానవ చరిత్రము తెలియక చేసిన క్రియాజాల మని తోచదు; విడదీయ వీలు గాని గ్రంథి కాదది. గంభీరమైన దార్శనిక తర్కమున కది యసత్యమయి బాధితమును కాదు. తొందరపడి దాని నుపే క్షించుటకును వీలుకాదు. మానవుని చరిత్రము నేడు క్రమిక పరిణామముల పరంపరారూపమున నున్నది. ఇంతేకాక సంబంధవ్యవస్థ నెరుంగుట తర్కమున కావశ్యక మగుచున్నది.

'హెగల్ ఈ కార్యమున సఫలుడు కాలేదు' అనున దిట ముఖ్యవిషయము కాదు. అతడు కథాత్మక యాలోచనను నిరూపించి యున్నాడు. అది యొక యుగాంతరకారి కార్యము.

ఈ కార్యమును మరియొక డెవ్వడును చేయలేడనుట నిక్కవమే. సెయింట్ సైమన్‌వలె హెగల్ తనకాలములో నొక గొప్ప విద్వాంసుడైనను నతని జ్ఞానము సీమిత మనక తప్పదు. అందుకు మొదటికారణ మతని జ్ఞానక్షేత్రము నియంత్రితమై యుండెను. రెండవ కారణము నాటి జ్ఞానము విస్తారతలోను, గాంభీర్యములోను పరిమితమై యుండెను. మూడవకారణము కూడ నింకొకటి లేకపోలేదు. హెగల్ శుద్ధజ్ఞానవాది. అతని దృష్టిలో మానసిక విచారములు సత్యవస్తువులయు, పరిణామములయు కొలదిగానో, లేక గొప్పగానో బుద్ధిద్వారా కల్పిత ప్రతిబింబములు కావు. అట్లు కాకపోగా ప్రపంచమున గల వస్తువులు, వాని పరిణామములును శుద్ధమగు జ్ఞానప్రతిబింబములగుచున్నవి. ఆ ప్రతిబింబములు సత్యములేకాని నిర్మిత సత్యములు. శుద్ధజ్ఞానము ప్రపంచము ప్రకట మగుటకు ముందెక్కడనో యుండి యుండెను.

ఆలోచనాప్రక్రియ ప్రపంచ పదార్థముల సంబంధమును మార్చివేసినది. హెగల్ ఆలోచనలలో ననేకములయుక్తములై యుండెను. వీనిలో నాంతరిక వ్యాఘాత మున్నది. దానికి సమాధానము లేదు. ఒకవంక నితడు మానవేతిహాసము పరిణామశీల మనును. అయ్యది తన స్వభావము కారణముగా ఉపయుక్తమైన కొండొక శుద్ధసత్త యుద్భూతమైనపుడు పరిణామముయొక్క చరమసీమను చేరజాల దని చెప్పుచున్నాడు. మరియొకవంక నతడు శుద్ధసత్యములు పుంజీభూతము లగు ననియు నభిమాన పడుచున్నాడు. త్రికాలములందును బాధితముకాని ప్రాకృతిక జ్ఞానవ్యవస్థ

కానీ, ఐతిహాసిక జ్ఞానవ్యవస్థ కానీ యేదియైనను కథాత్మక మగు నాలోచనకు చెందిన మూలభూత నియమములకు విరుద్ధ మగుచున్నది. కథాత్మక యాలోచన ననుసరించి బాహ్యప్రపంచమునకు సంబంధించిన జ్ఞానము నిరంతరము అంగలు వేయుచుండును.

జర్మనీ దేశపు శుద్ధ జ్ఞానవాదమును జనులు సర్వవిధముల నయుక్త మని గుర్తించిరి. కావున వారు స్వాభావికముగనే ప్రకృతివాదము వంకకు తిరిగిరి. పదునెనిమిదవ శతాబ్దపు సాధారణమైన యతిభూతవాద తర్కము ననుసరించువారు మాత్రము సర్వవిధముల యంత్రతుల్యమైన ప్రకృతి వాదము వంకకు మరలలేదను విషయము మరువరాదు. ఆధునిక ప్రకృతి వాదము మానవత్వముయొక్క వృద్ధిశీల పరిణామ రూపమే చరిత్ర యని యెంచుచున్నది. ప్రకృతికికూడ నొక యితిహాస మున్నదని ప్రాకృతిక జ్ఞానము ఋజువుచేయును. ఆ జ్ఞానమునకు చెందిన నవీనతమమగు నావిష్కారముల కీ ప్రకృతివాదము పరమ మిత్రము. ఆధునిక ప్రకృతి వాదము ననుసరించి చూచిన నక్షత్రాది దివ్యపదార్థములుకూడ శరీర ధారులగు ప్రాణులవలె ప్రకటములై విలీనము లగుచున్నవి. ఈ ప్రకృతివాద మావశ్యక రూపమున కథాత్మకముగ నున్నది. ప్రకృతి వాదమునకు చెందిన యీ క్రొత్తయుగము రాకముందు కొన్ని ఘటనలు జరిగినవి. వానివలన చరిత్ర విషయమున జరుగు నాలోచన లందును చాల మార్పు గలిగినది.

క్రీ. శ. 1831 లో లియోంస్ నందు మొట్టమొదట శ్రామిక వర్గ ముత్పన్నమైనది. 1838-1842 కి మధ్య కాలములో ఇంగ్లండుయొక్క రాష్ట్రీయ శ్రామికుల యాందోళనము చరమ సీమను చేరుకున్నది. ఐరోపా దేశముల చరిత్రపు ప్రథమ పంక్తులలో ధనికులకు దరిద్రులకు మధ్య నేర్పడిన వర్గసంఘర్షము వ్రాయబడినది. 'మూలధన హితము, శ్రమహితము రెండును సమానములే. పరిశ్రమకు సంబంధించిన నిరంతర సంఘర్షము విశ్వవ్యాపక మగు నైశ్వర్యమునకు, పరస్పర ప్రేమకు కారణ'మని పెట్టుబడి విధానవాదు లయిన అర్థశాస్త్రజ్ఞులు చెప్పుచుండిరి. కాని యనేక ఘటన లీ మత మసత్య మని ఋజువుచేసినవి. చరిత్ర విషయమునందు ప్రాతకాలపు జ్ఞాన వాదుల మతము భౌతిక సుఖముల నాశ్రయించి జరుగు వర్గ సంఘర్షమును నిష్ఫలముగా నెంచుచుండెడిది. ఈ మతము ననుసరించి వస్తువుల యుత్పాదనతో నర్థమునకు గల సంబంధ మప్పుడప్పుడు నకస్మాత్తుగ ప్రకట మగుచుండెడిది. సభ్యత యొక్క చరిత్రలో దాని కంత ప్రాముఖ్య ముండెడిదికాదు. క్రొత్తఘటనలు గడచిన చరిత్రను క్రొత్తపద్ధతితో పరీక్షించినవి. ప్రాచీన చరిత్రము వర్గసంఘర్షమునకు చెందిన దని ఋజువైనది. సమాజమునందు స్పర్థాశీలవర్గములు ఉత్పాదనము, వినిమయము నను రెంటి కారణముచే నుత్పన్నమైనవి. సమాజముయొక్క యార్థికరచన, తన యుగమునకు సంబంధించిన న్యాయవ్యవస్థకు, రాజనీతి వ్యవస్థకు మూలాధారము. ధార్మిక మతము, దార్శనిక మతము రెండును దీనిమీదనే యాధారపడి యున్నవి. నేడు జ్ఞానవాదము తన కంతిమయాశ్ర

యమైన యైతిహాసికదర్శనమునుండి తొలగింపబడినది. ఇతిహాస విషయమున ప్రాకృతిక-భౌతిక- మతము నిరూపింపబడినది. మానవజ్ఞాన మతని యునికి (సత్తా) ద్వారాను, జీవనము ద్వారాను పరీక్షింపబడినది. పూర్వమున నిందులకు విపరీతముగ మానవుని జ్ఞానముద్వారా యతని యునికి, యతని జీవనము పరీక్షింపబడెడివి.

మొదటి సమాజవాదము పెట్టుబడిదారుల యుత్పాదనమును, దాని పరిణామములను విమర్శించెడి దనుటలో సందేహము లేదు. కాని యది పూర్ణముగ పరీక్షింపజాలకపోయినది. ఆ కారణమున దీని యాధిపత్యముకూడ దానిమీద లేకుండెను. ఐతిహాసిక రూపమున పెట్టుబడిదారుల యుత్పాదనరూపము కొండొక సమయమున ననివార్యముగ నెట్లుద్గమించినది ? ఎట్లు విలయము నందినది ? అను విషయములు నిరూపింపవలసి యుండెను. పెట్టుబడి పద్ధతితో జరుగు నుత్పాదనమునకు సంబంధించిన మరియొక స్వభావముకూడ బయటపడవలసి యుండెను. అది యింతవరకును మరుగుపడి యుండెను. ఆలోచకులు దాని దుష్పరిణామములమీద ప్రహారములు చేసిరి; కాని, వస్తుస్వరూపముమీద కాని, స్వభావముమీద కాని చేయరైరి. అతిరిక్త మూల్యముయొక్క యావిష్కార మీ కార్యమును పూర్తిచేసినది. పెట్టుబడిదారి విధానమునకు సంబంధించిన యుత్పాదనము, దాని మూలమున జరుగు శ్రామికుల శోషణము భృతిహీనశ్రమపై నాధారపడి యున్నవి. పెట్టుబడిదారుడు శ్రామికునకు పూర్ణ భృతి నిచ్చి, యతని శ్రమను కొనినప్పటికిని నతడు శ్రామి

కున కిచ్చు భృతికంటె నెక్కుడు మూల్యమును గ్రహించిన వాడే యగును. అతిరిక్తమూల్యము వలన ధనరాసులు నిరంతరముగా పెరిగి ధనపతుల స్వాధీనము లగును. *

మార్క్సు ననుగమించు ఎంగల్సు మున్నగువారి దృష్టిలో మార్క్సు సమాజవాదముయొక్క యసాధారణ రూప మిదియే. నే డీ సమాజవాదము సిద్ధాంతరూపముననే యున్నదనరాదు. రష్యాలో ననేక సంవత్సరములనుండి యీ వాదము ననుసరించి శాసనము నడుచుచున్నది. నేడు దీనిని వ్యావహారికము కాదని కానీ, కాల్పనిక మనిగానీ, యాక్షేపింప వలనుపడదు.

మార్క్సు వాదమును పరీక్షించు వారిలో కొందఱు సమాజవాదము సర్వవిధముల మార్క్సుప జ్ఞము కాదందురు. మార్క్సుకు చాలకాలము పూర్వమే బ్రే, హాడ్జకిన్ అనువా రీ వాదమును నిర్దేశించి యున్నారు. కాని వారు ప్రసిద్ధులు కారు. అయినను మార్క్సుకు పూర్వము ప్రసిద్ధ విచారకులు కొందఱు లేకపోలేదు. వారు చాల పనిచేయక పోలేదు. మార్క్సు వారిలో కొందఱి యాలోచనలు స్పష్టముగా గ్రహించి యున్నాడు. మరికొందఱి విచారములు-ఆలోచనలు-కూడ నతడు స్వీకరించెను. కాని, తిరస్కార భావముతో స్వీకరించెను.

అక్వాచిత్కవాదులను నవ్యవహారికు లందురు. కాని, వారు తమ సిద్ధాంతములను కార్యరూపమున పరిణమింప

---

* డ్యూరింగ్ మత ఖండనము — భూమిక పు. 23-33.

జేయుటకు పూర్ణముగ ప్రయత్నపరులు కాకపోలేదు. సంయుక్తరాజ్యమైన యమెరికాలో వారి సిద్ధాంతములను పరీక్షణలో బెట్టుట కవకాశము కూడ లభించినది. బ్రక్ ఫార్మ్, న్యూహోప్ (క్రొత్త ఆశ), న్యూహార్మనీ (నవసామంజస్యము), న్యూ ఎంటర్ ప్రైజ్ (క్రొత్త యత్నము) నను పేరులతో జరిగిన యాందోళనలలో నా పరీక్షణలకు ఫలమును లభించినది. హాథోర్ న్, హోర్స్‌ప్రీ, లీ, రిప్లీ, అల్ బర్ట్స్, బ్రిస్బేన్, హెన్ రీ జేమ్స్ నను వారా సిద్ధాంతములకు సంబంధించిన యాందోళనలు నడిపి యుండిరి. అవి నేటికిని కొంతవరకు పరివర్తనము చెందినను జీవించియే యున్నవి. ఆ యాలోచనలు వ్యాపార సంఘములు, సహకార సంఘములు విస్తరించుటకు తోడ్పడినవి. పందొమ్మిదవ శతాబ్దపు పెట్టుబడిదారుల సమాజ విశ్లేషణము కూడ వీనివలన జరిగినది. మార్క్సునకు పూర్వపు టర్థశాస్త్రజ్ఞు లందరు పూర్వపు సిద్ధాంతములకు వ్యాఖ్య నొనరించువారే యనియు, మార్క్సు మాత్రము పరీక్షకు డనియు లోకులు చెప్పుదురు. కాని యిది యుక్తము కాదు. ఆదమ్‌స్మిథ్ ప్రాచీన సిద్ధాంతములను వ్యాఖ్యానము చేయువాడు కాడు. అతడు సంస్కర్త. అతడు ప్రాచీన శీర్ణ, జీర్ణ ప్రక్రియలకంటె భిన్నమైన యార్థిక స్వాతంత్ర్యమును ప్రతిపాదించియున్నాడు. అతడు వ్యాపారపు పోటీలవలన భవిష్యత్తున గలుగబోవు దుష్పరిణామములను స్పష్టముగా చూపి క్రొత్త యార్థిక వ్యవస్థను ప్రకటించినవాడు. అతని తరువాత గాడ్ విన్, చార్ లెస్ హాల్, బ్రే, థామ్సన్, రాబర్ట్, ఓవెన్ అనువారు క్రీ. శ. 1793 నుండి 1825

వరకు గల మూడు దశాబ్దాల కాలములో నున్న యార్థిక వ్యవస్థను గూర్చి యెంతో సమాలోచన చేసియుండిరి. వీరి యందరి దృష్టిలోను యంత్రములద్వారా జరుగు వ్యాపారము శ్రామికుల స్వాతంత్ర్యమును, సమానత్వమును, ప్రాతిస్విక (వ్యక్తిగత) సంపత్తిని నాశ మొనర్చునదే. ఆ కారణమున వారు దానిని విరోధించుచుండిరి. వీరిలో మిక్కిలి ప్రసిద్ధుడైన ఓవెన్ ప్రకృతివాదియైన దార్శనికుడు. అతడు పరీక్షాశీలుడైన యకార్యాచిత్క వాదియు నై యుండెను. అతని మతము ననుసరించి పరంపర, శిక్ష, నలుదిశల నుండిన యవస్థలు క్రొత్త సంతానమును పరస్పరము కలిసి పనిచేయుటకు ప్రేరింపగలుగును. ఫ్రాంసు దేశ వాసియగు 'ఫేరియర్' సెయింట్ సైమన్ యొక్క గ్రంథములలో నీ విశేషభావము ముఖ్యరూపమున నున్నది. అకార్యాచిత్క వాదులు బలప్రయోగముకంటె సహకారిత్వము నెక్కుడు బలపరచిరి.

మార్క్సుకంటె పూర్వము కనీసము ముగ్గురు లేఖకులు పెట్టుబడిదారుల వ్యాపారమునకు చెందిన క్రొత్తయవస్థలను, సమాజముపైబడు వాని ప్రభావములను సంగతితోబాటు నిరూపించి యున్నారు. వీరిలో నొకరు ఆంగ్లేయుడు మాల్థస్; రెండవవాడు జర్మనీదేశీయుడు రోడ్ బర్టస్; మూడవవాడు స్విట్జర్లండు నివాసి సిస్మండి. డార్విన్‌కు పూర్వము లామార్క్ చేసినంత పని మార్క్సుకు పూర్వము సిస్మండి చేసియున్నాడు.

మార్క్సు సమాజవాదమున చేసిన యావిష్కార మెంత? ఇతరులు చేసిన దెంత? అనునదియే యీ వివాదమునకు చరమసీమ. నే నిక్కడ దీనినిగూర్చి విచారింపబోను.

అనేక విషయములతో మార్క్సు సమాజవాదమునకు సంబంధ మున్నది. వాని నన్నిటి నిట పరీక్షింప నవకాశము లేదు. ధర్మము, బ్రహ్మాండమునకు కర్తయగు నీశ్వరుడు, శరీరము కంటె భిన్నమగు చేతనాత్మ, జన్మాంతరవాదము, కర్మఫల వ్యవస్థ యనున వన్నియు నే ప్రమాణములద్వారా సిద్ధించునో యాప్రమాణములతో సమాజవాదమును సాధించు ప్రమాణ ముల కేమైన విరోధమున్నదా? లేదా? యని విచారింప వలసి యున్నది. మార్క్సు కథాత్మక ప్రకృతివాదము నంగీక రించును. అతని దృష్టిలో ప్రకృతి, దాని వికారములు తప్ప చేతనములయిన యాత్మ, పరమాత్మలు లేవు. 'పూంజీ' (క్యాపిటల్) ప్రథమభాగముయొక్క రెండవ సంస్కరణపు భూమిక యం దిట్లు వ్రాసియున్నాడు: 'నా కథాత్మకరీతి హెగల్ రీతి కంటె భిన్నమేకాక దానికి ప్రతికూలమునై యున్నది. హెగల్ మతమునందు మానవుని మస్తిష్కముయొక్క జీవన ప్రక్రియ - విచారప్రక్రియ - జ్ఞాన మను పేరుగల స్వతంత్ర వస్తువు. అది సత్యప్రపంచమును ప్రకటించు మూలశక్తి. ఇందుకు విపరీతముగ నా మతమునందు జ్ఞాన మనునది మనుష్యుని మస్తిష్కముద్వారా ప్రతిబింబితమై, వివిధములైన విచార రూపములలో పరివర్తితమై, సత్యమై యుండు ప్రాకృతిక ప్రపంచముకంటె వేరుగ మరి యొండేమియు కాదు. లెనిన్ దృష్టిలో బుఖనర్, ఫోగ్ట్, మోలోశోట్ అను వారి హీనభౌతికవాదమునేకాక, ఫాయల్ బాఖ్ యొక్క యుత్తమ భౌతికవాదమును కూడ మార్క్సు, ఎంగల్సు దోషయుక్తముగా నెంచిరి. వా రభౌతికములగు జీవేశ్వర

పదార్థములను భౌతికవాదులైన దార్శనికులవలె యుక్తులతో నిషేధింపరైరి. జీవేశ్వరుల యునికి సామాన్యజనులకు సంబంధించిన యుక్తివిరుద్ధమైన మిథ్యావిశ్వాసము నాశ్రయించి యున్నదని వారెంచియున్నారు.

నేడు సమాజవాద శాసనముద్వారా పాలితమగు రష్యాలో భౌతికవాద ప్రచారము జరుగుచున్నది. శాసనమును నడుపు నధికారులు రష్యా సమాజవాదము మార్క్సిజ నను సరించుచున్నదని యెంచుచున్నారు. * సమాజవాది యను పేరుగల యొక త్రైమాసిక పత్రమునందు అధ్యాపకుల సమాచార పత్ర మను పేరుగల మరియొక పత్రమునకు చెందిన రెండు లేఖల సారము ముద్రింపబడినది. మొదటి దానియందు లేఖలోని కొన్ని యంశము లనువదింపబడినవి. రెండవది మూలలేఖయొక్క సంగ్రహము. రెండు లేఖలును రష్యాలోని యాధునిక సమాజవాదుల బడులలో జరుగు ధర్మవిరుద్ధ ప్రచారస్థితిని వర్ణించుచున్నవి. అందు మొదటి లేఖాంశ మిట్లున్నది: "పిల్లవానిమీద పాఠశాల ప్రభావము మాత్రమే పడదను మాట మరువరాదు. వాడు తన సమయములో నెక్కుడు భాగము బడికి వెలుపల గడపును. మిత్రులతోను, వృద్ధులతోను కలిసి యుండును. కొన్ని పరివారములలో నిప్పుడుకూడా పెట్టుబడిదారి పద్ధతి యవశిష్టమై యున్నది. దానిద్వారా పిల్లవాని దృష్టికోణము,

* సమాజవాది విచారము "సోవియట్ స్టడీజ్" ఏప్రిల్ 1950 నం. 4 జేసిక్‌బ్లాక్ బేల్ బ్రాడ్‌స్ట్రీట్ ఆక్స్‌ఫర్డు. రష్యా సామాజిక, ఆర్థిక సంస్థానములను విమర్శించు త్రైమాసిక పత్రము.

విశ్వాసము ప్రభావితము లగుననుట మిక్కిలి స్పష్టము. నలు దిశలలో నుండు పరిస్థితుల మూలమున పిల్లవానిమీద నెట్టి ప్రభావము పడకుండ జేయుటకు ప్రత్యేకోపాయములతో విద్యాలయమున యత్నింపవలసి యున్నది. అంతేకాక తమ యధికారము ద్వారాను, ప్రభావము ద్వారాను పరిస్థితులకు విరుద్ధమైన ప్రభావము పిల్లవానియందు కలుగ జేయవలెను.

ప్రస్తుతము కొందఱ అధ్యాపకులు పిల్లలయందు పక్షపాతము, మిథ్యావిశ్వాసము, ధార్మిక విచారములు కనబడు చున్నను నుపేక్షించుచున్నారు. ఇంతేకాక వాస్తవమున 'విద్యార్థులు జీవనమును గుర్తింతురా, లేదా ? జీవనమునకు వ్యాఖ్య నొనరింపగలరా, లేదా ?' అను విషయములందును నుదాసీను లగుచున్నారు. ధార్మిక విశ్వాసములకు సంబంధించిన చిహ్నములు ప్రకటమైనప్పుడు వాని విషయమున నుపేక్ష వహించుటకు మొదటికారణము మాదృష్టిలో నధ్యాపకులు విద్యాలయపు విద్యార్థులలో ధర్మవిరుద్ధపు కార్యమొనర్చుటకు తగిన శ్రద్ధ కలిగింపకుండుటయే. ఈ విద్యార్థులే ముందు అధ్యాపకు లగుదురు. ధర్మవిషయమున సమాజవాదమునకు చెందిన రాజనీతి యెట్టిదో యధ్యాపకులు పూర్ణముగ నెఱుగకుండుట రెండవ కారణము. 'అధ్యాపకుల సమాచార పత్రము' యొక్క కార్యాలయమునకు కొన్ని పత్రములు వచ్చినవి. వానివలన 'ధర్మమును, దాని రీతులను గూర్చి పిల్లలు ప్రశ్నించినపు డధ్యాపకులు తరుచుగా నా ప్రశ్నలకు సమాధానము చెప్పక కాలము గడుపుచున్నారు' అని తెలియుచున్నది. అనేక పత్రములందు, 'దుర్భాగ్యవశమున

నధ్యాపకులు విద్యార్థులకు విద్యగఱపుటలో నసమర్థులగుటయే కాక స్వయముగ ధార్మిక విశ్వాసములచే బద్ధులయి యప్పు డప్పుడు ధార్మికాచారముల ననుష్ఠించుచుందు' రనియు నుదాహరింపబడినది. అధ్యాపకుల కొసంగబడిన రాజనైతిక శిక్షణలో జరిగిన కొఱతవలన నిట్టి పరిణామ మేర్పడినది.

ధర్మవిరుద్ధ ప్రచారము పిల్లలలో చేయకపోయిన నధ్యాపనకార్యమునందు కానీ, శిక్షాకార్యమునందు కానీ మహాత్త్వమును సంపాదింప వలనుపడదు. పిల్లలు నిత్యజీవితమునందు తరుచుగా ప్రకృతివిషయమునందును, సమాజ విషయమునందును తర్కవిరుద్ధ విషయములను వినుచుందురు. ఇరుగుపొరుగున నుండువారు, కుటుంబములోనివారు నాచరించు ధార్మికాచారములకు సంబంధించిన ప్రభావము పిల్లలపై పడుచుండును. అప్పుడప్పుడు పిల్లలు, యువకులు ధార్మిక క్రియలందు పాల్గొన బాధితు లగుటయు కలదు.

అధ్యాపకు లిట్టి యవకాశముల నుపేక్షింపరాదు. తర్కముద్వారా పిల్లలకు ధర్మము తర్కవిరుద్ధ మని చక్కగా బోధింపవలెను. ధర్మ మంధకార మనియు, ప్రకాశముతో దాని నెదురింపవలె ననియు లెనిన్ మిఖన్ ఇవానోచివ్‌తో ననుచుండెడివాడు. విద్యాప్రేరకులు, విద్యావ్యాఖ్యాతలు నగు మార్క్సు, ఎంగల్సు, లెనిన్, స్టాలిన్‌లు ధర్మమునకు సంబంధించిన సామాజిక మూలములను ప్రకటించిరి. 'ధర్మమునకు ప్రతికూలముగ యుద్ధమొనర్చుట పరంపరా సంబంధముతో ధర్మమును రక్షించు సమాజముతో యుద్ధము చేయుటయే యగునని మార్క్సు యుక్తముగానే చెప్పి

యున్నాడు. లెనిన్ ధర్మమునుగూర్చి యీ క్రింది శబ్దములు చెప్పియున్నాడు. "ధర్మ మొకవిధముగ జనులపై మోప బడిన యాధ్యాత్మికభార మనదగును. పరుల స్వార్థమును సాధించుటకు పరిశ్రమ మొనర్చి, వెనుకబడియున్న వారి మీదను, నవసరములగు వస్తువుల యభావముచే వ్యాకులత నొందువారిమీదను నీభార మాక్రమించి యుండును. ఉత్పీడ కులకు విరుద్ధముగా చేయబడు సంగ్రామమునందు, పీడితుల యసహాయదశ వారిలో మరణానంతరము సుఖజీవనము తప్పక కలుగు నను విశ్వాసము నుదయింపజేయుచున్నది. ఈ విశ్వాసము, ప్రకృతికి విరుద్ధముగా చేయు సంగ్రామములో నోడిపోయి చివరకు దేవతలను, భూతప్రేతములను, చమ త్కారములను నమ్మునట్టి యాటవికుల విశ్వాసమును పోలి యున్నది. జీవించినంతకాలము కష్టించి, యలసిపోయి, సుఖ సాధనములులేని మనుజున కీలోకమున శాంతి, సంతోషము లతో జీవించుటకు ధర్మ ముపదేశించును. కాని, యితరుల శ్రమ మీద బ్రతుకువారి కీజన్మమున మంచిచేయుడని చెప్పును. వారు పరులకు కలిగించు నుత్పీడనమును-బాధను-న్యాయోచిత మని నిర్ణయించి వారికి పరలోకమున స్వర్గీయసుఖము ననుభవించు టకు తగిన ప్రమాణపత్రములనుగూడ చౌకగా నొసంగును. జనులకు ధర్మము నల్లమందు. అది యొకవిధమగు నాధ్యా త్మిక మద్యము. దానిలో మూలధనమునకు దాసులైనవారు తమ మానవీయ సత్తాను, మానవీయ జీవనావశ్యకతను ముంచివేయుదురు.

క్రాంతికి పూర్వము రష్యాలో మతమునకు విశేష స్థాన ముండెను. విచార స్వాతంత్ర్య మనునదియే లేంకుడెను. రాజ్యస్వీకృత మతముమీాదనున్న విశ్వాసము నిరంకుశ రాజ్యతంత్రమునకు సహాయకముగా నుండెడిది. అన్యమత ములకు లేని విశేషాధికారములు దానికి ప్రాప్తమై యుండెను. ధనికుల ప్రపంచమున విద్యాలయములందు మతముకూడ పఠనీయ విషయమై యుండెను. ప్రాకృతిక విజ్ఞానము వికృత రూపమున నేర్పబడు చుండెను. సంఘరాజ్యమైన యమెరికా విద్యాలయములలో డార్విన్ వికాసవాదము చదివించుట కాటంకములు కలిగినవి. అక్టోబరులో జరిగిన సమాజ వాదమునకు సంబంధించిన గొప్ప క్రాంతి రాజ్యస్వీకృత మతము నంతమొందించినది. విచారస్వాతంత్ర్యము పూర్తిగ నెలకొల్పబడినది. సమాజవాదుల సంఘము మతమునకు విరుద్ధముగా ప్రచార మొసరింప దృఢపడినది.''

రెండవ లేఖలో నిట్లు చెప్పబడియున్నది— ''మతము లన్నియు భౌతికప్రపంచము క్షణిక మనియు, నాధ్యాత్మిక జగత్తు నిత్య మనియు చెప్పును. ఇది మానవులలో గల సహజ చేతనకు, విజ్ఞాన పరిణామములకు విరుద్ధము. మతము సమాజమున శత్రువుచేయు పనిని చేయును. భూమిమీాద జీవనోన్నతికొఱకు, నుత్పీడన నాశముకొఱకు చేయు యత్నము లకు విఘ్నము వాటిల్లజేయుటయే మతమునకు పని. పూర్వ కాలపు ఉత్పీడక ప్రపంచముతో సమాజవాదమునకు సంబం ధించిన ప్రపంచమునకు విరోధము నడుచుచున్నది. ఉత్పీడక వర్గములు ప్రాచీన రీతులను స్థిరపరుచుటకుగాను మతమునందు

విశేష శ్రద్ధను జూపసాగినవి. శోషణము, దరిద్రత, నిరుద్యోగము, నజ్ఞానము ననునవి మతసంబంధమైన సామాజిక మూలములు. సమాజవాదియైన రష్యాలో నియ్యవి నాశమొనరింపబడినవి. మతము గడచిపోయిన కాలమునకు చెందిన యవశిష్టముగా మిగిలియున్నది.''

పైన వర్ణించిన లేఖాంశములనుబట్టి మార్క్సువాదు లనాత్మవాదు లనుట స్పష్టము. వారు సమాజవాదముతో ననాత్మవాదమునకు స్వాభావిక సంబంధ మున్నట్లు భావించుచున్నారు. కాని, గూఢతత్వముల నావిష్కరించు కొండొక వ్యక్తి, కొన్ని యాలోచనలను పరస్పరము సంబద్ధము లయిన ట్లంగీకరించుట యనున దొక విషయము; కాని యంతమాత్రమున వానిలోగల స్వాభావిక సంబంధ మట్టిదా కాదా యనునది మరియొక విషయము. సంబంధములు స్వాభావికములు కావచ్చును; నైమిత్తికములు కావచ్చును. స్వాభావిక సంబంధ మెన్నడు విడిపోదు. కాని, నైమిత్తికమో, నిమిత్తము తొలగినపుడు విడిపోవును. తర్కశాస్త్రమునకు సంబంధించిన ప్రసిద్ధోదాహరణమయిన ధూమాగ్నుల సంబంధమును చూడుడు. ధూమము కార్యము. అగ్ని కారణము. కార్యమునకు కారణముతో గల సంబంధము స్వాభావికము. న్యాయశాస్త్రపు పరిభాషలో నియ్యది వ్యాప్తి యనబడును. అందువలన ధూమ మగ్నిని విడిచి యెన్నడు నుండనేరదు. కాని, కారణమునకు కార్యముతో గల సంబంధము స్వాభావికము కాదు. కార్యము లేకున్నను కారణ ముండవచ్చును. ధూమము లేకున్నను నగ్ని యుండును. అంగారములు -

నిప్పుకణములు, ఎండ, విద్యుద్దీపములు వీనితో ధూమము నకు సంబంధ ముండదు. కొన్నింటి సంబంధము రెండు విధము లను స్వాభావిక మగును. అగ్నికి తాపమునకు నున్న సంబంధ మిట్టిదియే. అగ్ని లేని తాపముకానీ, తాపము లేని యగ్ని కానీ చూడనేరము. ఏ రెండింటిలో నొకదానికి మరియొకటితో స్వాభావిక సంబంధ ముండదో వానిలో నైమిత్తిక సంబంధ ముండవచ్చును. దేవదత్తుడు, యజ్ఞదత్తుడు నిరువురు కలిసి నడువవచ్చును. విడివిడిగాను నడువవచ్చును. అందువలన వీరి సంబంధము నైమిత్తికము, స్వాభావికము కాదు. పై రెండును కాక స్వాభావిక సంబంధ మని చెప్పదగు సంబంధము మరియొండు లేదు.

శ్రామికులవలన నతిరిక్తమూల్య ముత్పన్న మగును. దానిమీద పెట్టుబడిదారుడైన మిల్లుయజమానికి గానీ, లేక గ్రామాధిపతికి గానీ యధికార మేర్పడుట యనుచితము. ఇయ్యదియే సమాజవాదము. ఇది దాని యసాధారణ స్వరూపము. దీనికి ననాత్మవాదముతో కార్యకారణ భావ మేమియు లేదు. మరియొక స్వాభావిక సంబంధముకూడ కని పింపదు. ఈ రెంటికి గల సంబంధము నైమిత్తికము. నిమిత్తము లేనపు డా సంబంధము నుండదు. మార్క్సు, అతని సహ చరుడైన ఎంగల్సు సమాజవాదము నంగీకరింతురు. అనాత్మ వాదమును నంగీకరింతురు. అందువలన నీ రెండు వాదము లకు సంబంధ మున్నది. అనాత్మవాదము నంగీకరింపక ఆత్మ, జన్మాంతరము మున్నగువాని నంగీకరించికూడ సమాజ వాదమును ప్రామాణిక మని చెప్పగలుగుదుము.

కొన్ని సిద్ధాంతములు కొండొక దర్శనమునందో లేక మతవిశేషమునందో యంగీకరింపబడును. అంతమాత్రమున నా దర్శనము యొక్కయో, లేక మతముయొక్కయో, సమస్త సిద్ధాంతములు పరస్పరము స్వాభావికసంబంధముచే సంబద్ధము లన వలనుపడదు. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము నను నైదు యమములు; శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము నను నైదు నియమములు యోగదర్శనమున సుఖ సాధనము లని చెప్పబడినవి. మాఠరుడు, వాచస్పతిమిశ్రుడు మున్నగు వ్యాఖ్యాతలద్వారా నిరీశ్వరవాది యని చెప్పబడిన సాంఖ్యదర్శనముకూడ పై జెప్పిన యహింసాదుల నాచరణీయము లని యంగీకరించుచున్నది. సాంఖ్యమే కాదు, అవైదికము లయిన జైన బౌద్ధ దర్శనములుకూడ యమనియమములను పాలింపవలె నని శాసించుచున్నవి. యోగదర్శనమున నీశ్వరునితోబాటు యమనియమాదులు ప్రతిపాదింపబడిన కారణమున యమనియమములకు నీశ్వరవాదముతో నవిచ్ఛేద్యమైన స్వాభావిక సంబంధ మేర్పడజాలదు. వేదాంత దర్శనము వేదముల ప్రామాణ్యము నంగీకరించును. దాని ననుసరించి వర్ణాశ్రమ వ్యవస్థ, యజ్ఞానుష్ఠానము రెండును ధర్మము లగుచున్నవి. ప్రపంచమునకు కర్తయగు నీశ్వరుడే వేదముల రచయిత. కాని, పూర్వ మీమాంసా దర్శనమున కాచార్యులయిన కుమారిలభట్టు, ప్రభాకరుడు, మండన మిశ్రుడు ననువారు వేదప్రామాణ్యమును, యజ్ఞానుష్ఠానము నంగీకరింతురే కాని యీశ్వరు నంగీకరింపరు. వారి మత

మున వేదములు నిత్యములు; వాని నెవ్వడు రచింపలేదు. కాగా, వర్ణాశ్రమ వ్యవస్థ, యజ్ఞప్రామాణ్యము నను నీ రెంటికి నీశ్వరవాదముతో స్వాభావిక సంబంధ మేమియు లేదు. అనీశ్వరవాదమును ఖండించుచు నెన్నడు నొక నైయాయికుడు కాని, వేదాంతి కాని, యనీశ్వరవాదు లయిన మీమాంసకుల విషయమున వర్ణాశ్రమ ధర్మములతో నీశ్వరవాదమునకు స్వాభావిక సంబంధ మున్నదని చెప్పి యాక్షేపించినట్లు చూడనేరము. అపరిచితు లనీశ్వర-వర్ణాశ్రమ-ధర్మ శబ్దమును విని చకితు లగుదురు. వైశేషిక దర్శన మతమునందు పరమాణువులు, వాని సంయోగ విభాగముల ద్వారా సృష్టి ప్రలయముల నొనర్చు నీశ్వరుడు నున్నట్లు వాత్స్యాయనుడు, ఉద్యోతకరుడు, వాచస్పతి మున్నగువా రంగీకరింతురు. కాని, పరమాణువాదమునకు నీశ్వరవాదముతో స్వాభావిక సంబంధ మేమియు లేదు. పరమాణువుల నొప్పుకొనినంతమాత్రమున నీశ్వరు నంగీకరించుట యనివార్యము కాదు. కొందఱు విద్వాంసు లీ వాక్యములను విని యాశ్చర్యపడవచ్చు; కాని, సాంఖ్యకారికలకు యుక్తిదీపిక యను వ్యాఖ్యను రచియించిన వారి మతమున కణాద దర్శన మనీశ్వరవాది యనియు, నాదర్శనమునందు కాలాంతరమున శైవదార్శనికు లీశ్వరవాదమును చొప్పించి రనియు తెలియుచున్నది.

హెగల్ జ్ఞానవాదముతో కథాత్మకమగు నాలోచనాపద్ధతికి సంబంధ మున్నది. కాని, మార్క్సు ఆ కథాత్మకపద్ధతిని గ్రహించి ప్రకృతి వాదమును వ్యాఖ్యానము చేసియున్నాడు.

కథాత్మకమగు నాలోచనాపద్ధతిని గ్రహించినపుడు దానితోబాటు శుద్ధజ్ఞానవాదమునుగూడ గ్రహించుట యవసరమని మార్క్సు తలంపడయ్యె. మార్క్సు మూల్యము, దానిని నిశ్చయించు నుపాయములు, సాపేక్ష నిరపేక్షలు, అతిరిక్తమూల్యము మున్నగు నార్థిక తత్వముల స్వరూపములను ప్రకటించి యున్నాడు. అందలి ప్రధానాంశ మాత్మవాదమునకు విరోధి కాదని నేనెంచుచున్నాడ. ఇంతేకాదు, నాటికది యతనికపరిహార్యమై యుండెను. ఇందుల కాత్మవాదులు ప్రమాణములద్వారా యార్థిక వస్తువుల స్వరూపమును గూర్చి విచారించుట యావశ్యకమై యున్నది. వర్గపీడనము, దరిద్రత, నిరుద్యోగము ననునవి ధర్మమునకు మూలము లని లెనిన్, స్టాలిన్ చెప్పుచున్నారు. మనుష్యునకే కాక ప్రాణి మాత్రమునకు శుభము నొడగూర్చు ధర్మముయొక్క మూలరూపమునం దాత్మయొక్క యుజ్వల మగు శుద్ధతత్వమును ప్రకాశింపజేయుటకు ప్రమాణములను గూర్చి యాలోచించుట యావశ్యక మయినది. ఆత్మవాదముమీద శతాబ్దములనుండి వజ్రప్రహారములు జరుగుచున్నవి. నేడు సమాజవాదము విజ్ఞాన మను నభూతపూర్వ (క్రొత్త) శస్త్రమును గ్రహించి, రాజనీతికి, సమాజమునకు, చరిత్రమునకు సంబంధించిన ప్రత్యంశము నుండియు నాత్మను దూరముచేయ యత్నించుచున్నది ; ఆత్మ నామమునుకూడ తుడిచిపెట్టనున్నది. అందువలన నాలోచనాజ్యోతి ప్రదీప్తము కావలసియున్నది. ఈ యాలోచనకు విషయ మభౌతికములయిన జీవుడు మున్నగు పదార్థములు ప్రమాణసిద్ధము లగుటయో

లేక కాకుండుటయో కాదు; అతిరిక్త మూల్యాదులకు నాత్మ వాదముతో నున్న సంబంధమే విషయము. కార్లుమార్క్సు అభౌతికము లగు నాత్మాదుల నంగీకరింపక ముందుకు నడిచినాడు. నేను వాని నంగీకరించి ముందంజ వేయుదును.

సమాజవాదము కేవలము మార్క్సీయము కాదు. అది మార్క్సు ఎంగల్సీయము. దీని ప్రధానతత్త్వములు రెండు రకములు. మొదటి తత్త్వము ధనమునకు సంబంధించినది. రెండవది పరివారమునకు సంబంధించినది. అర్థ సంబద్ధ తత్త్వములను 'కూలి-మూలధనము' (వేజెస్ అండ్ క్యాపిటల్ 1949), 'అర్థశాస్త్ర సమాలోచనము' (క్రిటిసిజమ్ ఆఫ్ ఇకనామిక్సు 1859), 'పూంజీ (క్యాపిటల్ 1867) ప్రథమఖండము' మున్నగు గ్రంథములలో మార్క్సు ప్రతిపాదించి యున్నాడు. రెండవది యగు పారివారిక తత్త్వనిరూపణము ఎంగల్సు 'పరివారము వ్యక్తిగత సంపత్తి', 'రాజ్యోత్పత్తికి మూలము' అను గ్రంథములందు చేసియున్నాడు. వీనిలో రెండవతత్త్వ మాత్మవాదమునకు మిక్కిలి విరుద్ధముగా నున్నది. అర్థము పరివారమునకుకూడ మూలము. కావున ముందుగా దానినే యాలోచింతును.

# రెండవ యధ్యాయము

## లోకవ్యవహారముద్వారా స్వత్వజ్ఞానము

పణ్యావస్తువుల క్రయ విక్రయముల ద్వారా లోక వ్యవహారము నడుచుచున్నది. పణ్యాస్వామి వస్తువులను కొనువాని నుండి మూల్యమును గ్రహించి పణ్యముల నతని కమ్మును. కావున కొనువానికి మూల్యముమీదను, అమ్మువానికి పణ్యము మీదను స్వత్వ మున్నదని తెలియుచున్నది. స్వత్వ మనునది లేకున్న నిచ్చి పుచ్చుకొనుటలు - క్రయ విక్రయములు - జరుగ నేరవు. ఎల్లరిలోను నిచ్చి పుచ్చుకొనుట లున్నవి. కావున స్వత్వ మన నేమో తెలియనివా రుండరు. ధర్మశాస్త్రములందు స్వత్వము నిరూపింపబడి యున్నది. ధర్మశాస్త్రకారులలో కొందరీ స్వత్వ మనునది కేవల శాస్త్రగమ్యము - శాస్త్రముద్వారా తెలియదగినది - అందురు; మఱికొందఱు లోకసిద్ధమందురు. విజ్ఞానేశ్వరుడు యాజ్ఞవల్క్య స్మృతికి టీకయైన మితాక్షరయందును, మిత్రమిశ్రుడు వీరమిత్రోదయమునకు చెందిన వ్యవహార ప్రకాశమునందును స్వత్వము లోకవ్యవహారసిద్ధమని బాగుగ వివరించియున్నారు.*

స్వత్వము కేవలము శాస్త్రగమ్య మని యంగీకరించి నపుడు, శాస్త్రమునందు శ్రద్ధగలవారు స్వత్వవిషయమునందు శాస్త్రకారు లెంతచెప్పిన నంతే తు-చ- తప్పకుండ నంగీక

---

* యాజ్ఞవల్క్య స్మృతి. వ్యవహారాధ్యాయము. దాయవిభాగము. పు. 197-198 వీరమిత్రోదయము వ్యవహార ప్రకాశము. పు. 415-425.

రింతురు. అట్లుకాక స్వత్వము లోకవ్యవహారసిద్ధ మని యంగీకరింతుమేని యాచరణమున నున్న వ్యవహారమునందు పరివర్తనము చేయ వీలగును. హాని లాభములను విచారించి యొకప్పుడు మొదట జనులు స్వత్వమునకు సంబంధించిన యుపాయములను నిశ్చయించి యుండిరి. నేటి మానవులు దేశకాల భేదములను మనసున నిడుకొని, వానిలో నుచిత పరివర్తనలు చేయగలుగుదురు. అట్లు చేయుట యధర్మము కానేరదు. స్వత్వప్రాప్తికొఱకు పూర్వము శాస్త్రము ప్రతిపాదించిన యుపాయములు ప్రాచీనకాలమున నుపయుక్తము లయి యుండవచ్చు. నేడవి యనుపయుక్తము లయి నందున క్రొత్త యుపాయములను నిర్ణయించిన నవియును పూర్వపు టుపాయములవలె ప్రామాణికము లగును.

స్వత్వము శాస్త్రైకగమ్యమని యెంచువారి ననుసరించి, శాస్త్రము లోకసిద్ధమగు నర్థమును ప్రతిపాదించినచో నది వ్యర్థ మగుచున్నది. అలౌకిక తత్త్వమును ప్రకాశపరుచుటయే శాస్త్రమునకు ముఖ్య ప్రయోజనము. అప్పుడే యది శాస్త్ర మగును. అన్నము పక్వమైన తరువాత తినదగిన దగును. ఇయ్యది లోకసిద్ధ విషయము. ఇందులకు శాస్త్ర మెన్నడు యత్నింపదు. కాని లోకసిద్ధవిషయమునుకూడ శాస్త్ర మను వాదము చేసినచో నది నిష్ప్రయోజనము కాదు. వ్యాకరణ శాస్త్రము సాధుశబ్దములను గూర్చియు, నసాధుశబ్దములను గురించియు బోధించును. శబ్దములలోని సాధుభావముకానీ, యసాధుభావముకానీ లోకసిద్ధమే యగుచున్నది. సాధుశబ్ద ములతో బాటసాధుశబ్దములు కూడ లోకవ్యవహారమున

ప్రయోగింపబడుచున్నవి. సాధుభావము లౌకికమేకాని యది యసాధుభావముతో సంకరమగుచున్నది. అసాధుశబ్దములతో సంకరముకాని సాధుశబ్దముల గూర్చి వివేచించుట వ్యాకరణ శాస్త్రమునకు ప్రయోజనము. మీమాంసా శాస్త్రపు సాధు శబ్దాధికరణమున వ్యాకరణ శాస్త్రమున కిదియే ప్రయోజన మని వర్ణింపబడియున్నది. వ్యాకరణమువలెనే ధర్మశాస్త్రము కూడ లోకసిద్ధమగు స్వత్వోపాయములను నిరూపించును. కొందఱు భ్రమపడి 'స్వం' కానిదానిని 'స్వం'గా తలం తురు. ఇట్టి భ్రమ యనర్థమునకు మూలము. 'స్వం' 'అస్వ'ములను వివేచించుటకే స్మృతికర్తలు స్వత్వోపాయ ములను నిర్దేశించి యున్నారు.

స్వ-భావము క్రయవిక్రయములకు సాధనము. క్రయ విక్రయములు లౌకికార్థములు. ఈ విషయములో నెవరును వివదింపరు. లౌకికార్థమునకు సాధనముకూడ లౌకికమే. అన్నము, వస్త్రము, కాష్ఠము మున్నగువాని ద్వారా లౌకిక ప్రయోజనము సిద్ధించును. వాని నలౌకికము లని యెవరు ననరు. అన్నాదులవలెనే స్వత్వముకూడా లౌకికము కావలెను. అన్నము ద్వారా యాకలి యణగిపోవును. వస్త్రములద్వారా శీతోష్ణములవలన కలుగు బాధ నివారింపబడును. ఈ పదార్థ ములు లౌకిక ప్రయోజనములను సిద్ధింప జేయును. స్వత్వ మన్న వస్త్రాదుల ప్రాప్తికి సాధనము. బియ్యము నమ్మువానికి బియ్యము మీద స్వత్వ ముండును. అందువలన నతడు వాని నమ్మ చున్నాడు. కొనువానికి మూల్యముమీద స్వత్వ ముండును. వాడు దాని నిచ్చి బియ్యము తీసికొనుచున్నాడు. ఆకలి, చలి,

చేసి మున్నగు బాధలను తొలగించి లౌకిక సుఖముల నొడ గూర్చు నన్నవస్త్రాదులు లౌకికము లగుచున్నవి. లౌకికము లగు నన్నవస్త్రాదుల ప్రాప్తింప జేయు స్వత్వముకూడ లౌకికమే కావలెను.

ఆహవనీయాగ్ని స్వరూపము కేవల శాస్త్రగమ్యము. అది లౌకిక క్రియకు సాధనముకాదు. దానివలన కలుగు ఫల మలౌకిక మగుచున్నది. లౌకిక ప్రమాణ మాహవ నీయాదులతో వాని ఫలములకు గల పరస్పర కార్య కారణ భావమును తెలుపజాలదు. అగ్నిహోత్రము, దర్శపూర్ణ మాసము మున్నగు యాగములు అలౌకికము లగు స్వర్గాది ఫలములకు సాధనములు. వీనికి గల సాధ్యసాధనభావము శాస్త్రైకగమ్యమే యగుచున్నది.

స్వత్వము కేవల శాస్త్రగమ్య మగుచో దానివలన లోకసిద్ధ క్రయవిక్రయములు జరుగనేరవు. ఆహవనీయాగ్ని యొకవేళ లౌకిక ఫలమునకుకూడ సాధనము కావచ్చును; కాని, యప్పు డది యాహవనీయ స్వరూపమున సాధనము కాదు. అప్పు డది కేవల మగ్నిరూపమున పాకమునకు సాధన మగును. ప్రత్యక్షముగా కనబడు నగ్నిస్వరూపము లౌకికమే.

పూర్వ మీమాంసా శాస్త్రము స్వత్వమును, దాని యుపాయములను లౌకికము లనియే చెప్పును. 'లిప్సా' సూత్రము (పూ. మీ. అ. ౪. పా. ౧. అధి. ౨. సూ. ౨.) నకు శబరస్వామి మూడు వ్యాఖ్యలు చేసియున్నాడు. మూడవ వ్యాఖ్యయందు స్వత్వ విచారణ కలదు.

స్మృతికర్తల ననుసరించి నాలుగు వర్ణములకు భిన్న భిన్నము లయిన అర్జనోపాయములు నియమింపబడి యున్నవి. గౌతముని ధర్మసూత్రముల ననుసరించి దాయము, క్రయము, సంవిభాగము, పరిగ్రహము, అధిగమము ననునవి స్వత్వము నకు కారణములు.

ఏ వస్తువు తన స్వామికి సంబంధించిన మరియొక వ్యక్తికి (వారసునకు) 'స్వం' అగుచున్నదో యది దాయ మనబడును. పుత్రుడు, పౌత్రుడు, పితృపితామహుల ధనమును బొందు చున్నారు. పుత్రభావము, పౌత్రభావము ధనప్రాప్తికి కారణ ములు; పితృపితామహుల ధనము దాయ మగుచున్నది.

క్రయ మనగా ఇచ్చి పుచ్చుకొనుట. సంవిభాగ మనగా పంచుకొనుట. పైతృకమో, లేక వంశముద్వారా ప్రాప్తిం చినదియో యగు సంపదను వారసులు పంచుకొందురు. ఈ పంపకముద్వారా వా రా సంపత్తికి స్వాము లగుదురు.

ఏవస్తువున కింతవరకు స్వామి యుండడో దానిని గ్రహిం చుట పరిగ్రహ మనబడును. నీరు, గడ్డి, కట్టెలు మున్నగు వస్తువులు వానికొక స్వామి లేనపు డెవరైనను వానిని గ్రహింప వచ్చును.

నిధి మున్నగువానిని పొందుట యధిగమ మనబడును. పూర్వకాలమున నెక్కడో భూమియందు పూడ్చి భద్రపర చిన ధనరాశికి స్వామి లభింపనపుడు, దాని నెవ రన్వేషింతురో వారు పొందవచ్చును.

ఈ యుపాయములతో చాతుర్వర్ణ్యమునకు సంబంధించినవా రెవరైనను గొండొక వస్తువునకు స్వామి కావచ్చును. కొన్ని స్వత్వోపాయము లొక్కొక్క వర్ణమున కసాధారణములుగా చెప్పబడినవి. బ్రాహ్మణుడు దానము గ్రహించి ప్రాప్తవస్తువునకు స్వామి కావచ్చును. క్షత్రియునకు దానము గ్రహించు నధికారము లేదు. యుద్ధమున జయించిన తదుపరి లభించిన వస్తువుపై నతని కధికారము కలుగును. వైశ్యుడు కృష్యాదుల ద్వారా ప్రాప్తవస్తువులకు స్వామి యగుచున్నాడు. కృష్యాదులు వైశ్యునకు నియతకర్మలు. సేవ మున్నగు కర్మల నొనర్చినమీదట లభించు వస్తువులకు శూద్రు డధికారి యగుచున్నాడు. ఇవి యన్నియు నసాధారణ ధర్మములు.

ఈ యుపాయములతో లభించు ద్రవ్యమునకు రెండు ప్రయోజనము లున్నవి. ఈ ద్రవ్యము యజ్ఞముకొఱ కుపయోగింపబడినచో నది క్రత్వర్థ మగును. మనుజుడు తన సుఖముకొఱ కుపయోగించుకొనినచో నది పురుషార్థ మనబడును. మొదటి పక్షమున ద్రవ్యార్జనము యజ్ఞార్థ మగుచున్నది.

బ్రాహ్మణ వాక్యములద్వారా యజ్ఞము విధింపబడుచున్నది. యాగము ద్రవ్యములేక సిద్ధింపదు. కావున యాగమును విధించు వాక్యములు యాగముతోబాటు ద్రవ్యార్జనమునుకూడ నర్థతః (యాగసాధక రూపమున) ప్రతిపాదించుచున్నవి. కాని, యర్జనము పురుషార్థ మనియే సిద్ధాంతము.

ధనార్జనము చేసి పురుషుడు ప్రసన్నుడగును. పురుషుడు శరీరధారి. శరీరపోషణము ధనము లేకున్న కలుగదు. ఒకని శరీరము బాగుగ పోషింపబడుచున్నదనిన నతని దగ్గర ధన మున్నదని భావము. ముఖ్యరూపమున ధనప్రయోజనము శరీరపోషణము-ధారణము. ఆ ధనమువలన యజ్ఞము కూడ చేయవచ్చు. యజ్ఞముకొఱకు బియ్య మవసరము. బియ్యము యజ్ఞముకొఱకు సంపాదించినను, లేక శరీరపోషణార్థము సంపాదించినను, రెండు దశలలోను యజ్ఞము చేయవచ్చును. ప్రయోజన భేదమువలన బియ్యపు స్వరూపములో బేధ మేమియు కలుగదు. అర్జన ప్రయోజనము యజ్ఞమైనను, లేక శరీరధారణ మైనను బియ్యము బియ్యముగానే యుండును. విధివాక్యములు యాగమును విధించును. ధనార్జనము చేయుట వాని కర్థము కానేరదు.

అర్జనము-సంపాదనము-పైనచూపిన విధమున పురుషార్థ మైనందున స్వత్వము, దాని యుపాయములు లోకసిద్ధము లని స్పష్టమగుచున్నది. ఇచ్చి పుచ్చుకొనుట మూలమున వస్తువు మీద స్వత్వము సిద్ధింపకున్న నది పురుషుని సుఖమునకు కారణము కాదు. దేనిమీద నొకని కధికార ముండదో యది వాని కుపయోగింపజాలదు. మీమాంసా దర్శనపు శాబర భాష్యమునకు వ్యాఖ్యానము వ్రాసిన కుమారిలభట్టు, ఈ స్థలమున నవాంతర మతభేదము కలవాడైనను, స్వత్వము, దానికి సంబంధించిన యుపాయములు లోకసిద్ధము లనియే యంగీకరించి యున్నాడు.

శాస్త్రజ్ఞానము లేనివారుగూడ క్రయ విక్రయములు చేయుచున్నారు. వారికిగూడ స్వ, పర సంపత్తుల జ్ఞానమున్నది. వస్త్రములు, ఫలములు, పుష్పములు, వెండి, బంగారములు వీనివలె స్వకీయ వస్తువు, పరకీయ వస్తువు కంటికి గోచరమగును. యజ్ఞస్వరూపము నెరుగుటకు శాస్త్రము నాశ్రయింపవలసి యున్నట్లు స్వకీయ, పరకీయ స్వత్వముల నెరుగుటకు శాస్త్రమువంక చూడవలసిన యవసరము లేదు. అందఱు వస్త్రాదులను కొని వానిని తమవిగా నెంచుచున్నారు. అన్నవస్త్రాదులను, తినుటకు ధరించుటకు నుపయోగించుచున్నారు.

వస్త్రములయు, ఫలములయు నాకారములు, రంగులు కన్నులకు విషయము లగుచున్నవి. వస్త్రాకారమునకు, ఫలాకారమునకు గల భేదము కంటికి స్పష్టముగా కనిపించును. వస్త్రమునకు, ఫలములకు నాకార మున్నట్లు, స్వత్వమున కాకారము లేదు; రూపము లేదు. స్వత్వము కర్మముద్వారా యుత్పన్నమగును. రంగు గల ద్రవ్యము ప్రత్యక్షమైనట్లు, దాని కర్మము - క్రియ - కూడ ప్రత్యక్ష మగును. వస్త్రము కదలినపుడు, వస్త్రముతోబాటు దాని కదలికయు కంటికి తెలియును. సాలెవాడు వస్త్రములు నేయునపు డతని శ్రమ- అతని చేతులు కదలుట, తద్ద్వారా తంతువులు కదలుట- సాలెవానికి కనబడినట్లితరులకును కనబడును. కాబట్టి రూపము గల ద్రవ్యముల కర్మలు ప్రత్యక్షము లగుట స్పష్టము. కాని కర్మ క్షణికము. అది నష్టమైన తరువాత దాని ద్వారా యుత్పన్నమైన వస్త్రము మిగులుచున్నది. తన శ్రమవలన

నేర్పడినది కావున వస్త్రముమీద తనకు స్వత్వ మున్నట్లు సాలెవా డెంచును. ఎవని శ్రమవలన నేది యేర్పడుచున్నదో వానికి దానిమీద స్వత్వ ముండును. ఇది శుద్ధమైన జ్ఞాన వ్యాపారము. జ్ఞానమునుమించి దీనికి వెలుపలియునికి యేమియు లేదు. జ్ఞానము మనస్సుతో తెలియదగినది. అందువలన జ్ఞానమయ మగు స్వత్వముకూడ మనోవేద్య మగుచున్నది. దృశ్య మగు వస్త్రముతో సంబంధ ముండుటచేత, స్వత్వము మనోవేద్య మైనను నేత్రములకుకూడ కనబడుచున్నట్లే యుండును. వస్త్రము నిర్మింపబడినపుడు కర్మకూడ ప్రత్యక్షమై యుండెను. కర్మ ప్రత్యక్ష మగుచున్న సమయమున నా వస్త్రముపైగల స్వత్వము నిర్మాత యగు సాలెవానికి వలెనే యితరులకుకూడ మనస్సు ద్వారా ప్రత్యక్షమై యుండెను. వస్త్రము నిర్మింపబడిన తరువాత వినష్టమైన కర్మము ప్రత్యక్షము కాదు. కర్మ ప్రత్యక్షము కానపుడు స్వత్వముకూడ మానస ప్రత్యక్షము కాజాలదు. సిద్ధమై యొకచో నున్న వస్త్రమును జూచినపుడు దాని స్వత్వ మెవరికిని ప్రత్యక్షము కానేరదు. సిద్ధమైన వస్త్రమును సాలెవాడు చూచినపు డతడితరులవలెనే వస్త్రరూపముననే దానిని చూచును. అతనికిని స్వత్వ మప్పుడు ప్రత్యక్షముకాదు. వస్త్ర నిర్మాణకాలమున స్వత్వమునకు సంబంధించిన యే మానస ప్రత్యక్షము కలిగెనో యది యపుడు స్మృతిరూపమున నతనిలో నుండును. అనగా- 'నేనీ వస్త్రమును నిర్మించితిని' అను స్మృతి నేతగానికుండును. స్మృతి ద్వారా స్వత్వముతో నతనికి సంబంధ మున్నదని భావము. వస్త్రము నుత్పన్నముచేసిన శ్రమ యిప్పుడు లేదు.

కాని దానివలన నుత్పన్నమైన వస్త్ర మున్నది. శ్రమకు వస్త్రమునకు గల సాక్షాత్ సంబంధము విడిపోయినది. కాని జ్ఞానమయ సంబంధ మిప్పుడుకూడ నున్నది. నేతగానికి కానీ, మఱియొకరికి కానీ, యెవరికి వస్త్రముతో శ్రమకుగల సంబంధ జ్ఞాన మున్నదో వారికి వస్త్రము, దాని స్వత్వము కూడ కనబడుచునే యుండును. ఎవరు వస్త్రముతో శ్రమకుగల సంబంధము నెఱుగరో వారికి వస్త్రముమాత్రమే కనిపించును; స్వత్వము కానరాదు. వారి కా వస్త్రస్వామినిగూర్చి సందేహము కలుగుట సహజము. ఇట్టి సందేహమువలన స్వత్వము మనోవేద్య మనుట సిద్ధ మగుచున్నది. మనోవేద్యము కూడ నేత్రగమ్య వస్తువు వలె లోకసిద్ధమే యని తెలియవలెను. వస్త్ర, ఫల, పుష్పాదు లెట్లు దృశ్యపదార్థములై లోకసిద్ధము లగుచున్నవో యట్లే మనోవేద్యము లయిన సుఖదుఃఖాదులు కూడ లోకసిద్ధములే. కాబట్టి సుఖ దుఃఖాదులవలెనే స్వత్వము కూడ మనోవేద్య మగుటచే నదియు లౌకికమే కావలెను. సుఖ దుఃఖములు భౌతిక పదార్థములవలన నుత్పన్నము లగును. కాని వాని యనుభవము ప్రాణికి లోపల గలుగుచున్నది; వెలుపల కాదు. స్వత్వానుభవము లోపల కలుగుచుండియు నది వెలుపల కలుగుచున్నట్లు తోచును.

కంటికి కనబడు పదార్థముల గుణములలో కొన్నింటి జ్ఞానము కంటి ద్వారా కలుగును. మరికొన్నింటి జ్ఞాన మితరేంద్రియముల వలన కలుగును. ఇట్లీ రెండురకముల గుణముల యనుభవము పలుమారు కలుగుటచేత, నొక వస్తువును కంటితో చూచినపుడు కంటికి కనబడక యితరేంద్రియ

ములతో నెరుగదగు గుణముల స్మృతి కలుగును. ఈస్మృతి మనస్సుద్వారా కలుగును. కాని యాస్మృతి మిక్కిలి వేగ ముగా కలిగినందున నాగుణములు దృశ్యములైనట్లే తోచును. ఆమ్రఫలమును చూడగానే దాని గంధము, రసము రెంటి జ్ఞానము కలుగును. గంధము నాసికా విషయము. రసము జిహ్వకు విషయము. ఆమ్రఫలము నాసికనుకానీ, జిహ్వనుకానీ సమీపించుటకు పూర్వమే దాని గంధము, రసము రెండును స్మృతికి వచ్చును. అట్టియెడ శీఘ్రతకారణ ముగ ఫలమువలె దాని గంధరసములుకూడ దృశ్యములైనట్లు తోచును. గంధము, రసము విభిన్నేంద్రియముల విషయ ములు. మనస్సుద్వారా వాని స్మరణ కలుగును.

స్వత్వ మనునది బాహ్యేంద్రియమునకు విషయము కాదు. అది జ్ఞానమయము. అందువలన సుఖదుఃఖముల వలె నది మనోవేద్యము. మనస్సు స్వత్వ సంబంధమును దృశ్య వస్తువుతో నంగీకరించినది. కావున స్వత్వజ్ఞాన మాంతరిక మయినను బాహ్యదృశ్యము వలె తెలియును. వెలుపలి వస్తువు దృశ్య మగును. కావున స్వత్వము కూడ దృశ్యమై తెలియ నగును. ఒకానొక వస్తువు కంటికి విషయము కాకున్నను నేదో యొక కారణమున నది కంటికి విషయమైనట్లు తోచును. ఆ కారణ విశేషము తొలగిపోయినపుడు దాని దృశ్య స్వరూ పము నుండజాలదు. అది తన పారమార్థిక రూపమున నెదుట బడును. స్వత్వ విషయమున కలుగు సందేహమే యది యదృశ్య మనుటకు ప్రమాణము. దానివలన నది మనోవేద్య మనియు సిద్ధ మగుచున్నది.

దృశ్యవస్తువులలోని స్వత్వము సందిగ్ధ మగుటచేత కొందఱు స్వత్వము నలౌకిక మని యెంచుచున్నారు. వారు "స్వత్వజ్ఞానము కేవల శాస్త్రగమ్యము. స్వత్వము లౌకిక మగు నెడల స్వామి యెవరో తెలియనపుడు 'కొండొక వస్తువుమీద నెవరికి స్వత్వమున్నది? ఇతనికా? అతనికా?' అను సందేహము కలుగరాదు. స్వత్వము కేవల శాస్త్రగమ్య మని యంగీకరించిన నిట్టి దోషము వాటిల్లదు. కేవల శాస్త్రగమ్య వస్తువు నిశ్చయము కంటితో చూచినంత మాత్రమున కలుగదు" అని యందురు. ఈ యాక్షేపమునకు వీరమిత్రోదయకర్త యిట్లు సమాధానము చెప్పియున్నాడు. "స్వత్వమునకు కారణములు క్రయవిక్రయాదులు. 'కొన్నవా డెవడు?' అని సందేహము కలుగును. కావున స్వత్వము విషయమునకూడ సందేహము కలుగును." (వీరమిత్రోదయము–వ్యవహార ప్రకాశము - పు ౨౨౨). కాని, స్వత్వము లోకసిద్ధ మగు నెడల 'కొన్నది యెవరు?' అని క్రయాదులలో సందేహము కలిగినను, స్వత్వనిశ్చయము కంటితో చూచినపుడు కలుగవలెను. క్రయాదులు స్వత్వమునకు జనకములే కాని స్వత్వము కాదుగదా! జనకవస్తువు విషయమున కలుగు సందేహము జన్యవస్తు స్వరూపములో సందేహము కలుగజేయజాలదు. ఒక మనుజుని చూచినపు డతని 'తండ్రి యెవరు?' అని సందేహము కలుగవచ్చును కాని, అతడు మనుజు డగుటలో నెట్టి సందేహము కలుగజాలదు గదా?

వాస్తవమున దృశ్య వస్తువునకు రెండు రకములైన యదృశ్యధర్మము లుండును. కేవల శబ్దగమ్యములైనవి యొక

రకము. అవి శాస్త్రముల ద్వారా విహితములైన కర్మ లాచరించినందున నేర్పడును. వానిని కంటితో చూడనేరము. అగ్నికి గల యాహవనీయ ధర్మ మిట్టిదే. అగ్నికి గల లౌకిక స్వరూపము దానిని చూచినంత తెలియును. ఆ లౌకిక రూపములో తాపము, ప్రకాశము నున్నవి. అగ్నియొక్క యాహవనీయ జ్ఞానము శాస్త్రము ద్వారా తెలియును. రెండవ రకమునకు చెందిన యదృశ్య ధర్మములు లౌకికములే కాని, వానిని తెలిసికొనుటకు శాస్త్రక్రియా కలాపముల నెరుగ నవసర ముండదు. అవి మనోవేద్యములు. స్వత్వ మీ రెండవ వర్గమునకు చెందినదే. శాస్త్రము లేకున్నను స్వత్వ జ్ఞానము మనస్సుద్వారా కలుగును. వస్త్రముయొక్క స్వత్వము మనోవేద్య మగుటకు కారణ మది యదృశ్య మగుటయే కాని, యలౌకికము, కేవలము శబ్దగమ్యము నగుట కాదు.

స్వత్వము జనుల నిత్యవ్యవహారమునకు చెందిన వస్తువు. శాస్త్రకర్త లీవిషయమున చెప్పినదియు లోకసిద్ధ మగు చున్నది. స్వత్వవిషయముననే కాక యితర వ్యావహారిక విషయములందును శాస్త్రకారులు లోకసిద్ధ తత్వములను నిరూపింతురు. వీరమిత్రోదయ కర్త, "వ్యవహారమునకు సంబంధించిన స్మృతులు తరుచుగా లోకసిద్ధములగు నర్థముల ననువదించు"నను విషయము నిబంధకారు లందరు నంగీక రించుచున్నారని వ్రాయుచున్నాడు. *

---

* వీరమిత్రోదయము. వ్యవహార ప్రకాశము. పు. ౪౨౦

మనుస్మృతి, కొండొక యవస్థయందు స్వత్వమునకు చౌర్యముకూడ కారణ మగు ననుచున్నది.

"తథైవ సప్తమే భక్తే భక్తాని షడనశ్నతా
అశ్వస్తన విధానేన హర్తవ్యం హీనకర్మణః॥
ఖలాత్ క్షేత్రా దగారాద్వా యతోవాప్యుపలభ్యతే
ఆఖ్యాతవ్యంచ తత్తస్మై పృచ్ఛతే యది పృచ్ఛతి॥
మ. అ. శ్లో. 16-17.

'ఆరు భోజన సమయములలో భోజనము లభింపని వ్యక్తి యేడవ సమయమున హీనకర్ముని పదార్థములను దొంగిలింప వచ్చును. కల్లమునుండి కానీ, క్షేత్రమునుండి కానీ, గృహ మునుండి కానీ, యెక్కడ లభించిన నటనుండి దొంగిలింప వచ్చును. కాని యెవరైన ప్రశ్నింతురేని దాచకుండ చెప్ప వలెను.' అని మనువు చెప్పియున్నాడు.

స్వత్వము శబ్దైకగమ్య మని యంగీకరించువారు, 'స్వత్వము లౌకిక మగునెడల లోకముద్వారా చౌర్యము స్వత్వ మునకు కారణ మని సిద్ధము కానేరదు. ఆరు సమయము లొకనికి వరుసగా భోజనము లభింపకుండుట యాపత్తి. అట్టి యాపత్సమయమున జేసిన చౌర్యము స్వత్వమునకు కారణ మగునా? కాదా? స్వత్వము లోకసిద్ధ మందుమేని చౌర్యము స్వత్వమునకు జనకముకాదు. అజనకమును కాదు. కారణ మే మన : చౌర్యము స్వత్వజనకము కాదనుట లోకవ్యవహార నిశ్చి తము. వ్యవహారవిరుద్ధ మగుటవలన చౌర్యము స్వత్వజనక మని యంగీకరింప వీలులేదు. వేలకొలది శాస్త్రములు కలిసి ప్రత్య

క్షమునకు విరుద్ధమగు నర్థమును యథార్థము చేయజాలవు. శాస్త్రవచనములు జలము దహనమునకు కారణమని సిద్ధ పరుపనేరవు. చౌర్యము స్వత్వము నుత్పన్నము చేయజాలదేని చౌర్యమున కనుమతించుట వ్యర్థము. ధనమున్నచో పంచ మహాయజ్ఞములు మున్నగు ప్రధానకర్మలు చేయవచ్చును. యజ్ఞమాచరించుటకు తన ధన ముండవలెను. చౌర్యమువలన సంపాదించిన ధనముమీద స్వత్వ మేర్పడకున్నచో నా ధనముచే పంచమహాయజ్ఞాది కార్యములు జరుగజాలవు. తనది కాని ధనముద్వారా యాకలి తీర్చుకొనవచ్చును. కాని, కేవల మాకలికొఱకు అన్నము దొంగిలించుట తగదు. ఇట్టి చౌర్యము శిష్టాచార విరుద్ధము. శిష్టులు పంచమహా యజ్ఞములు చేయనంతవరకు నన్నమును తినరు. ఒక పురుషుని దగ్గర నున్న యన్నమే యతని దేవతలదికూడ నగుచున్నదని శాస్త్రము లనును. "ఒకమాటు విశ్వామిత్రు డాకలిచే వ్యాకులుడై యొక చండాలుని యింటి కుక్క యొక్క జఘన మాంసమును దొంగిలించెను. ఇంద్రాది దేవతల కిచ్చి దానిని విశ్వామిత్రుడు తినగోరెను. అత డింద్రాది దేవతలకు వారిభాగము నొసంగ నారంభించినపుడు వారు ప్రసన్నులయి వర్షింప జేసిరి. వెంటనే పొలము ధాన్యముతో నిండిపోయెను." ఇది యొక పురాణగాథ. ఈ కథ ననుసరించి చౌర్యముద్వారా సంపాదించిన యన్నము దేవతల కియ్యదగు నని తెలియుచున్నది. స్వత్వము శబ్దైకగమ్య మని యంగీకరించినచో చౌర్యమువలన స్వత్వ ముత్పన్నమగుననియు, కాదనియు కూడ శాస్త్రమువలన దెలియుచున్నది. శాస్త్రము జనుల

ననుసరింపదు. జనులే శాస్త్రము ననుసరింతురు. శాస్త్రవచనములలో విరోధము రాజాలదు.

దీనికి ప్రతీకారముగ వీరమిత్రోదయ కర్త యిట్లు చెప్పుచున్నాడు....."లోకవ్యవహారము ననుసరించి చూచిన చౌర్యము స్వత్వము నుత్పన్నము చేయదనుటలో సందేహము లేదు. అయినను నేడవ భోజన సమయమున చౌర్యము చేయుటకు శాస్త్ర మనుమతించినందున చౌర్యమువలన కూడా స్వత్వ ముత్పన్న మగునని తెలియుచున్నది. కాగా ఆపత్కాలపు స్వత్వము శాస్త్రసిద్ధ మగుచున్నది. ఆపద లేనపుడు స్వత్వము శాస్త్రసిద్ధము కాదు. కావున నాపత్కాలపు స్వత్వము, సాధారణకాలపు స్వత్వము నని స్వత్వము రెండు విధము లగుచున్నది. సాధారణకాలపు స్వత్వము లోకవ్యవహారసిద్ధము కాకపోయిన శాస్త్రము నెరుగనివారు క్రయవిక్రయములు చేయజాలరు. స్వత్వము లేకున్న క్రయవిక్రయములు జరుగకుండుటయే యిందులకు కారణము. శాస్త్రము చౌర్యము నడ్డగించును. అందువలన చౌర్యము స్వత్వము నుత్పన్నము చేయదని యెంచరాదు. 'దొంగతనము చేసిన శిక్ష లభించును.' అని చెప్పుటయే శాస్త్ర తాత్పర్యము. ఒక వస్తువు తరుచుగా లోకసిద్ధమైకొండొక యవస్థావిశేషమున నొకప్పుడది శాస్త్రసిద్ధమగుట యసంగతము కాదు. ప్రతి బ్రాహ్మణుని యందును బ్రాహ్మణత్వము కనబడును. కాని జాతికి నుత్కర్ష కలిగినపుడు బ్రాహ్మణభావము దృశ్యముకాదు. అప్పుడు దాని జ్ఞానము శాస్త్రమువలన కలుగును. స్మృతు లిట్లు విధించుచున్నవి. 'ఒక క్షత్రియుడో, లేక యొక

వైశ్యుడో తనకంటె నున్నతమైన జాతివారితో వివాహ మాడుచు వచ్చిన నేడవ తరములో నతని నిమ్నజాతియైన క్షత్రియత్వమో, లేక వైశ్యత్వమో యతనిలో నుండదు. అతని జాతి యుత్కృష్ట మగును. అనగా, క్షత్రియుడు బ్రాహ్మణు డగును; వైశ్యుడు క్షత్రియు డగు నని యభిప్రాయము.' ఇట తరముల సంఖ్యానియమము శాస్త్రగమ్య మగుచున్నది. రెండు మూడు తరములకు తరవాతనే జాతి పరివర్తన మేల జరుగదు? ఏడు తరములవరకు నేల కాదు? అను విషయములను గూర్చి లోకవ్యవహార మేమియు చెప్పనేరదు. ఈ యంశము శాస్త్రీయమని యాచార్యుడు చెప్పియున్నాడు. 'ఇన్ని తరములలో జాతి పరివర్తనమగు'నను తరముల సంఖ్యానియమమును లౌకిక ప్రమాణము చెప్ప నేరదు. జాతియొక్క యుత్కర్ష స్థలములో బ్రాహ్మణత్వము ప్రత్యక్షము కాదనువారి మత మిది. ఆ యవస్థయందును బ్రాహ్మణత్వాదులు ప్రత్యక్షమగు నని యంగీకరించువారును కొందఱు గలరు. వా రేమందు రన — తరముల పరంపర బ్రాహ్మణత్వమును ప్రకటించును. మొదటి తరమునుండి యారవ తరమువరకు బ్రాహ్మణత్వము ప్రకటము కాక యుండెను. ఏడవతరమున నది ప్రకటమగును. తరముల సంఖ్య యిట నభివ్యక్తికి (ప్రకట మగుటకు) కారణము. ఆ సంఖ్య తప్పక శాస్త్రగమ్య మగుచున్నది. బ్రాహ్మణత్వము శాస్త్ర గమ్యము కానిండు, లేక ప్రత్యక్షము కానిండు, ఎట్లైనను, చౌర్యము స్వత్వమునకు కారణమగుటలో నెట్టి యంతరమును కలుగదు. చౌర్యము స్వత్వమునకు కారణము కాదనుట

లోకసిద్ధ విషయము. అవస్థా విశేషమున చౌర్యము స్వత్వమునకు కారణమగుననుట శాస్త్రగమ్య విషయము. అందువలన నీ రెండింటిలో విరోధ మేమియు లేదు. చౌర్యధనముతో క్రయవిక్రయములు జరుగవు. అందువలన చౌర్యము స్వత్వమునకు కారణ మనజాలము. ఇయ్యది లోకవ్యవహార సిద్ధము. ఒక వస్తువు స్వత్వము నుత్పన్నము చేసినను వ్యవహారమున లేనందున దాని జ్ఞానము కలుగకపోవచ్చు. కాబట్టి చౌర్యము స్వత్వము నుత్పన్నము చేయదని యెంచ రాదు. స్త్రీపురుష సంబంధము పుత్రజన్మకు కారణము. ఇది యెల్లరు నెరుగుదురు. అయినను శాస్త్రము పుత్రేష్టిని పుత్ర జన్మకు కారణ మనును. పుత్రజన్మకు పుత్రేష్టిలో గల కారణ భావము లోకసిద్ధము కాదు. స్వత్వ విషయమున, క్రయ విక్రయములతో స్వత్వమునకు గల పరస్పర కార్యకారణ భావము లోకసిద్ధము. కాని, చౌర్యమునకు స్వత్వవిషయ మున గల కారణభావము శాస్త్రగమ్యము. ఇట్లే స్వర్గము, ఆహవనీయము మున్నగునవి సర్వవిధముల నలౌకికములు. వాని యుపాయములును లౌకికములు కావు. కాని యిది మరియొక విషయము.''

ఉపర్యుక్తమగు విషయమునుబట్టి వీరమిత్రోదయ కర్త, స్వత్వము లోకగమ్య మని యంగీకరించియు నవస్థా విశేషమున నది శాస్త్రగమ్య మగునని యోచించుచున్నాడు. వాస్తవమున నాపత్కాలమునందు చౌర్యము ద్వారా స్వత్వ ముత్పన్నమగుటకూడ లోకసిద్ధమే. అట్లంగీకరింపని పక్షమున చౌర్యమువలన కలిగిన స్వత్వము శాస్త్రీయము కానేరదు.

ప్రత్యక్ష వ్యవహారము ననుసరించి చూచిన చౌర్యము స్వత్వ మునకు కారణము కాదు. శాస్త్రము పలుమారు చెప్పినను నది కానేరదు. శాస్త్రము స్వయముగ చౌర్యమునకు దండన విధించుచున్నది. కావున నది చౌర్యమును స్వత్వ జనకముగా నంగీకరింపదు. క్రయవిక్రయముల ద్వారా లభించు ధనము యథేచ్ఛగా నుపయోగింపనగును. చోరులు దొంగిలించిన ధనము నుపయోగింతురు. స్వత్వము లేకయే వారు దాని నుపయోగింతురు. అందువలన వారు దండన యోగ్యు లగుచున్నారు. దండనవిధాన తాత్పర్య మిదియే. జాతియొక్క యుత్కర్ష సమయమున బ్రాహ్మణత్వము ప్రత్య క్షముకాక శబ్దగమ్య మగుచున్నది; కాని యది ప్రత్యక్షము నకు విరుద్ధముకాదు. స్వత్వ విషయమున ప్రత్యక్షము విరోధి యగుచున్నది. కావున స్వత్వము శాస్త్రీయము కానేరదు. స్వత్వమునకు జనక మేది? జనకము కాని దేది? అను విష యము కేవలము శాస్త్రీయమై, లోకవ్యవహార మీ విషయ మున నేమియు చెప్పజాలని పక్షమున శాస్త్రము స్వేచ్ఛగా నాపత్తిలేక చౌర్యము స్వత్వము నుత్పన్నము చేయజాలదనియు నాపత్తిలో చేయగలుగుననియు చెప్పగలిగి యుండెడిది. కాని, లోకవ్యవహారము క్రయ విక్రయాదులను స్వత్వజనక ములనియు, చౌర్యము కాదనియు చెప్పుచున్నది. అందు వలన చౌర్యముద్వారా యుత్పన్న స్వత్వమును విధింప వీలులేదు.

ఇంతేకాక బ్రాహ్మణత్వమును జాతిగా నంగీకరించు వారి ననుసరించి చూచినచో నాజాతి ప్రత్యక్షమైన మనుజ

లంపు ప్రత్యక్ష మగును. జాతియొక్క యుత్కర్షావస్థలో నేడవ తరమునం దది శబ్దగమ్య మగుచున్నది. తరువాత నెనిమిదవ, తొమ్మిదవ తరములలో నది మరల ప్రత్యక్షమే యగుచున్నది. ఈ ప్రత్యక్షమునకును, జాత్యుత్కర్షములేక బ్రాహ్మణ మాతాపితల సంతానమునందు కలుగు ప్రత్యక్ష మునకును భేద మేమియు నుండదు. కాని, చౌర్యమువలన కలిగిన స్వత్వ మెల్లప్పుడు శబ్దగమ్యముగానే యుండును. అది యెన్నడును ప్రత్యక్షము కాదు. కాబట్టి యీ విషయ మున బ్రాహ్మణత్వము, స్వత్వము రెండును సమానములు కావు. స్వత్వము పుత్రేష్టివలె శాస్త్రీయ మన వీలులేదు. స్త్రీ పురుషుల సంబంధము పుత్రజన్మకు కారణము. అది ప్రత్యక్షసిద్ధము. పుత్రేష్టి పుత్రునకు కారణము కాదు. ఇయ్యది ప్రత్యక్షముద్వారా నిశ్చితమును కాదు. ప్రత్యక్ష కారణములు లేనపు డప్రత్యక్ష కారణమును శాస్త్రము నిరూపించును. స్వత్వవిషయమున నిట్టి స్థితి యొండును లేదు. ప్రత్యక్షమువలన క్రయవిక్రయాదులు స్వత్వమునకు కారణ ములని తెలియుటయేకాక, చౌర్యము స్వత్వమునకు కారణము కాదనియు తెలియుచున్నది. కావున శాస్త్రము చౌర్యమును స్వత్వమునకు కారణముగా చెప్పజాలదు.

అటులయిన శాస్త్రము చౌర్యమును స్వత్వజనకముగ నేల చెప్పుచున్నది ? దీనికి సమాధాన మిది : శాస్త్ర మిక్కడ కూడ లోకసిద్ధ తత్త్వమును నిరూపించుచున్నది. ఇయ్యది యొక యలౌకిక తత్త్వ మేమియు కాదు. కర్మ నాచరించు వానికి, వాడుచేసిన కర్మయొక్క ఫలముమీద నధికార

ముండును. ఈ నియమము ననుసరించియే క్రయ విక్రయములు జరుగును. ఒక డొకని ద్రవ్యమును దొంగిలించినపుడతడు వాని కర్మఫలమును బలవంతముగా తనవశము చేసికొనుచున్నాడు. దొంగిలింపబడిన ద్రవ్యము దొంగచేసిన కర్మకు ఫలముకాదు. అందువలన నతడు దండనీయు డగుచున్నాడు. ఆపత్కాలమున నొకడు చౌర్యము చేయును. కాని యత డా సమయమున ద్రవ్యార్జనముకొఱకు తగిన కార్య మాచరింప నెంచియు చేయజాలక పోవుచున్నాడు. వివశుడై చివరకు చౌర్యమునకు పూనుకొనుచున్నాడు. ధనికులు జీవికకు వలయు సాధనముల నన్నిటిని వశపరుచుకొని యతనిని కర్తవ్య కర్మాచరణము నుండి వంచించుచున్నారు. అందువలన నతడు కర్మల నాచరించి వాని ఫలమును పొందజాలడు. ఆరు సమయములవరకు నిరంతరమునొక డాకలితో నుండవలసిన దశ లోభులయిన ధనికులవలననే కలుగుచున్నది. కావున న్యాయము ననుసరించి యీ ధనికుల యన్నము నతడు గ్రహింపవచ్చును. ధనికులు సంచయముచేసిన యన్నము వారి కర్మలకు ఫలముకాదు. ఆకలిగొన్నవాని చౌర్య మతనికి కర్మఫలమును పొందుట కుపాయము మాత్రమే. అందువలన నది లోకసిద్ధమగు తర్కము ననుసరించి స్వత్వజనక మగుచున్నది.

## మూడవ యధ్యాయము

# మూల్య స్వరూపము

పణ్యావస్తువుల యాకారము వాని పణ్యాధర్మము (క్రయ విక్రయ యోగ్యత)ను తెలుపజాలదు. ధరించుటకు, నమ్ముటకుగాను నిర్మింపబడిన రెండురకములైన వస్త్రముల నొకడు చూచికాని, లేక స్పృశించికాని, 'ఇవి భోగ్య (ధరింపదగిన) వస్త్రములనియు, ఇవి పణ్య (యమ్మదగిన) వస్త్రము లనియు' వేరుచేసి చెప్పజాలడు. మొదటినుండియు నమ్ముటకనియే నిర్మించినట్లు తెలిసిన వస్తువులను పణ్యాము లని యెంచుటలో కఠినత యేమియు నుండదు. వస్తువునకు సంబంధించిన యుపభోగము, వినిమయము నను ప్రయోజనములు రెండును పరస్పర మత్యంత విరుద్ధములు. వస్తువు ఉన్న కాలమున నుండని ప్రయోజనము ప్రత్యక్షము కానేరదు. వస్త్రమును చూచి యది యుపయోగి యనియు, శ్రమజన్య మనియు నెవరైనను చెప్పవచ్చును. అప్పుడు దాని యుపభోగముకానీ, విక్రయముకానీ జరుగకున్న నది పణ్యామైనను కావచ్చును; లేక భోగ్యమైనను కావచ్చును; అని రెండు విధములుగ సంభావింపవీలగును. ఒకవస్తువు భోగ్యమో లేక పణ్యామో కావలయుననిన దానియందు రెండు ధర్మము లావశ్యకము లగుచున్నవి. ఒకటి యుపయోగిత; రెండు శ్రమ. కేవలము పణ్యామే కావలయు ననిన మూడవ ధర్మజ్ఞానము కూడ నవసర మగుచున్నది. ఆ ధర్మము వినిమయయోగ్యత. ఉపయోగిత,

శ్రమము లేకున్న, వస్తువు వినిమయయోగ్యము కానేరదు. అందువలన నుపయోగిత, శ్రమ రెండును వినిమయమునకు కారణములు. భోగ్యవస్తువునకు కూడ నవి కారణములే యగు చున్నవి. కాని యప్పు డవి కారణములే యనబడును. వాని కింకొక నామము కలుగదు. వినిమయము కొఱ కవి వస్తువు నుత్పన్నము చేసినపుడు - ఉపయోగియైన శ్రమ యుపయోగి యైన వస్తువును క్రయవిక్రయముకొఱకు నిర్మించినపుడు - మూల్య మను పేరుతో వ్యవహరింప బడును. మూల్యరూప మగు శ్రమ యుపయోగితకంటె భిన్నమే. కాని, శ్రమ యుప యోగితా రహిత మెన్నడును కాదు. వినిమయమునకు కారణమైన శ్రమ యుపయోగితా విరహిత మెన్నడు కాదని భావము. కాగా, పణ్యము కనిపించినపుడు దానియం దుప యోగిత, ఘనీభూత శ్రమము రెండును పరస్పరము సంబద్ధ ములై కనిపించును.

శ్రమ స్థిరముకాదు; అది క్షణికము. కావున నది యిచ్చిపుచ్చుకొన వీలయిన వస్తువు కాదు. శ్రమజన్యమైన పణ్య మాదానప్రదానములకు యోగ్య మగుచున్నది. కావున పణ్యముద్వారా శ్రమయు నాదానప్రదానయోగ్య మగుచున్నది. ఒక పణ్యము నుత్పన్నము చేయుట కెంత శ్రమ కలుగుచున్నదో రెండవ పణ్యము నుత్పన్నము చేయు టకు నంతయే యయినచో నా రెండు పణ్యవస్తువు లొకదాని కొకటి మూల్య మగుచున్నవి. మూల్యము పణ్యవస్తువులలో గల యొకవిధమగు సంబంధ మనదగును. శ్రమ పరిమాణ ములోగల సామ్యము నెఱుగకున్న నీసంబంధజ్ఞానము కలు

గదు. సమానత యనునది యొక్క వస్తువునందు సంభవము కాదు. అందులకు రెండుకానీ, యంత కెక్కుడు వస్తువులు కానీ యుండవలెను. రెండు పణ్యము లొకదానికి మరి యొకటి మూల్య మగును. ఇది మూల్యమునకు ప్రారంభిక రూపము. ఇందు మూల్యరూపము మిక్కిలి చిన్నదిగా నుండును. ఉదాహరణము కొఱకు రెండు గజముల కద్దరు గుడ్డ యొక చొక్కాయికి సమాన మనిన, రెండు గజముల కద్దరుగుడ్డ మూల్య మొక చొక్కాయి యగుచున్నది.

రెండు వస్తువులలో సాదృశ్యము చూడనగును. దాని కా రెంటితోను సంబంధ ముండును. అందొకటి యనుయోగి, రెండవది ప్రతియోగి యనబడును. దేని సమానత చెప్ప బడునో యది యనుయోగి; దేనితో సమానత చెప్పబడునో యది ప్రతియోగి. దేవదత్తుడు యజ్ఞదత్తునితో సమాను డందుమేని, దేవదత్తు డనుయోగి; యజ్ఞదత్తుడు ప్రతియోగి యగును. యజ్ఞదత్తుడు దేవదత్తునకు సమాను డనిన, యజ్ఞ దత్తు డనుయోగి; దేవదత్తుడు ప్రతియోగి యగును. ఒక్కే సమయమున నొకవస్తువు అనుయోగి, ప్రతియోగి రెండును కాజాలదు.

రెండు గజముల కద్దరు మూల్యము ఒక చొక్కాయి యనిన, రెండు గజముల కద్దరు ఒక చొక్కాయికి సమానమని యభిప్రాయము. అప్పుడు రెండు గజముల కద్దరు అనుయోగి; చొక్కాయి ప్రతియోగి యగును. రెండు గజముల కద్దరులో ఘనీభూతమైయున్న శ్రమకు సమానమైన శ్రమ యొక్క

చొక్కాయిలో నున్నదని మరియొకవిధముగ చెప్పవచ్చునని తెలుచున్నది.

ప్రసిద్ధమైన వస్తువుతో నప్రసిద్ధ వస్తువు పోల్చి చెప్ప బడును. ఉపమానము, ఉపమేయము రెండును సామ్యమును ప్రతిపాదించు ననుకొనుడు. ప్రసిద్ధమైన యుపమానముతో పోలిన యప్రసిద్ధమైన యుపమేయ మా రెంటికిగల సమానత ద్వారా తన మహిమను వెల్లడించును. కద్దరు మహిమ దాని మూల్యము. అది యప్రసిద్ధము. చొక్కాయి మహిమ - మూల్యము - ప్రసిద్ధము. కద్దరు తన మూల్య మును చొక్కాయిద్వారా తెలుపుచున్నపుడు చొక్కాయి తన మూల్యమును తెలుపజాలదు. చొక్కాయి కేవలము సమానతను - సాదృశ్యమును - తెలుప సాధన మగుచున్నది. అప్పు డది సమానముగానే యుండును.

ఈ యుపమానోపమేయ భావమును విపరీతము చేసి నపుడు చొక్కాయి కద్దరుకు సమాన మగును. అప్పుడు చొక్కాయి కద్దరుద్వారా తన మూల్యమును ప్రకటించును; కద్దరు తన మూల్యమును చెప్పదు. ఉపమానము ఉపమేయ సామ్యమును ప్రకటించు క్షణమున తన సామ్య విషయమున స్థానము వహించును.

కద్దరు, చొక్కాయి రెండును విజాతీయము లయినను, వినిమయ మూల్య రూపమున సమానములై సజాతీయము లగుచున్నవి. వీనిద్వారా వీని యుత్పత్తికి కారణమైన శ్రమ - నేయుట, కుట్టుట - సజాతీయ మగుచున్నది. నేయుట, కుట్టుట రెండును భిన్నములుగా కనబడవు. ఈ రెండును

మనుష్యున కుపయోగకరము లగు వినిమయ వస్తువుల నుత్ప న్నము చేయు శ్రమలై యున్నవి. ఇట్టి సామ్యరూపమునందు నేయుట, కట్టుట రెంటియొక్క ప్రాతిస్వికి (వ్యక్తిగత) విశే షము తొలగి పోవుచున్నది.

చొక్కాయి తన విశేషరూపములో మూల్యముకాదు. అది పణ్యమునుకాక శ్రమజన్యమై యుపయోగకరమగు భోగ్యవస్తు వగుచున్నది. కద్దరు మూల్యరూపమునుండి చొక్కాయి యాకారమున ప్రకటమగుట కారంభించును. మూల్యరూపము, ఉపయోగకరమైన వస్తువుయొక్క శ్రమ జన్య భౌతికరూపముకంటె విలక్షణము. భోగ్యరూపము శ్రమవలన జనించును. అది యుపయోగకరముకూడ. కద్దరు, చొక్కాయి రెండును భోగ్యరూపముకంటె సర్వవిధముల భిన్నములు.

సాదృశ్యముద్వారా యుపమానభూతమగు ప్రతియోగి వస్తువు, ఉపమేయ భూతమగు ననుయోగివస్తువు మూల్యమును ప్రకటించునపుడు తన మూల్యమును ప్రకటింప నసమర్థ మగును. * ఇది ప్రతియోగికి గల యసాధారణ స్వభావము. మార్క్సు దీనికిమించి ప్రతియోగికి మూడు విలక్షణము లయిన యన్యస్వభావము లున్నట్లు చూపుచున్నాడు.

మార్క్సు ననుసరించి, ఉపమానము-ప్రతియోగి-విని మయ మూల్యమును ప్రకటించుటకు ఉపయోగకరమగు మూల్యరూపమున నుండును. ఒక పణ్యవస్తువు స్వయముగ

* క్యాపిటల్ భా. ౧. పు. ౫౬......

తనకు తానే సమానము కానేరదు. అందువలన నది తన మూర్తీభవించిన రూపమును, తనకు మూల్యముగా మార్పు చేయజాలదు. ప్రతి పణ్యావస్తువు, మరియొక పణ్యమును సమానరూపములో నెన్నుకొనవలసి యుండును. ఎన్నుకొనిన తరువాత రెండవ పణ్యావస్తువుయొక్క మూర్తరూపమును తన మూల్యరూపమున గ్రహించుట యావశ్యక మగుచున్నది. కాని, ఉపమానము ఉపయోగివస్తువిశేషరూపమున తెలియబడు నెడల ఉపమేయ మూల్యమును ప్రకటింపజాలదు. * ఒక చొక్కాయి రెండు గజముల కద్దరుకు మూల్యమయి వచ్చినప్పుడు చొక్కాయి రూపము కనిపింపదు. అది యా వినిమయమునకు తగినట్లుగా నుపయోగకరమగు శ్రమరూపమున కనిపించును. ఒకవేళ కద్దరు, చొక్కాయిద్వారా తన మూల్యమును ప్రకటించునేని, కద్దరు దానిని మూల్యరూపమున చూచును; చొక్కాయికూడ కద్దరు కెదురుగా మూల్యరూపమున నిలుచుండును. కద్దరు తన విశేషరూపమును, చొక్కాయి తన విశేషరూపమును విడువని పక్షమున సమానత యేర్పడదు. కావున చొక్కాయి మూల్యరూపమున రాజాలదు. చొక్కాయి తన దృష్టిలో మూల్యరూపముకాదు. కారణ మేమన: చొక్కాయి, చొక్కాయికి మూల్యముకాదు. కాని, చొక్కాయి తనకొఱకు స్వస్వరూపమును విడువకున్నను కద్దరుకొఱకు మూల్యరూపము ధరించుటకు నాటంకము లేదు.

---

* క్యాపిటల్ భా. ౧. లో. ౨౦ గ. వినన్. ౧ కోటు ఉదాహరణము

ఇక రెండవ విలక్షణ స్వభావమునుగూర్చి విచారింతము. సమానమై యుండు పణ్యశరీరము మనుష్యుని సామాన్య శ్రమయొక్క ఘనీభూత రూపాంతరమని మార్క్సను చెప్పుచున్నాడు. అదియును నొక విశేష విధమగు నుపయోగియు, మూర్తము నయిన శ్రమ విశేషమువలన నుత్పన్నమగుచున్నదనియు నత డనుచున్నాడు. ఆ కారణమున రూపొందిన శ్రమ విశేషము మనుష్యుని సామాన్య శ్రమమును ప్రకటించుటకు సాధనము. కుట్టుటలోను, నేయుటలోను మనుజుని శ్రమశక్తి విస్తారమై యున్నది. కాబట్టి యీ రెండును మనుష్యుని శ్రమలు. మూల్యము నుత్పన్నము చేయుటకు దానికీ రూప మవసరము. కాని యీరూపమున నవస్థ బొత్తిగ మారిపోవుచున్నది. నేత మూల్యమును ప్రకటించునపుడు నేత రూపమున ప్రకటింపదు. అది మనుజుని శ్రమరూపమున మూల్యము నుత్పన్నము చేయును. చొక్కాయి శరీరాకారమున మూల్యమును సూటిగా ప్రకటించినట్లు, కుట్టుపని సూటిగా శ్రమకు సంబంధించిన మూర్త విశేష రూపముననుండి మనుష్యుని సామాన్యశ్రమను ప్రత్యక్షముగ మరియొక రూపమున ప్రకటించుచున్నది.

ఇక్కడకూడ నా మొదటి పొరపాటె యున్నది. ఉపమాన - ప్రతియోగి - శ్రమ మూర్త విశేషశ్రమయే; కాని, విశేషరూపమున నది మూల్యముకాదు. మూల్యమగుట కది సామాన్య రూపమున మనుష్యుని శ్రమరూపములో నుండుట యావశ్యకము. కుట్టుపని, కుట్టుపని రూపములో ప్రకటముకాక యుపయోగకరమైన శ్రమరూపమున

ప్రకటమైనపుడు కొండొక రూపొందిన శ్రమ సామాన్య మనుష్య శ్రమకు ప్రకాశక మని చెప్పజాలము. విశేషశ్రమ ప్రతియోగి దృష్టిలో విశేష మూర్తశ్రమ మైనప్పటికిని, మూల్యదృష్టితో నాలోచించినపుడు ఉపమేయ-అనుయోగి - సమక్షమున నది సామాన్య రూపములోనే యున్నది. నేత తన మూల్యమును ప్రకటించుటకు మనుష్యుని యుపయోగ కరమగు సామాన్య శ్రమరూపమున వచ్చినట్లు, కుట్టుపని నేతపనికి మూల్యమగుటకు ఉపయోగకరమగు సామాన్య శ్రమరూపమున వచ్చును. ఒకదాని సంబంధమున మరియొకటి వచ్చినపుడు పణ్యవస్తువులు మారు రూపములను ధరించుట తప్పదు.

ప్రతియోగి యగు నుపమానముయొక్క మూడవ విలక్షణ స్వభావము వ్యక్తులయొక్క ప్రాతిస్వికి - తన తన - శ్రమ సామాజిక రూపమున మార్పుచెందుట. భేదములేని మనుష్య శ్రమరూపమున కుట్టుపని గుర్తింపబడును. ఏదేనియొక విశేషశ్రమతో దాని నైక్యము చేయవచ్చు. కాగా పణ్యవస్తువుల నుత్పన్నము చేయు నితర శ్రమలవలె కుట్టుపని యొకానొక వ్యక్తి విశేషమునకు చెందిన శ్రమ యైనప్పటికిని, దాని స్వభావము సామాజిక మగుచున్నది. అందువలననే కుట్టుటవలన నుత్పన్నమైన వస్తువు ఇతర పణ్యవస్తువులతో వినిమయము చేయ వీలగుచున్నది.

కాని, కేవలము ప్రతియోగి శ్రమమే ప్రాతిస్వికి-తన-రూపమును విడిచి సామాజిక రూపమును పొందుటలేదు; అనుయోగి శ్రమ యవస్థయు నిట్టిదే. రెండు గజముల కద్దరు

మూల్యము ఒక చొక్కాయి యయినప్పుడు చొక్కాయి శ్రమమే కాక కద్దరు శ్రమకూడ సామాజికమే యగుచున్నది. నేయుట, నేతపనిగానే యున్నచో నది కుట్టుపనితో సమానము కానేరదు. సమానత లేకున్న వినిమయము జరుగనేరదు. కుట్టుపని నేతపనికి మూల్యము కావలయుననిన నది నేతపనితో నైక్యము కావలసి యుండును. కాని, నేతపని యేకతను కలుగనీయకున్న నేకత యెట్లుకలుగును ? అందులకై నేతపనికూడ నైక్యము సంపాదింప వలసి యున్నది. ఏకత రెండువైపులనుండి జరుగును. ఇట్టి యేకతకు ఫలరూపమేమన, ప్రతియోగి మొదటిమాటు అనుయోగిమూల్యమును ప్రకటించును. కుట్టుపని నేతపనితో నేకమై నేత యొక్క మూల్యమును తెలుపును. నేతపని తన మూల్యమును తెలుపవలె ననిన స్థానపరివర్తనము చేసికొనవలెను. నేతపని కుట్టుపనితో సమానమగును.

ఇక యుపమానముయొక్క మూల్యవిషయమున నొకే విలక్షణత యున్నది. అది యుపమేయ సమక్షమున తాను చూడదలచిన రూపమున వచ్చి నిలబడును. ఉపమేయము నది తన సమానరూపమున చూచును; కాని యుపమేయము యొక్క యీ రూపాంతరము దాని మూల్యమును ప్రకటింప జాలదు. చొక్కాయి కద్దరును మనుష్యుని శ్రమరూపమున చూచును; కాని యది యెందుల కట్లు చూచును ? కద్దరు తన మూల్యరూపమున తెలియబడవలయునని యది యట్లు చూచును. కద్దరును తన మూల్యరూపమున చూపగల శక్తి యప్పుడు చొక్కాయిలో లేదు.

మూల్యరూపమున శ్రమజ్ఞానము కలుగు క్షణములను లెక్కించినచో నీ విలక్షణస్వభావ ప్రతీతి స్పష్టము కాగలదు.

ప్రథమ క్షణమున :— ఒక చొక్కాయియొక్క శ్రమజ్ఞానము.

రెండవ క్షణమున :— రెండు గజముల కద్దరు శ్రమజ్ఞానము.

మూడవ క్షణమున :— రెండు గజముల కద్దరుశ్రమ యొక్క చొక్కాయి శ్రమకు సమాన మను జ్ఞానము.

నాలుగవ క్షణమున :— రెండు గజముల కద్దరుశ్రమ మూల్య మొక చొక్కాయి శ్రమ అను జ్ఞానము కలుగును.

మూడవ క్షణమున, చొక్కాయి నిర్మించుట కయిన శ్రమ కద్దరు నిర్మించుట కయిన శ్రమయొక్క సామ్యమును తెలుపును. అందువలన తన సమానతను తెలుపజాలదు. ఆ క్షణమున చొక్కాయి కద్దరుకు సమాన మని తోచదు. దీని పరిణామ రూపమున నాలుగవ క్షణమున కద్దరుయొక్క శ్రమమూల్యము ప్రకట మగును. చొక్కాయి శ్రమమూల్యము తెలియదు.

# నాలుగవ యధ్యాయము

## వినిమయముయొక్క మొదటి రూపము

రూప్యములద్వారా పణ్యావస్తువుల క్రయ విక్రయములు జరుగుచుండుట చూచి యర్థశాస్త్రజ్ఞులు వినిమయముయొక్క యాదిమధ్యాంత రూపములను గూర్చి వర్ణనలు చేసి యున్నారు. తరుచుగా వారి దృష్టి పణ్యావస్తువులమీద నుండెను. కావున వారి దృష్టిలో వినిమయము భౌతికము లయిన పణ్యావస్తువులతో ప్రారంభమయినది. భౌతిక పణ్యములు లేకున్న వినిమయము జరుగగలదని వారు సంభావింప లేకపోయిరి. వారి మతము ననుసరించి ప్రప్రథమమున నే వస్తువులతో వినిమయము ప్రారంభమైనదో యా వస్తువుల రచన సరళమై యుండెను. ఒక భౌతికవస్తువు తీసికొని మరి యొక వస్తు వీయబడుచుండెడిది. కూరగాయలిచ్చి ధాన్యము, ధాన్యమునిచ్చి కూరగాయలు తీసికొనుచుండెడివారు. ఏదేని యొక భౌతికవస్తువునకు బదులు మరియొక భౌతికవస్తువు నిచ్చి పుచ్చుకొన వీలయ్యెడిది. ఈ దశయందు వినిమయము చేయబడు భౌతిక పణ్యావస్తువులలో పణ్యములకు మూల్యమునకు మధ్య జాతిభేదము లేకుండెను. ఇచ్చిపుచ్చుకొను వస్తువులలో నే వస్తువైనను ఒకప్పుడు పణ్యము, మరియొకప్పుడు మూల్యము కాగలుగుచుండెను. కాలక్రమమున వినిమయములో మార్పులు జరుగుచు, రాను రాను మూల్యము ధాతుమయములగు నాణెముల రూపమును ధరించినది. తరువాత

నిరంతరాభ్యాస కారణమున పణ్యావస్తువులు, మూల్యము నను నీ రెండింటిలో జాతిభేదము స్పష్టము కాజొచ్చెను. బంగారము, వెండి మున్నగు ధాతువులు మూల్యజాతు లయినవి. ధాన్యము, కట్టెలు, కూరలు, వస్త్రములు, నేయి, పాలు, పెరుగు మున్నగునవి పణ్యజాతు లయినవి. పణ్యములకు, మూల్యమునకు నేర్పడిన జాతిభేదము వినిమయ ప్రక్రియకు చరమరూప మననగును. పణ్యములకు, మూల్యమునకు గల యీ చరమ విజాతీయ రూపముతో బాటు ప్రాథమికమయిన యేకజాతీయ రూపము-పణ్యావస్తువు ద్వారా మరియొక పణ్యవస్తు వినిమయము - ఆచరణలో లేకపోలేదు. నేడుకూడ, లక్షలాది రూప్యముల విలువగల దూదికి బదులు తైలమో, మందులో లేక మరియొక వస్తువో వినిమయరూపమున నిచ్చి పుచ్చుకొనుటలు భిన్నభిన్న రాజ్యముల వ్యాపారమున చూడనగును.

ఇచ్చిపుచ్చుకొనుటకు గల కారణమును గూర్చి బాగుగ నాలోచించి చూచిన వినిమయ ప్రారంభము భౌతిక పణ్యావస్తువులతో నేర్పడలేదని తెలియును. వినిమయ ప్రారంభము వస్తూత్పత్తికి పూర్వమే యైనట్లు తెలియును. పణ్యములుగా వ్యవహరింపబడు భౌతిక పదార్థములలో రెండు ధర్మములు తప్పక లభించుచున్నవి. పణ్యావస్తువులు మనుష్యుని కొండొక యావశ్యకతను నెరవేర్చుట మొదటి ధర్మము. రెండవది యా వస్తువుల యుత్పత్తి శ్రమవలన కలుగుట. కూరలో, లేక పాలో యిచ్చి గోధుమలు తీసికొనవచ్చు; రూప్యము లిచ్చియు తీసికొనవచ్చు. పై వస్తువులలో నేది

యిచ్చి తీసికొన్నను గోధుమలు పణ్యము లగుటలో నెట్టి భేదమును లేదు. పణ్యమైన గోధుమలు మనుష్యున కుపయోగ కరములు. వానివలన నాకలి తీరును. కృషీవలుని శ్రమ గోధుమల యుత్పత్తికి కారణము. శ్రమచేయకయే గోధుమ లెప్పుడెన్ని కావలసిన నన్ని లభించు పక్షమున వానికి విలువ యుండదు. ఎండ, గాలి మనుజున కెంతో యుపయోగకర ములు; ఇవి లేకున్న ప్రాణము లుండవు. కాని వీనిని సంపాదించుటకు శ్రమచేయవలసిన పనిలేదు. కావున నవి జీవన మున కెంత తప్పనిసరియైన వస్తువులైనను వానికి మూల్యము- విలువ - లేదు. మట్టి, ముండ్లు, రాళ్లు నుపయోగకరములు కానపుడు వానిని ప్రోవుచేయుట కెవ డెంత పరిశ్రమ చేసినను వానికి మూల్య ముండదు. ఇక్కడ శ్రమ యున్నను నుపయో గము లేదుకాబట్టి మూల్యము లేదు. మూల్యము లేనందున నిట్టి నిరుపయోగ వస్తువుల రాసుల వినిమయము కూడ జరుగదు.

శ్రమవలన నేర్పడి, యుపయోగకరములైనను, నుత్పా దకుడా వస్తువుల నుపభోగించునెడల నవి పణ్యవస్తువులు కావు. కృషికుడు తన పరివార పోషణకు కావలసిన ధాన్యము నుత్పన్నముచేసి దాని నమ్మకపోయిన నది పణ్యముకాదు; భోగ్య మగును. భోగ్యపదార్థము తప్పక యుపయోగకరమై యుండవలెను. అనుపయోగి యగు పదార్థ మెంత శ్రమజన్య మైనను భోగ్యము కానేరదు. ఉపయోగకరములు కాని మట్టికుప్పలు, రాళ్ళకుప్పలు పణ్యములు కానట్లే భోగ్యము లును కావు. పణ్యము కావలసియున్నను, భోగ్యము కావలసి

యున్నను వస్తువునం దుపయోగిత సమానముగ నపరిహార్య మగుచున్నది; కాని భోగ్య మగుటకు శ్రమ యపరిహార్యము కాదు. ఎండ, గాలి శ్రమజన్యములు కావు; కాని యుప యోగకరము లగుటచే నవి యెల్లరకు భోగ్యము లగుచున్నవి.

భోగ్యపదార్థములు రెండు రకములు. శ్రమసాపేక్ష ములు (శ్రమ నపేక్షించునవి), శ్రమనిరపేక్షములు (శ్రమను కోరనివి). ధాన్యాదులు శ్రమ నపేక్షించును. ఎండ, గాలి మున్నగునవి శ్రమ నపేక్షింపవు. పణ్యము లట్లు కాదు. శ్రమలేక, యే వస్తువును పణ్యము కానేరదు. కాని, శ్రమ జన్యమైనంతమాత్రమున ప్రతివస్తువు పణ్యముకాదు. అది యుపయోగియు నై యుండవలెను. పణ్యమగుటకు శ్రమ, యుపయోగిత రెండును నవసరములే. భోగ్యమగుట కుపయో గితమాత్రము తప్పనిసరి యగుచున్నది. ఈ స్వభావభేదమును బట్టి యుపయోగితలేక పణ్యభావ మేర్పడజాలదు. పణ్యము నమ్మువాని కది యుపయోగి కాదు. కాని, కొనువాని కా పణ్య ముపయోగి యగుచున్నది. పాలు అమ్మువాని కుపయోగింపవు; కాని కొనువాని కవి యుపయోగిం చును; వాని నతడు త్రాగును. భోగ్యభావమునకు పణ్యభావ మపరిహార్యము కాదు. గోపాలకుడు స్వయముగా త్రాగు పాలు భోగ్య మగుచున్నది; పణ్యము కాదు. కొండొక పదార్థము భోగ్య మగుటకు శ్రమ యేమియు నక్కరలేదు; కాని శ్రమ భోగ్యభావమునకు విరోధియు కాదు. శ్రమ-జన్యమైనను, కాకపోయినను వస్తు వుపభోగ్య మగును. ఒక వస్తువు పణ్యమగుటకు ఉపయోగిత యావశ్యకమైనపు డా

వస్తువునందు భోగ్యత - భోగింప నర్హత - యపరిహార్య మను మాట మరువరాదు. కాని ఉపభోగాపేక్ష యుండదు. ఉప భోగము పణ్యాభావమునకు విరోధి. శ్రమజన్యమగు ధాన్యాదు లలో నుపయోగిత - ఉపభోగయోగ్యత - యున్నంతవరకు నవి పణ్యము లగును. ఒకరిద్దరిలో కాదు; వందలాది మను ష్యుల ద్వారా క్రయవిక్రయములు జరిగినను ధాన్యమున భోగయోగ్యత - ఉపయోగిత - యున్నంమన నది పణ్యము కాగలదు. కాని, దాని భోగ మారంభమైన క్షణమునుండి యందలి పణ్యాభావము నశింప మొదలిడును.

శ్రమజన్య పదార్థములలో గల పణ్యాభావమునకు, భోగ్యభావమునకు మధ్యనున్న యంతరము కంటితో చూచి కాని, చేతితో స్పృశించికాని తెలిసికొనజాలము. కట్టెలను, పాలను చూచి, 'ఇవి కట్టెలు' 'ఇవి పాలు' అని యెవరైనను చెప్పవచ్చును; కాని, వాని పణ్య-భోగ్య-భావములను నిశ్చ యింపజాలరు. పదార్థము నుపభోగించుటకానీ, యమ్ముట కానీ స్వామియొక్క కోరికమీద నాధారపడి యుండును. పణ్యము భోగ్యము కావచ్చును; భోగ్యము పణ్యము కావచ్చును.

మనుష్యు డుత్పన్నముచేయు పదార్థములు పణ్యములు కానీ, భోగ్యములు కానీ, యేవియైనను వాని నుత్పన్న మొనర్చుటకు శ్రమ, యుపయోగిత రెండును నపరిహార్య కారణము లగుచున్నవి. కాని, పదార్థముల భౌతిక గుణములు, వాని నుత్పన్నము చేయుటకైన శ్రమయు నను నీ రెండే పదార్థములను పణ్యములుగాగానీ, భోగ్యము

లుగాగానీ చేయవు. ఉత్పాదకు డగు మనుష్యుని జ్ఞానవిశేషము పదార్థమును పణ్యముగానో, భోగ్యముగానో చేయును. గోపాలకుడు తాను త్రాగుటకు పాలు పిండెనేని యా పాలు భోగ్యమగును. స్వామిచే నుపభోగింపబడి పదార్థము భోగ్యమగుచున్నది. విక్రయింప నొకడు పాలను ప్రోవుచేయునేని యా పాలు పణ్యమగును. కాని మనుజుని కోరిక స్థిరమైనది కాదు. ఒకడు పాలను తాను త్రాగుటకై పిండినను, నతడు వాని నమ్మదలచిన నమ్మగలుగును. అమ్మదలచిన క్షణమున పాలు పణ్యమగును. అమ్ముటకని పిండిన పాలు, తా ననుభవింపదలచిన క్షణమున భోగ్యమగును. ఇట్లు కోరిన మాత్రమున పణ్యవస్తువు భోగ్యము, భోగ్యవస్తువు పణ్యము నగుచున్నది. ఒక వస్తువు పణ్యమునుండి భోగ్యముగానో, భోగ్యమునుండి పణ్యముగానో మారినంత మాత్రమున నా వస్తువులో భౌతికగుణ మొకటి క్రొత్తగా నేర్పడదు. పూర్వమున్న భౌతికగుణము మారిపోదు. భౌతికగుణములు, శ్రమము, నను రెంటివలన పదార్థ స్వరూప మేర్పడుచున్నది. కాని, దానిలో పణ్యభావము కానీ, లేక భోగ్యభావము కానీ, జ్ఞానవిశేషము ద్వారా యుత్పన్నమగును. ముఖ్యముగా జ్ఞానముతో సంబంధము మనుష్యున కున్నది. ఉపయోగితా సంబంధము పైచూపులకు పదార్థముతో మాత్ర మున్నట్లు తెలియును. గోధుమ లాకలిని తీర్చును. అది వాని స్వాభావిక గుణము. ఇట్లే, పాలు, పండ్లు, కూరలు మున్నగువానిలో కూడ నాకలిని తీర్చి, శరీరమును పోషించు గుణములు స్వాభావికములు. మనుష్యుడు శ్రమ

చేసి గోధుమలు, పండ్లు, పాలు మున్నగునవి యుత్పన్నము చేయును. కాని, యీ పదార్థముల గుణముల నతఁ డుత్పన్నము చేయఁడు. పదార్థములకు మూలకారణములలో నుండు గుణములు కారణముగా గోధుమలు మున్నగు పదార్థముల గుణములలో వైచిత్ర్య మేర్పడును. పదార్థ గుణములు స్వాభావికములు కాక, శ్రమద్వారా యుత్పన్నము లగు నెడల మనుష్యుఁడు తన కోరిక ననుసరించి గుణముల నుత్పన్నము చేసికొనును. గోధుమలను నేతద్వారా వస్త్రములుగాను, దూదిని పిండిగా విసిరి రొట్టెలుగాను చేసికొని యనుభవించెడివాఁడే; కాని, యిది యసంభవము. కాబట్టి, పృథివ్యాది భూతముల గుణములు స్వాభావికములు. ఈ స్వాభావిక గుణములు కారణముగ భౌతికపదార్థము లుపయోగకరము లగుచున్నవి. కాని, గుణముల కారణమున నుత్పన్నములగు పదార్థ గుణములను స్వాభావికము లనజాలము. శ్రమవలన పదార్థము లెట్లు జనించుచున్నవో యట్లే వాని గుణములును జనించుచున్నవి. గోధుమలలో నాకలిని దూర మొనర్చు సామర్థ్యము స్వాభావికమే; కాని, స్వాభావిక సామర్థ్యము కలిగినంత మాత్రమున నవి యాకలిని దూరము చేయజాలవు. కృషికుఁడు వానిని భూమి మీఁద చల్లి, పైరుచేసి పండింప శ్రమ మొనర్చును. మరి కొందఱు వానిని పిండిచేసి రొట్టెలు చేయుటలో శ్రమ యొనర్తురు. ఇంత శ్రమచేసిన తరువాత గోధుమలు తిన యోగ్యము లగును. ఈ శ్రమవలన గోధుమలలో నాకలిని తీర్చుటకు, శరీరమును పోషించుటకు సామర్థ్య మేర్పడు

చున్నది. ఈ విధముగ జన్యపదార్థములలోని యుపయోగిత కూడ శ్రమజన్యమే యగుచున్నది.

పదార్థముల నుత్పన్నము చేయువానికి వాని నుపభోగించుటకును, అమ్ముటకును పూర్ణమైన యధికార మున్నది. ఉపభోగించునపు డా వస్తువు భోగ్యమని తెలిసికొనుటకు మరియొక వస్తువు నెదుట నుంచుకొనవలసిన యవసర మేమియు లేదు. అన్నము, పాలు, పండ్లు యే పదార్థములైనను వానిపై తనకు స్వత్వ మున్నచో స్వామి వాని నుపభోగించుటకు వానివంక చూచును. రొట్టె తినదలచినపుడు పాలవంక చూడడు. పాలు త్రాగదలచినపుడు పాలు వాని యెదుట నున్న చాలు. కాని, వస్తువు నమ్మదలచినపు డది యెదుటనున్న చాలదు. వస్తువు నమ్ముటకు నితరవస్తువు నొకదానినో లేక యనేకమునో తన లక్ష్యమున నుంచుకొనవలసి వచ్చును. వస్తువులు రెండైనను లేకున్న విక్రయము జరుగదు. మూల్యము తీసికొని పణ్యవస్తువు నిచ్చుటయే విక్రయము - అమ్మకము - అనబడును. పణ్యవస్తువు తనకు దా మూల్యము కాదు. పణ్యవస్తువు రూప్యములు తీసికొని యమ్మబడునపుడు, పణ్యమునకు మూల్యమునకు గల భేదము బాగుగ స్పష్టమగును. ఒక పణ్యమును తీసికొని మరియొక పణ్యవస్తువును దానికి బదులుగా నిచ్చినపు డొకటి మూల్యము, రెండవది పణ్యము నగును. గోధుమల నిచ్చి పాలు తీసికొందుమేని పాలు మూల్యముగల పణ్యవస్తువగును; గోధుమలు మూల్య మగును. గోధుమలు మూల్యమైన క్షణమున నవి పణ్యవస్తువు కావు; అప్పుడు పాలు మూల్యముగలవి యగుచున్నవి. పాలుకూడ

గోధుమలకు మూల్యము కావచ్చు; కాని, యవి మూల్యమైన క్షణమున మూల్యవంతమగు పణ్యము కావు; ఆ క్షణమున గోధుమలు పణ్య మగును.

మూల్య మగుటకు, మూల్యభూత వస్తువునకు మూల్యముగల పణ్యముతో సామ్య ముండవలెను. పణ్యముతో సామ్యములేని వస్తువు మూల్యము కానేరదు. అనేక పణ్య వస్తువు లొకే పదార్థమునకు మూల్యము కావచ్చును. గోధుమలు, కట్టెలు, ఫలములు మున్నగు ననేక వస్తువులు కలిసి పాలకు మూల్య మగును. రూపములోను, నాకారములోను పాలు, కట్టెలు, ఫలములు మున్నగు వస్తువులు భిన్నములు; భిన్నభిన్న జాతికి చెందినవి. అయినను వీనిలో నొక విధమగు సామ్య మున్నది. ఆ కారణమున నవి పరస్పర మొకదాని కొకటి మూల్యము కాగలుగుచున్నవి. ఆ సమానత శ్రమకు, నుపయోగితకు సంబంధించినది. పాలు, పండ్లు, గోధుమలు మున్నగు వస్తువుల యుత్పాదక - శ్రమలోను, నుపయోగిత యందును మిక్కిలి భేద మున్నది. పండ్లను, ఫలములను నుత్పన్నము చేయుట కగు శ్రమకు, గోధుమలు, కూరలు నుత్పన్నము చేయుట కగు శ్రమకు నెంతో భేద మున్నది. అట్లే వాని యుపయోగమునందును భేద మున్నది. పాలు త్రాగుట కుపయోగించును. గోధుమలు రొట్టెచేసి తినుట కుపయోగించును. శ్రమను, ఉపయోగమును సామాన్య రూపముతో చూచెదమేని వీనిలో గల భేదము ప్రత్యక్షము కాదు. గోధుమలు, పండ్లు, పాలు మున్నగు వివిధములగు వస్తువుల నిర్మాణమున కగు వివిధ శ్రమలలో

నెంత భేద మున్నను నా శ్రమ లన్నియు మానవుడు చేయు శ్రమలే యగుచున్నవి. శ్రమభేదము ననుసరించి వస్తువుల యుపయోగములు నానావిధము లయినను నన్నియు నుప యోగములే యగుచున్నవి. వేని యుత్పత్తిలో మనుష్యునకు సమాన శ్రమ చేయవలసివచ్చునో యా వస్తువులు సమానము లగును. ఉపయోగిత శ్రమవలన జనించును. కావున శ్రమ సమానమైనపు డుపయోగితయు సమాన మగును. శ్రమలో గల సమానత కాలముద్వారా నిశ్చయింప నగును. గోధు మలు, పండ్లు, పాలు మున్నగునవి వాని పరిమాణములో నెంత భిన్నము లైనను, వాని నుత్పన్నము చేయుటకైన శ్రమ సమానమైన వాని మూల్యముకూడ సమాన మగును. సమాన మైన శ్రమద్వారా యొకదాని కొకటి దూరమున నుండియు పణ్యవస్తువులు మిక్కిలి సమీపము లగును; ఒకదాని స్థాన మును మరియొకటి గ్రహింపగలుగును. దేశదూరమే కాదు; కాలికదూరముకూడ వానిలో నుండదు. కృషీవలు డొక నాడు వస్త్రములను తీసికొని యొక సంవత్సరమునకు తరు వాత నావస్త్రముల మూల్యరూపమున గోధుమలో, యవలో యిచ్చును. దేశముద్వారా, కాలముద్వారా దూరముగా నుండు వస్తువులను మనుష్యుడు విచారబలముతో సమాన ములుగా నెంచును. పణ్యవస్తువున నాక్షణమున మూల్యము కూడ నుండును. పణ్యము మూల్యము రెండును పరస్పరము సాపేక్షపదార్థములు; అవి బొత్తిగా నిరపేక్షములు కాజాలవు. ఒక వస్తువు పణ్యభావము మరియొక వస్తువు యొక్క మూల్యభావము లేకున్న మనసునకు రాజాలదు.

కాలపరిమాణము ద్వారా సమానమైన శ్రమ పణ్యమును, మూల్యమును నుత్పన్నము చేయును. ప్రారంభమున నొక శ్రమ పణ్యము, మరియొక శ్రమ మూల్యము నగుచున్నవి.

శ్రమ క్షణికము. అది భౌతిక పదార్థములవలె స్థిరముగా నుండదు. శ్రమద్వారా జనించిన పదార్థములు చిరకాలమువరకు స్థిరముగా నుండును. శ్రమ క్షణిక మగుట వలన నది వస్తువు నాశ్రయింపక సాక్షాత్తుగ క్రయ విక్రయములకు నలవికాదు. పదార్థములద్వారా యది యాదాన ప్రదాన యోగ్య మగుచున్నది. పదార్థము లొకవిధముగ క్షణికమగు శ్రమయొక్క స్థిరరూపము లనదగును. గోధుమల నుత్పన్నము చేయుటకయిన శ్రమ, వస్త్రముల నుత్పన్నము చేయుటకయిన శ్రమతో సాక్షాత్తుగ వినిమయము చేయ వీలుగాదు. గోధుమలు, వస్త్రములు నను పణ్యముల రూపమున నది వినిమయము చేయవలసి వచ్చును.

కాని, స్థూల భౌతిక పణ్యవస్తువులు లేకయే వినిమయము చేయుటకు తగిన శ్రమలుకూడ కొన్నియున్నవి. ఇరువురు మనుజులు భిన్నభిన్న స్థానములకు ప్రతిదినము పోవువా రున్నా రనుకొనుడు. వారిలో నొకడు కారణ విశేషము వలన తాను వెళ్ళవలసిన స్థానమున కొకనాడు వెళ్ళజాలక, రెండవ వానిని పంపును. ఒకటి రెండు రోజు లయిన పిదప తాను రెండవవాడు వెళ్ళవలసిన తావునకువెళ్ళి యతని బదులు తీర్చును. ఇట్లు వారి యిరువురి ప్రయోజనములు నెరవేరు నను కొనుడు. ఈ యుదాహరణమునందు ఒకరి గమనశ్రమ, మరియొకరి గమనశ్రమతో వినిమయము చేయబడినది.

ఇక్కడ శ్రమ వినిమయమునకు మరియొక స్థూల భౌతిక పదార్థము నాశ్రయింపవలసిన యవసరము కలుగలేదు. ఇట రెండు గమనరూప క్రియలలో పరస్పర వినిమయము జరిగినందున రెండు క్రియలకు నయిన శ్రమ యొక జాతికి చెందిన దగుచున్నది. కొన్ని యెడల భిన్నజాతికి చెందిన శ్రమలుకూడ భౌతికపదార్థములద్వారా కాక సాక్షాత్తుగ వినిమయము చేయ సంభవ మగుచున్నది. ఒక కృషికుడు తన మిత్రున కొక గంట సమయము బావినుండి నీళ్లు తోడిపెట్టును. ఆ మిత్రుడు దానికి బదులా కృషికుని పొలములో నొక గంట నాగలి దున్నును. ఈ యుదాహరణమునందు నీళ్లుతోడుట, నాగలి దున్నుట యను నీ రెండు శ్రమలు భిన్నజాతీయములు. వాని వినిమయమునందు మరియొక స్థూలపదార్థ ముపయోగింపబడలేదు. శ్రమకు బదులు మరియొక శ్రమ సాక్షాత్తుగా వినిమయము చేయబడినది. వినిమయమున కిది మొదటి రూపము. ప్రపంచపు వ్యవహారములలో ననేకములు సాక్షాత్తుగ శ్రమ వినిమయముద్వారా నెరవేర్ప ననువుకావు. అందువలన భౌతిక పదార్థ సహాయము వినిమయమున కవసర మగుచున్నది. వినిమయముయొక్క యాదిమ రూపమునందు శ్రమకు గల రెండు రూపములు స్పష్టము లగును. ఒక శ్రమ పణ్య మగును; మరియొకటి మూల్య మగును. మనుష్యుని శ్రమ దృష్టితో రెంటికి గల సామ్య మనాయాసముగ దెలియును. భౌతిక పదార్థ రూపములలో శ్రమ స్థిరమైనపుడు శ్రమలో నేకరూపత యుండదు. గోధుమలు, కట్టెలు, వస్త్రములు, ఇనుము మున్నగువాని నన్నిటి నుత్పన్నము చేయుటకు శ్రమ

యవసరము. శ్రమదృష్టితో వీనిలో నేకరూపత యున్నది. వీని యన్నింటి పరిమాణములు సమాన మగు శ్రమద్వారా యుత్పన్నము లైనవి. వానిలో నేకరూపతను చూచుటకు విచారణద్వారా గోధుమాది పదార్థములకు గల వైరూప్య మును దూర మొనరింపవలసి యుండును.

క్రయ విక్రయములలో నేమి, యాదానప్రదానము లలో నేమి భౌతికపదార్థములు పనికివచ్చుచున్నందున పై చూపులకు శ్రమవినిమయము తెలియకున్నది. శ్రమ పణ్యావస్తువుల నుత్పన్నము చేయగలుగును; కాని, స్వయ ముగ పణ్యము కాజాలదని తెలియును. అభ్యాస మహిమ వలన శ్రమకు గల పణ్యారూపము వ్యవహార క్షేత్రమునుండి యదృశ్యమై పోయినది. దీనికి ఫలరూపముగ పణ్యమునందు శ్రమ, ఉపయోగిత యనునవి రెండును స్వతంత్ర ధర్మములుగ కనబడసాగినవి. ఒక్కొక్కప్పుడు వానిలో మిక్కిలి విరో ధముకూడ కలుగుచున్నది. నీళ్ళు తోడుట, నాగలి దున్ను టకు వినిమయ మయిననాడు శ్రమకంటె వేరుగ నుపయో గితకు సాధనము లేకుండెను. నాడు శ్రమయే స్వయముగ నుప యోగి యగుచుండెను. గోధుమలు, కట్టెలు మున్నగువాని వలె నీళ్ళు తోడుటవలనగానీ, నాగలి దున్నుటవలనగానీ గుణములద్వారా యుపయోగితను స్పష్టముచేయు వస్తు వేదియు చేతికి లభింపదు. గోధుమాది వస్తువులలో శ్రమ యెన్నడో కనబడి పోయినది; కాని, యుపయోగిత వ్యక్త రూపమున కనబడుచున్నది. వాస్తవమున శ్రమలోనే యుప యోగితయు నున్నది. అదియే వస్త్రాదుల నుపయోగకరము

లుగ చేయుచున్నది. శ్రమయేకాక, దాని యుపయోగితకూడ గోధుమాది రూపమున రూపొందుచున్నది - ఆకారమును ధరించుచున్నది. పణ్యావస్తువుల వినిమయము జరుగునపుడు మూల్య ముపయోగితనుండి పూర్తిగ వేరై కనిపింపదు. గోధుమలు తినుటకు పనికివచ్చును. ఇనుము స్తంభాదులను నిర్మించుట కుపయోగించును. ఒక పదార్థమువలన సిద్ధించు ప్రయోజనము రెండవదానివలన సిద్ధింపదు. ఈ స్థూలభేద మును చూచి, మార్క్సు పణ్యములలో మూల్య ముపయో గితకంటె వేరుగ స్వతంత్రముగ వినిమయకారణమని యంగీక రించి యున్నాడు.

గోధుమలు, వస్త్రములు, ఇనుము, పాలు మున్నగు పదార్థముల యుపాదాన కారణములు భిన్నములు; వాని స్వాభావిక గుణములలోను భేద మున్నది. ఆ గుణములు కారణముగ గలుగు స్వాభావికమగు నుపయోగిత శ్రమ కంటె వేరై స్వతంత్ర మగుచున్నది. కాని, యీ యుప యోగిత పణ్యధర్మము; శ్రమ జన్యము; శ్రమ కధీనమునై యున్నది. కావున శ్రమతో కలిసి యది మూల్యమును ప్రకటించుచున్నది. స్వాభావిక మగు నుపయోగితకు, శ్రమ జన్య మగు నుపయోగితకును నాశ్రయ మొక్కటియే. ఆ రెండుపయోగితలును వేరు వేరు ప్రదేశములం దుండవు. గోధుమాది పదార్థములలో రెండు విధములగు నుపయోగిత లును కలిసి యవిభాజ్యములై యుండును. స్వాభావికమగు నుపయోగిత పదార్థములందు పూర్వమునుండియే యుండును. శ్రమజన్యమగు నుపయోగిత తరువాత పదార్థమున చేరును.

తదుపరి చేరినప్పటికిని స్వాభావికమగు నుపయోగితాస్థలమున సమావిష్ట మయినందున నదియు స్వాభావికముగనే తెలియును. ఇది భ్రమ. ఈ స్వాభావికతా భ్రమ వలన మరియొక భ్రమ కలుగును. ఉపయోగిత మూల్యముకంటె నన్ని రీతులలోను భిన్నమనుటయే యీ రెండవ భ్రమ.

వినిమయముయొక్క యాదిమరూపమునకు సంబంధించిన యథార్థజ్ఞానము ఈ భ్రమల నడ్డగింపగలదు. ఉపయోగితామూలమును గూర్చి విచారించినచో వినిమయము యొక్క యాదిమరూపము మిక్కిలి స్పష్టమగును. గోధుమాది పణ్యవస్తువులు మనుజునికి ప్రయోజనము చేకూర్చును. ఇదియే వాని యుపయోగము. గోధుమలు తినుటకు, వస్త్రములు ధరించుటకు, నిటికలు సున్నము మున్నగునవి యిల్లు కట్టుటకును నుపయోగించును. పదార్థ మేదియైనను, మనుజుడు దానిని సుఖముపొందుటకో, లేక దుఃఖమును దూరమొనర్చుటకో యుపయోగించును. కావున సుఖప్రాప్తికి, దుఃఖనివృత్తికి సాధనమగుటయే పదార్థముల యుపయోగిత యగుచున్నది. స్వాభావిక గుణముల మూలముననను, శ్రమ వలనను వస్తువులం దుపయోగిత యేర్పడుచున్నది.

శ్రమ కేవలము పణ్యమైనపు డది స్వయముగ గోధుమాదులవలె సుఖప్రాప్తికి సాధనమగును. అప్పు డా శ్రమలో శ్రమజన్యమగు నుపయోగిత యుండదు. శ్రమజన్య పదార్థములోని యుపయోగిత శ్రమవలన కలుగుచున్నది. శ్రమను శ్రమ యుత్పన్నము చేయదు. కావున శ్రమయొక్క యుపయోగితయు శ్రమవలన జనింపదు.

గోధుమలు, వస్త్రములు, ఇనుము మున్నగునవి స్థూల పదార్థములు. వానిలో రూపము, రసము, స్పర్శ, మున్నగు (స్వాభావిక) గుణము లుండును. ఆ గుణముల మూలమున నవి యుపయోగకరము లగుచున్నవి. గోధుమలలో రసము, పొడవు వెడల్పులు, స్పర్శాది గుణములు లేకున్న నవి యుపయుక్తములు కాజాలవు; వానివలన నాకలి దూరము కాదు; శరీరమున బలము కలుగదు. ఇట్లే వస్త్రమున స్పర్శ లేకున్న దాని తంతువులలో పరస్పరము సంయోగము కలుగదు; పొడవు వెడల్పులు లేకున్న వస్త్రము ధరింప నుపయోగింపదు. శ్రమలో గుణము లుండవు. దానిలో రసముకానీ, పొడవు వెడల్పులు కానీ, రూపముకానీ, గంధముకానీ యేమియు లేదు. అది యవయవ శూన్యము.

కర్మకు రెండవ నామము శ్రమ. ఆ శ్రమ కర్మయైనందున ఉపయోగి యగుచున్నది. సుఖ దుఃఖములను కలిగించుటకు ద్రవ్యములు, గుణములు కారణము లైనట్లు కర్మ కూడ కారణ మగును. సుఖదుఃఖముల నుత్పన్నము చేయుటకు స్థూలభౌతిక పదార్థములు తమ గుణములమీాద నాధారపడినట్లు కర్మ గుణములమీాద నాధారపడదు. కర్మస్వరూపము గుణవంతము కాదు. సుఖ దుఃఖముల ప్రాప్తికి సాధనమగుటయే కర్మలోగల యుపయోగిత. దప్పిక గొన్నవానికి నీరు త్రావించుట, వేడివలన వ్యాకులుడగువానికి వీవనతో విసురుట సుఖము కలిగించును. నీరు త్రావించుట, వాయుస్పర్శ కలిగించుటయు శుద్ధమైన కర్మలు - శ్రమలు. ఈ రెండు విధములగు శ్రమలలోను పరస్పరము వినిమయము జరుగ

వచ్చును. రెండును సుఖదాయక కర్మలే. కావున నవి పణ్యము, మూల్యము నగుచున్నవి.

ప్రకాశముతో సంబంధము కలిగినమీదట పుస్తకము, పాలు, గోధుమలు మున్నగు పదార్థములు ప్రకాశితము లగుచున్నవి. ప్రకాశమును తెలుపుటకు మరియొక ప్రకాశాపేక్ష యుండదు. శ్రమసంబంధము గోధుమాది పదార్థములను సుఖజనకములుగాను, పణ్యములుగాను, మూల్యముగాను చేయుచున్నది. శ్రమ స్వయముగ సుఖజనకము, పణ్యము, మూల్యము నగుచున్నది. అది యట్లగుటకు మరియొక శ్రమనుకానీ, శ్రమజన్య గుణములను కానీ యపేక్షింపదు. మొదట శుద్ధశ్రమయొక్క యాదానప్రదానములు జరుగును. తరువాత కేవల శ్రమద్వారా వ్యవహారము నడువనపుడు స్థూల భౌతిక పదార్థముల యాదాన. ప్రదానములు ప్రారంభమగును. అప్పుడు శ్రమసంబంధమా వ్యవహారమునకు కారణ మగును. దీనికి విపరీతముగ శ్రమవలన నుత్పన్నమగుటయే పణ్యమునకు, మూల్యమునకు ముఖ్యకారణ మని యంగీకరించిన పక్షమున స్థూలములగు పణ్యపదార్థములలో నుపయోగిత, మూల్యము రెండును స్వతంత్ర ధర్మములుగా దోచ నారంభించును.

భౌతిక పణ్యపదార్థములతోనే వినిమయము ప్రారంభమగునని యంగీకరించువారు, శుద్ధమగు శ్రమయే క్రయవిక్రయములకు విషయమైనపుడు తడబడ నారంభింతురు. ధనపతి ప్రస్తుతకాలమున శ్రమికుల శ్రమను కొనుచున్నాడు. శ్రామికులదగ్గర శ్రమకుమించి మరియొక పదార్థ

ముండదు. మార్క్సు మున్నగు అర్థశాస్త్రిలకు శ్రమలో గోధుమాది పదార్థములలోవలె శ్రమకానీ, యుపయోగిత కానీ కనిపింపదు. అందువలన, వారు శ్రమయొక్క పణ్యాభావము నుచితరీతి నుత్పన్నము చేయుటలో నసమర్థు లగుచున్నారు. మొదటినుండి శుద్ధమైన శ్రమసంబంధమగు నాదానప్రదానముల నెరిగినమీదట నిట్టి శంకకు తావుండదు. రూప్యములద్వారా గోధుమలు, వస్త్రములు మున్నగువాని వలన జరుగు వినిమయముకూడ శ్రమకు శ్రమతో జరుగు వినిమయమే యగుచున్నది. గోధుమాదులు రూపొందిన శ్రమరూపములే కదా! ఇట్లే వెండి బంగారముల మూల్యమయరూప ముపయోగకరమగు శ్రమకు మించి మరి యొండేమియు కాదు.

## ఐదవ యధ్యాయము

# మూల్యముయొక్క బీజరూపము దాని వికాసము

ఒక పణ్యావస్తువు మరియొక పణ్యావస్తువుతో వినిమయము చేయుటవలన లభించును. అప్పుడు ప్రప్రథమమున మూల్యము బీజరూపమున ప్రకట మగును. రెండు గజముల కద్దరు నిచ్చి యొక చొక్కాయి తీసికొనినపుడు చొక్కాయి కద్దరుకు మూల్యముగా నగును. వినిమయము కొఱకు వలయు శ్రమ రెంటియం దున్నది. కావున వినిమయ క్షణమున నుపయోగ కరమగు శ్రమ మాత్ర మున్నది. భోగ్యమునకు, పణ్యాము నకు గల భేదము వినిమయము వలన స్పష్ట మగును. దుగ్ధము లోనున్న యుపయోగము మామిడిపండ్లలో లేదు. పండ్ల యుపయోగము వస్త్రములో నుండదు. కాని, పణ్యాము లయినపు డన్నింటి యుపయోగము సామాన్య మగును. చొక్కాయి యుపయోగియే. కద్దరు నుపయోగియే. రెండు పణ్యాములలోను భేద ముండునుకాని, యది యుపయోగి, యనుపయోగి రూపమున నుండదు. అనుపయోగి పణ్యామే కాదు. పణ్యాముల భేదము మూల్యరూపమునను, మూల్యేతర రూపమునను నుండును. చొక్కాయి మూల్య మైనపుడు కద్దరు మూల్యము కాదు; మూల్యవంత మగును. చొక్కాయి మూల్యమే కాని యాక్షణమున మూల్య వంతము కాదు. కాబట్టి మూల్యముయొక్క యారంభిక బీజరూపము మూల్యమునకు, మూల్యవంతమునకు మధ్యగల భేదమును ప్రకటించును.

ఈ బీజరూప మీ దశయందే యెప్పుడు నుండదు. ఇది రూపాంతరము నొందసాగును. క్రమముగా మూలరూప మును విడిచి మిక్కిలి భిన్నరూపమును దాల్చును. సాధారణ దృష్టికి మూలరూపమునకు, తరువాత నేర్పడు రూపములకు గల సంబంధము గోచరింపదు. రెండు గజముల కద్దరు మూల్యము మొదట చొక్కాయి రూపమున ప్రకటమైనది. కాని, చొక్కాయి స్థిరముకాదు. చొక్కాయి స్థానమును అన్నము, ఫలాదులు నేవైనను నాక్రమింపవచ్చును. ఇట్లు మూల్యమున కారంభిక రూపము లనేకము లగును. మొదట నొకరూప ముండెను; ఇప్పు డనేక రూపము లయినవి. కాని యీ రూపము లన్నియు నారంభిక బీజాకారమునకు చెంది నవే. పరిమాణములో మార్పు లేదు. సంఖ్యలో మాత్రము మార్పు వచ్చినది.

మొదటి యాకారము :— రెండు గజముల కద్దరు = ఒక చొక్కాయి.

రెండవ యాకారము :— 2 గ. కద్దరు = 8 మామిడిపండ్లు.

మూడవ యాకారము :—2 గ. కద్దరు = 4 సేర్ల గోధుమలు.

నాలుగవ యాకారము :— 2 గ. కద్దరు = 24 కాగితములు.

ఐదవ యాకారము :— 2 గ. కద్దరు = 1 తుల మాషధము.

మొదటి యాకారమునందు మూల్యము భేదరహిత మగు, ఉపయోగకరమైన సామాన్య మనుష్య శ్రమరూప మున ప్రకటమయ్యెను. ఆ క్షణమందు మనుష్యుని యుపయో గకరమగు శ్రమసామాన్యరూప మంతగా స్పష్టముకాదు.

రెండవ యాకారమున సామాన్య రూపము స్పష్టముగా ప్రకాశించెను. కద్దరు నుత్పన్నము చేయుటలోనే శ్రమ కారణ మయ్యెనో యది యితర గోధుమాది వస్తువుల నుత్పన్నము చేయుటకైన శ్రమతో సమాన మనుట బాగుగ తెలిసినది. కట్టుట, విత్తుట, తడుపుట, తూచుట, విసరుట మున్నగు క్రియారూపములగు శ్రమ లన్నియు మనుష్యున కుపయోగకరములే. చొక్కాయి, పండ్లు, గోధుమలు మున్నగునవి యెన్ని రూపములలో ప్రకటమైనను, కద్దరు మూల్య పరిమాణములో మార్పులేదు. ఈ యపరివర్తిత - మార్పుచెందని - పరిమాణము వినిమయ పరిమాణమును తన వశములో నుంచుకొనును.

మొదటి రెండాకారములలోను మరియొక యంతరము చూడదగి యున్నది. మొదటి యాకారమునందు ఖద్దరు మూల్యముయొక్క పూర్ణరూపము కనిపించును. చొక్కాయి మూల్యము - దాని పూర్ణస్వరూపము ప్రత్యక్షము. రెండవ యాకార మితరాకారములతో కలిసి యొక మూల్యశ్రేణి యగుచున్నది. ఆ శ్రేణి కంత ముండదు. ఈ శ్రేణిలోని ప్రతిదాని మూల్యము పణ్యముల యనంతశ్రేణి రూపములో ప్రకటమగును. అనేక పణ్యములు మూల్యమును ప్రకటించు నపు డంశరూపమున ప్రకటించును; కాని, యేదియు పూర్ణ రూపమున ప్రకటింపదు. సామాన్యము, నుపయోగకరము నగు మనుష్యశ్రమయొక్క యశేషరూపము ప్రత్యక్షము కాదు.

మొదటి యాకారము, రెండవ యాకారము వీనివలన మూడవ విధమగు స్వరూప మొకటి ప్రత్యక్షమగును. ఖద్దరు ననేక పణ్యములతో వినిమయము చేయునపుడు, స్వాభావికముగ జనులు కద్దరుతో తమ నానావిధములగు పణ్యములను వినిమయముచేయ ప్రయత్నింతురు. మొదట కద్దరు-మూల్యము నన్యపణ్యములు ప్రకటించును; ఇప్పుడు కద్దరు ఇతర పణ్యముల మూల్యమును ప్రకటించును. మొదటి యాకారమును విపరీతము చేసినందున మూడవ యాకారము ప్రకటమగును.

మూడవ యాకారము:—

| | |
|---|---|
| 1 చొక్కాయి | |
| 8 పండ్లు | |
| 4 సేర్ల గోధుమలు | = 2 X. ఖద్దరు. |
| 24 కాగితములు | |
| 1 తుల మాషధము | |

పై చూపులకు నీ మూడవ యాకారమునకు, మొదటి రెండాకారములకు నెక్కువ భేదము కనిపింపదు. మొదట చొక్కాయి మున్నగునవి కద్దరు మూల్యమును ప్రకటించుచుండెను. ఇప్పుడు కద్దరు వాని మూల్యమును ప్రకటించుచున్నది. కాని, యిది సాధారణ విషయము కాదు. ప్రతి జంటను విపరీతము చేయవచ్చు; అనేకమును చేయవచ్చును. మూల్యమునకు సంబంధించిన ప్రతి జంటను విపరీతము - విపర్యయము - చేసిన విలక్షణత యేమియు ప్రకటము

కానిమాట వాస్తవమే. కాని, రెండు గజముల కద్దరు, చొక్కాయి - వీని సమానతను విపర్యయము చేసిన చొక్కాయి మూల్యము రెండు గజముల కద్దరగును. ఎనిమిది మామిడి పండ్లు, నాలుగుసేర్ల గోధుమలు - వీనికిగల సామ్యము తల క్రిందులు - విపరీతము - చేసిన గోధుమల మూల్యము పండ్లగును. 24 కాగితములు, ఒక తులమౌషధము - వీని సామ్యము మార్పుచేసిన నొక తులపు ఔషధ మూల్యము 24 కాగితము లగును. కాని, చొక్కాయి, పండ్లు, గోధుమలు మున్నగు పదార్థము లన్నియు కద్దరుతో స్థానపరివర్తనము చేసికొనిన, స్థితి చాల మారిపోవును. జంటల సామ్యమును కేవలము విపర్యయము చేసినపుడు కేవలము మొదటి వస్తువు స్థానమున రెండవ వస్తువు మూల్యమగును. కాని యనేక పదార్థము లొక పణ్యముద్వారా తమ మూల్యమును ప్రకటించునపు డొక వస్తువు వాని యన్నింటి మూల్య మగును. ఉపర్యుక్త రెండవ యాకారమునందు నిట్టిస్థితి లేదు. దానిలో కద్దరు మూల్యము గలదిగాను, భిన్నభిన్న విజాతీయ పదార్థములు మూల్యముగాను తెలియును. ఇప్పుడో మూల్యము గలవి యనేక వస్తువు లయిన మూల్య మొక్కటి యగుచున్నది. కద్దరు రెండు గజములే. దాని పరిమాణ మెక్కుడు కాలేదు; కాని మూల్యమయరూపము మిక్కిలి ప్రభావశాలియైనది. ఇప్పు డది యొకటి రెండు పణ్యములదే కాక సమస్త పణ్య ప్రపంచమూల్యమును ప్రకటించును. మూల్యముయొక్క యీ విశాలరూప ముపయోగితను పణ్యములలో నోతప్రోతముగా చూపుచున్నది. ఒకటి, రెండు ఆకారము

లలో కద్దరు మూల్యమును, చొక్కాయి మున్నగు పదార్థము లొక్కటొక్కటి ప్రకటించినవి. అప్పు డవి మరియొక పణ్య ముతో సంబద్ధమైకాని, అన్య పణ్య సహాయము తీసికొనిగాని ప్రకటింపలేదు. ఈ మూడవ యాకారమునందు సమస్త పణ్యములు కలిసి తమ మూల్యమును ప్రకటించుచున్నవి. కద్దరు మనుష్యుని వివిధములైన యుపయోగకరములగు శ్రమలయొక్క ఘనీభూత రూప మగుచున్నది. ఈ కారణమున కద్దరు అన్యపణ్యములతో వినిమయము చేయనగును. వినిమయ కారణమున శ్రమ సామాజిక మగుటలో నిప్పు డెట్టి సందేహము నుండజాలదు.

పై మూడాకారములను బాగుగ పరిశీలించిన రెండవ యాకార మెంత వికసించునో మూడవ యాకారముకూడ నంతగా వికసించునని తెలియనగును. మొదటి యొక యాకారము కొండొక పణ్యమును సమానము చేయు చున్నది. దానికి విశాల రూపమగు రెండవ యాకారము ఒక్క పణ్యమూల్యమును సమస్త పణ్యముల రూపమున ప్రక టించుచున్నది. మూడవ యాకారమున నొక పణ్యవిశేషము విశ్వవ్యాపకమగు నుపమాన మగుచున్నది. కారణము, సమస్త పణ్యములు తమ మూల్యమును దీనిద్వారా ప్రకా శిత మొనర్చుచున్నవి.

రెండు గజముల కద్దరు ఒక చొక్కాయికి సమానమై నపుడా కద్దరు మూల్యము ప్రకట మగును. చొక్కాయి మూల్యమును మాత్రము తెలుపును. ప్రతియోగి యను యోగి కాదు.

రెండవ యాకారమున కద్దరు తన యనుయోగి రూప మును పూర్ణరూపమున విస్తరింపజేయును. ఇతర పణ్యము లన్నియు ప్రతియోగు లగును. మొదటి యాకారమును తల క్రిందులు చేసిన స్వభావము మారదు. అప్పుడు కద్దరు అను యోగి కాదు. చొక్కాయి యనుయోగి యగును. కాని రెండవ యాకారము తలక్రిందైన స్వభావముకూడ మారును.

అంతమున మూడవయాకారము కద్దరును ప్రతి యోగిగ నొనర్చును. అప్పుడు కద్దరుతక్క, మరియొక పణ్యము ప్రతియోగి కాదు. మరియు నాదశలో కద్దరుతప్ప యితర పణ్యములు మరియొక పణ్యమును పరివర్తనము చేయ నేరవు.

మూడవ యాకారపు విశ్వవ్యాపి ప్రతియోగి మూల్య మును ప్రకటించుటకు మూడవ యాకారమును మార్పవలసి వచ్చును. అప్పు డది రెండవ యాకార మగును. ఇందు కద్దరు మూల్యమును పణ్యములు ప్రకటించును. కాని యా పణ్యము లలో నేదియు తన మూల్యమును ప్రకటింపనేరదు. ప్రతి యోగు లనేక సంఖ్యలో నుండుట యీ రెండవ యాకారము లోని విశేషము.

మూడవ యాకారమువలన నాలుగవ యాకారము ప్రకట మగును. ఒకపణ్య మే క్షణమునుండి యితర పణ్యముల మూల్యములను నియత రూపమున ప్రకటింప మొదలిడునో యా క్షణమునుండి యది ధాతుమయ మగును. ధాతువు రూప మున పనిచేయ నారంభించును. ఒక విధముగ 'నది యన్య

పణ్యాములనుండి మూల్యమును ప్రకటించు నధికారమును బలాత్కారముగ తనవశము చేసికొను' నని చెప్పనగును. జనుల వ్యవహారమున ప్రచలితమై యా పణ్య విశేషము యొక్క యధికారము పూర్ణముగ స్థాపిత మగును. మూడవ యాకారమున నీ గొప్ప యధికారము కద్దరుకు చెంది యుండెను. ఆ కద్దరుస్థానమున సువర్ణమునో, రజతమునో యుంచిన నది నాల్గవ యాకార మగును. దాని రూప మిట్లుండును :

| | |
|---|---|
| 1 చొక్కాయి | |
| 4 మామిడిపండ్లు | 2 తులముల రజతము |
| 4 సేర్ల గోధుమలు | లేక |
| 24 కాగితములు | 2 చిన్నముల బంగారము |
| 1 తు. ఔషధము | |

మొదటి యాకారముకంటె రెండవ యాకారమునందును, దానికంటె మూడవ యాకారమునందును స్వరూపములో భేద మున్నది. కాని మూడవ నాలుగవ యాకారములలో స్వరూప భేదము లేదు. వస్తుభేదము మాత్ర మున్నది. కద్దరు స్థానమున సువర్ణమో లేక రజతమో వచ్చినది. సమాజమున నిరంతరము జరుగు వ్యవహారము విశ్వవ్యాపక మగు మూల్యరూపము వెండి బంగారముల కిచ్చివేసినది. ప్రారంభమున వెండి బంగారములు కూడ విశ్వవ్యాపి మూల్యముగా లేవు. ఇతర పణ్యములవలెనే వెండి బంగారములుకూడ వినిమయమున మరియొక పణ్యమునకు మూల్యముగా వ్యవహరింపబడుచుండెను. క్రమముగా నితర పణ్య

మూల్యమును ప్రకటించుచు చివర కవి విశ్వవ్యాపి మూల్యము లయినవి. వెండి బంగారములకు పణ్య ప్రపంచమున ప్రతిష్ఠ కలుగగానే ధాతుమయ మూల్యము వేరైనది. మూడవ నాలుగవ యాకారములలో గల భేదము స్పష్టము కాజొచ్చి నది. ధాతుమయ మూల్యము పూర్ణముగ నధికారమునకు రాకముందు వ్యవహార కారణముననే పణ్యమైనను విశ్వ వ్యాపి మూల్యము కాదగి యుండును. ధాతుమయ మూల్య కార్యము నది యంతవరకు చేయుచుండును.

ధాతుమయ మూల్యము ధాతువుయొక్క యంశము లలో ప్రకట మగును. రెండు గజముల కద్దరుమూల్యము ధాతువుల యంశము రూపమున ప్రకట మగును.

2 గ. కద్దరు = 2 తులముల వెండి, ఆ వెండి నాణె ములు చేయబడిన 2 గ. కద్దరు = 2 రూప్యములు.

నాలుగవ యాకారము మూడవ యాకారముతో పూర్తిగ పోలియుండును. మూడవ యాకారము రెండవ యాకారపు పరిణామము. రెండవ యాకారము మొదటి యాకారమువలన ప్రకట మగును. కావున మొదటి యాకా రము ధాతుమయ మూల్యమునకు బీజరూప మనదగియున్నది.

# ఆఱవ యధ్యాయము

## ఆత్మవాదానుసారము పుణ్యస్వరూపము

పదార్థములు రెండు రకములు. చేతనములు; అచేతనములు. చేతనములు నిత్యములు. వానికి నుత్పత్తికానీ, నాశముకానీ లేదు. అచేతనవస్తువులకు మూలకారణము ప్రకృతి. అదియు నిత్యమే. కాని యిది ప్రతిక్షణము పరిణతి నొందుచుండును. దీనికి మరియొక మూలకారణమేదియు లేదు. అది యన్యకార్యపదార్థముల కన్నింటికి మూలము. అందువలననే యది నిత్యము. చేతనములగు జీవులు నిత్యులే. ప్రకృతియు నిత్యమే. అయినను రెండింటి నిత్యతలో భేద మున్నది. చేతనమగు జీవాత్మలో వికారమెన్నడు కలుగదు. కాని, ప్రకృతిలో నిరంతరము పరిణామము కలుగుచుండును. జీవాత్మ పరిణామములేని నిత్యవస్తువు; ప్రకృతి పరిణామము గల నిత్యవస్తువు.

అనాదికాలమునుండి జీవాత్మ తన కర్మల ననుసరించి యొకప్పుడు పశుశరీరము, మరియొకట పక్షిశరీరము, ఇంకొకనాడు మనుష్యశరీరము, నిట్లనేక శరీరములను బొందుచుండును. ఏకర్మలఫల మేశరీరమున ననుభవింపవలెనో యందు వాని ననుభవించి యా శరీరమును విడిచి మరియొక శరీరమునకు జీవుడు వెళ్ళవలసినవా డగును. మనుష్య యోనియందు జీవుడు పూర్వజన్మపు కర్మల ఫలము ననుభవించును. ఈ జన్మలో చేయు కర్మల ఫలము నన్యజన్మలం దనుభవింపవలసిన

వాడగును. కాని పశుపక్ష్యాది యోనులలో జీవుడు పూర్వ కృత కర్మఫలములను మాత్ర మనుభవించును. ఆ యోనులందు చేయు కర్మలు కారణముగా మరియొకజన్మ లభింపదు. మనుష్య యోనికి నితర యోనులకు గల భేద మింతయే. కర్తవ్యాకర్తవ్యములను విచారించి చేసిన కర్మల ఫలమే యనుభవింపవలసి వచ్చును. మనుష్యునకే కర్తవ్యాకర్తవ్య వివేక ముండును. ఇతర ప్రాణులకా వివేక ముండదు. అందువలన మనుష్యేతర ప్రాణులకా యా శరీరములందు చేయు కర్మల ఫలము మరియొక జన్మమునందు లభింపదు - అనుభవింపవలసిన యవసర ముండదు.

జీవున కతడు చేసిన కర్మలవలన శరీరము లభించినది. ప్రాచీన కర్మల ఫలము ననుభవించుటలో జీవుడు పరతంత్రుడు; కాని, కర్మల నాచరించుటలో పూర్ణముగ స్వతంత్రుడై యున్నాడు. సుఖదుఃఖముల ననుభవించుటకు, కర్మల నాచరించుటకు శరీరము సాధనము. శరీరము లేకున్న జీవుడు కర్మల ఫలము ననుభవింపనేరడు; కర్మలను చేయనుజాలడు. జీవు డీ జన్మమునందు ప్రయత్నించి, వస్తువులను సంపాదించి సుఖము ననుభవించునట్లు, పూర్వపు కర్మల ఫలమునుకూడ నీ లౌకిక వస్తువుల వలననే యనుభవింపవలసి యున్నది.

వస్తువు లన్నియు భోగసాధనములే. ఈ వస్తువులు కర్మ చేయకున్న నుత్పన్నములు కావు. కావున కర్మ వీనికి కారణమగును. భోగ్య వస్తూత్పత్తికి రెండు కారణములు తప్పక యుండవలెను. ఒకటి యుపాదాన కారణము, రెండవది నిమిత్త

కారణము. వస్త్రము తంతువులనుండి యుత్పన్న మగును. తంతువులు దానికుపాదాన కారణము. నేతగాని ప్రయత్నము వస్త్రమునకు నిమిత్తకారణము. కేవల ముపాదాన కారణము వలన గానీ, కేవల నిమిత్త కారణమువలన గానీ వస్తువుత్పన్నము కాదు. తంతువులలో వస్త్ర మగుటకు తగిన శక్తి యున్నది; కాని, స్వయముగ నవి వస్త్రము కాజాలవు. వస్త్ర రూపమున వానిని మార్చుటకు జ్ఞానము, ప్రయత్నము నవసరము లగుచున్నవి. ఉపాదాన కారణ గుణములు కార్యము నందు తెలియవచ్చును. కార్యము, ఉపాదాన కారణముకంటె బొత్తిగా భిన్నము కాదు. కార్యరూపమున భేద మున్నను, ఉపాదానకారణ రూపమునందు రెండును నభిన్నములే. వస్త్రమునందు తెలియు గుణములు దాని యుపాదాన కారణమునందలి గుణములు కారణముగ నేర్పడును. ఉపాదానమునందు గుణములు లేకున్న కార్యమునందు నుండజాలవు. ఉపాదానకారణ మొక్కటే కార్యము నుత్పన్నము చేయజాలనట్లు కార్యగుణములను కూడ నది యుత్పన్నము చేయజాలదు. వస్త్రోత్పత్తికి నేతగాడవసరమైనట్లు, వస్త్రగుణముల నుత్పన్నము చేయుటకు నతడవసరమే. నేతగాని జ్ఞానము, ప్రయత్నము, రెండును వస్త్రము నుపయోగిగ నొనర్చును. కర్త నిమిత్తకారణ మనిన, కర్త యొక్క జ్ఞానకర్మలు నిమిత్తకారణ మని దాని యభిప్రాయము. కర్తయొక్క జ్ఞాన ప్రయత్నములు వస్త్రాకారము నుత్పన్నము చేయుటకు నిమిత్తకారణము లైనట్లు దాని గుణముల నుత్పన్న మొనర్చుటకును నిమిత్తకారణములే. కర్మ

కంటె ముందు జ్ఞాన మావశ్యకము. తెలియని విషయమున కర్మ యేర్పడదు. జ్ఞానానంతరము కర్మ మవసరము. జ్ఞాన మొక్కటే మూర్త ద్రవ్యమును, దాని గుణముల నుత్పన్నము చేయజాలదు.

మనుష్యునకు గాని, లేక ప్రాణిమాత్రమునకు గానీ లభించు శరీరము వాని యీ జన్మపు జ్ఞాన కర్మలవలన లభింప లేదు. శిశువునకు తన శరీరము నిర్మించు జ్ఞాన ముండదు; శరీర నిర్మాణమునకై యది యత్నింపజాలదు. ఆత్మవాదము ననుసరించి జీవునకీ శరీరము వాని కర్మల ఫలముగా లభించి నది. సూర్య చంద్రులు, పృథ్వీ సముద్రాది పదార్థములు నన్నియు మనుష్యునకు సుఖదుఃఖములు లభింపజేయును. అవియు నుత్పన్నములైనవే. వీని యుత్పత్తి కేవల ముపాదాన కారణమువలననే జరుగలేదు. వీనికికూడ నిమిత్తకారణము జ్ఞాన ప్రయత్నము లుండవలెను. నేతగాని జ్ఞాన ప్రయత్న ములు వస్త్రమునందు మూర్తీభవించి యున్నట్లు, సూర్య చంద్రాదు లందును వాని యుత్పాదకుని జ్ఞానప్రయత్నములు మూర్తీభవించి యున్నవి.

ఆధునికులయిన యనాత్మవాదుల మతమున నెండ, గాలి, వాన, సూర్యుడు, చంద్రుడు మున్నగు పదార్థములు నర్థశాస్త్ర దృష్టితో నుపయోగకరములే; కాని యవి జ్ఞాన ప్రయత్నముల ద్వారా యుత్పన్నములు కాలేదు. అవి కేవలము వాని యుపాదాన కారణ పరిణామములు మాత్రమే.

ఆత్మవాదులకు ననాత్మవాదులకు గల భేద మీ విషయ మున నింతే. కాని, వాస్తవమున నుపర్యుక్త సూర్య

చంద్రాది పదార్థము లన్నియు ప్రాణుల భోగమునకు సాధనములు. వానివలన ప్రాణులకు సుఖదుఃఖములు కలుగును. కావున నవి జ్ఞాన ప్రయత్నములు లేక యుత్పన్నములు కాజాలవు.

ఆత్మవాదమున రెండు పక్షము లున్నవి. ప్రథమ పక్షమున పరమాత్ముడు నదీ సముద్రాదులను ప్రాణులకు సుఖదుఃఖముల నిచ్చుటకు రచించి యున్నాడు. జీవుల కర్మ లచేతనము లగుటవలన నవి స్వయముగ ఫలము నీయజాలవు. అందువలన పరమేశ్వరుడు జీవుల కర్మల ఫలము లభించుట కనువుగ సూర్య చంద్రాది భౌతిక పదార్థముల నిర్మించి యున్నాడు. ఆ పదార్థములకు నిమిత్త కారణము లిట్లు జీవుల కర్మలు, పరమేశ్వరుని జ్ఞానము నగుచున్నవి. పరమాత్మ జగత్తునకు కర్తృరూప నిమిత్తకారణము. జీవుల కర్మలు కరణరూప నిమిత్తకారణము.

నిమిత్తకారణము లనేక విధములు. ఉపాదాన కారణమునకు భిన్నమైన కారణములు నిమిత్తకారణములని సామాన్యముగ చెప్పనగును.

ఆత్మవాదమునకు చెందిన రెండవ పక్షమునందు, సూర్యచంద్రులు, నదీనదములు మున్నగువాని రచయిత పరమాత్మ కాదు. జీవులద్వారా నవి యుత్పన్నము లగుచున్నవి. వీనికి నిమిత్తకార్ణము జీవుల కర్మలు మాత్రమే. జీవులు చేసిన కర్మలు జ్ఞానపూర్వకములు. కావున వారి కర్మలతోబాటు జ్ఞానముకూడ నిమిత్తకారణ మగును.

మొదటిపక్షమున పరమేశ్వరుని జ్ఞానము, నీ రెండవపక్షమున సమస్తజీవుల జ్ఞానకర్మలు నిమిత్తములు.

అనాత్మవాదు లయిన యర్థశాస్త్రజ్ఞులు, వస్త్రములు, గోధుమలు, ఫలపుష్పములు, బల్లలు, కుర్చీలు మున్నగునవి మాత్రమే కర్మజన్యము లందురు. ఎండ, గాలి మున్నగున వన్నియు మనుష్యరచితములు కానందున కర్మలేకయే యవి యుపయోగకరము లగునని యంగీకరింతురు. అనాత్మవాదమునందు జ్ఞానకర్మలు వ్యాపకరూపమున కారణములు కావు. కాని యాత్మవాదమునం దవి విశ్వవ్యాపక కారణములు. ఆత్మవాదమునందు వస్తువు లన్నియు భోగ్యములే. కొన్ని మనుజుని యొక్కయు, మరికొన్ని పరమాత్ముని యొక్కయు జ్ఞానకర్మలచే నుత్పన్నము లయినవి. పరమేశ్వరుడు భోగసాధనములుగ నుత్పన్నముచేసిన పదార్థములలో కొన్నింటి యుత్పత్తియందు కొండొక జీవుని జ్ఞానకర్మలు విశేష కారణము లగును. మరికొన్ని సమస్తజీవుల కర్మలు కారణముగ నుత్పన్నము లయినవి. శరీరాదులవలన శరీరధారు లయిన మనుష్య పశుపక్ష్యాదులకు వేరువేరుగ సుఖదుఃఖములు ప్రాప్తము లగును. కావున శరీరాదులు ప్రత్యేక జీవునకు కర్మల ఫలమే. మరియు, సూర్యచంద్రులు, పృథ్వీ సముద్రాదులు వీనివలన సమస్త ప్రాణులకు సుఖదుఃఖములు లభించును. కావున వీని యుత్పత్తికి సమస్తజీవుల జ్ఞానకర్మలు నిమిత్తకారణములు.

లౌకిక వ్యవహారమున వస్తువులు పణ్యము లైనట్లు, పారలౌకిక వ్యవహారమునం దొక వస్తువు పణ్యముకాదు. మనుష్య

డొక వస్తువు నుపయోగకరముగ నిర్మించును. దానిని మరి యొక డుపయోగించి సుఖము పొందును. ఒక డొక వస్తువు నిచ్చి దానికి బదులు రెండవ వస్తువు పొందగలుగును. జ్ఞానము, శ్రమ వీనికి బదులు జ్ఞానశ్రమలు పణ్యావస్తువుల ద్వారా లభించును. కాని, పరలోకమున ఫలము ననుభవించుటకు పణ్యావస్తువుల యాదానప్రదానముల యవసరము లేదు. జ్ఞానము, శ్రమయు సాక్షాత్తుగ ఫలము నిచ్చును. సేవకుడు, నధ్యాపకుడు, లేఖకుడు క్రమముగ సేవ, పఠన పాఠనములు, లేఖనములు చేసి వేతనములను బొందునట్లు జీవుడుకూడ కర్మల నాచరించి ఫలములను బొందును. కర్మల ఫలము పణ్యములేకను లభించును. మనుష్యుడు తన జ్ఞానకర్మల ద్వారా యితరుల కెంతటి సుఖదుఃఖములను కలిగించునో యంతటి సుఖదుఃఖము లతని కిహలోకముననో లేక పరలోకముననో కలుగును. కాని వస్తురూపమున వినిమయ మట జరుగ నేరదు. జ్ఞానకర్మల ఫలముయొక్క యాదానప్రదానములు జరుగును; కాని, పణ్యావస్తువు మధ్యలో సాధనము కాదు.

కర్మఫల వ్యవస్థ ననుసరించి పణ్యాస్వరూప మొకింత విలక్షణముగా చెప్పబడును. పణ్యావస్తువు సుఖదుఃఖములకు సాధన మగును. వస్త్ర గోధుమాదులు సుఖప్రాప్తి కొఱకును, నస్త్ర శస్త్రాదులు దుఃఖప్రాప్తి కొఱకును నిర్మింపబడును. సామాన్య రూపమున మనుష్యుని జ్ఞానకర్మలు పణ్యావస్తువుల నుత్పన్నము చేయును. కావున, నే రెండు పదార్థముల నుత్పన్న మొనర్చుటలో జ్ఞానకర్మలు సమాన పరిమాణములో

నుపయోగింపబడినవో యా రెండు పదార్థములు పరస్పరము మూల్యము లగును.

వాస్తవమున చేతన మగు నాత్మకు పణ్యవస్తువు జ్ఞాన శ్రమల రూపమున ప్రత్యక్షమగును. జ్ఞానము, ప్రయత్నము రెండును నాత్మకు స్వాభావిక గుణములు. ప్రయత్నమువలన నచేతన వస్తువులందు కర్మ యుద్భవించును. జీవాత్మ, పరమాత్మ రెండును చేతనములే. గోధుమలు, వస్త్రములు మున్నగు భౌతిక పదార్థములలో జీవాత్ముని జ్ఞానకర్మలు, సూర్య చంద్ర నక్షత్ర జల స్థలాదులందు పరమాత్ముని జ్ఞాన కర్మలు మూర్తీభవించి ప్రత్యక్ష మగుచున్నవి. జ్ఞానము, కర్మ రెండును చేతనాత్మకు స్వరూపములు. కావున వాని దర్శన మాత్మదర్శనమే యగుచున్నది. మూల్యము జ్ఞాన కర్మల రూపము. కాగా మూల్యమునకు నాత్మకు భేద మొకింతయు .లేదని బోధపడుచున్నది. గోధుమాదుల మూల్యము జ్ఞానకర్మ మయ మగు జీవాత్మ యనియు, పృథివీ, సూర్యచంద్రాదుల మూల్యము జ్ఞానకర్మ మయ మగు పరమాత్మ యనియు ననవచ్చును. జ్ఞానము, కర్మ రెండును సామాన్యముగ పణ్యములందు నోతప్రోతములై యుండును. మరియొక విధముగ జెప్పిన ప్రాకృతిక జగత్తునందు మూల్య రూప మగు బ్రహ్మ మోతప్రోతమై యున్న దనవచ్చును. అమూర్తబ్రహ్మము జడపదార్థములలో స్పష్టముగ భాసింపదు. కాని, సామాన్య జ్ఞానకర్మల సముచ్చయ రూపమున బ్రహ్మ మెల్లరకు ప్రత్యక్ష మగును. జ్ఞానకర్మలకు సంబంధములేని పణ్యము లోకమున నుండదు. ఆత్మ మూల్యరూపమున నుండి

పణ్యముల నిటునటు త్రిప్పుచున్నది. జ్ఞానకర్మాత్మక మగు బ్రహ్మము స్వయ మఖండమూల్యము. దాని సంబంధము పరిణామముగల పదార్థములను మూల్యవంత మొనర్చు చున్నది. పణ్యమేకాక, పణ్యములకంటె భిన్నమైన భోగ్య వస్తువులకును మూల్యము జ్ఞానకర్మాత్మక బ్రహ్మమే. సమీప మున నుండు పణ్యములలో వినిమయము జరుగునంతవరకు మూల్యరూపమగు బ్రహ్మయొక్క వ్యాపకత స్పష్టముకాదు. గోధుమలతో సంబంధ మున్నదానికి సామాన్య రూపమున వస్త్రముతో నున్నట్లు స్పష్టము కాదు. కాని, గోధుమలకు బదులు మరియొక దేశమునుండి వస్త్రములు వచ్చునపు డిటనుండి గోధుమలను, నటనుండి వస్త్రములను నడుపు వస్తువు మరియొకటి వానిలో నిమిడియున్నది. గోధుమల వినిమయ మనేక వస్తువులతో జరుగునపుడును వాని కన్నిటికిని గతి కలిగించు వస్తు వొకటి యుండును. అదియే యన్నిటి తోను సంబద్ధమై యున్నది. అదియే గతికి మూలము. అదియే మూల్యరూపమగు జ్ఞానకర్మాత్మక బ్రహ్మము. దానికి దూర మున నుండు నన్నిపదార్థములతోను నొక్కటిగా సంబంధ మున్నది. సమానభావముతో మూల్యబ్రహ్మ సంబంధము వస్తువులలో లేకున్న పదార్థముల వినిమయమే కాదు. పణ్య ములు కానీ, భోగ్యములు కానీ, జన్యములైన యెల్లపదార్థము లకు మూలము బ్రహ్మము. మూలమే మూల్యము; మూల వంతమే మూల్యవంతము. ప్రకృతి మూలము; కాని యది యుపాదానము. జీవ పరమాత్మలు మూల్యరూప మగు మూలములు; కాని నిమిత్తకారణములు. కాగా ప్రకృతి,

జీవులు, ఈశ్వరుడు నను మూఁటి సంబంధము మూల్యమునకు కారణము.

ACC NO- 8292 181.4 EAS

బ్రహ్మ, జీవుడు, ప్రకృతి యన్నియు నభిన్నములే యను నొక పక్ష మాత్మవాదమున గలదు. ఈ పక్షము ననుసరించి చూచినను మూల్యము బ్రహ్మరూప మగుచున్నది. బ్రహ్మ జీవులకు భిన్నము కాదు; ప్రకృతికిని భిన్నము కాదు. ఈ యభేదము కారణరూపముననే కాని, కార్యరూపమున నుండదు. కార్యరూపములో నన్నియు భిన్నములే. భూషణములు సువర్ణముతో నిర్మింపబడును. కాని యుంగరము తన రూపముతో కుండలములకంటె భిన్నము. బంగారము రూపమున నుంగరము, కుండలములు రెండును నభిన్నములే. కార్యరూపమున వస్తువులలో గల భేదము సత్యమే కాని మిథ్య కాదు. జ్ఞాన కర్మమయ బ్రహ్మ మనేక రూపముల నుండును. ఒకటి గోధుమ రూపమున నున్న, మరియొకటి వస్త్రరూపమున నుండును. వేరొకటి దుగ్ధరూపమున నుండును. ఇంకొకటి సువర్ణరూపమున నుండును. గోధుమలు, వస్త్రములు, దుగ్ధము, సువర్ణము మున్నగు రూపములలో నన్నియు భిన్నములే. ఆకృతులను చూచునపుడు వానిలో నభేదము కనిపింపదు. కాని యీ యాకారము లన్నియు జ్ఞాన కర్మమయ మూల్యముయొక్క వివిధ పరిణామములు. జ్ఞాన కర్మల పరిణామ మొకచో గోధుమ లయిన మరియొక యెడ వస్త్రములు, నింకొకచోట పాలు నగును. సామాన్య రూపమున నన్నియు జ్ఞానకర్మ మయములే. గోధుమలకు బదులు వస్త్రములు వినిమయము చేసినపుడు గోధుమలు, వస్త్రములు

5-200

రెండును మూల్యరూపమున నొక్కటే యగుట నిశ్చితము. ప్రతి పణ్యవస్తువు మూల్యముకంటె భిన్నము కాదు. అందు వలన వస్తువులు పరస్పర మభిన్నములే యగుచున్నవి. మూల్యరూపమున నభిన్నము లగుటచేత గోధుమలు వస్త్ర రూపమును, వస్త్రములు గోధుమల రూపమును ధరించును. మూల్యరూపమున నొకవస్తువు మరియొక వస్తురూపమును ధరింపకుండునది యొండును లేదు.

మున్ముందు కద్దరుకు బదులు చొక్కాయి లభించిన రెంటియొక్కయు భేదము మూల్యరూపమున ప్రకట మగును. కద్దరుకు బదులు గోధుమలు, ఇనుము, పాలు, పెరుగు మున్నగు ననేక వస్తువులతో వినిమయము జరిగిన నపు డది యీ యన్నిటికి నభిన్నమని తెలియును. కద్దరు స్థానము నే వస్తువైనను గ్రహింపవచ్చును. ఏ వస్తువు కద్దరు స్థానమును గ్రహించునో యదియే యితర వస్తువుల కభిన్న మగును. ఇట్లు ప్రతి వస్తువును నితర వస్తువుల కభిన్నము కాగలదని యర్థ మగుచున్నది. మూల్యము పణ్యమున కాత్మ; పణ్యము మూల్యమునకు శరీరము నగును. శరీరము లన్నిటియందును నఖండ మూల్యబ్రహ్మ మిమిడి యున్నది. మూల్య మిమిడి యుండుట యన నమూర్త మూల్యము మూర్త రూపము వహించిన దనవచ్చును. శుద్ధ నిరపేక్షమూల్య మమూర్తము. పరస్పరాపేక్ష గల మూల్యము మూర్త మని భావము.

ఇంతకంటె విలక్షణవిధమగు నద్వైత వాద మొకటి యాత్మవాదమున గలదు. అందు కేవల శుద్ధబ్రహ్మసత్తా (యునికి) తక్క మరియొక పదార్థ మంగీకరింపబడదు. జీవ

ప్రకృతులు రెండును మిథ్యారూపములే. ప్రపంచమును మిథ్యగా నంగీకరించు నీ యద్వైతవాదపక్షమున శుద్ధమగు జ్ఞానకర్మలే సత్యములు. వీనికి భిన్నమైన యాదానప్రదానము లన్నియు మిథ్యలే. రెండు గజముల కద్దరు స్థానమును గోధుమాది-ఇతర పదార్థము లేవి గ్రహించినను నీ వినిమయమునకు మూలకారణము జ్ఞానకర్మరూప బ్రహ్మ మని స్పష్టమగుచున్నది. గోధుమలు, వస్త్రములు, పాలు మున్నగు వస్తువులు చూచుట కెంత భిన్నములైనను వాని భేదము పరమార్థము కాదు. వాస్తవమున నవి భిన్నములేయైన నొక వస్తువునకు మరియొక వస్తువు వినిమయమున లభింప ననువు కాదు. వినిమయమునందు మొదటి వస్తువురూపమును రెండవది, రెండవదాని రూపమును మూడవది గ్రహించును. పణ్యములలో నొకటి మరియొకదాని రూపమును గ్రహింపనిది లేనేలేదు. ఈ రూపాంతర ధారణమే వస్తువుల యభిన్నతకు ప్రమాణము. చూచుటకు, వినుటకు పణ్యములు భిన్నములైనను వాని మూల మొక్కటియే. అది సత్యముకూడ. ఆదానప్రదానమున కంతటికి నాధారము జ్ఞానకర్మమయమగు బ్రహ్మమే. వస్తువినిమయమున దాని బాహ్యరూపము చూడబడదు. వస్తువులలో నిమిడియున్న జ్ఞానకర్మల యేకత చూడనగును. జ్ఞానకర్మల యేకతయున్న దావుననే వినిమయము జరుగును. జ్ఞానకర్మమయబ్రహ్మము మూల్యరూపమున సమస్త పణ్యములలోను నాత్మయై ప్రకాశించుచున్నది. బాహ్యభేదములను తొలగించి చూచిన సర్వవస్తువులందును జ్ఞానకర్మల రూపమున బ్రహ్మతత్త్వము వ్యాప్తమై యుండుట చూడనగును.

ఆత్మవాదమున నేపక్షము ననుసరించినను, పణ్యములయు, మూల్యముయొక్కయు స్వరూపము యుక్తిసంగత మగుచున్నది. వానిలో త్రైతవాదమునకు ననాత్మక సామ్యవాదమునకు నెక్కుడు సామ్యము కనిపించుచున్నది. త్రైత వాదమున జీవేశ్వర ప్రకృతులు మూడును మూల్యమునకు కారణము లగుచున్నవి. ఏవస్తువులకు నీశ్వరుడు కర్తయో వాని కుపాదానము ప్రకృతి; నిమిత్తకారణము జీవుడు. కద్దరు, చొక్కా, గోధుమలు మున్నగువాని కుపాదానము ప్రకృతి. కద్దరుకు తంతువులు, చొక్కాకు వస్త్రము, గోధుమలకు బీజములు నుపాదాన కారణములు. కద్దరుకు సాలెవాడు, చొక్కాకు దర్జీ, గోధుమలకు కృషికుడు, నిమిత్త కారణములు. వీని నిర్మాణములో సాలె, దర్జీ మున్నగువారి జ్ఞానకర్మలును నిమిత్తకారణము లగును. కాని, యీ రెండు నిమిత్తకారణములలో జ్ఞానకర్మలు కరణము లగును ; సాలె మున్నగువారు కర్త లగుదురు. కర్తయొక్క జ్ఞానకర్మలు పణ్యరూపమున మూర్తము లగును. దర్జీ మున్నగువారు పరస్పరము భిన్నులు. వారి జ్ఞానకర్మలును భిన్నములే. కాని, సామాన్యరూపమున సమస్త జ్ఞానకర్మలు నొక్కటే. విశేష జ్ఞానములలో జ్ఞానసామాన్య మొక్కటియే యగును. అట్లె కర్మవిశేషములందు కర్మసామాన్య మొక్కటే యగును. జీవులు నిర్మించు పణ్య, భోగ్యవస్తువులలో జ్ఞానసామాన్యము, కర్మసామాన్యము, రెండును వ్యాప్తములై యున్నవి. గోవు లన్నిటిలోను గోత్వ మున్నట్లు సామాన్యము సమస్త విశేషము లందును వ్యాప్తమై యుండును.

సూర్య చంద్ర నక్షత్రాదులకు కర్త జీవుడుకాడు. వాని కర్త యీశ్వరుడై యున్నాడు. వానికి నిమిత్త కారణము కూడ పరమేశ్వరుని జ్ఞాన కర్మములే. జీవేశ్వరుల జ్ఞాన కర్మలలో భేద మున్నది. నానా జీవుల నానా జ్ఞాన కర్మలు వస్తువులకు కారణము లగును. వారి జ్ఞాన కర్మల యేకత సామాన్య రూపమున భాసించును. కాని, సూర్య చంద్రాదులకు కర్త యైన యీశ్వరుని జ్ఞాన కర్మలు భిన్నములు కావు. ఈశ్వరుడు వ్యాపకుడు. అతనికి సూర్య చంద్రాదుల కుపాదాన కారణ ములైన పరమాణువులతో సంబంధ ముండును. అతని జ్ఞానము, కర్మలు నొక్కటే. అతడే సమస్త ప్రపంచమునకు రచయిత. అతని జ్ఞాన కర్మలు సూర్య చంద్రుల రూపమున మూర్తిమంతము లగుచున్నవి. అవి విశేష రూపమునను నొక్కటియే. వానికి సామాన్య రూపమే లేదు. విశేష రూపము లనేకము లున్నపుడే సామాన్యరూప మొక్కటి యుండును.

ఇట ధ్యానమున నుంచుకొనదగిన విషయ మొకటి యున్నది. సూర్య చంద్రాదుల యుత్పత్తిలో పరమేశ్వరుని జ్ఞాన కర్మలు నిమిత్త కారణము. పరమేశ్వరుని జ్ఞాన కర్మలే కాక జీవుల జ్ఞాన కర్మలుకూడ నిమిత్త కారణము. సమస్త జీవులకు వారి శుభాశుభ కర్మలకు తగినట్లు సుఖ దుఃఖ రూప ఫలముల నందజేయుటకై పరమేశ్వరుడు ప్రపంచమును రచియించుచున్నాడు. పరమేశ్వరుని జ్ఞాన కర్మలు కర్తకు సంబంధించినవి. ప్రపంచ రచన జీవుల నుద్దేశించి జరుగును కావున జీవు లుద్దేశము. జీవుల జ్ఞాన కర్మలు ఉద్దేశమునకు

సంబంధించినవి యగును. ఒక మనుజుడు చొక్కా కుట్టుటకు దర్జీవానిని కోరును. ఆ చొక్కాకు కర్తృరూపమైన నిమిత్తము దర్జీ యగును. కాని ప్రయోజన రూప నిమిత్తము చొక్కాను కుట్టుట కాజ్ఞ యిచ్చిన మనుజు డగును. పరమేశ్వరుడు కూడ సుఖ దుఃఖములను కలిగించుటకు ప్రపంచము రచియించు చున్నాడు. సుఖ దుఃఖములు కర్మ ఫలములు. కావున జీవులు, వారి జ్ఞాన కర్మలు, ఫలములు నన్నియు ప్రయోజన రూప నిమిత్తము లగును. పరమేశ్వరునివే కాక, సమస్త జీవుల జ్ఞాన కర్మల మూర్తరూపమే యీ ప్రపంచము. జన్యపదార్థములకు రెండు విధములగు చేతనములు కర్త లగుట యావశ్యక మగు చున్నది. సామాన్యరూపము (చేతనత్వము) ద్వారా నా రెంటి జ్ఞానము నొకే రూపమున నగును. జీవు డొక చేతనము. పరమేశ్వరుడు నొక చేతనము. సామాన్య రూపమున రెండును నాత్మలే. జీవేశ్వరుల జ్ఞానకర్మలును సామాన్య రూపమున నొక్కటే. ఈ దృష్టితో చొక్కా, కద్దరు, సూర్యుడు, చంద్రుడు మున్నగు వానికి రెండే కారణములు. ప్రకృతి యుపాదాన కారణము. జ్ఞాన కర్మలు సామాన్య భావమున నిమిత్త కారణము.

అనీశ్వ రాత్మవాదమున, గోధుమాదులకె కాక, సూర్యచంద్రాదులకును కర్తృరూప నిమిత్త కారణము జీవులే యగుచున్నారు. కద్దరు మున్నగువానిని నానా జీవుల జ్ఞానకర్మలు ప్రాతిస్వికరూపమున నిర్మించుచున్నవి. సూర్య చంద్రాదుల యుత్పత్తికి సమస్తజీవుల జ్ఞానకర్మలు సామూహిక రూపమున కారణము లగుచున్నవి. సాంఖ్యకారికల

వ్యాఖ్యాతమైన వాచస్పతి మిశ్రుల దృష్టిలోను, సాంఖ్య దర్శన వ్యాఖ్యాతమైన విజ్ఞానభిక్షువు దృష్టిలోను సాంఖ్యుల యాత్మవాద మనీశ్వరవాదమై యున్నది. ఇట్లే పూర్వ మీమాంసకులలో కుమారిలుడు, ప్రభాకరుడు, మండన మిశ్రులు ననీశ్వర - ఆత్మవాదులై యున్నారు.

ఈ పక్షమున నొక యాపత్తి చూపబడును. వస్తువును నిర్మించు కర్తకు దాని జ్ఞాన ముండును. జ్ఞానములేక వస్తు రచన జరుగనేరదు. నేతగానికి వస్త్రరచనాజ్ఞాన ముండును. అతనికి కత్తి నిర్మించు జ్ఞాన ముండదు; కావున దానిని రచింప లేడు. సూర్యచంద్రాదుల నిర్మించు జ్ఞానము జీవులకు లేదు. కావున జీవులు వానికి కర్తలు కాలేరు. జీవులు ప్రయోజన రూప నిమిత్తము కావచ్చును. కాని ప్రయోజనరూప కర్తలు కాజాలరు. ఇంతేకాక, ప్రయోజన ముండుట, కర్త భిన్నుడై యుండవలె ననుటకు ప్రమాణ మగుచున్నది. దేవదత్తుడు ధరించుటకు చొక్కా కావలెను. అంతమాత్రముచేత కుట్టుపని తెలియని దేవదత్తుడు చొక్కా నిర్మింపలేడు. కుట్టువాడు - దర్జీ-వేరుగా నుండవలెను. జీవులకు సూర్యచంద్ర నక్షత్రాదు లుండుట యవసరము. జీవు లనభిజ్ఞులు. కావున వారికంటె భిన్నముగా సర్వజ్ఞుడైన యీశ్వరు డుండక తప్పదు. అతడే వానికి కర్త.

జన్యవస్తు వెట్టిదైనను, కర్తయొక్క జ్ఞానకర్మలులేక యది భోగ్యముకాదు; పణ్యమును కానేరదు.

## ఏడవ యధ్యాయము

# దుర్లభ ధాతువులు మూల్యము లగుటకు కారణము

మూల్యమునకు మూల్యముగల వస్తువుతో సంబంధ ముండును. కాని, గుణమునకు గుణితోను, కర్మకు కార్య వస్తువుతోను సంబంధ మున్నట్లు మూల్యమునకు మూల్యము గల వస్తువుతో సంబంధ ముండదు. గుణములు సహజములు, నైమిత్తికములు నని రెండు విధములు. రూపరసాదులు సహజములు. సంయోగ విభాగాదులు నైమిత్తికములు. వస్త్రమునకు దాని రూపముతో స్వాభావిక సంబంధ ముండును. శ్వేతరూపముగల వస్త్రము శ్వేత మగును. ఉంగరమునకు నంగులికి గల సంబంధము నైమిత్తికము. అంగుళీయకముతో నే యంగులికి సంయోగ ముండునో యా యంగులి యంగుళీయకము కల దగును. మూల్యస్వభావము విలక్షణముగా నుండును. రెండు గజముల కద్దరుకు మూల్యము ఒక చౌక్కాయి యైన, కద్దరు మూల్యముకలది యగును. చౌక్కాయి మూల్య మగును. శ్వేతరూపముతో శ్వేత వస్తువున కున్నట్లు కానీ, అంగుళీయమున కంగులితో నున్నట్లు కానీ మూల్యముతో మూల్యముగల వస్తువునకు సంబంధ ముండదు. కద్దరుకు మూల్యమైన చౌక్కాయి కద్దరులో రూపమువలె గానీ, అంగుళీయకమువలె గానీ సంబద్ధమై యుండదు. కద్దరు, చౌక్కా రెండును భిన్నస్థానములం

దుండును. అయినను మనుజుడు బుద్ధిద్వారా కద్దరుతో చౌక్కాకు సంబంధము కల్పించుకొనును.

ఒక వస్తువును నిర్మించుటలో నెంత శ్రమ యయ్యెనో మరియొక వస్తువు నిర్మాణములోను నంతే శ్రమయైన నా రెండువస్తువులు పరస్పర మొకదానికి మరియొకటి మూల్య మగును. మొదటి వస్తువులోని శ్రమ పణ్యము. రెండవ దాని శ్రమ మూల్యము. కాని, శ్రమ క్షణికము కావున దాని యాదానప్రదానములు జరుగ వీలులేదు. కావున వస్తువే వ్యవహారమున పణ్యము, మూల్యము నగును. పణ్యవస్తువు నందు శ్రమ యుండును. కాని యా శ్రమ దానికి మూల్యము కాదు. కద్దరు తనకు తానే మూల్యము కాదు. రెండు గజ ముల కద్దరు గుడ్డ, యా గుడ్డతోనే కొనబడదు.

వ్యవహారమున మూల్యస్వరూప మిది. దీనికి గల కారణ ములనుగూర్చి యాలోచించిన నీ స్థితి యుండదు. మొదటి శ్రమకు మూల్యము రెండవశ్రమ యైనపుడు, అది యట్లగు టకు కారణము మొదటిశ్రమకు రెండవ శ్రమతో గల సామ్యమే. మొదటిశ్రమ లేకున్న దానికి రెండవదానితో సామ్యము కలుగదు. రెండు గజముల కద్దరులో శ్రమ లేకున్న నొక చౌక్కాయి దాని మూల్యము కాదు. కద్దరులో నున్న శ్రమ కారణముగ చౌక్కాయి దానికి మూల్య మగుచున్నది. ఇట్లు కద్దరు నిర్మించుటకైన శ్రమ మూల్యరూపమగు చౌక్కాయికి మూలము. ఈ దృష్టితో శ్రమచే నేర్పడిన వస్తువునకు మూల మున్నది; మూల్యము నున్నది. వ్యవహా రము నడచుటకు రెండవ వస్తు సహకార మవశ్యము తీసికొన

వలసి యుండును. కర్దరుశ్రమ కర్దరుకు మూల్య మైనపుడు మూల్యమునకు, మూల్యముగల వస్తువునకు నున్న సంబంధము గుణములకు ద్రవ్యములతో నున్న సంబంధమునకు తుల్యమే యగుచున్నది.

వ్యవహారమున మూల్యస్వరూపము రెండు విధములుగ నుండును. ఒక వస్తువునకు మరియొక వస్తువుతో వినిమయము జరుగునపుడు మూల్యము వస్తుమయముగ నుండును. సువర్ణాద్యంశములతో వస్తువుల వినిమయము జరిగినపుడు మూల్యము ధాతుమయ మగును.

అనాత్మవాదులగు నర్థశాస్త్రుల దృష్టిలో నారంభమున మానవుల జ్ఞాన మతిమందముగా నుండెను. వారు పశుతుల్యులుగా నుండిరి. ఆ దశలో వారు వస్తువులను వస్తువులకే వినిమయము చేయుచుండిరి. క్రమముగా మానవులలో జ్ఞానమున్నతము కాజొచ్చెను. అంతట వారు ధాతువులతో వస్తు వినిమయము చేయదొడగిరి.

కాని, యాత్మవాద పక్షమున నారంభమున మానవులెల్లరు పశుతుల్యులుగా నుండిరనుట సంగతము కాదు. జన్మాంతరకర్మల ననుసరించి కొందఱి బుద్ధి మందముగా నున్నను మరికొందరి బుద్ధి తీవ్రముగా నుండి యుండవచ్చును. నిశిత బుద్ధిగల మానవులు ప్రతి యుగమునందును నేటివలె రెండు విధములగు మూల్యమును వ్యవహరించుచుండిరనుట యుక్త మగుచున్నది. అసంస్కృతులై వన్యదశలో నున్న మానవులవలె యుగములు గడచిన తదుపరి వారు ధాతుమయ మూల్యమును వ్యవహారమునకు తెచ్చిరనుట పొసగదు.

వస్తుమయ మూల్యముతో వ్యవహారము వీలుకానపుడు ధాతుమయ మూల్యమును ప్రయోగమునకు తెచ్చియుందురు. జ్ఞానవంతులకు కాలాంతరమువరకు వేచి యుండవలసిన యవసర మొందు కనిపింపదు. వారు సువర్ణాది ధాతువుల నారంభము నుండియు నెరుగుదురు.

ఉన్నత మనుష్య సమాజమునందును నాలోచనా క్రమము ననుసరించి ప్రథమమున వస్తువినిమయము వస్తువుల ద్వారాను, తరువాత ధాతుమయ నాణెముల ద్వారాను జరిగి యుండును. వస్తువుద్వారా వస్తు వినిమయము ప్రథమమున స్వాభావికమై యుండును. వ్యాపకరూపమున సమస్త వస్తువుల వినిమయము జరుగజాలదు; కావున ధాతువుల మూల్యము నిర్మింపవలసి వచ్చును. ధాతుమూల్యము నైమిత్తికము. నిమిత్త మెల్లపుడు స్వాభావిక దశకు తరువాత నేర్పడును. కావున నైమిత్తికము తరువాతనే కలుగుట యనివార్యము.

నేతగాని దగ్గర వస్త్ర మున్న దనుకొనుడు. అతడు దాని నమ్మగోరును. కృషీవలు డంతకు పూర్వమే వస్త్రములను కొనియున్న నత డా వస్త్రమును కొనడు. కమ్మరికి వస్త్ర మవసరమయిన నత డా వస్త్రమును కొనజూచును. కాని యతని దగ్గర కత్తి కొడవలి మాత్రమే వస్త్రమునకు బదులిచ్చుట కున్నవి. నేతగానికి వాని యవసర ముండదు. అట్టి దశలో నుపయోగకరములగు వస్తువులు సమీపమున నున్నను పరస్పర మిచ్చి పుచ్చుకొను వ్యవహారము జరగదు.

అప్పుడప్పుడు భిన్న భిన్న వస్తువుల యావశ్యకత గలుగుచుండును. అట్టి వస్తువులను కొనుటకుగాను నెవడును తన దగ్గర నెక్కుడు పరిమాణములో ప్రోవుచేసి యుంచడు. ఇన్ని వస్తువుల నుంచుట కందరకు తగినంత స్థానము నుండదు. సువర్ణ రజతాదులు మూల్యమైనపు డీ కష్టము కలుగదు. నేతగా డెప్పుడు కావలెనని నప్పుడే తన వస్త్రమును కమ్మరి కమ్మగలుగును. కమ్మరి యపుడు రజతమయ మూల్యము నతని కిచ్చును. ఇట్టి మూల్యము నుంచుకొనుటకు నేతగాని కేయభ్యంతరము నుండదు. కృషీవలుడు నీమూల్యముతో నవసరమగు వస్తువు నెప్పుడు కావలయునో యప్పుడు కొన గలిగి యుండును.

వివేకముగల మానవ సమాజమున వ్యవహార మిట్లే నడుచుచుండును. కాని, నికృష్టజ్ఞానముగల మానవ సంఘమున మూల్యదశ యిట్లుండదు. వారిలో నిచ్చి పుచ్చు కొనుటయే తక్కువగా నుండును. ఆ సంఘమున పరస్పర మాదానప్రదానములు జరుగ ప్రారంభమైన తదుపరి వ్యవ హారము వ్యాప్తము కాజొచ్చును. వారికి క్రమముగా వస్తువుద్వారా వస్తువు కొనుట కష్టకరమైనపుడు వా రత్యంత ముపయోగకరమగు వస్తువు నొకదానిని నాదానప్రదాన ములకు సాధనముగా నుపయోగింప సాగుదురు. ఇట్లు సాధన మగు వస్తువే మూల్య మగును. ఏదో యొక వస్తువే మూల్య మగునను నియమము లేదు. వీలునుబట్టి యొకప్పు డొక వస్తువు, మరియొకప్పుడు మరియొక వస్తువును మూల్యము గా గలుగును. వన్యదశలో మానవులు, గొఱ్ఱె, మేక, ఆవు

మున్నగు జంతువులను కూడ నిచ్చిపుచ్చుకొనుటకు సాధ నముగా నుపయోగింతురు. అప్పు డవియే మూల్యము లగును. పలు సమయములలో తినుటకు, కట్టుకొనుటకు నుపయోగించు వస్తువులు మూల్యముగా వ్యవహరింప బడుటయు గలదు. మూల్యప్రతిష్ఠ జరిగిన తదుపరి జనులు వస్తువుల నమ్ముటకై నిర్మింతురు. ఈ స్థితిలో వన్య మానవులకు నాగరికులకు నేమియు భేద ముండదు. ఇరు తెగలవారును అమ్ముటయే ప్రయోజనముగా గల వస్తువులను నిర్మింతురు. అట్టి వస్తువులు నిర్మాతల యుపయోగమునకు రావు. వన్యమానవులు సువర్ణాదులపై మూల్యరూపమున నధికారము కలిగి యుండరు. నాగరికులు వానిపై నధికారము గలిగి వ్యవహ రింతురు. ఇదియే యా యిరు తెగలకు నుండు భేదము.

మార్క్సు ననుసరించి ధన మొక వస్తువు. అది యమూర్త మైనను నవసరమునుబట్టి ఘనము చేయబడినది. ఆ కారణముననే వస్తువు పణ్య మగుచున్నది. పణ్యముల యుపయో గము, మూల్యము నను నీ రెంటియందు గల యవ్యక్త విరోధ మును క్రమముగా జరుగు వినిమయ విస్తారము స్పష్టము చేయును. ఈ విరోధమును స్పష్టము చేయుటకు గల యావశ్య కతయే మూల్యమునకు గల స్వతంత్ర రూపమును స్థాపించును. పణ్యమునకు మూల్యమునకు గల భేదమును స్థిరపరుప నంత వరకు నది ప్రయత్నము చేయుచునే యుండును. (క్యాపిటల్ పు. 29).

పణ్య నిర్మాణము వినిమయముకొఱకు జరుగునపుడు వినిమయోపయోగిత కంటె పణ్యోపయోగమునందలి యుప

యోగిత వేరని స్పష్ట మగును. కాని మూల్యమునకు గల స్వతంత్ర రూపమును గూర్చి బాగుగ నాలోచించినమీదట నుపయోగితకు మూల్యమునకు మధ్య విరోధము లేదని తెలియును. సువర్ణాదులు కానీ, మరియొక యుపయోగి వస్తువు కానీ స్వతంత్ర రూపమున మూల్య మైనపుడు పణ్యామూల్యములలో భేదము కలిగినను నుపయోగితకు మూల్యమునకు పరస్పర విరోధ ముండదు. మూల్యము నుపయోగిత నుండి పూర్తిగ వేరుచేయ వలనుపడదు. శ్రమయు, నుపయోగితయు నున్నమీదట మూల్య మేర్పడును. ఈ రెంటిలో నేది లేకున్నను మూల్య ముండదు. ఒక విశేష పణ్యమునో, లేక సువర్ణాదులనో మూల్యముగా చేసినపుడు వానిని కేవల సామాన్య శ్రమరూపముననే కాక సామాన్యోప యోగితా· రూపమునను నంగీకరింతుము. మూల్యరూపమును బొందిన నొక పణ్యవిశేష మితరములయిన యనేక పణ్యముల వినిమయ మొనర్చును. వినిమయము చేయబడిన వస్తువులలో నుపయోగిత యుండును; శ్రమయు నుండును. ఆ వస్తువుల మూల్యముగా నగుటకు సువర్ణాదులందును, లేక వస్తువిశేషము నందును శ్రమ, యుపయోగిత రెండు నుండవలెను. వానిలో కేవలము సామాన్య శ్రమ యున్న నవి మూల్యము కాజాలవు. వాస్తవమున స్వతంత్రరూపమున మూల్య మగుదానిలో గల మూల్యపణ్యముల భేదస్వరూపము విలక్షణముగా నుండును. ఒక పణ్యమునకు మరియొక పణ్యము మూల్యమైనపుడు మూల్యముగల పణ్య ముపభోగయోగ్య మగును; దానిలో శ్రమయు నుండును. అట్లే యే పణ్యము మూల్యమో యదియు నుపభోగయోగ్యమై శ్రమయుక్తమై యుండును.

రెండు గజముల కద్దరు ఉపయోగకరమై, శ్రమతో కూడియుండును. దానికి మూల్యమగు నొక చొక్కాయి యందును నుపయోగిత, శ్రమ రెండు నుండును. ఈ దశలో పణ్యము, మూల్యము రెండును సమానములే. పణ్యోపాదాన కారణము పణ్యముతో నుండును. మూల్యోపాదాన కారణము మూల్యముతో నుండును. కద్దరుకు తంతువు లుపాదాన కారణము. తంతువులులేక కద్దరు సిద్ధముకాదు. చొక్కాయి మూల్యము. దాని కుపాదాన కారణము కద్దరు. ఉపయోగిత వస్తుగుణములం దుండును. గుణము లుపాదానకారణము లేకున్న నుండజాలవు. మూల్యమైన వస్తువుకూడ నుపయోగకరమై యుండవలెను. మూల్యముగా నుపయోగించు వస్తు వొకనిదగ్గర నున్నపు డది వాని యుపభోగమునకు యోగ్యము కాకున్నను, దానిని తీసికొనువాని కది యుపభోగమున కుపయోగించును. పణ్యస్వామికి పణ్యము లుపభోగయోగ్యములు కావు. అతడు వానిని కేవల మమ్మజూచును. వానిని కొనువా రుపభోగింతురు. ఎవ రుపభోగించినను వస్తు వుపభోగ యోగ్యము కానంతవర కది పణ్యముకానీ, మూల్యము కానీ కాజాలదు.

రెండు వస్తువులలోనే పరస్పరము వినిమయము జరుగునంతవరకు వానిలో విశిష్టమగు నుపయోగిత యుండవలసి యుండును. కద్దరు ఉపయోగము వేరు. చొక్కాయి యుపయోగము వేరు. ఒక వస్తు వనేక పణ్యములకు మూల్యమైనపుడును, దాని యుపాదాన కారణ మా వస్తువుతోనే యుండును. కాని యా వస్తు వపుడు విశేషోపయోగమునకు

కారణము కాదు. రెండు గజముల కద్దరు అనేక పణ్యములకు మూల్య మైనపుడును నది యుపాదానకారణ రహితము కాదు. అప్పుడును తంతువులు దాని కుపాదానకారణమే. అప్పుడును నాకద్దరుతో చొక్కాయి నిర్మింప నగును. కాని యప్పు డది కొండొక విశేషోపయోగిత కారణముగ మూల్యము కాదు. రెండు గజముల కద్దరు నిచ్చి, ఫలము, పుష్పములు, కట్టెలు, గోధుమలు నేవైన వినిమయమున తీసికొనవచ్చును. ఇట పుష్పఫలాదు లనేకములు. మూల్య ముగా నున్న రెండు గజముల కద్దరు ఒక్కటే. అయినను అయ్యది సామాన్యశ్రమ, సామాన్యోపయోగిత మూలమున మూల్య మైనది. అనేక పణ్యముల కది మూల్య మగుటవలన దానియం దుపయోగితయొక్క సామాన్య స్వరూపము ప్రకట మగును.

ఏదో యొక వస్తువు ఉపయోగితయొక్క సామాన్య స్వరూపమున కుపాదానకారణము కాజాలదు. సామాన్య మొకే వస్తువునం దుండదు. అనేకమునం దుండును. పుష్ప ఫలాదు లన్నింటియందును సామాన్యరూపమున నుపయోగిత యుండును. వ్యాపకముగా నుండు నుపయోగితను రూపొంద చేయుట కొక వస్తువు అనేక వస్తువులకు మూల్యము చేయ బడును. అప్పు డది యొకటే సామాన్యరూపమున నుపయో గిత కాశ్రయ మగును. వాస్తవమున నొక వస్తువు సామాన్య రూపమున నుపయోగితకు కానీ, శ్రమకుగానీ యాశ్రయము కానేరదు. కల్పనవలన సామాన్యమున కాశ్రయముగా నంగీకరింపబడుచున్నది.

మొదట మూల్యము వస్తువుకంటె భిన్నముగా కనిపింపదు. కాని, కద్దరు అనేక వస్తువులకు మూల్యమైనపు డది వస్తు వయ్యు వస్తువు కాదు. అది కేవలము సామాన్య శ్రమ యొక్కయు, నుపయోగిత యొక్కయు మూర్తరూపమగును. ఉపయోగిత, సామాన్యశ్రమ రెండును నుపాదాన కారణము లేకయే నిరాధారముగ, స్వతంత్ర రూపమున స్థిరములైనట్లు చెప్పినను చెప్పవచ్చును. సువర్ణాదులు మూల్యమైనప్పుడు వాని స్థితియు నిట్టిదే యగును. సువర్ణాదులు మూల్యము లయినను వానిలో భూషణములగు యోగ్యత యుండును. అవి భూషణముల కుపాదానములు. కాని యుపాదానకారణము లయినపు డవి మూల్యము కావు. కద్దరుకంటెను, మరియొక యత్యంతోపయోగి వస్తువుకంటెను సువర్ణాది ధాతువులలో మూల్యమునకు గల స్వతంత్ర వ్యాపక స్వరూపము మిక్కిలి స్పష్టముగా తెలియును. ఇతరవస్తు వేదైనను పది, ఇరువది, నూరు వస్తువులకు మూల్యము కావచ్చును. కాని సువర్ణాదులు లక్షలాది వస్తువులకు మూల్యము కాగలవు. సువర్ణాది ధాతువులలో మూల్య వ్యాపక రూపమెంత స్పష్టముగ తెలియునో యితర వస్తువులలో నంతగా తెలియదు.

ద్రవ్యములు కానీ, గుణకర్మములు కానీ యుపాదాన కారణము లేకున్న వాని ప్రతీతి కలుగదు. సామాన్య ధర్మము (జాతి) కూడ నాశ్రయవ్యక్తిలేక ప్రత్యక్షము కాదు. కేవల వ్యాపకవస్తువు ఆధారములేక యుండగలదు. దాని కుపాదానకారణముకానీ, నిమిత్తకారణముకానీ యుండదు.

నిత్యమును, జగత్తులోని ప్రతి పదార్థముతో సంబంధము కలిగియుండునదియు నగు వ్యాపకవస్తు విట్టి దేదియు కాన రాదు. ఉపయోగము, శ్రమయు ననువాని ప్రపంచవ్యాపి సామాన్యరూపమే మూల్యముయొక్క స్వతంత్ర రూప మగు చున్నది. ఆధారరూపమున ప్రత్యక్ష మొనర్చుట కిది సువర్ణా దుల రూపమున చేయబడినది. వస్తుమయ మూల్య ముపా దాన సహిత మగును. వస్తురహిత మూల్య ముపాదాన రహిత మగును. వస్తువునకు మూల్యమునకు గల భేద మింతే. అదియు మూల్యము స్వతంత్ర రూపమున ప్రతిష్ఠిత మైనపుడు ప్రత్యక్ష మగును.

మార్క్స్ ఉపాదానకారణము వలన నుపయోగిత యుత్పన్న మగునని యెంచుచున్నాడు. అందువలన నుపయో గితకు, మూల్యమునకుపరస్పర విరోధమున్న ట్లతనికి తోచినది. అతడు సువర్ణాదులను వినిమయ సాధనములుగానే చూచి నాడు కాని, అవి యితర వస్తువులవలె నుపయోగసాధనము లనియు నెంచడయ్యె. భూషణములను నిర్మించుటకును, నన్య కార్యములందును నవి యుపయోగించును. ఇట్టి యుపయో గము వలన నవి విశ్వవ్యాపక మూల్యము కాజాలవు. అందు వలన నుపయోగిత యనావశ్యక మని యెంచెను. కాని, సామాన్య రూపమున నుపయోగిత యనివార్యము కాకపోదు. ఉపయోగిత యెట్టిదైనను సామాన్య రూపమున కానీ, విశేష రూపమున కానీ, దానికి నుపాదానము, నిమిత్తము రెండు నుండును.

చొక్కాయి ధరించుట కుపయోగించును. ఈ యుప యోగమునకు కద్దరు ఉపాదాన కారణము, కుట్టుపనివాని పరి శ్రమ నిమిత్త కారణము నగును. కద్దరు లేకున్న చొక్కాయి ధరింప నుపయోగింపదు; కాని, కద్ద రున్నంత మాత్రమున నది చొక్కాయిగా నుపయోగింపదు. అందుల కనువుగ దానిని కుట్టవలసి వచ్చును. అందువలన నుపయోగితకు రెండును కారణములే. ఇట్లు రెండును కారణము లైనందున పణ్యము నందు కేవలోపయోగిత కానీ, మూల్యమునందు కేవల శ్రమ కానీ యుండ నేరదు.

మార్క్సు ఉపయోగిత నుపాదాన కారణమునందును అనగా పణ్యమునందును, శ్రమను మూల్యమైన వస్తువునందును నంగీకరించుటకును కారణము లేకపోలేదు. మూల్యము, మూల్యముగల వస్తువు రెండును వ్యవహారమునందు భిన్న స్థానములం దుండుటయే యీ మతమునకు కారణము. ధర్మి పదార్థము తనలోనుండు ధర్మములతో నుపయోగమునకు వచ్చును. అట్టియెడ ధర్మి, ధర్మములు రెండును నుపయోగ మునకు కారణము లగును. ఫలము తినుట కుపయోగించును. రసము దాని ధర్మము. ఫలము, రసము రెండును భోజనము నకు కారణములు. ఇం దెవరికిని సందేహము కలుగదు. ఫలమును భుజించి యందలి రసమును భుజింపకుండుట యసంభ వము. కాని మూల్యము, మూల్యముగల వస్తువు, వీని రెంటికి గల ధర్మ ధర్మి భావ మట్టిది కాదు. మూల్యవంతమగు వస్తు వుపయోగించినపుడు మూల్య ముపయోగింపదు. పణ్యస్వామి మూల్యోపయోగితను చూడడు. మూల్యము నిచ్చువాడు

దాని యుపయోగితను గుర్తించును. మూల్యము నిచ్చువాడే వస్తువును మూల్యరూపమున నిచ్చునో యది యతనికి వినిమయ సాధనము మాత్ర మగుచున్నది. అతడు దానికిగల యన్యోపయోగితను గుర్తింపడు.

ఈ విధముగ వ్యవహారమున నేది యుపయోగి యగునో యది మూల్యము కాదు; మూల్యమగు వస్తు వుపయోగి కాదు. లఘు రూపమున నుపయోగిత, మూల్యము వేరుగా నుండుట రెండువస్తువుల వినిమయమునందును కనిపించును. సువర్ణాదులు మూల్య మైనపు డుపయోగితకు, మూల్యమునకు గల భేదము బాగుగ తెలియును. ఒక డొక వస్తువును కొనదలచినపుడు సువర్ణాది ధాతువుల ముద్రల నిచ్చి కొనును.

జనులు పణ్యములను తీసికొని వాని నుపయోగింతురు. కాని మూల్యమును వినిమయముకొఱకు మాత్ర ముంచుదురు. మూల్యమునందు పణ్యములందువలె నుపయోగిత వారికి కనిపింపదు. ఇట్లు మూల్యమునకు, నుపయోగితకు సాహచర్య ముండదు. వినిమయమునకు కారణము శ్రమ. కావున మూల్యరూపమున శ్రమ యుపయోగితనుండి వేరైనది. కాని యీ దృష్టి సాధారణ జనులది. ఆలోచన కేవల మింతే చూడదు. మూల్యము కేవలము వినిమయము కొఱకే. అందులో సందేహము లేదు. సువర్ణము, రజతము నెంత యున్నను నితర పణ్యములవలె భోగ్యములు కావు. అది ధనము. కొనుట కుపయోగించును. ధనము శ్రమరూపము. నిరర్థక శ్రమ మూల్యము కాదు. దానిలో నుపయోగితా

సామాన్య రూప ముండవలెను. సామాన్యరూపమున నుప యోగిత, శ్రమయు మూల్య మగును. కావున మూల్యమునకు నుపయోగితకు విరోధము లేదు.

సువర్ణాదులను పణ్యములయొక్క విశ్వవ్యాపి మూల్య మొనర్చు కారణములను గూర్చి విచారింపవలసి యున్నది. మార్క్సు సువర్ణాదులలో కొన్ని స్వాభావిక గుణములను వర్ణించును. అవి ధనమగుట కా గుణములే కారణములు. సమాన గుణములను ప్రకటించు భాగములు గల వస్తువు శుద్ధమూల్యము కాదగును. పరిమాణము కారణముగ మూల్యములో భేదము కలుగును. కావున ధనరూపమున నుండు వస్తువు కోరినపుడు విభజించుటకు, కలుపుటకు నను వుగ నుండవలెను. (క్యాపిటల్ 103)

మార్క్సుకు పూర్వమున్న అర్థశాస్త్రిలుకూడ ధాతువులలోని యసాధారణ గుణములను వర్ణించుచుండిరి. అయినను నీవిషయమున కొఱత లేకపోలేదు. కేవల మీా గుణము లుండుటచేతనే సువర్ణాది ధాతువులు తమకు తాము వ్యాపకమూల్యము కాజాలవని గుర్తించుకొనవలెను. కార ణము కార్యరూపమును బొందవచ్చును. కాని యంతమాత్ర మున కారణము కార్యరూపమున పరివర్తించు నను నియ మము లేదు. బీజము లింట నున్నంతమాత్రమున నవి యంకు రింపవు; పత్రశాఖాదులు కలవి కావు. విశాల వృక్షరూపము నందగల శక్తి బీజములో నున్నది. కాని యది భూమియందు విత్తబడవలసి యున్నది. మట్టి యనుకూల మొనర్పవలెను. నీరు పోయవలెను. ఇట్టి యత్నములే సమయాంతరమున

వృక్షరూపము నందును. సువర్ణాదులు కూడ కొండొక ప్రక్రియ నాశ్రయించికాని మూల్యము కావు. ఆ ప్రక్రియయే వినిమయము. అదిలేక యొక వస్తువు మరియొకదానికి మూల్యము కాదు. అట్టియెడ సువర్ణాదులు సమస్త పణ్యము లకు మూల్య మెట్లు కాగలుగును? అశేష పణ్యముల విని మయమునకు సాధనములై యవి మూల్యము కాగలుగును. సువర్ణాదులు మూల్యమైనపుడు వినిమయమువలన వాని మూల్యము ప్రకటింపబడదు. అవి మూల్యముయొక్క విశ్వ వ్యాపక రూపమును ధరించును. వినిమయము వలన ప్రకట మగు మూల్యమునకు రెండు రూపము లుండును. ఒకటి పణ్యముయొక్క ప్రాతిస్వికరూపము. రెండవది వ్యాపక రూపము. మార్క్సు ననుసరించి యీ రెంటి యంతరమును తెలిసికొనజాలక యనేకులు సువర్ణాదుల మూల్యమును కల్పి తముగా నెంచిరి. 'లాక్' మతమున మానవులు సువర్ణాదులు ధనమగుటకు తగిన గుణములద్వారా వానికి కల్పితమూల్యము నొసంగి యుండిరి. (క్యా. 103.)

ఇట మార్క్సుమతము యుక్తమే. మానవజాతి కేవలము కల్పనద్వారా యొక వస్తువును ధనమని యంగీక రింపజాలదు. ధనము వినిమయమునకు కారణము. శ్రమ సంబంధములేక యే వస్తువుకూడ వినిమయము చేయింపలేదు. సువర్ణాదులు సమస్త వస్తువులను వినిమయము చేయించు చున్నవి. కావున వానికి శ్రమతో విశేష సంబంధ ముండితీర వలెను. సువర్ణాదులు గనులనుండి తీయుట కెంతో శ్రమ యవసర మగును. కాని యా శ్రమ కారణముగా వాని

మూల్యము నిశ్చయము కాదు. ఒక కృషికు డొక దినమున నెన్ని గోధుమ లుత్పన్నముచేయునో యా గోధుమల విలువ యతని దినశ్రమనుబట్టి నిర్ణయింపబడును. సువర్ణాదులమూల్య మట్లు దినశ్రమనుబట్టి నిర్ణయింపబడదు. ఒక దినమున నెంత పరిమాణములో గోధుమ లుత్పన్నము కాగలవో యా గోధుమల విలువతో నొక దినమున గనులనుండి తీయబడు సువర్ణము విలువ సమానము కాదు. సమాన పరిమాణములో శ్రమ వినియోగింపబడినను సువర్ణాదుల విలువ భిన్నముగానే యుండును. గోధుమలకంటె సువర్ణము విలువలో నెంతో యెక్కువగ నుండును. ఈ విషయమున మార్క్సు అభిప్రాయము యుక్తముకాదు. (క్యాపిటల్ 105 పు.) సువర్ణాది ధాతువుల విలువ మార్క్సు ఉత్పాదన శ్రమనుబట్టి నిర్ణయించుచున్నాడు. గనులనుండి యొక్కొక్క యెడ నల్పపరిశ్రమచే నధిక పరిమాణములో సువర్ణాదులు లభింపవచ్చును. కాని, ఋత్వనుకూల దశలో సుకరముగా గోధుమాదు లధిక పరిమాణములో లభించినట్లు సువర్ణాదు లెన్నడును నెక్కడను నంతపరిమాణమున లభింపవు. అన్య పణ్యములకంటె సువర్ణాదు లెల్ల వేళల దుర్లభము లగుట తప్పదు. కావున రజత సువర్ణాదుల ప్రాప్తి కెంతటి యల్పపరిశ్రమ చేయబడినను, వాని మూల్య మధికముగానే యుండును.

సువర్ణాదుల పరిమాణ మూల్య మితర పణ్యముల రూపమున ప్రకాశిత మైనపుడు సువర్ణాదుల నియత పరిమాణముల కొక మూల్య మున్నట్లు పణ్యములకును నియత మూల్యముండును. కాని దానికి కారణము శ్రమ సామాన్య పరిమా

ణము కాదు. ఇరువది రూప్యముల కొక తులము సువర్ణము లభించు సమయమున నా యిరువదిరూప్యములకు పదిమణుగుల గోధుమలు లభింపవచ్చును. అప్పు డా గోధుమల నుత్పన్నము చేయు కృషికుల శ్రమ యా సువర్ణమును తీయు శ్రామికుల శ్రమతో సమానము కావలె నను నియమము లేదు. ఒక తులము సువర్ణ మొక దినపు పరిశ్రమద్వారా లభింపవచ్చు. కాని పదిమణుగుల గోధుమ లొకదినము పరిశ్రమద్వారా యెన్నడు నుత్పన్నము కావు. వాస్తవమున సువర్ణాదుల మూల్యము వాని యుత్పాదన కగు శ్రమ ననుసరించి నిర్ణయింపబడదు. సువర్ణాదులు సాధారణ జనులకు దుర్లభములు. అవి దొరుకు గను లెక్కడో స్థానవిశేషములం దుండును. ఆ స్థలములపై విభిన్న దేశముల రాజుల కధికార ముండును. సాధారణ జను లా స్థలములను సంపాదింపజాలరు. ఇందుల కగు శ్రమ సువర్ణాదులను గనులనుండి తీయుట కగునది కాదు. ప్రపంచమునం దంతటను సువర్ణాది ధాతువులే దుర్లభములు. కావున వాని ప్రాప్తికి విశేష శ్రమ చేయవలసి యుండును. అందువలన నవి బహుమూల్యము లగును. ఇతర పణ్యములవలె నవియు సులభసాధ్యములైన, వాని యుత్పత్తి కెంతశ్రమ చేయవలసి వచ్చినను వాని మూల్య మధికము కానేరదు.

సాధారణ జనుల కొక వేయి రూప్యములు సంపాదింప వనేక మాసములు పరిశ్రమ చేయవలసి వచ్చును. సముద్రమున మునిగి ముత్యములను పట్టి తెచ్చు వా డొకప్పు డొకటి రెండు సారులు మునిగి వేయి రూప్యములు విలువగల ముత్యా

మును సులభముగ పొందవచ్చును. ఉత్పాదనశ్రమ ననుసరించి ముత్యముల మూల్యము నిశ్చయించిన వాని మూల్య మంత యెక్కుడుగ నుండరాదు. విశేష ప్రకారముగల ముత్యము లకు విశిష్ట మూల్య ముండును.

ఉపయోగకరమగు శ్రమ మూల్యమునకు కారణము. అది యొకట పణ్యోత్పాదనకు చేయబడును. మరియొక యెడ పణ్యప్రాప్తికి చేయబడును. ఉత్పత్తి కొఱకగు శ్రమను మూల్యోత్పాదకముగా నెంచిన కారణమున కొందరు శ్రమ లేకయే పణ్యముల మూల్యము నంగీకరించినారు. తీయుటలో నెక్కుడు శ్రమ యవసరము కానందున వారు ముత్యములు మున్నగు వానిని శ్రమలేకయే బహు మూల్యములుగా నెంచుచున్నారు. వాని బహుమూల్యమునకు కారణము దుర్లభతయే. దుర్లభము లైనమీాదట వాని ప్రాప్తికి శ్రమ యొనర్పనగును. ఆ శ్రమ మూల్యము నుత్పన్నము చేయును.

సువర్ణాదులలో స్పష్ట ధర్మములు రెండు గలవు. మొదట నవి మూల్యములు; తరువాత మహార్ఘములు. తరుచు క్రయ విక్రయములు వానిద్వారా జరుగును. కావున మొదట మూల్యరూపమున నవి ప్రకటమగును. కార్య కారణ భావమునుబట్టి యవి మొదట మహార్ఘములు కావల యును. ఇతర పణ్యములును మూల్యము లగును. కాని యవి కొన్నింటికే మూల్యము లగును. సువర్ణాదులు సమస్త పణ్య ములకు మూల్య మగును. నిరంతరము నివి మూల్యముగా వ్యవహరింపబడుటవలన వీనిలో భోగ్యభావ ముండియు భాసింపకున్నది. అవి మహార్ఘములు కాకున్న వ్యాపక

మూల్యము కాజాలవు. వ్యాపక మూల్య మగుటకు కారణము కేవలము బహు మూల్యమగుట కాదని మరువ రాదు. విశాల భవనములు, పెద్ద వాయు యానములు బహు మూల్యములే; కాని, యవి వ్యాపక మూల్యములు కావు. వ్యాపక మూల్య మగుటకు మహార్ఘతతో బాటు మరికొన్ని గుణములు కావలసి యున్నవి. అం దొకటి బహుకాల ముంచినను చెడకుండుట. రెండవది తన యంశముల ద్వారా పణ్యముల యాంశిక మూల్యమును ప్రకటించు సామర్థ్యము కలిగియుండుట. అంశములలో విభక్తము చేసినను, మరల మూలపిండముతో కలిసినపుడు మూల్యమునకు హాని కలుగ కుండవలెను. ఈ ధర్మములు మూల్యము వ్యాపక మగుటకు ముఖ్యకారణము లగుచున్నవి. సువర్ణాదులలో నిట్టి ధర్మము లున్నవి; కాని, విశాల భవనాదులలో లేవు. మహార్ఘత లేకున్నను విశేష గుణములు మూల్యమును వ్యాపక మొనర్ప గలుగును; కాని, వ్యాప్త మగుటకు వలయు గతి తీవ్రము కాజాలదు. గోధుమాది పణ్యముల వలె సువర్ణాదు లల్ప మూల్యము గలవి యైనను సమస్త పణ్యములకు నవి మూల్యము లగును. విశేష గుణములు లేనందున గోధుమాదులు వ్యాపక మూల్యము కాజాలవు. సువర్ణాదు లల్పమూల్యము కలిగియున్న నల్పమూల్యముగల పణ్యముల వినిమయమున నెట్టి కఠినతయు నుండదు. కాని విశాల భవనాదుల వినిమయమున కఠినత కలుగును. భవనములకు తగినంత విశాల పరిమాణములో సువర్ణాదులు లభింపవు. అవి మహార్ఘము లగుటచే నల్పమాత్ర లోనే పని నెరవేరును. బహుమూల్య వస్తువులు సులభముగా

వినిమయ మొనర్చుటకుగాను మూల్యమగు వస్తు వల్ప మాత్రలో బహుమూల్యమై యుండుట యవసరము.

దుర్లభత యల్పాకారపు వస్తువును మహార్ఘము చేయు చున్నది. వస్తు వెంత దుర్లభమైన నది యంత బహుమూల్య మగును. ఎంత బహుమూల్యమైన నంత శీఘ్రముగ మూల్య రూపమున సమస్త పణ్యములతోను దానికి సంబంధము కలుగును. మహార్ఘ వస్తువు వ్యాపకమూల్య మైనప్పుడు, దానికంటె నల్పమూల్యము గల పణ్యమునకు నితరవస్తువులతో సంబంధము కలుగుటలో మిక్కిలి విలంబ మగును. అందు వలనే దానికి మహత్వము కలుగదు.

మూల్యము పణ్యములలో రెండు విధములుగ వ్యాపిం చును. ఒక విధమున క్రమ ముండును. రెండవ విధమున క్రమ ముండదు. ఒక చిన్నము బంగారము తీసికొని పుస్తక ముల నమ్మువాడు పుస్తకము నమ్మును. ఆ బంగారముతో ప్రత్తి తీసికొనును. ప్రత్తి నిచ్చిన కృషీవలు డా బంగారముతో వస్త్రము కొనును. వస్త్ర వ్యాపారి దానితో నౌషధమును కొనును. ఇట్లా చిన్నము బంగారము ఔషధముల నమ్మువాని చెంత చేరినది. అతనికి పాత్రలు కావలసిన నది పాత్ర లమ్ము వానికి చేరును. ఇట్లే చక్రము నడుచుచునే యుండును. ఇట చిన్నము బంగారమునకు క్రమముగా పుస్తకము, ప్రత్తి, వస్త్రము, ఔషధము, పాత్రలు వీనితో సంబంధము కలిగినది. ఇది యొక విధము.

ఒక తులము బంగార మిచ్చి పై వస్తువు లన్నియు నొకే మాటు కొనవచ్చును. అప్పుడు బంగారమునకు పై వస్తువు

లన్నిటితోను సంబంధము కలుగును. కాని క్రమముగా కలుగదు. సువర్ణాదు లిట్లు మూల్యరూపమున రెండు విధము లను కలిగి యుండును.

మహార్ఘత మూల్యము వ్యాపక మగుటకు కారణమని చెప్పియుంటిమి. కాని రెండు విధములను వ్యాపకమగుట కొక హద్దున్నది. దుర్లభత కారణముగ మూల్యమున కొంతవరకు వృద్ధి కలుగును. కాని, తరువాత మూల్య మెక్కువైన పణ్యములతో క్రమిక సంబంధము కలుగజాలదు. ప్రపంచమునం దంతటను నత్యంతాల్ప సంఖ్య గల రత్నము లుండవచ్చు. అవి విశ్వములోని సమస్త వస్తువులకు మూల్యము కావచ్చు. అప్పు డవి సమస్త వస్తువుల కొకేసారి మూల్య మగును. కావున నవి వ్యాపకమూల్య మగును. అవి యైదారు వస్తువులకు మూల్యము కాజాలవు. అందులకు వాని యంశములలో మూల్యము కాగల సామర్థ్య ముండ వలెను. కాని యది వానిలో నుండదు. రత్నముల నంశము లుగా విభజించిన వాని మూల్య మెంతగానో తగ్గిపోవును. సువర్ణాది ధాతువులు రెండు విధములగు వ్యాప్తిని కలిగి యుండును. కావున మూల్యరూపమున నవి వ్యాపకములు. దుర్లభతలో చరమసీమను పొందిన మహార్ఘ రత్నములు క్రమములేక పణ్యములతో సంబద్ధము లగును. కావున నవి గౌణరూపమున వ్యాపకము లగును.

అర్థశాస్త్రులలో ననేకులు దుర్లభత మూల్యకారణ మని సిద్ధపరుచుటకు మరియొక యుక్తిని చూపించుచున్నారు. కరువు కాలమున వల్ప మూల్యముగల వస్తువుకూడ బహుమూల్య

మగును. శ్రమ ననుసరించి నాలుగణాలు మూల్యముగల సేరు దుంపలు కరువుకాలమున ప్రాణాధారములై నూరు రూప్యములు లేక యంత కెక్కుడు మూల్యముగలవి కావచ్చును. కావున కేవల దుర్లభత మూల్యము నుత్పన్నము చేయదు. అది యుపయోగిత నెక్కుడుచేసి మూల్యమును పెంచును. దుంపల యుపయోగిత వాస్తవమున నెక్కువ కాదు. సుకాలమున నవి యెంత యుపయోగకరములో దుష్కాలమునను నంతే. కాని యితర భోజ్య వస్తువులు లేనందున వాని యుపయోగిత యెక్కువైనది. ఉపయోగితలో కలిగిన యీ వృద్ధి యపేక్షాబుద్ధి కారణమున జ్ఞానమున కలిగినది. వస్తువునందు కలుగలేదు. క్రొత్తశ్రమ యేమియు నిట కలుగ లేదు. అందువలన శ్రమ వృద్ధికి కారణము కాదు. కావున నిట దుర్లభత యుపయోగితను పెంచి యధిక మూల్యమునకు కారణ మగుచున్నది.

మార్క్సు ఉపయోగిత లేకయే శ్రమ మూల్యమునకు కారణ మనుచున్నాడు. పైన వర్ణించిన యర్థశాస్త్రజ్ఞులు కూడ శ్రమలేకయే యుపయోగిత మూల్యమునకు కారణ మని సిద్ధపరుచుచున్నారు. కాని మొదటి పక్షమున సర్వ విధములయిన మూల్యము కేవల శ్రమజన్య మగుచున్నది. రెండవ పక్షమున శ్రమజన్యవస్తువుయొక్క మూల్యమునకు శ్రమకారణమే; కాని, దుర్లభ మగుటవలన బహుమూల్యమైన వస్తువుమూల్యమున కుపయోగిత కారణ మగుచున్నది. ఈ రెండు పక్షములలో గల భేద మిదియే.

వాస్తవమున మూల్యమునకు శ్రమ, యుపయోగిత రెండును కారణములే. కరువుకాలమునందు సేరు దుంపల

నుత్పన్నముచేయుట కగు శ్రమకంటె నెక్కుడు శ్రమ నవి యపేక్షింపనిమాట నిజమే కాని, వాని ప్రాప్తి యెక్కుడు శ్రమచేయక కాదు. మూల్యము వందరూప్యము లయిన, నవి మిక్కిలి యుపయోగకరమైన శ్రమద్వారా లభించును. దుంపలు పణ్యములు; వానిని తినకున్న ప్రాణ ముండదు. అందువలన నుపయోగితలో వృద్ధి కనిపించును. వంద రూప్యముల నీయకున్న నవి లభింపవు. కావున వానిలో నెక్కుడు శ్రమకు సంబంధము కనిపించును. ప్రాప్తితో శ్రమకు సంబంధ ముండుటలో వివాదమునకు తావులేదు. ప్రాప్తిద్వారా శ్రమకు దుంపలతో సంబంధము కలుగును. ప్రాప్తి ధర్మము. ధర్మము ధర్మిలేక యుండజాలదు. కరవుకాలపు దుంపలవలె సువర్ణాదులందును శ్రమ, యుపయోగిత రెండు నుండును. ప్రాప్తిద్వారా శ్రమకు దుంపలతో కలుగు సంబంధము, సువర్ణాదులకువలె సమానము. దుంపల యుపయోగిత తినుటయే తడవుగా తెలియనగును. కాని సువర్ణాదుల యుపయోగిత సామాన్యరూపమున వ్యాపకము. అయ్యది సువర్ణాదుల ద్వారా యుపయోగకరములగు వస్త్రాదులను కొనినపుడు తెలియును. బహుమూల్యము లయిన సువర్ణాదులును శ్రమతోను, ఉపయోగితతోను యుక్తములే.

ఉపయోగిత యున్నచోట శ్రమ, జ్ఞానము రెండు నుండుట యవసర మగుచున్నది. అవిలేక యుపయోగిత యేర్పడదు. సువర్ణాదులు వ్యాపక మూల్యములు. కావున వానిలో నుపయోగిత, దానినుత్పన్నముచేయు జ్ఞానశ్రమయును విశాల పరిణామములో నుండును. కాగా సువర్ణాదులు [illegible] రూపము లనదగి యున్నవి.

# ఎనిమిదవ యధ్యాయము

## శ్రమఫలముపైగల స్వత్వమునకు కారణము

పెట్టుబడి ద్వారా పణ్యావస్తువుల నుత్పన్నము చేసి వ్యాపారము చేసినందున ధనము వృద్ధియగును. శ్రామికుడు పణ్యావస్తువు నుత్పన్నముచేసి స్వయముగా నమ్మిన నతడు ధనవంతుడు కాడు. పెట్టుబడిదారుడు శ్రామికుల ద్వారా పణ్యముల నుత్పన్నము చేసి యమ్మిన నతడు మహాధనవంతు డగుచున్నాడు. శ్రామికుని చేతినుండి పణ్యము పెట్టుబడి దారుని చేతికి రాగానే దాని మూల్యము పెరుగును.

నేడీ పెట్టుబడివిధాన యుగమున విశాల యంత్రము లధిక పరిమాణములో పణ్యావస్తువుల నుత్పన్నము చేయు చున్నవి. వాని నమ్ముటవలన పెట్టుబడిదారుల చెంత నపార ధనరాశి యేర్పడుచున్నది. శ్రామికుడు కూడ పెట్టుబడి దారుని వలెనే పణ్యము నమ్మజూచును; కాని, యతడు వివశుడయి, పెట్టుబడిదారుల చెంతజేరి వారికి తన శ్రమ నమ్మవలసి వచ్చుచున్నది. అట్లు చేయని పక్షమున నత డాకలితో నుండవలసి వచ్చును. జీవించుటయే కఠిన మగును. గడచిన కాలములో క్రయ విక్రయ వ్యవస్థ లనేకములు వ్యవహారమునకు వచ్చియుండెను. వాని మూలమున లక్షలాది శ్రామికు లిట్టి దశకు లోబడవలసి వచ్చినది. ఈనాటి యవస్థ వచ్చుటకు శతాబ్దములు పట్టినది. పణ్యము నమ్మగలిగి, శ్రమ నమ్మవలసిన స్థితి రాకుండుటకు

మనుజునిదగ్గర ననేక సాధనము లుండవలెను. పణ్యావస్తువుల నుత్పన్నము చేయుటకు తగిన యుపకరణములు - ఉపాదాన కారణములు - ముడిసరుకు, నిమిత్తకారణము - పనివారు, సాధనములు నన్నియు నుండవలెను. ఇంతేకాక యన్నపాన ములకు లోటుండరాదు. కేవలము ముందెన్నడో నిర్మింపబడు పణ్యావస్తువుల సహాయముతో నెవడును జీవింపనేరడు. జన్మతో బాటు మనుష్యున కాకలిదప్పులు వెంటవచ్చును. ఉత్పన్న మైన తరువాత పణ్యావస్తువుల నమ్ముటకు తగిన సమాజ మొకటి యుండవలెను. రెండవవైపున శ్రామికు లుండవలెను. వారిదగ్గర శ్రమతప్ప మరియొక వస్తువేదియు నమ్ముటకు తగినది యుండరాదు. ఇట్టి శ్రామికులు విరివిగా పెట్టుబడి దారునకు లభించిన నతనిధనము మిక్కుటమగును. పెట్టుబడికి వలయు ధన మేర్పడుటకు గల ప్రక్రియను మార్క్సు విస్తార ముగ నిరూపించి యున్నాడు. దానినిగూర్చి విచారింపవలసి యున్నది. ప్రస్తుత యుగము ననుసరించి 10 పౌనుల దారము నిర్మింపబడినదని యెంచుము. దారము నిర్మించుటకు దూది కావలెను. దూది దారమున, కారంభక పదార్థము. ఈ దృష్టాంతమున నా దూది పది (10) పౌనులు. దాని యథార్థ మూల్యము 10 షిల్లింగులు. వ్యాపారుల సమాజము ననుస రించి దూది యేర్పడుటకు కావలసిన శ్రమ యీ మూల్యము వలన ప్రకట మగును. ఆ దూదిని నూలుగా వడుకుటకు కావలసిన సాధనములకు, దూదిని నేకుటకు రెండు షిల్లిం గులు ఖర్చగు ననుకొనుడు. ఇట్లు పండ్రెండు (12) షిల్లింగుల నుత్పన్నము చేయుటకు 24 గంటల శ్రమయో లేక రెండు

పని దినములో కావలెను. కాగా నూలులో రెండు దినముల శ్రమ మొదటినుండి యున్నదని యొప్పుకొనవలెను. పది పౌనుల దూది నుత్పన్నముచేయుట కయిన శ్రమ, నూలు వడుకుట కుపయోగించిన సాధనములలో నరిగిపోయిన యంశము కూడ నొకవిధముగ రూపొందిన శ్రమయేకావున నా శ్రమయు నా పదిపౌనుల నూలులో నుండును. పణ్య వస్తువుల యాకారములోను భేద మేర్పడినది. మొదట దూది, వడుకు సాధనములు నుండెను. తరువాత నూలు సిద్ధమైనది. కాని మూల్యములో భేదము కలుగలేదు.

ఉత్పత్తికొఱకు సామాజికస్థితి ననుసరించి యనివార్యముగ నెంత శ్రమకాల మవసరమో యంతకుమించి కాల నియమము చేయరాదను విషయము మరువరాదు. ఒకపౌను నూలువడుకుట కొకపౌను దూదికంటె నెక్కుడు దూది యవసరము కానట్లయిన, నంతకంటె నెక్కుడుఖర్చు కాకుండునట్లు జాగ్రత్తపడవలసి యుండును. ఒక్కగంట శ్రమవలన నొక నిశ్చిత పరిమాణమున దూది నూలగును. కావున పండ్రెండు గంటలలో నెంత దూది నూలుకావలెనో యంత సిద్ధము కానంతవరకు నొకదినపు శ్రమ – పండ్రెండుగంటల శ్రమగా నెంచరాదు. సామాజిక రూపమున ననివార్యమగు కాలమే మూల్యము నుత్పన్నము చేయుటలో లెక్కింపనగును. ఒక గంటలో $1\frac{2}{3}$ పౌనుల దూది వడుకబడునేని 10 పౌ. నూలుకు 6 గంటల శ్రమ కావలయును. మూల్యమునుగూర్చి యాలోచించినపుడు, నియత పరిమాణముగల భౌతిక ద్రవ్యములు కొన్ని గంటలయో లేక కొన్ని దినము

లయో సామాజిక శ్రమకు సంబంధించిన ఘనీభూతమగు స్థిర దశను ప్రకటించును.

ఒక దినపు శ్రమమూల్యము మూడు షిల్లింగులని యంగీకరించి యాలోచింతము. అనగా మూడు షిల్లింగులలో నారుగంటల శ్రమ నిండియుండును. దీనివలన, నొకదినపు జీవనమున కుపయోగించు వస్తువుల నుత్పన్నము చేయుటకు ఆరుగంటల శ్రమ యపేక్షిత మగుచున్నట్లు సిద్ధమగుచున్నది. నూలు వడుకుటలో 10 పౌ. దూది యారుగంటల శ్రమను తనలో నిముడ్చుకొనుచున్నది. మూడు షిల్లింగులలోకూడ నారుగంటల శ్రమపుంజ మిముడుచున్నది. కాబట్టి నూలు వడుకుటకైన శ్రమ దూదిలో మూడుషిల్లింగుల మూల్యమును వృద్ధిచేసినది.

ఒకమాటు 10 పౌ. నూలుయొక్క మొత్తము మూల్యమును గూర్చి యాలోచింపుడు. రెండున్నర దినము లిందు వ్యయింపబడును. రెండు రోజులు దూదిలోను, ఉపకరణ ముల ఘర్షణలోను గడచినవి. అర్ధదినము నూలువడుకుటలో గతించినది. ఇట్లు పదునైదు షిల్లింగులు రెండున్నర రోజుల శ్రమను తమలో నింపుకొనుచున్నవి, కావున 10 పౌ. నూలుకు 15 షి. మూల్యము యుక్తమగును.

పెట్టుబడిదారు డీ మూల్యము నయుక్తమని యెంచును. ఇది మూలధనమునకు సరియైన మూల్యము. దీనిలో వృద్ధి యేమియు లేదు. మొదట దూదిలోను, నుపకరణములలోను, శ్రమలోను నున్న మూల్యమున కిది సంచయము. కేవల మిట్లు రాశి చేసినంత మాత్రమున లాభము కలుగదు.

పెట్టుబడిదారు డుత్తేజితుడై "నేను ధనమును వృద్ధిచేయుటకు పెట్టుబడి పెట్టితిని. నేనిపుడు అంగడివీధినుండి పణ్యములను కొందును. స్వయముగ పణ్యముల నుత్పన్నము చేయను" అని పలుకును. కాని పెట్టుబడిదారు లందరు నిట్లే చేయదలతు రేని పణ్యము లెటనుండి వచ్చును? ధనమా తినలేదు. 'నేను 15 షి. లతో మిక్కిలి సుఖము పొందగలిగెడివాడను; ఆ సుఖమును విడిచి నూలు నుత్పన్నము చేయుటకు పూనుకొంటిని. దాని ఫలము నాకు లభింపవలెను' అని యత డనవచ్చును. కాని, నూలురూపమున ఫల మతనికి లభించినది. దూదికి బదు లత డిప్పుడు నూలుకు స్వామి. దాని కతడు, 'ఈ నూలుతో నాకేమి ప్రయోజనము? నేను దీని నమ్ముటకు నిర్మించితిని.' అనును. దాని నత డమ్ముకొనిన 15 షి. లభించును. దూది, యుపకరణములు లేక నూలు కాజాలదు. ఇందులో సందేహ మేమియు లేదు. శూన్యమునుండి యే వస్తువును కలుగదు. శ్రామికుడు కేవలము తన యంగముల బలముతో పణ్యవస్తువులను నిర్మింపజాలడు. పెట్టుబడిదారు డతనికి దూది, యుపకరణములు నిచ్చి సహాయము చేసినాడు. కాని, శ్రామికులు లేనిచో పెట్టుబడిదారుడును పణ్యముల నుత్పన్నము చేయజాలడు. ఇందులో నిరువురు సమానులే. పెట్టుబడిదారుడు 3 షి. మూల్యము నిచ్చెను. శ్రామికుడు నతనికి మరల 3 షి. ఇచ్చినాడు. దూదికైన మూల్యమున 3 షి. మూల్యము నధికముగా చేర్చినాడు. ఇంతేకాక శ్రామికుల పనిని నిరీక్షించు వారు వేరుగ నుందురు. వారి శ్రమకు వేతనము

లభించును. అందువలన పెట్టుబడిదారుడు కార్యనిరీక్షణ కర్తయు గాడు. అయినను పెట్టుబడిదారునకు లాభము కలుగ కుండ నెవరు నడ్డగింపజాలరు. అత డందులకు వలయు నుపాయ మెరుగును. మూడు పిల్లింగు లొకదినపు శ్రమ మూల్యము. సాధారణవ్యక్తి కొకదినపు భోజనమజ్జనాదులకు వలయు పదార్థముల మూల్యముకూడ మూడు పిల్లింగు లగును. ఆరుగంటల శ్రమ శ్రామికుని నిరువదినాలుగు గంటల వరకు జీవింపజేయ గలుగును. శ్రామికు డారుగంటలకు బదులు పండ్రెండుగంటల శ్రమయు చేయగలడు. పండ్రెండు గంటలు శ్రమచేసినను మూల్యము మూడు పిల్లింగులే యగు పక్షమున నతనికి కలుగు లాభమేమి? శ్రమమూల్యము మూడు పిల్లింగులు; కాని యా శ్రమ 12 గం. లో నుత్ప న్నము చేయు పణ్యముయొక్క మూల్యము 6 పి. లగును. పెట్టుబడిదారుడు శ్రమను కొన్నప్పటి నుండియు నత డా యంతరముమీద ధ్యాన ముంచుచునే వచ్చును. శ్రమవలన మూల్య మేర్పడుటయే కాక యధికమూల్యము కూడ నేర్పడును. శ్రామికున కిప్పుడు 6 గం. లకు బదులు 12 గం. శ్రమ చేయవలసి వచ్చుచున్నది. 6 గం. శ్రమవలన 10 పౌ. దూది 10 పౌనుల నూలుగ నగును. 12 గం. శ్రమవలన 20 పౌ. దూది 20 పౌ. నూలగును. మొదట $2\frac{1}{2}$ దినముల శ్రమ యిప్పుడు 5 దినముల శ్రమ యగును. ఇందులో నాలుగు దినములు దూదిక్రిందను, నుపకరణముల ఘర్షణలోను ఖర్చ గును. మిగిలిన యొకదినము నూలు వడుకుటలో పోవును. ఇట్లు 5 ది. శ్రమకు మూల్యము 3 పి. లగును; కాని,

యీ శ్రమతో నేర్పడిన పణ్యముల మూల్యరాశి 27 షిల్లింగులకు మించదు. 27 షిల్లింగులను 30 షిల్లింగుల రూపమున పరిణమింప చేసినచో, 3 షిల్లింగులు అతిరిక్త మూల్యమగును. ఇట్లు ధనము మూలధన మగును.

ధనవృద్ధికి కారణము మార్క్సు అతిరిక్తమూల్య (సర్ప్లస్ వాల్యూ) మనుచున్నాడు. ఈ నామకరణము నితడే యొనర్చెను. ఇతర శబ్దములలో నిది యితరుల శ్రమఫలాపహరణ మనవచ్చును. శ్రామికులు శ్రమ చేసిరి. ఆరుగంటల శ్రమమూల్యము లభించునట్లే పండ్రెండుగంటల శ్రమమూల్యముకూడ వారికే లభింపవలెను. 6 షి. మూల్యముమీద వారికి స్వత్వము న్యాయప్రాప్తము. 'కర్మ చేయువాడు ఫలమును బొందవలెను' అను సిద్ధాంతముమీద వ్యవహారము ప్రతిష్ఠితమై యున్నది. పెట్టుబడిదారుడు నీ సిద్ధాంతము ననుసరించియే పెట్టుబడి పెట్టును.

మార్క్సుయొక్క యీ తర్కము ననుసరించి పెట్టుబడిదారుడు శ్రామికుల శ్రమఫలము నపహరించుచున్నాడు. నిస్సందేహముగ మూలపతి చిరకాలమునుండి శ్రమఫలము నపహరించుచు వచ్చుచున్నాడు. వారి యీ యపహరణాధికారమును జను లుచిత మని యెంచుచుండిరి. మార్క్సు వారి యధికారములోని యనౌచిత్యమును మిక్కిలి చక్కని రీతిలో ప్రకటించినాడు. కాని యిట మార్క్సుద్వారా యొక యథార్థము ప్రకటింపబడినది; కాని, మరియొక యంశము మరుగుననే యుండిపోయినది. మార్క్సు మతము ననుసరించి వస్త్రోత్పాదనమున మూలపతి కొంచెముకూడ శ్రమ యొనర్పడు.

"10 పౌ. నూలు ధర 10 షి. 2 షి.లు యంత్రముల యరుగుదల మూల్యము. 3 షి. శ్రామికుని శ్రమమూల్యము. ఇట్లు 10 పౌ. నూలు మూల్యము 15 షిల్లింగు లగుచున్నది" అని మార్క్సు లెక్క వేయుచున్నాడు. కాని, యిది సరియైన లెక్కకాదు. ఈ లెక్కలో శ్రామికుని ఆరుగంటల శ్రమకు మూల్యము కట్టినట్లు మూలపతి శ్రమకు మూల్యము కట్టలేదు. అందువలన 10 పౌ. నూలు మూల్యము 15 షిల్లింగు లనుట యథార్థముకాదు. అందులో మూలపతి శ్రమమూల్యము కూడ చేర్పవలసి యున్నది. మూలపతి శ్రమయే చేయలేదనుట యుక్తముకాదు. కారణ మేమన: శ్రామికుడు శ్రమచేయు సమయమున ధనపతియు శ్రమచేయుచున్నాడు. ధనపతియొక్క శ్రమ దూది, యంత్రము, ఉపకరణములు నను వాని రూపమున సంచితమై యున్నది. ఆ సంచితశ్రమ శ్రామికుని శ్రమకు తోడ్పడును. శ్రామికుని శ్రమలో వేగము నుత్పన్నము చేయును. శ్రామికు డొక్కడే నూలు నిర్మింపడు. అతని శ్రమతోపాటు మూలధనపతి యంత్రము ద్వారా తన నవీన శ్రమనుకూడ జోడించుచున్నాడు. యంత్రములు, దూది మున్నగువాని రూపమున నున్న పెట్టుబడిదారుని పూర్వపుశ్రమ, శ్రామికుడు పనిచేయునపుడు చేష్టా-శ్రమ-రహితముగా నుండదు. వేగవంతమగు గతిగలదై శ్రామికునకు తోడ్పడును. కావున ధనపతికూడ వస్తు నిర్మాణమున కొంత శ్రమ యొనర్చుచున్నాడనుట నిర్వివాద విషయము.

జ్ఞానము, ప్రయత్నము నను నీ రెండును నాత్మగుణములు. ఇయ్యవి క్షణికములు. కాని, వీనిని స్థిరమొనర్చుటకుపాయ మున్నది. జ్ఞానము నశించుచు నొక సంస్కారమును కలిగించి పోవును. సంస్కార రూపమున నది స్థిరమగుచున్నది. జ్ఞానముయొక్క స్వరూపము క్షణికము. కావున స్వరూపతః దానిని స్థిరమొనర్ప వీలులేదు. అనేక విషయములం దభ్యాస మొనర్చుటచే జ్ఞాన సంస్కారములు స్థిరములగుచున్నవి. ఈ సంస్కార సముదాయ సహాయముతో మనుజుడు వస్తువులోని మిక్కిలి సూక్ష్మ ధర్మములను గూడ తెలిసికొన గలుగుచున్నాడు. జ్ఞాన సంస్కారము లెంత యెక్కుడుగా సంచితములగునో యంత యెక్కుడుగా మనుజుడు వస్తు ధర్మముల నెరుగ గలుగును.

ప్రయత్నము వలన కర్మ జనించును. అదియును క్షణికమే. ప్రయత్నించి కర్మలను మాటిమాటికి చేసినందున శరీరబల మెక్కుడగును. మొదట 20 సేర్ల బరువు నెత్త లేనివాడు తరువాత అభ్యాసమువలన మణుగు బరువు నెత్తును. అనగా, కూడబెట్టబడిన బల మిక్కడ మణుగు బరువు నెత్తుటకు కారణ మగుచున్నది. కర్మ బరువు నెత్తుటకు కారణ మైనట్లు పణ్యమునకు, మూల్యమునకు కూడ నది కారణ మగుచున్నది. కర్మ యెంత యెక్కువ సంచితమైన నంత బరు వెక్కుడుగా నెత్తగలుగును; అంత యెక్కుడు పణ్యముల నుత్పన్నము చేయును; మూల్యము నంతగా పెంచును. బరు వెత్తుటకు కారణమైన కర్మ శరీరమున నున్నది. పణ్యమునకు, మూల్యమునకు కారణమగు కర్మ

శరీరమునకు వెలుపల యంత్రరూపముననను, నూలు రూపము నను నున్నది. ఒక కర్మసంచయము శరీరమునందును, మరియొక కర్మసంచయము శరీరమునకు వెలుపలను నున్నది. శరీరధారియగు మనుష్యుడు కర్మ ద్వారా శరీరమునందు కలిగిన బలమునకు స్వామియైనట్లు నూలుగాను యంత్రములు గాను శరీరమునకు వెలుపలనున్న కర్మకును స్వామి యగు చున్నాడు. శరీరాంతర్గత కర్మ బరువు నెత్తుటకు కారణ మగును. అట్లే బాహ్యకర్మ నూలురూపమున, యంత్రముల రూపమున పణ్యములను, మూల్యమును నుత్పన్నముచేసి వానికి కారణ మగును. మణువు బరువును నలుగు రైదుగు రెత్తిన వారందరు దానికి కర్త లగుదురు. నలుగురు మణువు బరు వెత్తినపుడు వారు సమ బలు లగుదురేని యొక్కొక్కడు 10 సేర్ల బరువు నెత్తును. విషమ బలు లగుదురేని హెచ్చు తగ్గులుగా నెత్తుదురు. ఒక్కొక్కప్పుడు 10 సేర్ల బరువు నెత్తలేని మనుజుడు యంత్ర సహాయమున 10 మణువుల బరువు నవలీలగా నెత్తును. ఇట్లు యంత్ర సహాయమున మనుజు డనల్పభారము నెత్తు స్థలములలో మానవుని బలము ముప్పది సేర్లకు మించి యెత్తదని యూహ.

యంత్రములకు స్వామి పెట్టుబడిదారుడు. నూలు, యంత్రము ననువాని ద్వారా శ్రామికుడు శ్రమ యొనర్చును. కావున నీశ్రమ కేవలము శ్రామికునిదే కాదు. ఇందు యంత్ర స్వామి శ్రమయు కలిసియున్నది. మణువు బరువు నెత్తుటలో మనుజుని తాత్కాలిక బలమే కారణము కాదు. అతడు పూర్వము సంపాదించిన బలముకూడ కారణ మగును. అట్లే

పణ్యముల నుత్పన్నము చేయుటలోకూడ కేవలము శ్రామికుల శ్రమయే కారణము కాదు. పెట్టుబడిదారుని ద్వారా సంచిత శ్రమ - యంత్రము, నూలు - కూడ కారణమగును. పణ్యోత్పాదనమున శ్రామికుడు, ధనపతి, యంత్రములు ననువారి స్వాభావిక సామర్థ్య మెంత యున్నదో విచారణీయ విషయము. పణ్యోత్పాదనమునందు శ్రామికుని శ్రమ మాత్రమే కారణముగా నంగీకరించి యంత్రస్వామిని - పెట్టుబడిదారుని - విడిచిపెట్టుట న్యాయముకాదు. పెట్టుబడిదారుడు గొప్ప గొప్ప యంత్రముల నేర్పరచి తన సంచితశ్రమ ద్వారా వేలాది శ్రామికులకు సహాయము చేయుచున్నాడు. అందు వలన నతడుకూడ శ్రామికు డగుచున్నాడు. సహాయకుడుగా నతడు గొప్ప శ్రామికు డన నొప్పును. కాని, యతడుచేయు సహాయములో నెక్కుడు భాగము యంత్రముల స్వాభావిక సామర్థ్యమునకు చెందియుండును. ధనపతియు శ్రామికుని వలె కాళ్లు చేతులు కలిగి యుండును. అతని శరీరగత శ్రమకు, శ్రామికుల శ్రమకు భేదముండదు. కాని, సంచితశ్రమశక్తి నూలు, యంత్రములు నను రూపములో నెక్కు డగును. ఈ యెక్కుడు సామర్థ్యము పెట్టుబడిదారునిది కాదు. అది యంత్రములది. యంత్రముల స్వాభావిక సామర్థ్యముమీద నధికారము సంపాదించి ధనపతి పణ్యవస్తువుల యుత్పత్తిలో శ్రామికులకంటె తన శ్రమ మిక్కిలి యెక్కువ యని యెంచుచున్నాడు. వాస్తవమున పణ్యోత్పత్తిలో నతని సహాయక శ్రమ మిక్కిలి తక్కువ. యంత్రముల స్వాభావిక సామర్థ్యము మీద ధనపతి కధికార మంగీకరింతుమేని నీటి గొట్టమునుండి

రొక చెంబు నీళ్ళు నింపి తెచ్చియిచ్చువానికి వందలకొలది రూప్యము లీయవలసి యుండును. నీటివలన ప్రాణరక్షణ జరుగునుగదా! కాని, ప్రాణరక్షణ నీటికి స్వాభావిక గుణము. నీటిని తెచ్చియిచ్చువాని శ్రమవలన ప్రాణరక్షణ జరుగదు; కాని యతని శ్రమకును కొంత మూల్యము లేకపోలేదు. జనులు మూల్యము గ్రహింపకయే నీటి నిత్తురు. మూల్యమెవరైన గ్రహించినను నొక కాని లేక రెండు కానులు మాత్రమే.

ఒక వైద్యు డొక రోగి ప్రాణములను కాపాడినపుడు రోగి వైద్యునకు యథాశక్తి ధన మొసగును. ప్రాణరక్షకమగు నౌషధమూల్యము వంద, రెండు వందలు, వెయ్యి, రెండు వేలు కావచ్చును. ఔషధముద్వారా ప్రాణరక్షణ జరుగును. కాని యా యౌషధమును సిద్ధముచేయుటలో నొక సంవత్సరకాలము గడువవచ్చును. ఇంతేకాక వైద్యునకు చికిత్సాజ్ఞానము సంపాదించుటలో ననేక సంవత్సరములు గతించి యుండవచ్చును. ఇట్టీ సమస్త సంచితశ్రమ రోగి చికిత్సకు కారణ మగును. అధిక పరిమాణములో ప్రాణరక్షకము లగు నౌషధము లుత్పన్నములై, నిపుణులగు వైద్యు లనేకు లున్నచో చికిత్సామూల్యము సాధారణ మగును.

ధనపతియొక్క సంచితశ్రమము సంపూర్ణముగ నుత్పాదనయోగపడి పణ్యముల నుత్పన్నము చేయదు. అతని సంచిత శ్రమములో మిక్కిలి స్వల్పభాగము వ్యయ మగుచున్నది.

కావున పణ్యమూల్యములో నతి సూక్ష్మభాగముమీద పెట్టుబడిదారున కధికార ముండవలెను.

మార్క్సు చూపిన యుదాహరణమునందు 10 పౌ. నూలు మూల్యము 15 షి. అందులో 3 షి.లు శ్రామికుని యారుగంటల శ్రమకు మూల్యము. ఆ యారుగంటలలో ధనపతియొక్క సహాయక శ్రమకూడ ఉన్నది. కాని యతని శ్రమ సాక్షాత్తుగ సహాయకము కాదు. పరంపరగ సహాయక మగుచున్నది. నూలు, యంత్రములు సంపాదించుటకు పెట్టుబడిదారునకు లక్షలు ఖర్చైయుండవచ్చు. అందువలన వానిపై నతని కధికార ముండును. యంత్రాదుల మూల్య మతనికి లభించుచుండును. కాని, యంత్రాదుల మూలమున శ్రామికునకు లభించు సహాయ మత్యల్పము. దాని మూల్యము ఒక పెన్నీ కానీ, అంతకంటె తక్కువ కానీ కావలసి యుండును.

మార్క్సు ననుసరించి చూచిన 10 పౌ. నూలు నమ్మిన పెట్టుబడిదారునకు 15 షి. లు లభింపవలెను. అంతకు మించి యత డధికారి కాడు. అనగా నతడు సంచిత శ్రమ ద్వారా నవీన శ్రమ నార్జింపకూడదని తేలుచున్నది. కాని యది యుక్తము కాదు. పెట్టుబడిదారుని ద్వారా సంచిత శ్రమము (యంత్రాదులు) కొంచెమేని చేయని పక్షమున - యంత్రమునం దెట్టి స్పందనము గలుగని పక్షమున-శ్రామికుడు యంత్రాద్యుపకరణములు లేకయే పణ్యముల నుత్పన్నము చేయగలిగి యుండును. కావున సంచిత శ్రమవలన లభించు సహాయ మెంత సూక్ష్మ - మల్ప - మైనను కావచ్చును; కాని

సహాయ మున్నదని యంగీకరింపక తప్పదు. కాబట్టి దానికి కూడ మూల్య ముండవలెను. శ్రామికులు కలిసి పనిచేయు నపుడు శ్రమ ననుసరించి మూల్యములో వారి కందరకు భాగ ముండును. ఒకరి కెక్కువ, మరియొకరికి తక్కువ యుండవచ్చును. అట్లే మూలపతియు నొక శ్రామికుడే. అతనికి కూడ భాగ ముండుట యుచితము. శ్రామికులలో నొకడు మరియొకని శ్రమ నపహరించుట యనుచితము. కాని, పరుని శ్రమ నపహరించిన కారణమున నతని నిజ శ్రమనుకూడ నిషేధింప వీలుకాదు.

అపహరణ విషయమునందును మార్క్సు ఒక యంశ మును ప్రకటించి మరియొక యంశమును విడిచిపెట్టి యున్నాడు. అది యేమన—పెట్టుబడిదారుడు శ్రామికులు కానివారి శ్రమ మీద కూడ నధికారము వహించుచున్నాడు. శ్రామికులు పణ్యముల నుత్పన్నము చేయునపు డతడు 'శ్రామికులు నూలు వడుకుచున్నారా? లేక యింటిని నిర్మించుచున్నారా?' యను నది విచారింపడు. నూలు సిద్ధము కావచ్చు, లేక యిల్లు నిర్మింపబడవచ్చు, కొయ్యమీద శ్రమ జరుగవచ్చు లేక రాతిమీద; బొగ్గులమ్మవచ్చు, లేక రత్నములు, ఏది జరిగి నను పెట్టుబడిదారునకు ధనవృద్ధి కావలెను. అతనికి ధనవృద్ధి మీదనే ధ్యాన ముండును. శ్రామికుల శ్రమఫలము నపహ రించుటచే ధనము వృద్ధిజెందునేని శ్రామికుల నతడు లూటీ చేయును. లేక మరియొకని శ్రమఫలము నపహరించిన ధన వృద్ధి యగునేని యతనిని లూటీచేయును. లూటీ చేయుటలో దాని పరిమాణమున లక్ష్యముంచునుగాని, యసహ్యాతుల జాతి

క్షేదముమీద దృష్టి యుండదు. పెట్టుబడిదారు డుపభోక్త లను లూటీచేసికూడ తన ధనము పెంచగలుగును. 10 పౌ. నూలు యథార్థమూల్యము. మార్క్సు మతము ననుసరించి 15 షి. నామతము ననుసరించి దాని మూల్యము 15 షిల్లింగులు 1 పెన్నీ కావలసి యున్నది. అట్టియెడ పెట్టుబడిదారు డుపభోక్తలనుండి 10 పౌ. నూలుకు 18 షిల్లింగులు తీసికొన దలచినను నతని కాటంక ముండదు. ఆ స్థితిలో నుపభోక్తల నుండియు నధికముగా 3 షి. కూడ పెట్టుబడిదారునికి చేరు చున్నది. ఈ విషయమును మార్క్సు వెల్లడింపడయ్యె. ఇదియు నొకవిధమగు శ్రమాపహరణమే. కావున మూడు విధములుగ శ్రమఫలము నపహరింపవచ్చునని తేలుచున్నది. కేవల శ్రామిక శ్రమఫలాపహరణ మొక విధము. కేవలోప భోక్తల శ్రమఫలాపహరణము రెండవ విధము. శ్రామికులయు నుపభోక్తలయు శ్రమాపహరణము మూడవ విధము.

కేవలము శ్రామికుని శ్రమఫలమునే యపహరించినపు డుపభోక్తకు కష్ట ముండదు. అప్పుడు పెట్టుబడిదారుడు ఉపభోక్త కెంత పణ్య మిచ్చునో యంతేమూల్యము నాణెముల రూపమున నుపభోక్త పెట్టుబడిదారున కిచ్చును. 20 పౌ. నూలుకు 30 షి. యథార్థమూల్యమైన ఉపభోక్త కంతే యియ్యవలసి వచ్చును. పెట్టుబడిదారుడు 20 పౌ. నూలు 33 షి. ల కమ్మిన, నతనికి 27 షిల్లింగులు 33 షిల్లింగుల రూపమున పరిణమించును. అప్పు డతడు 3 షి. శ్రామికుని నుండి, 3 షి. ఉపభోక్తనుండి హరించును. ఈ దశయం దుపభోక్త 33 షిల్లింగులిచ్చి 30 షిల్లింగుల పణ్యమును బొందుచు

న్నాడు. శ్రామికుడు 12 గంటలు పనిచేయును. అతనికి 6 షి. లభించవలసి యుండెను; కాని 3 షి. లభించుచున్నవి.

ఉపభోక్తనుండి యధిక మూల్యము తీసికొనినపుడు పణ్యావస్తువున కయిన వాస్తవ మూల్యమునకు, శ్రమ పరిమాణమునకు సమత యుండదు. ఒక నిర్జన ప్రదేశమునందు బంగాళాదుంపలు దుర్లభమైన కారణమున సేరు రు. 50 ల మూల్యము చేయవచ్చు. అంగడివీధిలో దాని మూల్యము రెండణాలే యుండును. ఏబది రూపాయలకు, లేక నూరు రూప్యములకు వలయు శ్రమ యొనర్చినను దుంపలు ఒకసేరు లభింపవు. కావున రు. 50 లు ఇయ్యవలసి వచ్చును. అప్పుడా దుంపలతో నధిక శ్రమకు సంబంధ మున్నదని యంగీకరింప బడును. ఈ యుదాహరణమునం దుపభోక్తయొక్క శ్రమ ఫల మెంత యెక్కుడుగ నపహరింపబడినదియు స్పష్ట మగుచున్నది. పెట్టుబడిదారు డుపభోక్తలకు పణ్యావస్తువులు కరువగునట్లు సదా యత్నించుచుండును. అందువలన నతనికి నుచితమైన మూల్యముకంటె నెక్కుడు మూల్యము లభించును.

మరియొక విధమున నీ విషయము స్పష్టము చేయ వచ్చును. పణ్యావస్తువుల నుత్పన్నము చేయుటకు కావలసిన ముడిసరుకు, ఉపకరణములు పెట్టుబడిదారునకు పరిశ్రమ చేయకయే స్వాయముగ నుత్పన్నములై లభించు ననుకొనుడు. ఎండ, నీరు మున్నగువానివలె ప్రకృతి స్వాయముగ నా పదార్థములను సంపాదించి యిచ్చినదని యెంచుడు. ఆ స్థితిలో ముడిసరుకు, ఉపకరణములు సంపాదించుటకు మూలధన మవసరము కాదు. పెట్టుబడి పెట్టవలసిన యవసర ముండదని

భావము. కాగా పణ్యమూల్యములో మొదటి యంశము తగ్గి
పోవును. నూలుకు సంబంధించిన యుదాహరణము నిక్కడ
గ్రహింతుమేని, మార్క్సు మతము ననుసరించి 24 షిల్లింగులు
తగ్గిపోవును. ఇక క్రొత్తగా నుత్పన్నమైన మూల్యము మిగిలి
యుండును. ఇందులో శ్రామికుని శ్రమఫల మపహరించుట
వలన లభించిన లాభము కలిసియుండును. అవశిష్టమూల్యము
6 షిల్లింగులు. 3 షి.లు శ్రామికునకు, 3 షి.లు పెట్టుబడిదారు
నకు చెందియుండును. పెట్టుబడిదారుడు శ్రామికున కిచ్చుటకు
3 షిల్లింగులు ఖర్చు చేయును. అదియే మూలధనము - పెట్టు
బడి. కాగా మూలధన స్వరూప మిట్లగుచున్నది. మూల్యహీన
ములగు నుపకరణాదులు, శ్రామికుని వేతనము. మూల్య
హీనమగు ముడిసరుకు, ఉపకరణములు నన్నియు శూన్యము
నకు సమానములు. కాగా శూన్యము + శ్రామికుని
వేతనము కలిసి పెట్టుబడి యగుచున్నది. అనగా పెట్టుబడి =
0 + వేతనము. దీనిలో శ్రమఫలాపహరణము కూడ
కలిపినచో పెట్టుబడి = 0 + వేతనము + శ్రమాపహరణము
అగును.

పెట్టుబడిలో నొకభాగము ఆరంభకద్రవ్యాత్మకము -
ముడిసరుకు రూపము - రెండవ భాగము శ్రమాత్మకము. ముడి
సరుకు జడము. అందులో లాభము నుత్పన్నము చేయగల
గతి - క్రియ - లేదు. నూలు మూల్యములో దూదియొక్కయు,
నుపకరణములలో గలుగు తరుగుయొక్కయు మూల్యము
మరల ప్రకటమగును. ఉపకరణములలో తరుగు కాని భాగపు
విలువ వానిలోనే యుండును. జడముయొక్క మూల్యము

పణ్యముల నారంభించు ముడిసరుకులో నున్నను, లేక యుత్పన్నములైన పణ్యములలో నున్నను నొకటిగానే యుండును; దాని పరిమాణమునందు సంకోచముకానీ, వృద్ధి కానీ కలుగదు. శ్రమ గతిశీలమై యుండును. దానిలో భేద మేర్పడినపుడు లాభము, దాని వృద్ధియు గలుగును. దూది, యుపకరణములు ననువాని మూల్యము 24 షిల్లింగు లుండె ననుకొనుడు. అది 80 షిల్లింగు లయినను లాభమున భేద ముండదు. శ్రమస్వభావ మట్టిది కాదు. 6 గంటల శ్రమ 10 పౌ. దూదిని నూలు చేయును. దూది మూల్యము మొదటినుండియు 12 షి.లు సిద్ధమై యుండెను. శ్రమ మూల్యము 3 షి.లు కలిసిన 15 షి. లగును. ఇంతవరకు లాభ మేమియు లేదు. శ్రమ ఆరుగంటలనుండి పండ్రెండు గంటలకు పెరిగినపుడు 20 పౌ. నూలు సిద్ధమగును. దాని మూల్యము 30 షిల్లింగు లగును. అందులో 3 షిల్లింగుల లాభము - శ్రమఫలాపహరణము - సిద్ధించును. 12 నుండి 24 షిల్లింగు లయినను దూది, ఉపకరణములు వీని జడమూల్యా మట్లే యుండును. కావున నీ యవస్థయందు జడమూల్యము లాభ మును కలిగింపజాలదని యంగీకరించిన యనుచిత మేమియు కాదు. ఇట్లు జడమూల్యము శూన్య సమాన మైనపుడు, శ్రమఫలాపహరణమునకు కారణము శ్రమలో గలుగు భేదమే యని స్పష్టమగుచున్నది. పై చూపులకు జడ మూల్యము లాభోత్పాదనలో శూన్యతుల్య మనుట యసంగ తముగా దోచును. కాని వ్యవహారమున ప్రతిదినము నిది జరుగుచున్నది. నూలు వ్యాపారముతో లాభ పరిమాణ

మును నిశ్చయింప బూనినపుడు, వ్యాపారి దూదిమూల్యము మొత్తము ఆదాయమునుండి తీసివేయుచున్నాడు.

జడమూల్యమువలె శ్రమమూల్యము కూడ యథార్థమయిన, 20 పౌ. నూలుకు నపేక్షితమయిన 12 గంటల శ్రమమూల్యము 6 షిల్లింగు లిచ్చివేసినపుడు 30 షిల్లింగుల మూల్యమునందును లాభ ముండదు. కాని, యుపభోక్తల నుండి 33 షిల్లింగులు తీసికొనినచో 3 షి. లాభ ముండును. ఇంతేకాక, 10 పౌనులు నూలు మూల్యము 15 షిల్లింగుల నుండి 18 షిల్లింగులు చేయుటకు ఎంతో కాలము పట్టదు. వివశులనుజేసి యుపభోక్తలనుండి యెంతైనను తీసికొన వచ్చు. శ్రమ సమయములో నంతరము కలిగింప నవసర ముండదు. అప్పుడు శ్రమమూల్యము శూన్య సమాన మగును. ఒకవేళ ప్రకృతి స్వతఃసిద్ధమగు దూది, యుపకరణములు నీయక, స్వతఃసిద్ధమగు నూలే యిచ్చినచో మూల్యమెంత లభించినను నది యుపభోక్తల శ్రమఫలాపహరణమే యగును. ఈ విధమగు నూలు 10 పౌనులయిన నందు జడమూల్యము 12 షిల్లింగులు, శ్రమమూల్యము 3 షిల్లింగులు నుండవు. ఉపభోక్త 3 షిల్లింగులు మూల్యముగా నిచ్చిన నదియే మూల్యము; అదియే లాభము నగుచున్నది. ఉపభోక్తల శ్రమఫలాపహరణ మిట లాభకారణము. శూన్యమునుండి లాభ మెన్నడు కలుగదు.

పెట్టుబడిదారులు తరుచుగ పణ్యముల నుత్పన్నము చేయించి యితరుల శ్రమఫలము నపహరింతురు. పలుమారులు వారు పణ్యములు లేకయే యితరుల శ్రమఫలము

మీద తమ స్వత్వము నేర్పరుచుకొందురు. ప్రస్తుతమున కొందరు పెట్టుబడిదారులు విద్యాలయమునకు, పుస్తకాలయమునకు భవనములు కట్టించి, యధ్యాపకులను వేతనమిచ్చి నియోగింతురు. అధ్యాపకులదగ్గర జ్ఞానముమాత్ర ముండును. భవన నిర్మాణ సామర్థ్యము వారిలో నుండదు. ఆరుగంటలు పనిచేసి రెండు మూడు గంటల శ్రమకు తగిన మూల్యమునే వారు గ్రహింపవలసినవా రగుదురు. విద్యార్థులకు చదువుట యవసరము. బాధితులై వారు శిక్షణనిమిత్తము నెలజీతముల నధికముగా నీయవలసినవా రగుదురు. చదివించుట కేవల శ్రమము. దానివలన భౌతికపణ్యము లేవియు నుత్పన్నములు కావు. దాని నిచ్చి పెట్టుబడిదారుడు విద్యార్థులనుండి మూల్యము వసూలు చేయును.

ఇట్లే కొందఱు బట్ట లుతుకుట కిండ్లు కట్టించి వాని యందు చాకలివారిని, క్షౌరకర్మల కనువగు శాలలు నిర్మించి యందు మంగలివారిని వేతనముల నిచ్చి యుంతురు. ఇట్లు పనిచేయు చాకలికి మంగలికి వారి శ్రమకయిన మూల్యములో నర్ధభాగ మిచ్చి, యుపభోక్తలనుండి రెండు రెట్లు, మూడు రెట్లు మూల్యమును గ్రహించుచు తమ ధనమును పెంపు చేయుదురు. వీరందరు నితరుల శ్రమఫలముమీద నన్యాయముగ నధికారమును సంపాదించువారే.

శ్రమయో, శ్రమజన్య పణ్యమో తీసికొని శ్రామికులయు, నుపభోక్తలయు శ్రమఫలము నపహరింపకున్న పెట్టుబడిదారుడు మూలధనమును త్వరలో నెక్కువ వృద్ధి చేయజాలడు.

# తొమ్మిదవ యధ్యాయము

# వినిమయమునకు మూల్యమునకు గల సాధ్యసాధన భావము

రెండు గజముల కద్దరు నొక చొక్కాయి తీసికొని వినిమయము చేసినపుడు చొక్కాయి వినిమయ సాధనము - మూల్య మగును. కద్దరు సాధ్యమగును. వినిమయ మొక విధమగు క్రియ. సామాన్యముగ క్రియాసంబంధము సాధనము, విషయము నను రెండింటితో నుండును. కట్టెను తెగకొట్టుట యొక క్రియ; దానికి సాధనము గొడ్డలి; విషయము కట్టె. సాధనము విషయముతో సంబద్ధమై యందు క్రియ నుత్పన్నము చేయును. సాధన మొక్కటై సాధన విషయము లనేకము లైనపుడు క్రమముగా నొక్కొక్కదానితో సాధనముచేరి సాధ్యవిషయములందు క్రియను జనింప జేయును. సాధనము లనేకములై సాధ్యములు సమసంఖ్యలో ననేకము లైనపు డొకే సమయమున నన్నిటియందును క్రియను గలిగింపవచ్చును. ఒక గొడ్డలి యొక కట్టెను, చాల గొడ్డళ్ళు చాల కట్టెలను నరుకగలవు. పణ్యవినిమయము పణ్యములద్వారా జరిగినపుడు కొన్ని పణ్యములు సాధ్యము లగును; కొన్ని మూల్యములు-సాధనము లగును. ఆ దశలో నెన్ని సాధ్యము లుండునో యన్ని సాధనము లుండును. కాని, మూల్యము సువర్ణాది ధాతురూపము దాల్చినపుడు సాధన మొక్కటే యైనను ననేక పణ్యములతో క్రమముగా వినిమయము చేయసాగును.

పణ్యామయ మూల్యముయొక్క సాధనభావము నియతము కాదు. మూల్యరూపమున నొక చొక్కాయి రెండు గజముల కద్దరు వినిమయమునకు సాధనము. కాని, రెండు గజముల కద్దరు మూల్యమై యొక చొక్కాయిని వినిమయము చేయగలుగును. ఇట్టియెడ చొక్కాయి సాధ్యము; కద్దరు సాధనము నగుచున్నది. పణ్య వినిమయకార్యము పణ్యవస్తువులతో కాక సువర్ణాది ధాతురూపమునకు వచ్చినపుడు వాని మూల్యభావము నియతమగును; అవి తరుచుగా మూల్యముగానే యుండును. ఈ దశలో నవి వినిమయమునకు సాధనము లగును; సాధ్యములు కావు. పణ్యములు సాధారణముగ సాధ్యస్థితిలో నుండును. అయినను సువర్ణాదులు పణ్యదశకు వచ్చుట యసంభవము కాదు. ఒక రూప్యమునిచ్చి యెనిమిది మామిడిపండ్లు కొనవచ్చును. అట్లే యొకప్పు డెనిమిదిపండ్ల నిచ్చి యొక రూప్యము తీసికొనవచ్చు. పండ్లు మూల్య మగును; కాని కొలది సమయములలోనే యట్లగు ననుట మరువరాదు. అవి వ్యాపకమూల్యము కానేరవు. వ్యాపక మూల్యము సువర్ణాది ధాతువులే యగును. వానియందే యా యోగ్యత యున్నది. అందువలన నవి పణ్యములకంటె వేరుగ నుండును.

పణ్యామయము, ధాతుమయము నగు మూల్యముల నియతానియత స్వభావమునకు కారణము వినిమయక్రియలో గల దాని స్వరూప మగుచున్నది. క్రియలు రెండువిధములుగ నుండును. మొదటిది తన యునికికొఱకు జ్ఞానము నపేక్షింపదు. రెండవది జ్ఞానములేక తన యునికిని తెలుపలేదు.

నడకుట, దహించుట మున్నగు క్రియలు జ్ఞానములేకయే జరుగును. గోడ్డలికి జ్ఞాన మున్నను లేకున్నను దాని ప్రహారము కట్టైను నరుకును. అగ్నికి జ్ఞాన మున్నను లేకున్నను తృణాదులు దానిమీద పడిన కాలక మానవు.

కాని హ్రస్వమును, దీర్ఘమును నెరుగు క్రియ వస్తువు లున్నంత మాత్రమున కలుగదు. మూడు రేఖ లున్న వనుకొనుడు. మొదటిది హ్రస్వము; రెండవది దీర్ఘము; మూడవది దీర్ఘతరము. రెండవది యగు దీర్ఘము తాను దీర్ఘమైనట్లు తన సత్తామాత్రముచేతనే తెలుపజాలదు. మొదటిరేఖయొక్క హ్రస్వ పరిమాణము తెలియనంతవరకు రెండవదాని దైర్ఘ్యము తెలియదు. ఇట్లే రెండవరేఖ దీర్ఘ మని తెలిసినగాని మూడవరేఖ దీర్ఘతరమని బోధపడదు. రెండవరేఖ దైర్ఘ్యము తెలియుటకు మొదటిరేఖ హ్రస్వ జ్ఞానము కారణము – సాధనము. మొదటిదాని హ్రస్వ జ్ఞానమునకు రెండవదాని దైర్ఘ్య జ్ఞానము సాధనము. ఇట్లు ఆపేక్షిక జ్ఞానములందు అపేక్షా మూలమున సాధ్య సాధన భావము మారుచుండును. పణ్యములయు, మూల్యములయు జ్ఞానముకూడ నపేక్షాజన్యమే. రెండు గజముల కద్దరులో నెంతటి యుపయోగిత, శ్రమము నున్నవో యంతటి యుప యోగిత, శ్రమము నొక్క చొక్కాయిలో నున్నపుడు చొక్కాయి మూల్య మగును. ఇక్కడ కద్దరులోనున్న శ్రమకు, నుపయోగితకు చొక్కాయిలో నున్న శ్రమతోను, నుపయోగితతోను సామ్య మున్నందున చొక్కాయి మూల్య మైనది. ఇట్లే చొక్కాయిలోనున్న శ్రమోపయోగితలకు

కర్దరులోని శ్రమోపయోగితలతో సామ్యమైనపుడు కర్దరు మూల్యమగును. కాని సువర్ణాది ధాతువులలోని శ్రమాదులు పణ్యావస్తువులలోని శ్రమాదులతో సమానమైనట్లు తెలిసి నపుడు జను లీ ప్రతీతిని విపరీతముచేసి వ్యవహరింపరు. ఎల్లపుడు పణ్య శ్రమాదులను సువర్ణాదుల శ్రమాదులతోనే పోల్చి సువర్ణాదులనే మూల్యముగా నుపయోగింతురు. అట్లు చేయుటకే వారికి వీలున్నది. కావున పోలికలో సువర్ణాదుల నెల్లపుడు ఉపమాన స్థానమున నుంతురు. ఇట్లు సువర్ణాదులు నిరంతరము మూల్యరూపమున నుండుటచే బహుమూల్యము లగు నీ ధాతువుల పణ్యరూపము వెంటనే కన్నులకు పొడ కట్టదు. సువర్ణాదులు నగలు చేయించుటకై కొన్నప్పుడు పణ్యము లగును. కాని యప్పుడు వానికి మూల్యముకూడ సువర్ణాదిధాతువులే యగును. వ్యవహారములో నున్న యభ్యాసము వాని మూల్యరూపమును స్వతంత్రముగా ప్రతిష్ఠించుచున్నది. సువర్ణాదులలోని జడరూప మన్య జ్ఞానము నపేక్షింపనట్లు వాని మూల్యరూపముకూడ జ్ఞాన నిరపేక్ష మగుచున్నది. పణ్యములు, మూల్యము రెండును భౌతికములు. కట్టెను నరుకుటకు గొడ్డలివలె మూల్యము సువర్ణాది రూపమున పణ్యవినిమయమునకు సాధన మగు చున్నది.

ఇంతవరకు క్రియకు భౌతిక సాధనమైన గొడ్డలి మున్నగు వానితో ధాతుమయమూల్యమునకు సామ్య ముండును. కాని యికముం దట్లుకాదు. గొడ్డలి కట్టెను నరుకుట కుపయోగిం చును. అంతకుమించిన ప్రయోజనము దానివలన కలుగదు.

కట్టెను నరికినట్లు గొడ్డలిని నడుపు నావశ్యకత యుండదు. అందువలన దానిని నడుపు సాధనజిజ్ఞాస కలుగదు. కాని సువర్ణాదుల మూల్యస్థితి యిట్టిది కాదు. మూల్యము లేక యే వస్తువు లభింపదు. పణ్యములకు మూల్యమున్నపుడు మూల్యమునకు కూడ మూల్య ముండవలెను. మూల్యము స్వయముగ మూల్యవంతము కాకున్న నది మూల్యమే కాజాలదు. ప్రకాశము తేజస్వరూప మైనట్లు మూల్యభూత వస్తువునకు స్వరూపము మూల్యమే. ప్రకాశహీన వస్తువు తేజస్సు కానట్లు మూల్యహీనవస్తువు పణ్యములకు మూల్యము కానేరదు. ఇక్కడ గొడ్డలితో మూల్యమునకు సామ్య ముండదు. ఇదియొక సమస్య. దీనిని పరిష్కరించుట కుపాయము లేకపోలేదు.

సువర్ణాదులు పణ్యములకు మూల్యమైనపుడవి తమ భారముద్వారా మూల్యమగుచున్నవి. ఒక మణుగు గోధుమ పిండి విలువ రెండు చిన్నముల బంగారమో, లేక రెండు తులముల వెండియో యైనపుడు, మణుగు పిండిలో నెంత యుపయోగి శ్రమ యున్నదో యంత యుపయోగి శ్రమ రెండు చిన్నముల బంగారములోను లేక రెండు తులముల వెండిలోను నున్నదని యభిప్రాయము. రెండు చిన్నముల బంగారము మూల్యములేనిది కాదు. దాని విలువ రెండు రూప్యము లగును. రెండు చిన్నముల బంగారములో నెంత శ్రమ యున్నదో రెండు తులముల వెండిలో నంతే శ్రమ యున్నది.

అవి మూల్యమగుట కిదియె కారణము. ధాతువులు నాణెముల రూపము ధరింపనంతవరకు, వాని మూల్యము నాణెముల ద్వారా ప్రకటమగును. ఈ దశలో సువర్ణ మయము, రజతమయము నగు ధనమునకు కూడ మూల్య మున్నది. కాని నాణెము లయిన తరువాత ధాతువుల మూల్యము మరియొక వస్తువుద్వారా ప్రకటము కాదు. మణుగు గోధుమపిండి మూల్యము రెండు రూప్యములు. ఈ రూప్యముల విలువను వెండి ప్రకటింపజాలదు. అంతమాత్ర మున నా రెండు రూప్యములు విలువలేనివి కావు. వానిలో మూల్యమునకు మూలమైన యుపయోగి శ్రమ యున్నది. కాని దానిని వెండియొక్క యే రూపముతోను ప్రకటింప వీలులేదు. ఈ యభిప్రాయముతో నా రెండు రూప్యములు మూల్యహీనము లనవచ్చును. కాని, యపేక్షా బుద్ధితో ధనము మూల్యరహిత మగుచున్నది.

వాస్తవమున ధనమునకు మూల్య మున్నదనుటలో భేదములేదు. దాని ప్రకాశములో భేద మున్నది. వస్తువు లన్నియు నొకే విధమున ప్రకటింపబడవు. రాళ్ళు, వృక్షములు, లతలు మున్నగువానిని చూచుటకు దీపమో, సూర్యుడో కావలెను. ఈ వస్తువులు స్వయముగ ప్రకటము కాజాలవు. మరియొక ప్రకాశక వస్తువు కావలెను. కాని, దీపమును, సూర్యుని ప్రకటించుటకు మరియొక వస్తు వపేక్షింపబడదు. అవి స్వయంప్రకాశకములు; ఇతర వస్తువులనుకూడ ప్రకాశింపజే యును. స్వప్రకాశములగు దీపాదులు ప్రకాశహీనములు కావు. నాణెముల రూపమున నున్న మూల్యముకూడ సూర్యాదుల

వలె స్వప్రకాశకమైయున్నది. గోధుమలు, కట్టెలు, సువర్ణము, వెండి మున్నగున వన్నియు ధాతుమయమగు మూల్యము ద్వారా మూల్యవంతము లగుచున్నవి. పిండీభూతములగు సువర్ణాదుల మూల్యము సువర్ణముద్రాదు లగును. ధాతు మయములగు నాణెము లితరపణ్యముల మూల్యమును ప్రక టించును; తన మూల్యమునుకూడ ప్రకటించును. అవి తన మూల్యమును ప్రకటించుటకు వస్తువుల నపేక్షింపవు. దీపా దులు స్వతఃప్రకాశములు. ధాతుమయముద్రలుకూడ స్వతః ప్రకాశములే. స్వయముగ మూల్యము లగుటవలన వానికి మూల్యము లేకపోదు.

ధాతువుల మూల్యరూపము పణ్యముల మూల్య రూపమువలెనే యుపయోగహీనముకానీ, శ్రమహీనముకానీ కాదు. అయినను కొంత యంతర మున్నది. ఒక చొక్కా యిలో కుట్టుపనివాని శ్రమ యిమిడియున్నది. అది యుపయో గియు నగును. అందువలన నది రెండుగజముల కద్దరుకు మూల్య మగుచున్నది. వెండి బంగారములు వాని సంపాదన కగు శ్రమవలన వ్యాపకములైన మూల్యములు కాజాలవు. వాని ప్రాప్తికొఱ కగు శ్రమసామాన్యముతో బాటు, వాని ద్వారా పణ్యములు తీసికొని పొందు సుఖరూపమగు నుప యోగము వలన గూడ నవి వ్యాపకములైన మూల్యము లగు చున్నవి. పణ్యములలోను, సువర్ణాది ధాతువులలోను నుండు శ్రమోపయోగముల సంబంధము సమానముకాదు. చొక్కాయితోను, లేక కద్దరుతోను వాస్తవమున నొకప్పుడు శ్రమకు సంబంధము కలిగియుండెను. ఆ శ్రమజన్య మగు

నుపయోగిత వానిలో నిప్పుడుకూడ నున్నది. కాని, సువర్ణాదులను పొందుటకుగాను శ్రమచేయుటకు ముందే జనులు వాని మూల్యము నెఱుగుదురు. అప్పటికి శ్రమకు వానితో సంబంధము కలుగలేదు; కావున శ్రమజన్యమగు నుపయోగితకు వానితో సంబంధములేదు. సువర్ణము ప్రాప్తించిన మీదట, దాని ద్వారా భోగ్యవస్తువులను గ్రహించినపుడుపయోగితా సంబంధము కలుగును. రానున్న శ్రమోపయోగితల సంబంధము వాస్తవమున నిపుడు కలుగనేరదు. బుద్ధిద్వారా యీ సంబంధమును రచింపవచ్చు. సువర్ణాదులతో భావికాలమున కలుగనున్న శ్రమోపయోగితల బుద్ధికృత సంబంధము సువర్ణాదులను వ్యాపక మూల్యముగ చేయుచున్నది. జనులు సువర్ణాదులను రూపొందిన శ్రమోపయోగముల విశాలరాశులుగా నంగీకరింతురు. అంగీకరించుటయే మూలము; అందువలన వీని వ్యాపక మూల్యరూపము బుద్ధిమయ మగుచున్నది.

పణ్యవస్తువుల ధనమయమగు మూల్యము బుద్ధిద్వారా కల్పిత మను విషయము మార్క్సుకూడ నంగీకరించును; కాని, యతడు చూపిన హేతువులవలన మూల్యస్వరూపము కల్పిత మని సిద్ధింపదు. అత డిట్లు చెప్పును; "పణ్యముల ధనాత్మక రూపము, వాని సాధారణ మూల్యమువలెనే, వాని ప్రత్యక్ష శారీరికములగు నాకారములకంటె నన్నివిధముల భిన్నముగా నుండును. కావున నది శుద్ధమానసిక రూపమయి యున్నది. ఇనుము, ధాన్యము వీనియొక్క మూల్యము అదృశ్యమైనను నది యీ వస్తువులలో పరమార్థ

రూపమున నున్నది. సువర్ణముతో వీని సామ్యమును జెప్పి, మూల్యము కల్పనద్వారా ప్రకటింపజేయబడినది. ఇట్టి సంబంధము కేవలము వారి యాలోచనలలోనే యుండును. కావున నాపణ్యస్వామి పణ్యములకు వానికైన నీయవలెను; లేదా వానిమీద సూచించుటకు తగిన చీటీలైనా యంటింపవలెను. అప్పుడు వాని ముద్రామయమూల్య మితరులకు తెలియగలదు." (క్యాపిటల్. భా. 1. పు. 107.)

దీనింబట్టి ఇనుము, ధాన్యము మున్నగువానితో ధనమునకు, సువర్ణమయమూల్యమునకు సంబంధము కల్పితమని సిద్ధమగుచున్నది; కాని, మూల్యము స్వయముగ కల్పితమని సిద్ధముకాదు. మూల్య మెల్లపుడు పణ్యములకంటె భిన్న స్థానమున నుండును. మూల్యభూతమగు వస్తువుశ్రమ పణ్యశ్రమకు సమానమని తోచినపుడు దానిని మూల్య మందురు. సమానతాజ్ఞానము బుద్ధికి తోచును. పణ్యముతో మూల్యభూతశ్రమకు సంబంధము చేయుటయు బుద్ధికార్యమే. ఇంత జరిగినను, పణ్యమునందు శ్రమసంబంధము వాస్తవమువమున్న దనుటలో కల్పనాంశము లేదు. ఈ విధముగ మూల్యభూత వస్తువునందును శ్రమ వాస్తవమున నున్నది; అదియు కాల్పనికము కాదు. శ్రమ మూల్యమునకు మూలరూపము. అది పారమార్థిక మైనపుడు మూల్యము కాల్పనికము కాజాలదు. మూల్యవంతమగు పణ్యముతో దాని సంబంధమాత్ర్యము కాల్పనిక మగును. పణ్యమునకు మూల్యమునకు గలసంబంధము కాల్పనిక మైనంత మాత్రమున నొకని మతము భిన్నముకాదు. మరియు మార్క్సు సువర్ణాదులు వ్యాపక

మూల్య మగుటకు కారణము గనులనుండి వాని నెత్తుట కయిన శ్రమగా చెప్పుచున్నాడు. ఈ శ్రమతో పణ్యశ్రమము లకు, సామ్యము కల్పించుట నిస్సందేహముగ బుద్ధికార్యమే. కాని, సామ్యము, సామ్యమూలక సంబంధము బుద్ధిద్వారా కల్పితమైనను, సంబంధియగు శ్రమము కల్పితము కాజాలదు. నా పక్షము ననుసరించి సువర్ణాదుల మూల్యరూప మవశ్యము కాల్పనికమే. కారణము, వానిలో శ్రమ సంబంధము పారమార్థికము కాక బుద్ధిద్వారా కల్పిత మగుటయే.

'ధాతువుల మూల్యరూపము బుద్ధికల్పితమే కాని భ్రాంతము కాదు' అని ధ్యానమున నుంచుకొనవలెను. రెండు వస్తువులను భిన్నభిన్న స్థానములలో నెరిగి కారణవశమున వాని సంబంధ మొప్పుకొనబడినది. భ్రమలోకూడ నే రెండు వస్తువుల సంబంధము ప్రతీతమగునో యావస్తువులు భిన్నభిన్న స్థానములం దుండును; కాని, వాని స్థాన భేదము జ్ఞాతము కాదు. అంధకారమునందు త్రాడు సర్పముగా తోచినపు డెదుట త్రాడుండును. సర్ప మెక్కడనో మరియుక చోట నుండును. కాని యీ స్థాన భేదము తెలియనందున త్రాడు సర్పముగా తోచును. ఇది భ్రమ. సువర్ణము పణ్యమూల్యముగ తోచి నపుడు పణ్యములు, సువర్ణము భిన్నభిన్న స్థానముల నుండును. ఈ స్థానభేదము నెరుగుచునే సువర్ణము పణ్యము లకు మూల్య మందురు. నిమిత్త మెరిగియే యీకల్పన చేయ బడినది. కావున నిది భ్రమము కాదు.

అనేక పణ్యముల మూల్యము సువర్ణముయొక్క వివిధ మాత్రల - పరిమాణముల-లో ప్రకాశిత మగును. ఒక వస్తువు మూల్య మొక చిన్నపు బంగారమైన, మరియొకదాని మూల్యము రెండు చిన్నములు కావచ్చు. మూడవ పణ్యము మూల్యము మూడు చిన్నము లగును. ఇట్లు సువర్ణము తాను వివిధ పరిమాణములలో ప్రకాశిత మగుటవలన పణ్యమూల్యము తన స్వతంత్ర పరిమాణమును కోల్పోయి సువర్ణ పరిమాణమును బొందుచున్నది. అప్పుడు వాని నామరూపము లేకము లగుచున్నవి. కావున నొండొంటితో పోల్చుటకు యోగ్యము లగును. వాని పరిమాణము నిశ్చితము కాగలుగును. మూల్యములు వివిధములగు సువర్ణ పరిమాణ ములలో ప్రకటముకాక నాణెములలో ప్రకటమైనపుడును వాని నామరూపములలో భేదము కలుగదు. దీనింబట్టి, సువర్ణ రజత ముద్రాంశములలోను, పణ్యములలో నయినంత శ్రమయే యగుచున్నదని సిద్ధ మగుచున్నది. రెండున్నర రూప్యముల కిరువది మామిడిపండ్లు లభించిన నిరువది మామిడిపండ్ల నుత్పన్నము చేయుట కయినంత శ్రమ రెండున్నర రూప్యములలో నయినదని యొప్పుకొనక తప్పదు.

ఇట నొక విషయము మరువరాదు. పణ్యముల మూల్యము స్థిరముగా నుండదు. అది పెరుగును; తరుగును. **20** మామిడిపండ్లు ఒకప్పుడు రు $2\frac{1}{2}$లు కావచ్చు. మరి యొక్కప్పు డవి రు $1\frac{1}{4}$ కావచ్చు. ఉత్పత్తిలో వచ్చిన మార్పునుబట్టి యవియే రు 5 లు నగును. శ్రమ సమాన

మైనపుడు మూల్యములో నిట్టి భేద మేల కలుగుచున్నది? మూల్యములో కలుగు పెరుగు తరుగులను బాగుగ నాలోచించినచో నిట నీ ప్రశ్న ముదయింపదు. 20 పండ్లు రు $2\frac{1}{2}$ లకు లభించినపు డయినంత శ్రమయే రు $1\frac{1}{4}$ కు లభించినపుడు కాదు. అప్పుడు సగము శ్రమయే కలిగియుండును. ఇట్లే రు 5 లకు లభించినపుడు రెట్టింపు శ్రమ కలిగియుండును. శ్రమ యొక్కటిగానే యుండి ముద్రారూప మూల్యమున నంతర మేర్పడినచో పై ప్రశ్న ముదయించును. కాని, శ్రమ పరిమాణములో భేదము కలిగినందున మూల్యములోను భేదము కలుగుచున్నది. కావున ప్రశ్నకు తావు లేదు.

ఈస్థితిని గమనింపక మార్క్సు ఇట్లనుచున్నాడు; "ముద్రామయమగు ధనముయొక్కయు, మూల్యముయొక్కయు పరిమాణములలో పరిమాణ మూలకమగు నసంగతి యుండనే యున్నది. దానితోబాటు గుణమూలకమగు విరూపతయు నున్నది. అదియును నెంతవరకు గలదన : ధనము పణ్యములకు మూల్యరూప మైనను నాణెముల రూపమున నున్న ధనము విశేష దశయందు మూల్యమును ప్రకాశింపజేయుట మానివేయును." (క్యాపిటల్. భా 1. పు. 115).

ఇందులకు హేతువుగా అంతఃకరణపు పవిత్రత, ప్రతిష్ఠ, మున్నగు వస్తువులు పణ్యములు కావని మార్క్సు చెప్పియున్నాడు. అయినను వాని స్వామి వాని నమ్మగలుగుచున్నాడు. నాణెమురూపమున నున్న ధనముద్వారా యవి పణ్యము లగును. కావున విభిన్నప్రకారమగు వస్తువు స్వాభావిక మూల్యము కానప్పటికి ముద్రామయ మూల్యములో

యుక్తము కాగలుగుచున్నది. ఇట్టి దశలో ముద్రా మయ మూల్యము గణితమునకు సంబంధించిన కొన్ని రాసులవలె కాల్పనిక మగుచున్నది. కాని, అంతఃకర ణపు పవిత్రత కొఱకు, ప్రతిష్ఠకొఱకు మిక్కిలిగా శ్రమింప వలసి వచ్చును. ఇనుము, కట్టెలు మున్నగువానివలె పవిత్రత మున్నగునవికూడ పణ్యములగుట కెట్టి యాపత్తియు నుండరాదు. ఇనుము భౌతికమైన మూర్తవస్తువు. ప్రతిష్ఠాదు లభౌతికములు. ఈ భేదము తప్పకయున్నది. కాని, పణ్యము లగుటకు వస్తువులు భౌతికములే కావలయునను నియమము లేదు. శ్రమజన్యము, నుపయోగియు నగు ప్రతివస్తువు పణ్యము కావచ్చును. ముద్రామయ ధనము (నాణెములు) అభౌతిక వస్తువుల వినిమయము చేయించునపుడు, వాని యాశ్రమజనితమూల్యమును ప్రకాశింప జేయును. నాణెము నకు వస్తువుతో సంబంధము కలిగినపు డది తప్పక దాని శ్రమ-పరిమాణమును ప్రకటించును.

ఈ యవసరమున మార్క్సు ఇట్లు చెప్పుచున్నాడు; "ముద్రామయ ధనముయొక్క కల్పితరూపము అప్పుడప్పుడు సాక్షాత్తుగానో పరంపరగానో కలుగు మూల్యముయొక్క సత్యసంబంధమును మరుగుపరుచును. అకృష్ట-దున్నని-భూమి యొక్క యాదానప్రదానములకు సాధనమయిన ముద్రా మయధనము (నాణెములు) దీనికి నుదాహరణము. కారణము, మనుజుని శ్రమ యా భూమిని స్పృశింపకుండుటయే." (క్యాపిటల్. భా. 1. పు. 115).

కాని, యిదియును యుక్తముకాదు. ఇక్కడకూడ, ముద్రలు (నాణెములు) మూల్యమును ప్రకటించును. పైరు వేయుటద్వారా భూమిమీద పరిశ్రమ జరుగలేదు; కాని యీ భూమి శ్రమచేయక లభింపదు. దానిని పొందుట కపేక్షితమగు శ్రమయే దాని మూల్యమునకు కారణము. భూఖండముయొక్క దుర్లభత దాని ప్రాప్తికి వలయు శ్రమ నావశ్యకము చేయుచున్నది. ఆ భూప్రాప్తి కెంత పరిమాణములో శ్రమ యావశ్యకమో యంతటి శ్రమ దాని వినిమయ మొనర్చు ముద్రారాశిలో నున్నది. మార్క్స్ కేవలము ఉత్పత్తికి కారణమగు శ్రమమూల్యమునకు నిమిత్తముగా నంగీకరించుచున్నాడు. కావున నతనికి అకృష్టభూమి మూల్య రహితముగా తోచినది. బుద్ధి సువర్ణాదులవలెనే అకృష్ట భూమితో కూడ భావిశ్రమకు సంబంధము చేయును. ప్రాప్తి కొఱకు శ్రమసంబంధము లేకున్న నా భూమిమీద నెవరికి నధికార ముండదు. ముద్రామయ ధనముతో దాని యాదానప్రదానములును జరుగవు. ఎండ, గాలి, వాన మున్నగునవి యెల్లరకు సులభములే. వీనిని బొందుట కెవరును శ్రమ యొనర్పరు. కావున నవి మూల్యహీనములు. మూల్యము లేనపుడు వానితో ముద్రాసంబంధము నుండదు. ముద్రాధనము మూల్యమునకు రెండవ రూపము. మూల్యము లేకయే ముద్రాసంబంధము కలిగిన వెన్నెల, యెండ, గాలి కూడ ముద్రలద్వారా ఇచ్చి పుచ్చుకొనవలసిన వగును.

# పదవ యధ్యాయము

## మూల్యోత్పత్తికి కారణము

జన్యవస్తువులకు రెండు కారణము లుండును. ఉపాదాన కారణము; నిమిత్త కారణము. వస్తువుయొక్క యుత్పత్తిలో నుపాదాన కారణ మొకే రకమునకు చెందియుండును. నిమిత్త కారణము లనేక ప్రకారములై యుండును. వస్త్రమును తీసికొనుడు. ఇది యొక జన్యపదార్థము. తంతువులు దీనికి నుపాదానకారణములు. ఇవి యన్నియు నొక జాతికి చెందినవే. వీనికి నిమిత్తకారణము లనేకము లుండును. వానిలో కొన్ని కరణములు - యంత్రాదులు. కొన్ని కర్తలు- యంత్రమును నడుపు శ్రామికులు. కొన్ని సంప్రదానములు- ధరించువారు. కొన్ని యపాదానములు - దూది మున్నగు నవి లభించిన స్థలములు. కొన్ని యధికరణములు - దూది, యంత్రాదు లుండు స్థానములు. ఇవన్నియు నిమిత్త కారణములే. వీనిలో నే యొకటి లేకున్నను వస్త్ర ముత్పన్నము కాదు. వీనిలో కొన్నింటికి రెండవస్థలు నుండును. యంత్రాదు లను నడుపు శ్రామికులు కర్తలు. ఇది యొక యవస్థ. కాని, వారు తమకొఱకు వస్త్రముల నుత్పన్నము చేసికొందురేని సంప్రదానములు నగుదురు. ఇది రెండవ యవస్థ. యంత్రము లను నడుపువారు స్వయముగ కర్తలు, సంప్రదానములును నయినపుడు వస్త్రములు పణ్యములు కావు; అవి భోగ్యము లగును. వస్తువు వినిమయమునకు రానంతవరకు నది పణ్యము కాదు. వస్తువు వినిమయముకొఱకు సిద్ధముచేయబడిన కర్త,

సంప్రదానము రెండును భిన్నములగుట యావశ్యక మగును. కర్తకూడ రెండు విధములు. ఒకడు వస్తు వుత్పత్తిలో కరణము లను ప్రయోగించును. రెండవవాడు ప్రయోజకకర్త. ఇతడు స్వయముగ సాధనములను నడుపడు కాని, నడుపువానిని ప్రేరేపించును. కర్త వేతనము తీసికొని యితరులకొఱకు పనిచేయు స్థలమున రెండు విధములగు కర్తలు నుందురు. వస్త్రముల నుత్పన్నము చేయు యంత్రములలో రెండు విధములగు కర్త లుందురు; ప్రయోజకులు, శ్రామికులు. ఇందు ప్రయోజకులు పెట్టుబడిదారులు.

పై కారణములు పణ్యవస్తువుకు చెందినవి. ముద్రల - నాణెముల - కు కూడ నీ కారణము లుండును. ముద్రలు మూల్యము. వస్తువు మూల్యవంతము. రెంటి సంబంధమునకు కారణము సమాన శ్రమము. రు 100 లలో నెంత శ్రమ యున్నదో యంత శ్రమ వస్త్రములలో లేకున్నను, న్యూనము గానో యధికముగానో యున్న నవి పరస్పరము మూల్యము, పణ్యములు కానేరవు. యంత్రస్వామి రు 100 లు వ్యయము చేసి యుత్పన్నముచేసిన పణ్యములను రు 110 ల కమ్మును. రు 100 లలో రు 110 లగు సామర్థ్యము లేదు. మార్క్స్ (క్యాపిటల్ - భా 1 - పు 185) ననుసరించి పణ్యమును కొని మరల నమ్మునపుడు మూల్యమున పరివర్తనము కలుగదు. కొనునపుడు ముద్రలు పణ్యరూపమును ధరించును. మరల వాని నమ్మినపుడు పణ్యములు మొదటి ముద్రల రూపమునకు వచ్చును. రెండవసారి యమ్మిన కారణమున నింతకంటె నెక్కు డేమియు కాదు. కావున ముద్రలద్వారా పణ్యమును

కొనుటలో పరివర్తనము జరుగును. సమాన పణ్యములలో వినిమయము జరుగును; కావున పరివర్తనము మూల్యములో కాక యుపయోగితలో నగును. ఉపయోగిత స్వాయముగ పరివర్తనము చేయదు; దాని యుపయోగము పరివర్తనము చేయును.

పణ్యము, శ్రమము వీని రూపములో మార్పున్న పొర పాటుబడినట్లు స్పష్ట మగుచున్నది. పెట్టుబడిదారుడు ముద్రల యాదానప్రదానముల నిద్దరితో చేయును. శ్రామికుల కిచ్చును; ఉపభోక్తలనుండి తీసికొనును. శ్రామికుల కియ్య వలసినదానికంటె తక్కువ యిచ్చినను, నుపభోక్తలనుండి యధికము తీసికొనినను పెట్టుబడిదారుని ధనము వృద్ధియగును. పెట్టుబడిదారుడు గొప్ప యంత్రమునకు స్వామి. అతడు పణ్యవీధిలో శ్రామికుల శ్రమను కొనును. అందువలన నతనికి శ్రమపై స్వత్వ మేర్పడును. తద్ద్వారా శ్రమజన్య వస్తువుల మీదను స్వత్వము కలుగును. ముఖ్యముగా క్రయవిక్రయ సంబంధము శ్రమతో నున్నది. శ్రమజన్యము లగుటవలన నితర భౌతిక వస్తువులు పణ్యము లగుచున్నవి. భౌతిక వస్తువులతో సంబంధము లేకయే శ్రమ యిచ్చిపుచ్చుకొన వీలగునెడల శ్రమ తప్ప యితరవస్తువు లెన్నడు పణ్యము లయ్యెడివి కావు. శ్రమ తన స్వరూపముతో పణ్య మగును. అది పణ్యమగుటకు వన్యవస్తువు నపేక్షింపదు. భౌతికపదార్థముల స్వరూపము పణ్యమగుటకు శ్రమసంబంధము నపేక్షించును. ఇందుకు విపరీతముగ భౌతికపదార్థములను మూలరూపమున పణ్యము లని యెంచువారికి శ్రమయొక్క పణ్యభావమునకు కారణము

సంప్రదానము రెండును భిన్నములగుట యావశ్యక మగును. కర్తకూడ రెండు విధములు. ఒకడు వస్తు వుత్పత్తిలో కరణములను ప్రయోగించును. రెండవవాడు ప్రయోజకకర్త. ఇతడు స్వయముగ సాధనములను నడుపడు కాని, నడుపువానిని ప్రేరేపించును. కర్త వేతనము తీసికొని యితరులకొఱకు పనిచేయు స్థలమున రెండు విధములగు కర్తలు నుందురు. వస్త్రముల నుత్పన్నము చేయు యంత్రములలో రెండు విధములగు కర్త లుందురు; ప్రయోజకులు, శ్రామికులు. ఇందు ప్రయోజకులు పెట్టుబడిదారులు.

పై కారణములు పణ్యవస్తువుకు చెందినవి. ముద్రల - నాణెముల - కు కూడ నీ కారణము లుండును. ముద్రలు మూల్యము. వస్తువు మూల్యవంతము. రెంటి సంబంధమునకు కారణము సమాన శ్రమము. రు 100 లలో నెంత శ్రమ యున్నదో యంత శ్రమ వస్త్రములలో లేకున్నను, న్యూనముగానో యధికముగానో యున్న నవి పరస్పరము మూల్యము, పణ్యములు కానేరవు. యంత్రస్వామి రు 100 లు వ్యయము చేసి యుత్పన్నముచేసిన పణ్యములను రు 110 ల కమ్మును. రు 100 లలో రు 110 లగు సామర్థ్యము లేదు. మార్క్సు (క్యాపిటల్ - భా 1 - పు 185) ననుసరించి పణ్యమును కొని మరల నమ్మునపుడు మూల్యమున పరివర్తనము కలుగదు. కొనునపుడు ముద్రలు పణ్యరూపమును ధరించును. మరల వాని నమ్మినపుడు పణ్యములు మొదటి ముద్రల రూపమునకు వచ్చును. రెండవసారి యమ్మిన కారణమున నింతకంటె నెక్కు వేమియు కాదు. కావున ముద్రలద్వారా పణ్యమును

కొనుటలో పరివర్తనము జరుగును. సమాన పణ్యములలో వినిమయము జరుగును; కావున పరివర్తనము మూల్యములో కాక యుపయోగితలో నగును. ఉపయోగిత స్వయముగ పరివర్తనము చేయదు; దాని యుపయోగము పరివర్తనము చేయును.

పణ్యము, శ్రమము వీని రూపములో మార్పుల్ని పొరపాటుబడినట్లు స్పష్టమగుచున్నది. పెట్టుబడిదారుడు ముద్రల యాదానప్రదానముల నిద్దరితో చేయును. శ్రామికుల కిచ్చును; ఉపభోక్తలనుండి తీసికొనును. శ్రామికుల కియ్యవలసినదానికంటె తక్కువ యిచ్చినను, నుపభోక్తలనుండి యధికము తీసికొనినను పెట్టుబడిదారుని ధనము వృద్ధియగును. పెట్టుబడిదారుడు గొప్ప యంత్రమునకు స్వామి. అతడు పణ్యవీధిలో శ్రామికుల శ్రమను కొనును. అందువలన నతనికి శ్రమపై స్వత్వ మేర్పడును. తద్ద్వారా శ్రమజన్య వస్తువుల మీదను స్వత్వము కలుగును. ముఖ్యముగా క్రయవిక్రయ సంబంధము శ్రమతో నున్నది. శ్రమజన్యము లగుటవలన నితర భౌతికవస్తువులు పణ్యము లగుచున్నవి. భౌతికవస్తువులతో సంబంధము లేకయే శ్రమ యిచ్చిపుచ్చుకొన వీలగునెడల శ్రమ తప్ప యితరవస్తువు లెన్నడు పణ్యము లయ్యెడివి కావు. శ్రమ తన స్వరూపముతో పణ్య మగును. అది పణ్యమగుటకు నన్యవస్తువు నపేక్షింపదు. భౌతికపదార్థముల స్వరూపము పణ్యమగుటకు శ్రమసంబంధము నపేక్షించును. ఇందుకు విపరీతముగ భౌతికపదార్థములను మూలరూపమున పణ్యము లని తెలంచువారికి శ్రమయొక్క పణ్యభావమునకు కారణము

పరిగా బోధపడదు. గోధుమలు, పాలు మున్నగునవి శ్రమ జన్యములు; అందువలన నవి పణ్యములు. శ్రమజన్య మగుటయే పణ్యమగుటకు కారణమగు పక్షమున శ్రమ పణ్యము కాకుండవలెను; శ్రమ, శ్రమజన్యము కాదుగదా! కాలిన యినుము దహింప గలుగును. అగ్నిసంబంధము లోహమును దహించునదిగ చేయును. అగ్ని స్వస్వరూపముతో దాహకారణము. ఎవడేని లోహమును దాహ కారణముగ నంగీకరించిన నగ్నిలోకూడ లోహసంబంధమును వెదకవలసి వచ్చును. దాహమునకు శుద్ధమైన యగ్నివలె, శుద్ధమైన శ్రమ పణ్యభావమునకు కారణము. అగ్నిసంబంధము లోహమును దాహకము చేసినట్లు శ్రమసంబంధము భౌతికవస్తువులను పణ్య మొనర్చును.

భౌతికపణ్యము లుపయోగకరము లగుచున్నవి. అవి మనుజుని కొండొక సుఖమునకు కారణము లగును. సుఖప్రాప్తికి సాధనములు కాకున్న దుఃఖనివృత్తికైనను సాధనము లగును. ఔషధములు రుచిలో చేదైనను రోగమును దూర మొనర్చును. కావున నవి పణ్యము లగుచున్నవి. వానిలో రోగమును దూరముచేయు సామర్థ్యము శ్రమవలన జనించినది. శ్రమవలన భౌతిక వస్తువులలో నుపయోగిత యేర్పడును. ఉపయోగితను కలిగించు శ్రమకూడ నుపయోగి యగును. భౌతికవస్తువు తన యాకారముచేతను, గుణముల మూలముననను నుపయోగి యగును. ఆకారము, గుణములు నను వీనిలో కొంతభాగము స్వాభావికము, మరికొంత శ్రమ జన్యము నగును. జన్యగుణముల మూలమున పణ్యము

లుపయోగకరము లగుచున్నవి. ఈ జన్యగుణములు భౌతిక వస్తువుల యంశములలో నుండును. కొయ్యలో నావ యగుటకు గల సామర్థ్యము దాని ప్రత్యవయవములో నున్నది; కాని శ్రమచేయక యది నావగా సిద్ధముకాదు. నిర్మాతయొక్క యుపయోగిశ్రమ కాష్ఠమును నౌకాకారమునకు తెచ్చును. శ్రమ, శ్రమజన్య మగు నుపయోగితా సంబంధము నౌకను పణ్యముగ చేయుచున్నవి. శ్రమయొక్క యుపయోగిత కేవలము వస్తువు నుపయోగిగ చేయును. భౌతిక పణ్యములం దున్నట్లు శ్రమలో గుణము లుండవు. గుణము లుండగల యవయవములును దానియందు లేవు.

జన్యవస్తువునం దుపయోగిత యున్నంతవరకు నది పణ్యమగును. వస్తువు నుపయోగించినకొలది దాని యుపయోగిత నశించును. పూర్ణముగ నశించినమీదట నది పణ్యముగా నుండదు. వస్తువు పణ్యముగా నున్నంతవరకు శ్రమకు మూల్యముండును. ఉపయోగిత, శ్రమము వీనియొక్క నిజరూపము మీద పణ్యభావ మాధారపడి యుండును. అన్య భౌతిక పణ్యములలో నుపయోగిత, శ్రమము రెండును వేరు వేరుగ తోచును. పణ్యరూప మగు శ్రమలో శ్రమస్వరూపముకంటె వేరుగ నుపయోగిత కనబడదు. అన్య పణ్యములలో నుపయోగిత కాధారము లగు నుపాదానకారణములు శ్రమకంటె భిన్నములుగా నుండును. శ్రమయొక్క యుపయోగితకుపాదానకారణములు శ్రమకంటె భిన్నములుగా కనిపింపవు. కావున నుపయోగిత శ్రమను పణ్యము చేయునపుడది దాని స్వరూపమున కభిన్నమై యుండును.

ఒక డొక పణ్యమును మూల్యమిచ్చి తీసికొనునప్పుడు దాని నుపభోగ సాధనముగ నెంచి తీసికొనును. తరుచుగ జనులు పణ్యములను కొని వాని నుపభోగింపసాగుదురు. ఒక డొక పణ్యమును విక్రయించుటకు తీసికొనిన దానిని వెంటనే యుపభోగింపడు. దానిని పణ్యదశలోనే యుంచును. ఆ దశ లోను నది యుపభోగ సాధన మగును. వస్త్రమును శ్రామికుని నుండి తీసికొని వ్యాపారి తనదగ్గర నుంచుకొనినను, లేక శ్రామికుడు వ్యాపారి కీయక తనదగ్గరనే యుంచుకొనినను, అది యుపభోగింపబడనంతవరకు పణ్యముగానే యుండును. వ్యాపారి వస్త్రము నమ్మి ప్రాప్తించిన ముద్రలతో నన్యభోగ్య వస్తువులను తీసికొనును. ఇట్లు వస్త్రము పరంపరగా వ్యాపారి యుపభోగమునకు సాధన మగుచున్నది. వస్త్రమును వ్యాపారినుండి కొన్నవారు దానిని ధరింప నుపయోగింతురు. వారి యుపభోగమున కది సాక్షాత్ సాధన మగుచున్నది. ముఖ్యరూపమున సుఖదుఃఖముల యనుభవమునకు నుపభోగ మని నామము. అమ్మటకై వ్యాపారి పణ్యమును కొన్నపుడు- సాక్షాత్తుగ దాని యుపభోగము కానపుడు - దాని నుపభుక్త మని చెప్పిన నౌపచారిక మని యెంచవలెను. వ్యాపారి శ్రామికులనుండి యమ్మకమునకు పణ్యములు తీసికొని వాని నుపభోగించునని జను లందురు; కాని, వానిని వ్యాపారి యమ్మును; వాని నుపభోగించి సుఖము ననుభవింపడు. కావున నతడు ముఖ్యరూపమున నుపభోక్త కాడు. శ్రామికుడు వస్తువులను వ్యాపారి కమ్మును; వ్యాపారి యుపభోక్తల కమ్మును. శ్రామికుడు కానీ, వ్యాపారి కానీ, యాపణ్యముల

నుపభోగింపలేడు. యంత్రస్వామి శ్రామికునకు మూల్యమిచ్చి వాని శ్రమను కొన్నపుడు శ్రామికునికూడ భౌతిక వస్తువు వలె పణ్యరూపి యగుచున్నాడు. శ్రామికుల యధిపతి శ్రమ కాలమున సుఖమును బొందడు. కాని, శ్రమజన్య వస్త్రువుల మీద నధికారము వహించును. ఆ కారణమున నతని నా సమయమున నుపభోక్త యందురు.

ఉపభోగ మారంభమైన మీదట భౌతిక పణ్యములు క్రమముగా నశింప నారంభించును. కొంతకాలమునకు పిదప పణ్యము బొత్తిగా నశించును. అపుడా వస్తువుయొక్క యుపభోగము పూర్తి యగును. ఇట నుపభోగము కారణము, నాశము కార్య మగును. అన్నము తినుటచేతను, పాలు త్రాగుటచేతను నశించును. వ్యవహారమున నవి యుపభుక్తము లనబడును. వస్తునాశము అర్థతః తెలిసికొన నగును. వస్తు నాశమున కనేక కారణము లున్నవి. అన్నమును, పాలను నీటిలోను, మట్టిలోను వేసి నష్టపరుపవచ్చును. ఆ దశయం దవి యుపభోగము కాక నశించుచున్నవి. అన్నము, పాలు నుపభోగించునపుడు సుఖము కలుగును. ఉపభోగము నశించిన తదుపరి, యవి రుధిరాది రూపమున పరిణమించినపుడును సుఖము లభించును. అన్నముయొక్క యుపభోగము దాని స్థూలరూపమును నశింపజేసి రుధిరాది పరిణామము ద్వారా సుఖమునకు కారణ మగును. ఉపభోగము జరుగకయే యన్నము నశించిన రుధిరాది రూపమున నది పరిణమింపదు. కావున నుపభోగము సుఖకారణ మందురు. అన్నము యొక్క స్థూలరూప నాశము సుఖకారణము కాదు. బీజము

యొక్క స్థూలరూపము నశించినమీదట బీజమునుండి యంకుర జన్మము కలుగును. అయినను వ్యవహారమునందు బీజము నంకురమునకు కారణ మందురు; బీజనాశ మంకుర కారణముగ చెప్పబడదు.

శ్రామికులు యంత్రస్వామికొఱకు శ్రమింతురు. అప్పుడు వారి శ్రమ వస్త్రముల నుత్పన్నముచేసి నశించును. శ్రమ యన క్రియ. యది తంతువుల సంయోగ విభాగములను కలిగించును. అందువలన వస్త్రము లుత్పన్నములగును. మొదటి క్రియ వస్త్రములో నతి సూక్ష్మాంశమును నిర్మించి నశించును. రెండవ క్రియ రెండవ యంశమును నిర్మించి కొన్ని క్షణములలో నశించును. ఇట్లు వేలకొలది క్రియలు తమ యంశముల నుత్పన్నముచేసి నశించిన పిదప తంతువులు పటరూపమున పరిణమించును. ఏ క్రియ యే యంశము నుత్పన్నము చేయునో యది దానికి నిమిత్త కారణము. మొదటి క్రియ నశింపనంతవరకు రెండవ క్రియ జనింపదు. ఆ కారణమున ప్రథమక్రియానాశము ద్వితీయ క్రియోత్పత్తికి నిమిత్తము. ఇట్లు పూర్వపూర్వక్రియల నాశము తమతమ యుత్తరోత్తర క్రియల యుత్పత్తికి కారణ మగును. కాని, వ్యవహారమునం దన్నాదుల యుపభోగము రుధిరాదుల యుత్పత్తికి కారణమని చెప్పునట్లు, అంకురోత్పత్తికి బీజము కారణ మనునట్లు, వస్త్రోత్పత్తికి క్రియను కారణముగ వ్యవహరింతురు. తర్కదృష్టిలో అన్నస్థూల రూపనాశము రుధిరాదులకు, బీజస్థూల రూపనాశము అంకురోత్పత్తికి కారణమైనట్లు క్రియానాశము వస్త్రమునకు కారణ మగుచున్నది. బీజనాశ

ముపభోగముద్వారా కాదు; కాబట్టి యట బీజోపభోగ మంకు రమునకు కారణము కాదు. వస్త్రము నుత్పన్నము చేయుటలో గలుగు క్రియానాశము నుపభోగముద్వారా కలుగదు; కావున నిక్కడకూడ శ్రమోపభోగము వస్త్రో త్పత్తికి కారణము కాదు. అన్నముయొక్క యుపభోగము నాశముద్వారా కారణ మగును. అందువలన తరుచుగా నుప భోగమును, నాశమును రెంటి నొక్కటిగా నంగీకరింతురు. వాస్తవమున వానిలో నేకత లేదు; వస్త్రోత్పాదనమున నగు క్రియానాశము ఉపభోగముద్వారా కాదు; అయినను దాని నుపభోగ మనిన, నది వ్యవహార సామ్యమువలన నని స్పష్ట మగుచున్నది. ఉపభోగముద్వారా కలుగు అన్ననాశము రుధిరాదులకు కారణ మగుచున్నది. ఉపభోగింపకయే జరుగు క్రియానాశము వస్త్రోత్పత్తికి కారణ మగుచున్నది. ఈ రెండు నాశములును వస్తువు నుత్పన్నము చేయుటవలన సమానము లగుచున్నవి. వాస్తవమున శ్రమము, దాని నాశము వస్త్రమునకు కారణములు.

వస్త్రము నమ్మినందున మూల్యము లభించును. కావున శ్రమ మూల్యమునకును కారణ మగుచున్నది. ఈ విషయ మును బాగుగ గుర్తింపనందున మార్క్సు శ్రమయొక్క యుపయోగితను, దాని యుపభోగమును రెంటిని మూల్య మునకు కారణముగా నంగీకరించెను. అతని యాలోచన నను సరించి, యన్య భౌతిక పణ్యముల మూల్యమునకు కారణము శ్రమ యగుచున్నది (క్యాపిటల్ భా 1. పు. 186). కాని, శ్రమశక్తి యొకవిధమగు పణ్యము; దాని యుపభోగము

మూల్యము నుత్పన్నము చేయును. వాస్తవమున నుపభోగము మూల్యోత్పాదకము కాదు. అది వినాశకము. భౌతిక పణ్యములను శ్రమ, దానివలన నుత్పన్నమగు నుపయోగిత యొక్క సంబంధము రెండును మూల్యవంతములుగ చేయు చున్నవి. శ్రమమూల్యమునకు కారణములు దాని స్వరూపము, దానిలో నవిభక్తముగా నుండు నుపయోగితయు నగుచున్నవి.

ద్రవ్యమూల్యమును నిశ్చయించు ప్రక్రియ ద్రవ్యోత్పాదక ప్రక్రియను మిక్కిలి పోలియుండును. పణ్యవస్తువు, దాని మూల్యము రెండును జన్యములే. ఒక కార్యము ననేక కారణము లుత్పన్నము చేయును. ఇవి యన్నియు కార్యముకంటె ముందుండును; కాని యన్ని కారణముల కాలము సమమై యుండదు. కార్యమునకు సాక్షాత్ కారణము లయిన వన్నియు కార్యోత్పత్తికి పూర్వ మేక కాలమున నుండుట యావశ్యకము. కాని పరంపరగా కారణములగువాని కాలము సమానము కాజాలదు. తంతువులు, ఉపకరణములు, నేతగాడు వస్త్రమునకు సాక్షాత్కారణములు. ఇవి యన్నియు నియమముగ వస్త్రోత్పత్తికి ముందుగ నొకే కాలమున నుండును. తంతువులు మున్నగునవి కూడ జన్యములే. వాని కారణములు వానికంటె పూర్వమున నుండును. తంతువులు దూదినుండి, దూది ప్రత్తిచెట్టునుండి, ఆ చెట్టు దాని బీజము నుండియు నుత్పన్నమగును. బీజము దానికి ముందుండు చెట్టు నుండి, ఆ చెట్టు తనకు ముందున్న బీజమునుండి, ఇట్లు బీజవృక్ష పరంపర నడచుచుండును. నేతగాని తండ్రి, తాత,

ముత్తాతల రూపమున నొక పరంపర ప్రసిద్ధమే. పరంపరకు సంబంధించిన కారణము లొకదానికంటె మరియొకటి వెనుక ముందుగా నుండును. వస్త్రము నుత్పన్నమొనర్చు సాక్షాత్కారణములను గూర్చి యాలోచించినపు డీ కారణము లన్నియు నన్యథా సిద్ధములై కారణములలోనే చేరవు. వస్త్ర ముత్పన్నమగు క్షణమున పరంపరాకారణములు కొన్ని యుండనే యుండవు. కొన్ని యున్నను వాని యునికి లేమికి సమానమే యగును. అయినను పరంపరగా నివి యన్నియు కారణములే. ప్రత్తివిత్తనము లేకున్న, చెట్టుండదు; అది లేకున్న దూది యుండదు. అది లేకున్న నూలు, నూలు లేకున్న వస్త్రము కాదు. ఇట్లే నేతగాని తండ్రి తాతలు లేకున్నను వస్త్ర ముత్పన్నము కాదు. పరంపరా కారణములలో వేని యంశము స్థిరమై వచ్చుచుండునో యా యంశ మంతిమ కార్యోత్పత్తికి సహకారి కారణ మగును. అంతిమ కార్యము వస్త్రము. దానిని దృఢపరుపవలె ననిన తంతువులు దృఢముగా నుండవలెను. అందులకు దూది మంచిది కావలెను. అందులకు క్షేత్రము మంచిది కావలెను. అందు మంచి పైరు కావలె ననిన మంచి విత్తనములు; చతురుడైన కృషీవలుడు కావలెను. ఇట్లు పరంపరా కారణము లుత్కృష్టములు కాకున్న నంతిమ కార్య మగు వస్త్రము దృఢమైనది కాదు. భూమి, కృషికుడు మున్నగు కారణములలోని మంచితనము తరువాతి కారణముల యుత్కర్షకు కారణ మగుచు, నది చివరి కారణములైన తంతువుల వరకు చేరును. తంతువుల యుత్కర్ష వస్త్రములోని

యుత్కర్షకు కారణ మగును. పూర్వాపూర్వ కారణములలోని యుత్కృష్టత యుత్తరోత్తర కారణములలో సంక్రమించుచు చివరకు వస్త్రమునం దది ప్రస్ఫుట మగును.

వస్త్రమువలెనే వస్త్రమూల్యోత్పత్తియు ననేక కారణములవలన నగును. వస్త్రమూల్యమునకు ముఖ్య కారణము శ్రమ. శ్రమ లేకయే లోకమున వస్త్రము సిద్ధమైన దానికి మూల్య ముండరాదు. శ్రమ యెంతో మూల్య మంత. శ్రమచేయుట కయిన కాలము వస్త్రమూల్యమును నిశ్చయించును.

భూమి, నీరు మున్నగు నిమిత్త కారణముల సహాయమున నంకురము బీజముకంటె పెద్ద యాకారమున ప్రకట మగును. అంకురమువలన బీజము నష్టమైనట్లు, అంకుర మూల్యమువలన బీజమూల్యము నష్టము కాదు. అంకుర మూల్యము బీజమూల్యముతో నేకాకారమై వృద్ధినొందును. ప్రత్తివిత్తనము మొదలుకొని వస్త్రమువరకు గల కార్య కారణ పరంపరలో మొదటిది తరువాతిదానికి సహాయక మగుచున్నది. బీజమూల్యము మొదలుకొని వస్త్రమూల్యము వరకు కూడ నిదే దశ. నూలువడుకుట, కదురు మున్నగు సాధనముల మూల్యము లేకమై పటమూల్య మగుచున్నది.

కారణము లన్నియు వస్తువును సమాన రూపమున నుత్పన్నము చేయవు. తంతువులవలన వస్త్రము ఉత్పన్న మగును. అప్పుడు తంతువుల యాకారమునందు వానిని గుర్తింపజాలనంత మార్పేమియు రాదు. రాతితోను, కాష్ఠముతోను పాత్రలు నిర్మింపబడును. వానిలో రాయి,

కాష్ఠము వీని యాకారము స్పష్టమగుచునే యుండును. గోధుమలు, జొన్నలు మున్నగువానిని పిండిచేసినపుడు వాని మొదటి యాకారము బొత్తిగా మారిపోవును; కాని, పిండి రూపములో నవి కనబడుచునే యుండును. కార్యముతో నుపాదానకారణము తప్పక యుండును. కావున కార్య మూల్యముతో బాటు ఉపాదాన మూల్యముకూడ నుండును.

నిమిత్త కారణములు కార్యము నుత్పత్తిచేయు విధము విలక్షణముగా నుండును. అవి కార్యము నుత్పన్నము చేయు నపు డుపాదానముతో సంబంధము కలిగి యుండును. కాని, కార్యోత్పత్తి యైన తదుపరి కార్యముతో వానికి సంబంధ ముండదు. నిమిత్త కారణముల ద్వారా యుపాదాన కార ణములందు జరుగు పరివర్తనము కార్యమునందు కనబడు చుండును. వడ్రంగి, ఉలి, రంపము మున్నగునవి కాష్ఠమున నిర్మించు నాకారము సిద్ధమైనవస్తువులలో కనిపించును. ఆ వస్తువుల యాకారము ఉలి మున్నగు సాధనముల సంబంధ మును తెలుపును. అట్లే వస్తుమూల్యములో సాధన మూల్యము కలిసి యుండును.

ఉలి, నిర్మాణశాల మున్నగు నిమిత్త కారణములు నిత్యము కార్యముల నుత్పన్నము చేయుచుండును. నిర్మించు సమయమున వాని యాకారము వికృతము కాదు. ఉత్పా దనము చేయుటలో నసమర్థము లైనపుడు కూడ వీని యాకా రము మొదట నున్నట్లే యుండును. ఇవి వస్తువులను నిర్మించు నపు డశేష రూపమున నిర్మించును - రంపమో, చిత్రికయో పనిచేయునపుడు వాని యవయవము లన్నియు రచనతో

సంబద్ధములై యుండును. కాని, యివి మూల్యము నంశముల ద్వారా యుత్పన్నము చేయును. ఇవి కార్యము నారంభముచేసిన దినము మొదలుకొని, మిక్కిలి వికృతములైనందున పనినుండి తొలగు దినమువరకు చేసిన సమస్త కార్య కలాపమును విచారించి చూచిన, నవి తమ మూల్యమును అంశ మంశముగా - కొంచెము కొంచెముగా - కార్యములకు - వస్తువుల కర్పించినట్లు స్పష్టమగును. రు 100 ల విలువగల యంత్రము 100 దినములు పనిచేసి విరిగిపోయిన నా యంత్రపు మూల్యములో నూరవవంతు అది చేసిన కార్యమునందు ప్రతిదినము పోయినట్లు తెలిసికొన నగును.

దీనికి విపరీతముగ కొన్ని యెడల కారణములు పూర్ణ రూపముతో మూల్యము నుత్పన్నము చేయును. వాని సమస్తావయవములు తమ మూల్యము నుత్పన్న కార్యమున కిచ్చివేయును. కాని, కార్యము నుత్పన్నము చేయుటలో వాని కొన్ని భాగములు చేష్టాయుక్తము లగును; కొన్ని వేరై పోవును. వడ్రంగి కొయ్యతోను, కమ్మరి లోహముతోను పనిచేయును. అప్పుడు కొయ్యలోను, లోహమునందును కొంతభాగము చెక్కడు మున్నగువాని క్రింద పోవును. మిగిలిన భాగము వస్తు వగును. వీనిలో నిట్లు కొంతభాగము వ్యర్థము కాక తప్పదు. మొదటనున్న పరిమాణము వస్తు వుత్పన్నమైన తదుపరి యుండదు. కాని, మూల్యము నుత్పన్నము చేయుటలో నీ కారణములలో నే భాగమును వ్యర్థము కాదు. సమస్త కాష్ఠము, లోహము వీని మూల్య మంతయు కార్యవస్తువులందు వచ్చును. తరుచుగా

నుపాదానకారణములు కార్యరూపమున నిట్లు పరిణమించు చుండును.

ఇట నొక విషయము ధ్యానమున నుంచుకొనవలెను. ఏ భాగము తప్పనిసరిగా వేరై పడిపోవునో యది కార్యమున కుపాదానము కాదు. కార్యరూపమును ధరించిన పరిమాణములోనే యది యుపాదానకారణ మగుచున్నది. మూల్య విషయమున నట్లుకాదు. కార్యరూపమున పరిణతములైన భాగములు, వేరై క్రిందపడి వ్యర్థములైన భాగములు రెండును మూల్యమునకు కారణము లగుచున్నవి. చెక్కడు మున్నగు వానిక్రింద వ్యర్థమైన భాగములు కార్యము నుత్పన్నము చేయవు; కాని మూల్యము నుత్పన్నము చేయునని భావము. వ్యర్థభాగములు కార్యోత్పత్తికి నిమిత్తకారణము లగును. ఆ భాగములు వ్యర్థము కాకున్న కార్యము నుత్పన్నము కాజాలదు. కాబట్టి యవియు కారణములే. ఉపాదాన కారణము కార్యమును, మూల్యమును భిన్న భిన్న రూపమున నుత్పన్నము చేయదు. అది సంపూర్ణ రూపమున రెంటిని నుత్పన్నము చేయును. మొదటి దశలో కాష్ఠమునం దుపాదానకారణముగా చివరకు మిగిలిన భాగము, చెక్కడులో వ్యర్థముగాపోయి నిమిత్తకారణము లయిన భాగము కలిసి యుండును. అవిభక్తముగా నుండుటచే కాష్ఠము నుపాదానకారణముగానే వ్యవహరింతురు.

నిమిత్తకారణ స్వభావము విలక్షణముగా నుండును. అది యుపాదానకారణమునుండి బొత్తిగా వేరై యుండి యొక కాలమున సంపూర్ణరూపముతో ద్రవ్యము నుత్పన్నము

చేయును; కాని మూల్యమున కొలది కొలదిగా - అంశరూప మున - చేరును. రు 100 ల విలువగల యొక యంత్రము 100 దినములు పనిచేసి చెడిపోయిన దనుకొనుడు. అది యొక దినమున నే వస్తువు నుత్పన్నము చేసినదో దానిని సంపూర్ణ రూపముతో తాను లగ్నమై యుత్పన్నము చేసియున్నది. అనగా యంత్రమున నొక చిన్న యంశముకూడ నా వస్తువును నిర్మించుటలో పనిచేయక యుండదు. కాని యా యంత్ర మొక దినపు పనిలో మూల్యము నాంశికముగా నిచ్చును. మూల్యములో నూరవవంతు యంత్రములో నెంతభాగములో నుండునో యంతభాగమే తనయందున్న మూల్యము నొక దినపు కార్యములో చేర్చి యంశరూపమున కారణ మగు చున్నది. మిగిలిన యంత్రభాగములు తమయం దున్న రు 99 ల విలువను నాటి కార్యమున చేరనియ్యవు. ఆ యంశ ములే నాటి కార్యమును నాంశికముగ నుత్పన్నము చేయవు. కారణ మేమన: అవి యంత్రపు భాగములు - యంత్రము నందు కలిసి యుండును. కలిసిన రూపముననే ప్రతిదిన కార్యము నుత్పన్నము చేయును. ఉపాదానము లైనను, నిమిత్తము లైనను, అన్నింటి మూల్యము కార్యద్రవ్యమున చేరి సురక్షిత మగును.

ఉపాదానకారణములు కార్యము నుత్పన్నముచేసిన తదుపరి వానికి మొదటి యాకార ముండదు. ఆ యాకార మునుబట్టి చూచిన వాని నాశము జరిగినట్లెంచవలెను; కాని, వాస్తవమున నుపాదానకారణములు స్థిరముగా నుండును. మరియొక యాకారమును ధరించుటకు మొదటి యాకారము

నవి త్యజించుచున్నవి. తంతువులు తమయాకారమును విడిచి పటరూపమును బొందుచున్నవి. మొదటి యాకార ముండనందున మొదటి మూల్యము నుండదు. కాని మూల్యము బొత్తిగా లోపింపదు. మొదట తంతువులలోను, నేతసాధనములలోను నున్న మూల్యా మిప్పుడు పటము - వస్త్రము - లో చేరును.

తరుచుగా నుపాదానములో నెక్కుడు వికారము కలుగును; నిమిత్తకారణములందు తక్కువ కలుగును; కాని యొక్కొక్కప్పుడు నిమిత్తకారణమునందును నెక్కుడు వికారము కలుగును. తంతువులు వస్త్రము, లోహము కత్తి యయినపుడు వానిలో కలిగినంత వికారము వస్త్రమును, కత్తిని చేయుట కుపయోగించు నితరకారణము లలో కలుగదు. కాని పిండితో రొట్టెలు కాల్చినపుడు నిమిత్తకారణమైన బొగ్గులు పూర్తిగ వికృతములై నశించును. ఉపాదాన మైన పిండికంటె నిమిత్తకారణ మగు బొగ్గు లెక్కుడుగా నశించును. వానిలో నధికభాగములను సూచించు చిహ్నముకూడ నుండదు. ఎంత వికృతములైనను కారణముల మూల్యము నశింప దనుట మాత్రము స్పష్టము. రొట్టెలుచేసి యమ్మువాడు బొగ్గుల మూల్యమును రొట్టెలలో చేర్చి వాని నమ్మును. కార్యోత్పత్తి సమయమునందును, తరువాతను, కారణములకు కార్యముతో సంబంధ మున్నను, లేకున్నను, కారణప్రభావము కార్యమున కనబడినను, కనబడకున్నను, కారణ మూల్యము కార్య ద్రవ్యమున తప్పక యుండును. బొగ్గులు కాలునపుడు

రొట్టెలను పక్వము చేయును. బొగ్గుల తాపప్రభావము రొట్టెలో కనబడును. కాని, కాష్ఠముతోను, లోహము తోను వస్తువులు చేయబడినపుడు, చెక్కుడు మున్నగు విధముల వ్యర్థముగా పోయిన భాగములకు కార్యవస్తువులతో సంబంధము కానీ, వాని ప్రభావము వస్తువులలో కానీ కని పింపదు; అయినను వాని మూల్యము వస్తువులలో తప్పక చేరును. కార్యోత్పత్తికి కారణములలో వికారము కలుగక తప్పదు. కావున వాని మూల్యము వస్తువులలో చేర్పక తప్పదు.

పణ్యముల మూల్యము శ్రమమూల్యముపై నాధార పడి యున్నది. శ్రమ స్వయముగానే మూల్యము. దాని సంబంధము మూల్యరహితములైన భౌతిక వస్తువులను మూల్యము గల పణ్యములుగ చేయుచున్నది. దూది, వస్త్రము, బీజములు మున్నగున వన్నియు శ్రమ సంబంధము చేతనే మూల్యవంతము లగుచున్నవి. ఇతరుల సుఖమునకు కారణ మగుటచే శ్రమ మూల్య మగుచున్నది. శ్రమ సంబంధమును బొంది వస్త్రాదు లితరులకు సుఖసాధనము లగుచున్నవి. కాని, కేవలము సుఖసాధన మైనంత మాత్ర మున శ్రమ మూల్యము కాజాలదు. అది మఱియొక శ్రమకు సమానము కూడ కావలయును. రెండింటి కాలము నేక మైనపుడు సమానత సిద్ధమగును. 20 సేర్ల గోధుమల మూల్య మొక రూప్యమైన గోధుమలు, రూప్యము నను నా రెంటి శ్రమకాలము సమాన పరిమాణములో నున్నట్లు తెలియనగును. ఇక్కడ శ్రమ యొక స్థానమున గోధుమల

రూపమునను, మరియొక స్థానమున నొక రూప్యరూపమునను ఉన్నది. నూలుమూల్యమును నిశ్చయింపవలసి వచ్చిన నూలు నుత్పన్నము చేయుటలో నెంత శ్రమ చేయబడినదో చూతుము. దూది, కదురు మున్నగువాని రూపములో మొదటినుండి యున్న మూల్యముకంటె, శ్రామికుని శ్రమ యెక్కుడు మూల్యము నుత్పన్నము చేయును. ఈ నూతన మూల్యము నూలురూపమున కనిపించును. నేతగాడు నూలుతో శ్రమచేసి నూలుమూల్యముకంటె నెక్కుడు మూల్యము నుత్పన్నము చేయును. ఒకప్పుడు 20 సేర్ల గోధుమలు నాలుగు గంటల శ్రమఫలమైన, 20 సేర్ల గోధుమ లిచ్చి యొక రూప్యము తీసికొనువాడు నాలుగు గంటల శ్రమ నిచ్చి యొక రూప్యము పుచ్చుకొనుచున్నా డని భావము. ఒక రూప్యము నిచ్చి యతడే వస్తువును (4 సేర్ల పాలు - 4 గజముల గుడ్డ -) తీసికొనునో దాని ద్వారా యతనికి 4 గంటల శ్రమ లభించును.

భౌతిక పణ్యముల క్రయ విక్రయములలో శ్రమ - మూల్యము స్పష్టముగ వేరై కనిపింపదు. శ్రమవలన నెట వస్త్వాకారము మారదో, వస్తువు మరియొక యాకారమున నమ్మబడదో యట కేవల శ్రమకు మూల్య ముండును. చాకలి వస్త్రముల నుతికి యిచ్చును; మంగలి కేశఖండనము చేయును. వా రా పని చేసినందులకు వారికి నొక్కొక్క రూప్యము లభించిన నది వారి శ్రమమూల్యము. ఈ విధముగ కేవల శ్రమము చిరకాలమునుండి విక్రయింపబడుచు వచ్చుచున్నది.

శ్రమను భౌతికపణ్య మొనర్చి యమ్మువారును కేవల శ్రమ నమ్మ మొదలిడిన గలుగు నాటంక మేమియు లేదు. నేతగాడు నూలును వస్త్రముచేసి యమ్మును. అత డా వస్త్ర మును పెట్టుబడిదారున కిచ్చి శ్రమమూల్యము తాను గ్రహించినపు డతడు కేవల శ్రమ నమ్ముచున్నాడు. ఆ వస్త్ర మమ్ముడు బోవునా? లేదా? ఎన్న డమ్ముడు బోవును? మున్నగు విషయముల నత డాలోచింపడు. అతడు దినమున కెనిమిది గంటల చొప్పున శ్రమచేసి వేతనము పొందగోరును.

శ్రమ క్షణిక స్వభావము గలది. అది భౌతిక పణ్య ములలో జేరి స్థిర మగును. జడవస్తువులో నొకమా టది యే రాశిలో స్థిరమగునో మరల తనకు తానుగా మారదు. కాని శ్రమకు సంబంధము చేతనుడగు మనుజునితో నైనపుడు దాని పరిమాణము స్థిరముగా నుండదు. 20 సేర్లలో 4 గంటల శ్రమ యున్న దానిలో నొక క్షణపు శ్రమకూడ వృద్ధి కాదు. కాని, ఒక శ్రామికు డొక దినమున నెనిమిది గంటలు శ్రమచేసిన నది వాని కనివార్య నియమము కాదు. అతడు కోరి మరునాడు 10 గంటలు పనిచేయవచ్చు; 12 గంటలు చేయగలడు. శ్రమకు రెండు కారణములు. ఒకటి శరీరము; రెండు ఆత్మ. ఆత్మ స్వతంత్రము. అది చేయగలుగును; చేయకయు నుండగలుగును; పూర్వము చేసినరీతికి విపరీత ముగను చేయగలుగును. శ్రమకు చేతనములతోను, జడ ములతోను సంబంధము కలుగుటచే పణ్యశ్రమకు, శ్రమజన్య-భౌతిక పణ్యములకు నింత భేదము కలుగుచున్నది.

పణ్యము నమ్మునపుడు వ్యాపారి నాలుగుగంటల శ్రమగల వస్తువు నొకని కిచ్చిన నంతటి మూల్యము తనకు లభింపవలె ననియు, దానివలన నాలుగుగంటల శ్రమగల మరియొక వస్తువును తాను కొనగలిగి యుండవలె ననియును నాలోచించును. శ్రమను కొనునపుడుకూడ నత డా విషయము నాలోచించును. రెండు రూప్యములలో నున్నంత శ్రమ, యెనిమిది గంటలలో నున్నట్లు నిశ్చయించుకొని, యత డొక దినపు శ్రమను కొనును. తనతన పద్ధతిలో వ్యాపారి, శ్రామికుడు నిరువురును దిన మంతయు శ్రమ చేయుదురు. మూల్యమును కూడ తీసికొందురు. మూల్యము జీవన సాధనము. ఒక దినపు మూల్య మొకదినపు జీవనసాధనము కావలెను. ఒక దినపు జీవనమునకు కావలసిన అన్నపానములు, వస్త్రములు, నుండుటకు స్థానము లభింపవలయును. ఒక దినమునకు కావలసిన యన్నపానాదులు రెండు రూప్యములలో లభింపవలెను. ఇట్లు రెండు రూప్యము లొకవంక నెనిమిది గంటల శ్రమమూల్య మగుచున్నది. మరియొకవంక నొక దినమునకు కావలసిన యన్నపానముల మూల్య మగుచున్నది. తినుటకు, కట్టుటకు, నుండుటకు సాధనములులేని శ్రామికుడు దిన మంతయు పనిజేయజాలడు. అన్నపానములకగు సాధనముల మూల్యము మారుచుండును. దాని ననుసరించి దైనిక శ్రమమూల్యముకూడ న్యూనాధికము లగుచుండును. దినమునకు చాలినంత యన్నముద్వారా రాత్రింబవళ్లు (24 గంటలు) జీవింపగల సామర్థ్యము లభించిన, శ్రమకు మూల్యము తగిన దగును. దినములో రాత్రికూడ చేరి యుం

డును. రాత్రియంతయు నాకలితో నుండువాడు పగ లెనిమిది గంటలు పనిచేయజాలడు.

భౌతిక పణ్యముల మూల్యము రాత్రిందివముల జీవన సాధనము. కాని దాని పరిమాణము పగటి జీవనము ననుస రించియే నిశ్చితమయిన వ్యవస్థ కాజాలదు. కావున పణ్య ముల యుత్పత్తికి శ్రమకాల మెంత యగునో దాని ననుసరించి పణ్యమూల్యమును నిర్ణయింతురు.

## పదునొకండవ యధ్యాయము

# మూలధన స్వరూపము - దానికి కారణము

ధనము వినిమయసాధనము. అది వినిమయము ద్వారా లాభము నుత్పన్నము చేయ మొదలిడినపుడు దాని పేరు పెట్టుబడిధన మగును. సంస్కృతమున నిది మూల మనబడును. బీజ మంకురించి, పత్రములు, శాఖలు, స్కంధము మున్నగు రూపములను ధరించి, వృక్షమయి, మరల ననేక బీజముల నుత్పన్నము చేయునట్లు మూలధనము వినిమయ క్రమమున మిక్కిలి ధనము నుత్పన్నము చేయును. లాభముగా లభించిన ధనముకూడ మూలధనముతో కలిసి మూల మగును. ఆటంకము లేకున్న బీజాంకురములవలె మూలధనము, అంకురధనము నను వీని పరంపర దీర్ఘకాలము వరకు నడుచును.

కాని, మూల - అంకుర ధనములకు బీజాంకురములతో సామ్యము స్వాభావికము కాదు; ఔపచారికము - గౌణము. బీజములో నంకురము నుత్పన్నము చేయు శక్తి స్వాభావిక ముగ నున్నది. నీరు, ఎండ, మున్నగువాని సంసర్గమును పొంది యాశక్తి నియతకాలమున ప్రకట మగును. ధనములో పణ్యములను వినిమయము చేయింపగల శక్తి స్వాభావికముగ నున్నది. పణ్యములు పణ్యములను వినిమయము చేయించినపు డవి ధన మగును. కాని, వానిద్వారా ధనాంకురము - లాభము - కలుగదు. పణ్యములు వ్యాపక రూప

మున వినిమయము చేయించునపు డవి సువర్ణరూపమునకు వచ్చి సాధారణ జనుల దృష్టిలో ధన మగును. అప్పుడుకూడ లాభము గ్రహింపకున్న ధనము కేవలము వినిమయ సాధనమే యగును. దానిలో ధనాంకురము నుత్పన్నము చేయు నిమిత్త ముండదు. ప్రత్తిచెట్టునుండి దూది తెల్లనిది వెడలును. కాని ప్రత్తివిత్తనములకు విధిపూర్వకముగ ఎఱుపు, పసుపు రంగుల భావన నొసంగిన వాని పువ్వులు ఎఱ్ఱగానో, పచ్చగానో యేర్పడును. మూలమున దూది రంగు తెలుపుగా నుండెను. కాని నిమిత్తవశమున నుత్పన్నమైనను స్వాభావికమైన యెఱుపు, తెలుపు రంగులు గలది యగుచున్నది. వస్త్రములకు రంగువేసినట్లు దూదికి రంగువేయవలసిన యగత్యము లేదు. అది పుట్టుకతోనే యెఱ్ఱగానో, పచ్చగానో పుట్టును. ధనమునందు ధనాంకురము నుత్పన్నముచేయు సామర్థ్యము లేదు. నిమిత్తవశమున దానియందీ సామర్థ్యము కలుగును. అది చిరకాలమువరకు నుండుటచే స్వాభావిక మగుచున్నది.

వాస్తవమున ధనమునకు ధనముతో బీజాంకురముల వలె జన్య జనక భావము లేదు. ధనము ధనోత్పత్తికి నిమిత్త కారణము. నిమిత్తకారణమును కూడ ననేక పర్యాయములు మూల మందురు. నవీన ధనము ప్రాచీన ధనముయొక్క యవయవములనుండి యుత్పన్నము కాదు. కావున వానిలో నుపాదానోపాదేయభావము కూడ లేదు.

మూలపతి మూలము ద్వారా ధనలాభము బొందినపు డా లాభమునకు మూడు కారణము లుండును. మూలధనము,

శ్రామికుని శ్రమ, ఉపభోక్తనుండి లభించిన మూల్యము, ఈ మూడును లాభమునకు నిమిత్తములు. మూలధనము, శ్రామికుని శ్రమ రెండును కలిసి పణ్యము నుత్పన్నము చేయును. విక్రయించినమీదట పణ్యమునకు మూల్యము లభించును. కేవల మూలధనమువలన కానీ, కేవల శ్రామికుని శ్రమవలన కానీ పణ్యము జనింపదు. అందు వలన రెండును పణ్యమునకు కారణ మగును. మూలధనము కూడ నొక విధమగు శ్రమయే. పణ్యోత్పత్తికి వలయు సాధనము లన్నియు మూలధన మగును. పూర్వకాలమున నా సాధనములు వస్త్రమునకు కదురు, కండెలు, మగ్గము రూపమున నుండెను. నేడవి పెద్ద యంత్ర రూపమున నున్నవి. ఈ సాధనము లన్నియు శ్రమప్రాప్తములే. ఒక విధముగ నవి యస్థిరశ్రమకు స్థిర రూపములు. ఈ భౌతికోపకరణముల ద్వారా శ్రామికుడు శ్రమించునపుడు శ్రామికునివలె నవికూడ క్రియ జేయ నారంభించును. అప్పు డవి నిశ్చలముగా నుండవు. సజీవ శ్రమసంబంధముచే నవి కూడ సజీవము లగును; శ్రామికునితో బాటు శ్రమ జేయ నారంభించును. శ్రామికుని శ్రమలో కూడ వీనికి భాగ ముండును. మూలపతియొక్క ప్రాచీన శ్రమ, శ్రామికుని నవీనశ్రమ కలిసి పణ్యము నుత్పన్నము చేయును. ఇట శ్రామికుని శ్రమయే నవీన శ్రమ కాదు. ఉపకరణముల శ్రమయు నవీనమే. స్థూలదృష్టికి నుపకరణముల చలనములో శ్రామికుని శ్రమ మాత్రమే కనిపించును; కాని తర్కదృష్టికి నుపకరణముల శ్రమయు కనిపించును. ఇరువురు మనుజులు

కలిసి యొక బరువు నెత్తుదురేని వారి శ్రమ వేరువేరుగా కనిపించదు. కాని యది భిన్నమే. అట్లే యుపకరణముల శ్రమ, శ్రామికుల శ్రమ రెండును భిన్నములే యగును. కాని యుపకరణ స్వరూపములో కలిసిపోవుటవలన నొక్కటిగ తోచుచున్నవి. శ్రామికుడు యంత్రోపకరణములు లేక శ్రమచేయ నేరడు. కావున నవి యతని శ్రమకు హేతువు లగుచున్నవి. ఉపకరణములు మూలధనము. వాని యధిపతియు స్వయముగ శ్రామికుడు కావచ్చు; లేక యితరుడు కావచ్చు; ఎవరైనను నతడు మూలపతి యగును. కాని, శ్రామికుడు స్వయముగ నుపకరణముల కధిపతియైన నతనిని మూలపతి యనరు. లోకు లతని నుపకరణముల ద్వారా పనిచేయుచుండగా చూతురు. అతని శ్రమమయరూపము వారియెదుట నుండును. ఈ రూపముమీద నెక్కుడు ధ్యానముంచుటచేత నా శ్రామికునకు మూలపతి రూప మున్నను కనిపింపదు. ఉపకరణాధిపతి శ్రామికునకంటె భిన్నుడైనపు డతడు భిన్నస్థానమున నుండు కారణమున మూలపతియై స్పష్టముగా గోచరించును. కేవల యంత్రాధిపతి స్వయముగ పనిచేయడు. కావున సాధారణ జనులు మూలపతిని శ్రామికుని భిన్నులుగా నెంచెదరు. వారి దృష్టిలో మూలపతి శ్రామికుడుగానీ, శ్రామికుడు మూలపతిగానీ యొకే సమయమున కానేరడు.

శ్రామికుడు స్వయముగ మూలపతియై శ్రమచేయ దొడగినపు డతడు రెండు విధములగు శ్రమ చేయును. ఆ రెండు శ్రమలు నుపకరణములను కదల్చును. ఉపకరణ

ములు శ్రమయొక్క సంచితరూపములు. సంచిత శ్రమతో కలిసి నవీనశ్రమ ద్విగుణ, త్రిగుణ వేగముతో పణ్యములను నిర్మించును. శ్రామికుడు నవీనశ్రమ యొనర్చును. కాని దానికి రెండింతలు, మూడింతలు వేగము సంచితకర్మ కారణముగ నేర్పడును. ఇట్లు శ్రమ, వేగము రెండును పణ్యముల నుత్పన్నము చేయును. ఉపకరణములు మూలపతి వైనపుడు సంచిత శ్రమ యతనిదే యగును. శ్రామికుడు క్రొత్త శ్రమ మాత్రము చేయును. శ్రామికుని శ్రమలో మూలపతి సంచిత కర్మవలన వేగ ముత్పన్న మగును. శ్రామికుడుకూడ విశేష ప్రయత్న మొనర్చి తన శ్రమయందు వేగము తేగలుగును; కాని యీ వేగమునందు మూలపతియొక్క సంచితశ్రమకు గూడ భాగ ముండును.

మూలధనము నవీనశ్రమ సహాయముతో లాభము నుత్పన్నము చేయును. మూలము కారణముగ లభించు నధికధనము లాభ మనబడును. ప్రాచీనధనము నవీన ధన ప్రాప్తికి నిమిత్తకారణము. కాని, యుపాదాన కారణముతో దీనికి సాదృశ్య మున్నది. బీజము సజాతీయాంకురము నుత్పన్నము చేయునట్లు, ధనము సజాతీయ ధనము నుత్పన్నము చేయును. ఈ సామ్యము కారణముగ నుత్పాదక ధనమును మూలధన మందురు. ధనము వాస్తవమున ధనోత్పత్తికి నిమిత్త మైనను సామ్యకారణమున నది యుపాదానముకూడ నగుచున్నది. నిమిత్తము, ఉపాదానము రెండును భిన్నములు; కాని, యిక్కడ రెండు నభిన్నము లగుచున్నవి. ఇందు

నిమిత్తభావము ముఖ్యము. సామ్య కారణమున నుపాదాన భావము నని తెలియనగును.

మూలధనము యంత్రాదుల రూపమున పణ్యముల నుత్పన్నముచేసి క్రయవిక్రయముల ద్వారా పణ్యములనో, లేక ధాతుమయములగు ముద్రలనో సంపాదించును. అట్లు సంపాదించిన ధన మంకురతుల్య మగును. జన్యజనక భావము వలన నిమిత్త నైమిత్తికము లయినను, మూలధనము, లాభ ధనము పరస్పర ముపాదానోపాదేయములకు సమానము లగును. వడ్డీ వ్యాపారముతో జీవించు వాని మూలము-అసలు-వడ్డీ-ఫాయిదాలలో నీసామ్యము మిక్కిలి స్పష్టమగును. వడ్డీ వ్యాపారికి, అసలుకు వడ్డీ ధనరూపములోనే లభించును. అసలుఫాయిదాలకు మధ్యలో పణ్యసంబంధ మేమియునుండదు. వడ్డీకి కారణధనము అసలు; వడ్డీధనము అంకురము. జ్ఞానము, శ్రమము ననువానికి రూపాంతరమే ధనము. జ్ఞానము, శ్రమము రెండును నెల్లపుడు నిమిత్త కారణములే. ధనము వాని రూపాంతరమే కావున నదియు ముఖ్య రూపమున నిమిత్తకారణమే.

పణ్య వినిమయములో నున్న విశేష ప్రక్రియ ననుసరించి ధనము మూలధన మగును. విశేష ప్రక్రియ లేకున్న ధనము శుద్ధ ధనముగానే యుండును; మూలధనము కానేరదు. వినిమయగతి రెండు విధములుగ నుండును. మొదటిదాని ననుసరించి పణ్యముయొక్క ప్రథమ విక్రయము జరుగును. దానివలన లభించు ధనముతో మరల పణ్యము కొనబడును. మొదట పణ్యము, మరల ధనము, మరల పణ్యము; ఈ

గతిలో మొదట చివర పణ్య ముండును. దీని రూపము ప - మూ - ప. అగును. రెండవ గతిలో మొదట మూలము - ధనము, - తరువాత పణ్యము, మరల ధనము నుండును. ధ - ప - ధ. మొదటి గతిలో కొనుటకొరకు అమ్ముటయు, రెండవ గతిలో నమ్ముటకొఱకు కొనుటయు జరుగును. ఈ రెండు విధములగు గతియు ధనమును మూలధనము చేయును. పరిణామము సమానము. కాని యిది విషమముగ కూడ నుండును.

ఒక వడ్రంగి రు 10 ల కొయ్య తీసికొని, దానితో నొక పెట్టె చేసి రు 20 ల కమ్మ ననుకొనుడు. అందులో రు 5 లు శ్రమ మూల్యము; రు 5 లు లాభము నగును. లాభదృష్టితో చూచిన నతని రు 10 లు మూలధన మగును. అతడు రు 20 లు పొందినాడు పెట్టెనమ్మి. వానిలో రు 10 లో లేక రు 15 లో పెట్టి గోధుమలు మున్నగునవి కొనగలుగును. అట్లు గోధుమాదులను కొనిన నతనికి హాని యుండదు; లాభము నుండదు. కారణము? పణ్యముల మూల్యము సమాన మగుటయే. ఈ స్థితిలో నతనిదగ్గర రు 5 లు మిగిలి యుండును. మొదట నతనిదగ్గర కొయ్యరూప మగు పణ్య ముండెను. దాని పరిణామము రు 20 లయ్యెను. వానిలో రు 10 — 15 లు పరిణామము గోధుమ లయ్యెను. ఇట్లు ఆద్యంతములలో పణ్యము లున్నవి. అయినను రు 5 లు లాభము నుత్పన్నము చేయుటవలన వడ్రంగియొక్క రు 10 లు మూలధన మగుచున్నది. ఇందు గోధుమల రూపమున ఖర్చయిన యతని ధనము ఎల్లప్పటికి సమాప్త మైనట్లే. అది

యుపభుక్తమై పోయినది. మరల దాని విక్రయము జరుగ జాలదు. అతడు పెట్టెను కృషీవలున కమ్మలేదు; అధ్యాప కుడో, వైద్యుడో దానిని కొనియుండెను. వానినుండి వడ్రంగి యేమియు కొనవలసిన యవసర ముండదు.

రెండవది ముద్రలకు సంబంధించిన గతి. ఈ గతిలో నాద్యంతములందు ముద్ర లుండును. ఒకడు రు 100 ల దూదిని కొని రు 110 ల కమ్మును. అప్పు డతడు వాస్తవ మున రు 100 లను రు 110 లతో వినిమయము చేయును. పణ్యముద్వారా ధనమును ధనముతో వినిమయము చేసి నట్లగును. పణ్యమును తీసివేసిన మూ - మూ. అగును. ధనము కేవల ధనరూపముననే యుండి, మూలధనరూపమున దాని పరిణామము జరుగకున్నను, మొదట పణ్యవిక్రయము, అంతమున క్రయము జరుగవచ్చును. నేతగాడు రు 10 ల నూలునమ్మి రు 10 ల గోధుమలు కొనినచో నపుడు ధనము కేవలము వినిమయమునకు సాధన మగును. ఇట్టి స్థితిలో పణ్యముతో గలుగు నీ వినిమయగతి లాభములేని దగును. కాని, ప్రయోజన శూన్యము కాదు. ప్రథమ పణ్యస్థాన మును రెండవ పణ్య మేదో యొక యావశ్యకతను పూరించు టకే తీసికొనును.

ఏగతి పణ్యముమీద నుండక చివరకు ముద్రలమీద నిలుచునో దాని స్థితి విలక్షణముగా నుండును. ఆ గతి యందు ధనలాభ ముత్పన్నముచేసి మూలధనము కాకున్న నది నిష్ప్రయోజన మగును. ఒకడు నూరురూపాయలను నూరురూపాయలతోనే వినిమయముచేసిన నతని కేమియు

ప్రయోజన ముండదని స్పష్టముగా సిద్ధమగు చున్నది. ఎప్పుడైనను నొకడు ముద్రలతో పణ్యమును కొని యమ్ము నేని యతడు ఎక్కువ మూల్యమున కమ్మును. చివరకు పణ్యముమీదనో లేక ముద్రలమీదనో విశ్రాంతిని బొందు నీ రెండు విధములగు గతుల స్వరూపములోను, ప్రయోజన ములోను గల భేద మింతయే.

మార్క్సు (క్యాపిటల్. భా. 1. పు. 174....) చెప్పు చున్నాడు. "వినిమయముయొక్క పణ్య విశ్రాంతి లేక సంచారము అతిరిక్త మూల్యము నుత్పన్నము చేయదు. ధనమును మూలధనము చేయదు. అవి తమ హేతువుల నుదాహరణముద్వారా ప్రకాశింప జేయును. ఒకడు 'క' నుండి పణ్యము కొని, 'ఖ' కు అమ్మును. మరల 'క' నుండి పణ్యము కొనునేని యతడు రెండు విధములగు పనిని చేయును. మూల పతి రూపమున 'క' నుండి పణ్యము కొనును; పణ్యస్వామి రూపమున 'ఖ' కు అమ్మును. 'క' 'ఖ' లు అమ్మువారు కొనువారుగ నుందురు. మధ్యవర్తి యిద్దరిలో నొకరి యెదు టికి కూడ పెట్టుబడిదారునిరూపమున బోడు. అతని కార్య ములలో నొక్కటియు, ధనము, పణ్యము రెండును సాధారణ ముగ నుత్పన్నము చేయజాలని పరిణామమును కలిగింపజాలు నది కనిపింపదు. మధ్యవర్తికి 'క' నుండి కొనుట, 'ఖ' కు అమ్ముటయు నొక శృంఖలకు రెండు భాగములు. ఈ రెండు భాగములతో సంబంధము మధ్యవర్తికిమాత్ర మున్నది. 'క' 'ఖ' లు మధ్యవర్తి వ్యాపారమును గూర్చి యాలోచింప ప్రయత్నింపరు. 'క' 'ఖ' లు మధ్యవర్తిని విడిచి స్వయముగా

పరస్పరము క్రయవిక్రయములు చేయ ప్రారంభించిన వ్యాపార రూప మంతయు సంక్షిప్త మగును. మధ్యవర్తి దృష్టితో వ్యాపారము 'క' నుండి కొనుటతో ప్రారంభమై 'ఖ' కు అమ్మటతో నంతమగుచుండెను. అతని ననుసరించి వ్యాపార రూపము మూ - ప - మూ. అగును. 'క' 'ఖ'ల ననుసరించి చూచిన వినిమయ మొక క్రియ; దానికి రెండు భాగములు లేవు. ఒకటే క్రియ 'క'ను బట్టి చూచిన విక్రయము, 'ఖ'ను బట్టి చూచిన క్రయము నగుచున్నది. అపేక్షాభేద మును బట్టి యొకే క్రియకు రెండు నామము లగుచున్నవి. ఇప్పు డారంభము విక్రయముతోను, నంతము క్రయము తోను నగును. క్రయ విక్రయముల క్రమ విపర్యాసము మూల్యవృద్ధికి గల కారణమును కొంచెముకూడ తెలుపదు.

పణ్యముల సాక్షాద్వినిమయమును గూర్చి విచారించిన నదియు ధనము మూలధన మగుటకు కారణముగ సిద్ధము కాదు. ఇద్దరు పణ్యస్వాములు పరస్పరము పణ్యముల యాదానప్రదానములు చేయుదురేని మధ్యలో ముద్రలకు పనియే యుండదు. మూల్యాపేక్షతో పణ్యములు పరస్పరము సమానము లగును. ఈ దశలో ముద్రలు చేయగలిగినది పణ్యముల మూల్యమును మాత్రము ప్రకటించుటయే. సాక్షాత్తుగ పణ్యముల నిచ్చిపుచ్చుకొనుటలో నుపయోగితను బట్టి క్రయవిక్రయముల నొనర్చు వారిరువురు లాభమును పొందుదురు. 'క' మద్యము నమ్మి 'ఖ' నుండి గోధుమలు కొనును. 'క' నియతసమయములో నెంత మద్యము నుత్పన్నము చేయునో 'ఖ' యదే సమయమునం దంత

మద్యము నుత్పన్నము చేయనేరడు. 'ఖ' నియతకాలమున నెన్ని గోధుమల నుత్పన్నము చేయగలుగునో 'క' చేయ లేడు. 'క' 'ఖ' లు వినిమయము ద్వారా గోధుమలు, మద్యము పొందగలిగినంతగా నా వస్తువులను ప్రతి వ్యక్తియు స్వయముగ నుత్పన్నముచేసి వినిమయము చేయకయే పొంద వలె ననిన పొందలేడు. ఈ లాభము మూల్యమున గలుగదు. ఎవనియొద్ద మద్య మెక్కువగా నుండి గోధుమ లుండవో వాడు రు 50 ల మద్యమును గోధుమ లున్నవాని కిచ్చి వాని నుండి రు 50 ల గోధుమలు తీసికొనును. ఇట్టి యెడల ముద్రలు మధ్యలో చేరి మూల్యము నెక్కువ చేయజాలవు. అవి కేవలము క్రయవిక్రయములను రెండు భిన్న భిన్న వ్యాపారములుగ ప్రకటించును."

మార్క్సు చూపిన యీ రెండుదాహరణములలోను భేదము లేదు. మధ్యవర్తి ద్వారా క్రయవిక్రయముల నొనర్చువాడు వ్యాపార మొనర్చు తావున మధ్యవర్తి లేకున్న వినిమయము ముద్రలు లేకయే జరుగును - పణ్యములు సాక్షాత్తుగ పరస్పరము వినిమయము చేయబడును. ఈ దశ యందు మూల్యము వృద్ధికాదు. అందువలన నెట్టి యాపత్తియు కలుగదు. సాక్షాత్ వినిమయము ద్వారా క్రయ విక్రయముల నొనర్చువారికి నుపయోగకరమగు వస్తువు లెక్కుడు పరిమాణములో లభించుటయందును సందేహము లేదు. కాని పణ్యస్వామి యౌచిత్యమును విచారింపక పణ్యములను నెక్కుడు మూల్యమున కమ్మిన నతనికి తప్పక లాభము లభించును. అతడు పణ్యముల నుత్పన్నము చేయు

టకు పెట్టిన సొమ్ము మూలధన మగుటలోను విఘ్నముండదు. ఎక్కువ మూల్యమున కమ్మి మధ్యవర్తి యతిరిక్త లాభము నుత్పన్నము చేయును. పణ్యోత్పాదకుడు కూడ మధ్యవర్తి లేకున్నను పణ్యములను ప్రియముగా నమ్మగలుగును. పణ్యోత్పాదకులే పరస్పర మాదానప్రదానముల నొనర్చిన మూల్య మెక్కువ కాదు. కాని పణ్యోత్పాదకుడు పణ్యముల నుత్పన్నము చేయని యుపభోక్తలతో నాదానప్రదానము లొనర్చునపుడు వారినుండి యధిక మూల్యము గ్రహించుటలో నాటంక ముండదు. పణ్యస్వామినుండి యధిక మూల్యము ద్వారా యుపభోక్త యధిక యుపయోగకరములగు పణ్యము లను బొందగలుగును; కాని మూల్యమునందు వానికి హాని కలుగును. రు 20 లలో నెంత వస్త్రము నుపభోక్త నేతగాని నుండి తీసికొనునో, నేతగాడు దానికొఱకు పనిచేసినంత నిశ్చిత కాలములో నుపభోక్త రు 20 లను సంపాదింపనేరడు. ఈ విధముగ నుపభోక్తకు నుపయోగకరమగు వస్త్ర మధిక పరిమాణములో లభించినను, మూల్య మెక్కుడుగా నీయ వలసి వచ్చును. ఇట్లతిరిక్త మూల్యమును పొందుటవలన నేతగాడు వస్త్రోత్పాదనమున కుపయోగించిన ధనము మూల మగును. నేటి పెట్టుబడి విధాన యుగమున నేతగాడు తిన్నగా వస్త్రము నమ్మడు. నేతగాడు యంత్రస్వామి కధీనుడు. యంత్రస్వాము లుపభోక్తలనుండి యధిక మూల్యమును గ్రహింతురు; నేతగానికి తక్కువ యిత్తురు. తక్కువ యిచ్చి యెక్కువ గ్రహించుటచేత యంత్రస్వాముల ధనము మూల ధనముగ పెరుగుచున్నది.

సమాన మూల్యము గల పణ్యములలో పరస్పరముగాను, లేక పణ్యములు, ధనము నను వానిలో నొండొంటితోను వినిమయము జరిగిన నధికమూల్యము కలుగజాలదు. సాధారణ దశలో సమాన వినిమయము జరుగును. కాని సాధారణ స్థితి యెల్లపుడు నుండదు. మూల్యములో పెరుగు తరుగులు జరుగుచుండును. అందువలన పణ్యోత్పాదకులు యంత్రస్వాము లధిక మూల్యమును గ్రహింపగలుగుదురు.

అంగడివీధిలో పణ్యస్వాములు మాత్రమే పరస్పరమాదానప్రదానము లొనర్చిన, మూల్యములో పెరుగు తరుగులు కలిగినప్పటికి నెవడును లాభము నందలేడు. ఒకమాటు విక్రయించినందున నెవనికి లాభము కలుగునో వానికి క్రయ మొనర్చుటలో హాని కలుగును. విక్రయించువాడు రు 100 ల వస్తువును రు 110 ల కమ్మిన, నతనికి రు 100 లకు రు 10 లు లాభము వచ్చును. తరువాత నతడు కొనువాడగును; మూడవ పణ్యస్వామి యతని నుండి రు 100 కి రు 10 లు లాభము తీసికొని వస్తువు నిచ్చును; కావున మొదట లాభమున వచ్చిన రు 10 లు కొనుగోలులో హాని క్రింద పోవును. ఇట్టి లాభమును బొందియు పణ్యస్వాముల దశ యంతమున నేమియు మార్పు చెందదు. ఉచితమగు మూల్యమునకు పణ్యముల నమ్మినందున నేర్పడు స్థితియే యప్పుడు నుండును. ఆకారమున మార్పు గలిగినను వస్తువుయొక్క యాత్మ - స్థిరతత్వము మారదు. ఒక సేరు దూది, యొక సేరు చెంబుకంటె నాకారమున భిన్నమే కాని భారమున సమానమే.

ఈ స్థితిలో నొకప్పుడు విపరీత దశయు కలుగవచ్చు. కొనువాడు నూటికి రు 10 ల వంతున తక్కువ మూల్యము నకు పణ్యములను కొనవచ్చు. కాని, యతడు వస్తువులను కొనుటకు ముందు వస్తువులను విక్రయించి యున్నాడు ; ఈ యమ్మకములో నతనికి నూటికి రు 10 ల చొప్పున హాని కలిగి యుండెను. కాబట్టి పూర్వావస్థయే యిప్పుడు - వస్తువులను తక్కువ ధరకు కొన్న మీదట - ఉండును. పణ్యస్వాములు పరస్పర మాదానప్రదానములో తక్కువ కిచ్చి కానీ, లేక యెక్కువ తీసికొని కానీ యధిక మూల్యము నుత్పన్నము చేయజాలరు.

కాని, యంగడివీధిలో పణ్యస్వాములలోనే యాదాన ప్రదానములు జరుగవు. ఆదానప్రదానము లొనర్చు వారిలో నొకవంక పణ్యస్వాము లుందురు. మరియొక వంక మపభోక్త లుందురు. పణ్యవస్తువులు లేనివారిదగ్గర కేవలము ముద్ర లుండును. ముద్రలుకూడ పణ్యము లేకాని; వాని స్వరూప మనేకాంశములలో పణ్యవస్తువులకంటె మిక్కిలి భిన్నముగా నుండును. ముద్రలు ధాతుమయములు; పణ్య వస్తువులు ధాతువులనుండి సంచితములు కావు. కాని, యీ భేద మధికమూల్యము నుత్పత్తి చేయుటకు కారణము కాదు. ముద్రలు వినిమయము మాత్రము చేయింపగలవు. అంతకు మించి వాని యుపయోగ ముండదు. ఈ విలక్షణ గుణము పెట్టుబడివిధాన యుగమున నధిక మూల్యమునకు కారణ మగును. ముద్ర యున్నవారు వస్త్రాదులను కొనలేని వారికి శీతోష్ణముల వలన కలుగు కష్టములు దూరము కావు.

కావున వివశులై వారు వస్త్రాదులను కొందురు. యంత్ర స్వాములకు వారినుండి కొనవలసిన దేమియు నుండదు. అందువలన నన్నవస్త్రములను కొనువారు యంత్రస్వాములకు వస్తువుల నమ్మి హాని కలిగింపజాలరు. కాగా నొకవంక యంత్రస్వాములు ధనికు లగుచుండ, మరియొకవంక నుపభోక్తలు నిర్ధను లగుచుందురు.

వినిమయము పణ్య పర్యవసాయి యైనను లేక ముద్రా పర్యవసాయి యైనను, పణ్యముల యాదానప్రదానములు జరుగకున్న లాభము కలుగదు. యంత్రస్వామి వస్తువులను ప్రియముగా నమ్మి ధనపతి యగును.

మార్క్సు (క్యాపిటల్ భా. 1. పు. 181) ఇట్లను చున్నాడు— "'అ' యనువాడు 'బ' యనువాని నుండియో లేక 'స' అనువాని నుండియో లాభమును బొంది, 'బ', 'స' అనువారు 'అ' నుండి లాభము నందలేని స్థితి యొకప్పుడు కలుగవచ్చు. 'అ' రు 40 ల మద్యము 'బ' నుండి కొనును; వినిమయమున రు 50 ల మద్యమును బొందిన, నత డీ విధముగ తక్కువనుండి యెక్కువ పొందును."

ఇక్కడ మార్క్సు ననుసరించి యొక విషయము గుర్తింపదగి యున్నది. వినిమయమునకు పూర్వము 'అ' దగ్గర రు 40 లు విలువగల పణ్యము, 'బ' దగ్గర రు 50 ల విలువ గల పణ్య ముండెను. పణ్యముల మొత్తము మూల్యము రు 90 లు. వినిమయము తరువాత స్థితియు నట్లే యున్నది. హెచ్చు తగ్గు లేమియు లేవు. విభాగములో మాత్రము భేద మేర్పడినది. 'అ' దగ్గర మొదట రు 40 లున్న నిప్పుడు

రు 50 లయినవి. 'అ' వినిమయము చేయకయే తిన్నగ 'బ' నుండి రు 10 లు దొంగిలించినను నీ స్థితి యేర్పడవచ్చును.

కాని 'విభాగ వైషమ్యము ముఖ్యరూపమున మూల ధనమునకు కారణ మగును' అను నత్యంత స్పష్ట విషయము మీదకూడ మార్క్సు ఎందులకు ధ్యాన ముంచలేదో తెలియ కున్నది. 'అ' దగ్గర నున్న రు 40 లకు బదులు రు 50 లయినపు డతడు ధనపతి యయ్యెను. విభాగ వైషమ్యము తక్క మరి యేవస్తువుకూడ నిశ్చేష్టగ పడియున్న ధనమును వృద్ధిపరచలేదు. తనంతట తాను పెరుగుటకు ధనము బీజము కాదుగదా!

మార్క్సు ముద్రావిక్రాంత వినిమయము (మూ - ప - మూ.) మూలధనము నుత్పన్నము చేయునని యెంచు చున్నాడు. కాని, యీ రూపమునందును, ధనపతి పణ్యము లను ప్రియముగా నమ్మును. మార్క్సుకూడ నీ తత్వము నంగీక రించును. ఈ స్థితియందు పణ్యవిక్రయము ననివార్యరూపమున మూలధనమును పెంచుటకు కారణముగ నంగీకరింపక తప్పదు. పైన చూపిన యుదాహరణమున 'అ' 'బ' లు పరస్పరము పణ్యముల గ్రాహకులు. వారికి వినిమయముద్వారా మూల ధనము పెంచుటకు కఠినతయు కలుగవచ్చు; కాని, క్రయ విక్రయముల నొనర్చువా రిరువురిలో కొనువాని దగ్గర కేవలము ముద్రలే యుండి యమ్మువాని దగ్గర కేవలము పణ్యము లున్నపుడు, విక్రయించువాడు - పణ్యస్వామి - సులభముగ నధికమూల్యము నుత్పన్నము చేయగలడు.

నేతగాడు, వడ్రంగి మున్నగువారు ముఖ్యముగ శరీరము ద్వారా పరిశ్రమ చేయువారు కానీ, పెద్ద పెద్ద యంత్రములకు స్వాములుకానీ యెవరైనను తమ తరగతి వారి నోడించి తాము ధనవంతులు కాజాలరు. కృషికునకు వడ్రంగితోను, వడ్రంగికి కృషికుని తోను పణ్య వినిమయము చేయవలసి వచ్చును. వివిధములగు పణ్యములను మహా యంత్రముల ద్వారా యుత్పన్నముచేయు ధనపతియు తన తోడివారి నందరిని నోడింపజాలడు. కాని, పణ్యస్వామి విజాతీయ శ్రేణివారిని తాను హాని పొందకయే వంచింప గలడు. ఉపభోక్తలను పీడించుట కిరువురును (వడ్రంగి మున్నగువారు, యంత్రస్వామి) సిద్ధమగుదురు. మహా యంత్ర ప్రసారమువలన శారీరిక శ్రమద్వారా పణ్యో త్పాదన మసంభవ మైనపుడు పెద్ద పెద్ద ధనపతులు మాత్రము ధనము నాకర్షింతురు. పణ్యములను స్వయముగ నుత్పన్నము చేయని యుపభోక్తలు పణ్యస్వాములకంటె భిన్నశ్రేణికి చెందినవారు. ఉపభోక్తలనుండి ధనము సంపాదించు ప్రతి యోగితలో నేడు యంత్రస్వాముల మధ్య (సంఘర్షము) పోటీ జరుగుచున్నది. మొదట పణ్యములమీద నధికారము గలిగి, పణ్యముల నుత్పన్నముచేయు వ్యాపారుల శ్రేణులు కలహము చేయుచుండెడివి. నాడు మహాయంత్రములు లేనందున నొక్కొక్కడు లక్షలాది యుపభోక్తలనుండి బల వంతముగ ధనము నాకర్షింప లేకుండెను. ఇదియే నాటికి నేటికి భేదము.

పణ్యస్వామి పణ్యసంచారము చేయక ధనమును పెంచలేడు. పణ్యమునందు శ్రమపరిమాణ ముండును. సమాజముద్వారా నిశ్చితకాలముతో నా పరిమాణము కొలువబడును. శ్రమపరిమాణము పణ్యమూల్యమున ప్రకట మగును. ఒక పణ్యమూల్యము రు 10 లయిన, నా మూల్య మా పణ్యశ్రమ పరిమాణమును ప్రకటించును. కాని యతిరిక్తమూల్యము శ్రమపరిమాణమును ప్రకటింపదు. రు 10 లు మూల్యము, రు 1 అతిరిక్తమూల్యము నయిన నీ యతిరిక్తమూల్యముతో కలిసి రు 10 లు మూల్యమనియే చెప్పబడును. పణ్యస్వామి తన నవీన శ్రమద్వారా మూల్య మును పెంచగలడు. మూల్యము తనకు తాను పెరుగదు. చర్మపు మూల్యముకంటె చెప్పుల మూల్య మధికము. చర్మకారుడు చర్మములో తన నవీనశ్రమ చేర్చును. చర్మపు ధర మొదట నెంతో యిప్పుడు నంతే. క్రొత్తగా శ్రమ మూల్యము దానిలో చేర్చబడినది. శ్రమ కెంత మూల్యము నిశ్చితమో యంతకే పణ్యము విక్రయింపబడిన నధిక మూల్య ముత్పన్నము కాజాలదు. అధిక మూల్యోత్పత్తికి ననేక కారణము లున్నవి. వానిలో నొకటి యుపభోక్తల నుండి యధిక మూల్యమును గ్రహించుట. మూల్యము సమానము కానపుడు పణ్యములకు ముద్రలతో వినిమయము జరుగును. అందువలన ధనము మూలధన మగును. మార్క్సు (క్యాపిటల్. భాగ. 1. పు. 183) ననుసరించి 'వణిజుని మూల ధనములో నాద్యంతముల ముద్రలు పణ్యములద్వారా సంబం ధము కలిగి యుండును. వడ్డీవ్యాపారియొక్క అసలు, వడ్డీలకు

మధ్య పణ్యా ముండదు. ఆద్యంతములలో ముద్రలే యుండును. మూ - మూ. అధికధనముకొఱకు ధనవినిమయము జరుగును. పణ్యముల చక్రతుల్యసంచార మీ ధన మెట్లుత్పన్న మగునదియు నిరూపింపదు.' అని మార్క్సు హేతువు చెప్పెను. కాని, వృద్ధి, ధనముతో ధనము నిర్మించునని యెంచవద్దు. చెప్పుటకు మాత్రము ధనము వ్యాపించును; కాని వాస్తవమున ధనము వ్యాపింపదు. సూక్ష్మమునుండి స్థూలము, స్థూలతరము, స్థూలతమము నగు సామర్థ్యము కేవల ముపాదాన కారణమున నున్నది. ఋణి ముద్రలను తీసికొనునపుడు నాణెముల రూపమున పణ్యమును గ్రహించుచున్నాడు. పణ్యముల సామాన్యాకారము ముద్రారూపమున ప్రతిష్ఠితమై యున్నదని భావము. ఋణి ముద్రలతో పణ్యములను కొని వినిమయము ద్వారా ధనము నార్జించును. దానిలో కొంతభాగము వడ్డీరూపమున నుత్తమర్ణునకు - ఋణదాతకు - ఇచ్చును. ముద్రారూపమున ఋణము తీసికొనెను; కాబట్టి యా రూపముననే యిచ్చును. పణ్యసంచార మిక్కడ కూడ నున్నది; కాని, ఋణదాత సమక్షమున లేదు. ఋణదాత ముద్రలకు సంబంధించిన మరియొక రూపము - పణ్యమయ రూపము - జూడడు. దానివలన నతనికి ప్రయోజనము లేదు. కాని, ఋణికి ప్రయోజన మున్నది. వణిజుని మూలధనము కానీ, వడ్డీవ్యాపారి అసలు కానీ, యేదైనను పణ్యముల వినిమయము చేయక జన్మింపనేరదు.

# పంద్రెండవ యధ్యాయము

## మూలధనముద్వారా శ్రమార్జనము, శ్రమహరణము

శ్రామికుడు పణ్యద్రవ్యముల నుత్పన్నము చేయుటకు ముందు వానికి వలయు ముడిసరుకును, నుపకరణములను సంపాదించును. సాలెవానిదగ్గర, నూలు, మగ్గము మున్నగునవి ముందుగానే యుండును. వానిద్వారా యతడు వస్త్రము నేయును. నూలు మున్నగునవి నేతగానికి కొనవలసి యుండును. వానికొఱ కిచ్చు మూల్యము మూలధన మగును. వానిని కొనుటకు నారంభమున ధనము లేకున్న నతడు వస్త్రమును నేయజాలడు. నూలు మున్నగునవి కొనుటకు వ్యయమైన ధనము, నూలు రూపమున, నుపకరణముల రూపమునను నేతగానిదగ్గర స్థిరముగా నుండును. అవియే యతని కపుడు మూలధన మగును. బీజములేక యంకురాదులుత్పన్నము కానట్లు, ఆరంభమున నపేక్షిత ధనము లేకున్న వస్త్రములు నేయబడజాలవు. మూలధనము లేకున్న నెట్టి పణ్యము నుత్పన్నము కాజాలదు. వడ్రంగి కాష్ఠము, ఉపకరణములు వీనితో పనిచేయవలసి యుండును. అత డపుడు చిన్నవి, పెద్దవి వస్తువులు నిర్మింప గలుగును. చర్మకారుడు చెప్పులు కుట్టుటకు వలయు చర్మాది సాధనములు ముందుగానే సంపాదించును. మూలధనము కూడ శ్రమవలన నుత్పన్న మగును. శ్రామికుని పూర్వపు శ్రమ మూలధన

రూపమున నుండును; నవీనశ్రమ పణ్యరూపమున నేర్పడును. పణ్యమునందు సమస్త శ్రమ సంచితమై యేకమగును. శ్రామికుడు స్వయముగా తన పణ్యము నమ్మిన నతని కతని శ్రమ ఫలము పూర్ణముగ లభించును. ఆ యవస్థయందా శ్రామికుడు మూలధనమునకు, పణ్యమునకు రెంటికి స్వామి యగును. మొదటి శ్రమము తరువాతి శ్రమకు సహకారి. ప్రాచీనము, నవీనము నగు శ్రమలఫలము పణ్యోత్పాదకుడైన శ్రామికునకు లభించును కావున మూలధనము నవీన శ్రమ జననమునకు సహకారి యగును.

మూలధనము, తద్ద్వారా యుత్పన్నము చేయబడిన పణ్యములు నమ్మినందున వచ్చు సమస్త ధనముమీద నుత్పాదకున కొక్కనికే యధికారమున్న నన్యాయమున కవసరముండదు. స్వయముగా పణ్యముల నమ్ము శ్రామికుడు కేవల శ్రామికుడు కాడు. అతడు మూలపతి, విక్రేతయు నగును. అత్యంత మల్పపరిమాణములో నున్నను శ్రామికుని మూలధనము మూలధనమే యగును. ఉత్పాదకుడైన శ్రామికుడు స్వయముగా పణ్యము నమ్ముకొను నధికారమును కోలుపోయినపుడు పరిస్థితి మార్పుచెంద దొడగును. చేతులతో పరిశ్రమ చేయువారు పణ్యమును నిర్మించి వ్యాపారి కమ్ముదురు. ఆ వ్యాపారి యుపభోక్తల కమ్మును. ఈ క్రమమునందొక వ్యాపారియొద్దకు ననేక శ్రామికులు వచ్చి తమ పణ్యముల నమ్ముదురు. వ్యాపారియొద్ద మూలధనము శ్రామికునికంటె నధిక పరిమాణమున నుండును. అతడు వారి పణ్యములను కొనగలడు. అంతవరకు కూడ శ్రామికుడు

ముడిసరుకునకు, నుపకరణములకు స్వామిగా నుండును. కాని తరువాత నతడు తానుకోరిన పణ్యమూల్యమును బొందజాలడు. వ్యాపారి యిచ్చినది తీసికొనవలసినవా డగును. వ్యాపారి స్వయముగా లాభమును బొందగోరును. కావున శ్రామికున కతడు పణ్యమూల్యము తగినంత యీయడు. తన మూల ధనము ననుసరించి యనేక శ్రామికుల పణ్యములకు తక్కువ మూల్య మిచ్చినందున, వ్యాపారి యధిక మూల్యమునకు పణ్యముల నమ్మగలుగును. అతనిమీద నే యంకుశము నుండదు. అత డుపభోక్తనుండి పణ్యమున కగు పూర్ణ మూల్యము తీసికొనగలడు. మరియు కావలెనని యథార్థ మూల్యమునకు మించికూడ తీసికొనగలడు. మొదటి పక్ష మున శ్రామికుని శ్రమలో కొంతభాగము హరించును. రెండవ పక్షమున శ్రామికుని యొక్కయు, నుపభోక్తయొక్కయు శ్రమమీద నధికారము వహించును. ఉపభోక్తలకు పణ్య ముల నమ్ముటలో గలుగు శ్రమమీద వ్యాపారి కధికార ముండుట యుచితమే. కాని, యతడు తన శ్రమ కేకాక యితరుల శ్రమకును స్వామి యగును. శ్రామికున కత డుచిత మూల్య మిచ్చి పణ్యము తీసికొని దానికి తన శ్రమమూల్య మును కలిపి యమ్మిన నది యనుచితముకాదు. అట్లుచేసిన వ్యవహారమున దోసగు లుండవు.

శ్రామికునిదగ్గర ముడిసరుకులు, నుపకరణములు లేక, కేవల శ్రమ మున్న, పరిస్థితి బహు వేగముగ మార నారంభిం చును. ఈ దశయందు శ్రామికుడు కేవల శ్రామికుడే యగును. ముడిసరుకునకు, నుపకరణములకు నధికారి మరియొక డగును.

మిక్కిలి ధనమున్నవాడు యంత్రాదుల నొక స్థానమున జేర్చును. నాటినుండి శ్రామికుల దరిద్రత, ధనపతి ధనము వృద్ధి యగును. శ్రామికు డకించనుడు - ఏమియు లేనివాడు - వివశుడై యతడు ధనికుని కోరికప్రకారము వేతనము తీసికొని తనశ్రమ నతని కమ్మును. మూలధనస్వామి త్వరగా తన ధనమును పెంపగోరును. శ్రామికుల శ్రమకు పూర్ణ మూల్య మిచ్చిన నతని కోరిక నెరవేరదు; కావున నతడు వారి భృతిని తగ్గించును. దానితో పరపీడన మారంభ మగును.

శ్రామికుల కిచ్చు భృతి యెంత తగ్గిన, ధనికుని కంత యధిక లాభము కలుగును. ఒక దినమున నారు గంటలు పనిచేసినమీదట శ్రామికున కొక రూప్యము లభించి, యతడు నిర్మించిన వస్తువు నమ్ముటచే ధనికున కొక రూప్యము లాభ మేర్పడిన నా లాభమునకు కారణము శ్రామికుని శ్రమయే. ధనికుడు స్వయముగ శ్రమ చేయడు. కాళ్ళు చేతు లాడింపకయే యతనికి దినమున కొక రూప్యము లభించును. శ్రామికుని శ్రమఫల మొక రూప్యము. ధనపతి చేసిన శ్రమ మత్యల్పముగా నుండును. దానికి మూల్యము కట్టిన నొక్క యణా యగు ననుకొనుడు. ధనికుడు దానిమీద నధికారము వహించుట న్యాయమే. కాని, ధనికుని మూలధనము శ్రామికుల శ్రమఫలము హరించుటకు సాధన మగుచున్నది. శ్రమఫలమును హరించుట కెట్టి యాటంకము లేకున్న నెవనియొద్ద నెంత మూలధన మున్న నంత శ్రమఫలమును వాడు హరింప గలుగును. ఏబదిమంది శ్రామికుల యొక దినపు శ్రమకు మూల్యము నిచ్చుట కొకని దగ్గర రు 50 లున్న

నతడు దినమున కేబది రూప్యముల లాభము బొందగలడు. శ్రమమూల్యము నియతమైనపుడు శ్రామికుల సంఖ్యను బట్టి లాభమున హెచ్చుతగ్గులు కలుగును.

ఒక్కొక్కప్పుడు శ్రామికుల సంఖ్య యెక్కువైనను, వారి సంఖ్య ననుసరించి లాభ మెక్కుడు కాదు. ఆ స్థితియందు శ్రమమూల్యము పూర్వ మున్నదానినిబట్టి తక్కువగా నుండును. ధనికుడు తరుచుగా లాభమును తక్కువ కానీయడు. శ్రమహరణమున కతనిదగ్గర ననేక సాధనము లుండును. ఒక సాధనమున కొఱతయున్న నితర సాధనములను పెంచును. లాభ పరిమాణములో కొఱత కలుగనీయడు.

పూర్వ మూహించిన ప్రకారము 50 శ్రామికుల వలన రు 50 ల లాభ ముండెను. లాభపరిమాణము తగ్గి సగమైన పక్షమున రు 50 ల మూలధనము రు 25 ల లాభ మిచ్చును. కాని, శ్రమసమయము దినమునకు 6 గం. ల నుండి 12 గంటలకు పెంచినచో మరల రు 50 ల లాభము లభించును. మొదటి పక్షమున తక్కువ శ్రమహరణ ముండెను. రెండవ పక్షమున నెక్కుడు శ్రమహరణ మగును. మూలధనము రు 25 లు వెచ్చించి, యొక శ్రామికుని 6 గం. శ్రమమీద నొక్క రూప్యము లాభము వచ్చిన, ధనికుడు శ్రామికులను నిర్బంధించి 6 గంటలకు బదులు 12 గంటలు పని తీసికొనినచో రు 50 లు లాభము దొరకును. మూలధనము కొఱత ననుసరించి, శ్రమసమయము పొడుగుచేసిన తక్కువ పెట్టుబడి వలన లాభములో గలుగు కొఱత తీరిపోవును.

ధనికుడు మూలధనమును పెంచి యధిక సంఖ్యలో శ్రామికులను పనిలో పెట్టును. కాని, లాభలోభముచే ప్రేరితుడై యతడు శ్రామికుల కుచితమైన భృతి నిచ్చి వారికి సుఖము కలిగింపడు ; పైగా శ్రమహారణ మొనర్చి వారిని పీడించును. విశాల యంత్రాగారములలో వేలకొలది శ్రామికులు శ్రమచేసి వేతనము బొందుదురు. స్థూలదృష్టికి ధనపతి శ్రామికుల జీవనమున కాశ్రయ మిచ్చినట్లు కనిపించును. కాని యీ జీవిక, మిక్కిలి శ్రమకారణముగ శ్రామికుల జీవనము నసమయమున నంత మొనర్చును. శ్రామికులదగ్గర ముడి సరుకు, ఉపకరణములు నున్నపక్షమున జీవికకొఱకు కావలసిన సమయమునకు మించి యధిక శ్రమ వారు చేయరు. 7 — 8 గం. పనిచేసినందున నన్నవస్త్రములు లభించునేని యంత కెక్కు డెవరును పని చేయరు. లాభము నపేక్షించు లోభి యెనిమిది గంటలు కాక 12 గం. పని చేయించును.

ప్రారంభమున, మూలధనము తక్కువగా నున్నపుడు ధనికు డొకరినో, లేక యిద్దఱినో శ్రామికులను పనిలో నుంచును. దానివలన నతని నిర్వాహ మేదో యొకవిధముగ జరుగును. అతనికి లాభ మెక్కువగా లభించినపు డందులో కొంత భాగము మూలధనములో కలుపును. ఈ స్థితియందతడు శ్రామికునితో బాటు తానును శ్రమ చేయును. అప్పుడతడు ధనపతి, శ్రామికుడు నగును. క్రమముగా లాభ పరిమాణ మెక్కు డగును. తరువాత నతడు శ్రమ చేయుట మానును. శ్రామికుల శ్రమను నిరీక్షించును. అపు డతని

ధ్యాన మంతయు లాభము నధికము చేయుటలో స్థిరమగును. చివరకు మూలధనము శ్రమహరణకు పూర్ణ సాధన మగును.

మూలపతి తరుచుగ పణ్యములను చౌక జేయ యత్నించును. అందుల కతడు శ్రమలో నుత్పాదన సామర్థ్యమును పెంచును. మొదట రోజుకు 8 పణ్యము లుత్పన్నము లగుచుండిన, ఉత్పాదనశక్తి ద్విగుణముచేసిన తరువాత, దినమునకు 16 పణ్యములు సిద్ధమగును. అప్పు డతడు పణ్యమూల్యమును తగ్గించును. మొదట రు 1 మూల్యమైన ఇప్పుడు రు $\frac{1}{2}$ అగును. మొదట 8 పణ్యముల నమ్మినందున కలిగిన లాభమిప్పుడు 16 పణ్యము లమ్మినందున కలుగును. మూల్యము తక్కువ యైనందున పణ్యము లెక్కుడుగ నమ్ముడుపోవును. ఇట్టి పరిస్థితులలోనే మూలపతి లాభము నెక్కువ పొందును. ఇది పైచూపులకు కనిపింపదు. మూలపతి మొదట 8 గంటల శ్రమకు రు 4 ల నిచ్చి, తదుపరి రు $3\frac{3}{4}$ ల నియ్యసాగిన, ఉపభోక్తలు తెలిసికొనజాలకపోయినను, శ్రామికుడు మాత్రము మూలపతికి కలుగు లాభవృద్ధికి గల కారణమును వెంటనే గుర్తించును. ఇట్టి యుపాయములు వ్యాపారమున తరుచుగా ప్రయోగింపబడును.

కాని, శ్రామికుని భృతి తగ్గింపకున్నను, శ్రామికుడు దినమునకు 8 గంటలే పని చేసినను, మూలపతి లాభ మెక్కువగు ననుకొనుడు. దానికి కారణ మేమగును? శ్రమలో నుత్పాదనశక్తి యెక్కువ యైనందున శ్రమ మూల్యములో నేర్పడిన కొఱతయే దీనికి కారణము. అది బాహ్యమునకు కనిపింపదు. శ్రమమూల్యము తగ్గినందున పణ్య

మూల్యము తగ్గును. మొదట శ్రమ 8 గంటలలో 8 పణ్యములను నిర్మించిన, నిప్పుడు 16 పణ్యములను నిర్మించును. శ్రమ వ్యాపకమైనందున పణ్యవస్తువుమీద శ్రమభారము తగ్గును. మొదట నెంతశ్రమ యొక పణ్యమున కయినదో యందులో సగ మిప్పు డగును. మొదట ఒక పణ్యమునకు రెండణాలవంతున 8 పణ్యములమీద రు 1 లాభము సంపాదించును. ఇప్పుడు పణ్యమునకు $1\frac{1}{2}$ అణా చొప్పున 16 పణ్యముల మీద రు $1\frac{1}{2}$ లాభము సంపాదించును. కావున 8 అణాలు లాభ మెక్కువ లభించును. నవీనావిష్కారముల ద్వారా పెరుగు శ్రమసామర్థ్య మొకవంక పణ్యముల మూల్యమును తగ్గించిన, మరియొకవంక పణ్యముల వలన గలుగు లాభమును వృద్ధిచేయును.

మూలపతికి ప్రధాన ప్రయోజనము శ్రమహరణ మొనర్చి లాభమును వృద్ధిజేయుటయే. పణ్యముల మూల్యములో కలుగు హెచ్చు తగ్గులతో నతని కేమియు ప్రయోజన ముండదు. క్రొత్త పద్ధతివలన పణ్యమూల్యము తగ్గినందున లాభ మధిక మగును. కావున నతడు వాని మూల్యమును తగ్గించును. శ్రామికుని శ్రమకాలములో తగ్గిం పుండదు. అంతటితో విశ్రమింపక, మూలపతి కోరి శ్రమలో నుత్పాదన శక్తిని పెంచుటతోబాటు శ్రమకాలమును గూడ పెంచగలుగును. 8 గంటల నుండి 10 - 12 గంటలు చేయగలుగును.

ఇది యంతయు మూలపతియొక్క లాభ - లోభమునకు కారణము. మూలధనమునకు స్వాభావిక పరిణామ ముండదు. శ్రామికునివలె మూలపతి తన శ్రమ కుచితమైన

మూల్యము తీసికొని పణ్యముల నుత్పన్నము చేసిన, మూల ధనము శ్రమార్జనకు కారణ మగును. ముడిసరుకు, ఉపకరణ ములు నను వీనిలో నెంతభాగపు మూల్యము పణ్యముల లోనికి పోయునదో దానితోబాటు తన నవీన శ్రమమూల్యము మాత్రము గ్రహించి యూరకున్న మూలపతి శ్రమాపహర్త కాడు.

లాభమును వృద్ధిజేయుటకు మూలపతిదగ్గర మరియొక యుపాయ మున్నది. ఈ యుపాయము ననుసరించి శ్రామికుల వేతనము పెంచవలసిన యవసరము మూలపతికి కలుగదు. శ్రమదినముల గంటలు పెంచనక్కర లేదు; వస్తువుల మూల్యమును తగ్గింప నక్కర యుండదు. ఇక నతడు చేయున దేమి ? శ్రమసంభూయకరణము - అనేక శ్రామికులు కలిసి యొక పణ్యము నుత్పన్నము చేయుట. శ్రామికు లనేకులు కలిసి యొక్కచోట పనిచేయుదురు. వీరికి ప్రేరకుడు మూల పతి యొక్కడు. అప్పుడు శ్రామికులు పణ్యములను ప్రాతి స్వికరూపమున - ఒక్కొక్క రొక్కొక్క వస్తువును - సిద్ధము చేయరు. వారందరు కలిసి - సముదిత రూపమున - పణ్యముల నుత్పన్నము చేయుదురు. ప్రాతిస్విక, సముదిత శ్రమలలో నెంతో భేద మున్నది. ప్రాతిస్విక - వైయక్తిక - శ్రమప్రభావ మతి సంకుచితము. సముదిత - సామూహిక శ్రమప్రభావ మతి వ్యాపకము. ఒకటితో నొకటి కలిసిన పదకొండగు నని సామెత. ఒకటితో నొకటి కలిసి నపుడు సంఖ్యాదృష్టిలో రెండైనను వాని సామర్థ్యము పదు నొకండుతో సమాన మగుచున్నది. ఈ నియమము ననుస

రించి ప్రాతిస్విక,  సముదితశ్రమ  లాభములలో  మిక్కిలి యంతర మున్నది. సముదితశ్రమ  చేయువారు  శ్రామికులే. దానిలో మూలపతికి భాగ ముండదు.  ఉన్నను నత్యల్పము. కాని, యా శ్రమలాభము  సముదిత రూపమున  శ్రామికులకు లభింపదు. ఆ లాభముమీద మూలపతి ప్రాతిస్విక రూపమున నధికారము వహించును.

సంఖ్యను గూర్చియే యాలోచించిన  పణ్యము, దాని మూల్యము ననువానియందు  ప్రాతిస్వికశ్రమకు, సముదిత శ్రమకు గల భేదము స్పష్టపడదు. ఒక శ్రామికు డొక దినమున 8 గంటలలో నొక పణ్య ముత్పన్నము చేయును; 200 మంది 200 పణ్యముల  నుత్పన్నము  చేయుదురు.  ఒక పణ్యము మూల్య మొక్క రూప్యము.  200 పణ్యముల మూల్యము రు 200 లగును.  200 శ్రామికులు  ప్రాతిస్విక రూపమున 200 పణ్యముల నుత్పన్నము చేసినను,  సముదిత రూపమున చేసినను పణ్యమూల్యములో నందువలన భేద మిసుమంతయు కలుగదు.  కాని  సామర్థ్యమువంక చూచిన  భేదము స్పష్ట మగును.  శ్రామికుల సామర్థ్యము  సమానము కాదు.  పది మంది శ్రామికు లొకే రకమగు 10 పణ్యములను  ప్రాతిస్విక రూపముతో నిర్మించిన  నందరి  శ్రమకాలము సమానముగ నుండదు.  ఒక డెంత సమయములో  నొక పణ్యమును నిర్మిం చునో రెండవ వా డంతకు  తక్కువ సమయముననో  లేక యెక్కువ కాలముననో దానిని నిర్మింపగలడు.  అట్లే యిత రులలోను భేద ముండును.  పణ్యోత్పత్తి కనివార్యముగ నెంత కాల మపేక్షిత మగునో  యంత కెక్కుడు కాలము శ్రమించి

పణ్యము నిర్మించిన నతని శ్రమ ముపయోగి కాదు. ఇట్టి శ్రమకు రెండు గతు లుండవచ్చు. ఒకటి యా పణ్యము బొత్తిగా నమ్ముడు పోకుండవచ్చు. ఒకవేళ నమ్ముడు పోయినను సాధారణ మూల్యముకంటె తక్కువ మూల్యమునకు పోవును. ప్రాతిస్వికశ్రమలో నిట్టి దోషము లుండును. ఈ దోషములు సముదితశ్రమలో నుండవు. పదిమంది కలిసి (సముదితమై) పనిచేయునపు డొకని శ్రమలోని శైథిల్యము (మాంద్యము) మరియొకని సంసర్గముతో దూరమగును.

శ్రమ సముదితమైనపుడు సాధన సామగ్రి యవస్థలలో పరివర్తనము కలుగును. అందువలన పణ్యోత్పాదనమున గలుగు వ్యయము తగ్గును. శ్రామికుల సముదాయ మొకే భవనముననుండి పనిచేయును. ముడిపదార్థము లొకే భవనమున నుండును. శ్రామికులు వానిని క్రమముగానో, లేక యొకేసారిగానో యుపయోగింపగలరు. సముదితరూపమున నుపయోగించినందున సాధనసామగ్రియొక్క ప్రభావము విశాల మగును; మరియు వాని నిర్మాణ వ్యయము తగ్గును. ఐదుగురు శ్రామికుల కెంత భవనము కావలెనో యంత కెక్కుడు భవనము 50 మందికి కావలసి యుండును. ప్రతి యైదుగురి కొక్క భవనము చొప్పున నిర్మించిన 10 భవనములలో నెంత ధనము వ్యయమగునో యంతకంటె తక్కువ వ్యయమొక్క విశాల భవనము 50 మందికి నిర్మించిన నగును. అధిక పరిమాణములో, నధిక సంఖ్యలో పణ్యములు నిర్మింపబడిన సాధనములు తన మూల్యములో నతిస్వల్పభాగమును పణ్యవస్తువుల కర్పించును. దాని ఫలితముగా పణ్యముల

మూల్యము స్వల్ప మగును. శ్రామికులు స్వతంత్రముగా తమ తమ సాధనములతో నల్పపరిమాణమున పణ్యముల నుత్పన్నము చేయుచు రేని వారి సాధనములయు, పణ్యము లయు మూల్యము మిక్కిలి యధికమగును.

పలువురు శ్రామికులు పరస్పర సహాయము చేయకయే యొకే స్థానమునందు దగ్గర దగ్గరగా నుండి పనిచేసినను, శ్రమయొక్క సంభూయకరణ (కలిసి చేయుటలో గల) ప్రభావ మంతగా కనిపింపదు. కాని శ్రామికులు పరస్పరము సహాయము చేయదొడగినపుడు సంభూయకరణ (కలిసి పని చేయు) సామర్థ్యము మిక్కిలిగా పెరుగును.

మార్క్సు సముదితశ్రమ ప్రభావము నుదాహరణ ముల ద్వారా బాగుగ స్పష్టముచేసి యున్నాడు. "పలువు రశ్వారూఢులు, లేక పదాతి సైనికులు ఆక్రమణకు, నాత్మ రక్షణకు కావలసిన వైయక్తిక సామర్థ్యము గలిగి యుందురు. వారి యందఱ సామర్థ్యముల కూడిక యొకవంక నుంచి, యాసేనయొక్క సముదితసామర్థ్యము మరియొకవంక నుంచి చూచిన రెండును సమానములు కావు. వానిలో మిక్కిలి భేద ముండును. ఇట్లే శ్రామికులు ప్రాతిస్వికరూపమున పనిచేయుటలోను, కలిసి పనిచేయుటలోను వారిశ్రమ లొక్కటిగ నుండవు. ఒక గొప్ప బరువు నెత్తవలసి వచ్చినపుడును, గొప్ప యంత్రమును త్రిప్పవలసి వచ్చి నపుడును నందఱిచేతు లొక్కమాటు పూనుకొనును. ఇట్టిపను లొక్కొక్క శ్రామికునకు వశపడునవి కావు; ఒక్కొక్క డేపని చేసినను ఫల ముండదు. ఒక కొంత

ఫలము కలిగినను, అభీష్టఫలమునకంటె నది యతిసూక్ష్మ మగును. సమయము కూడ నెక్కువ కావలసి యుండును. వ్యక్తిసామర్థ్య మేమియు సముదాయమున పెరుగదు. సముదాయమునందు సముదితసామర్థ్యము పేరిట నొక క్రొత్త సామర్థ్య ముత్పన్న మగును. ఇంతేకాక, సముదితశ్రమ ప్రతి శ్రామికుని ప్రాతిస్వికయోగ్యతను కూడ పెంపు చేయును. దినమునకు 12 గం. చొప్పున పనిచేయగలవారు పండ్రెండుమంది యొక్కడొక్కడుగ చేసిన శ్రమకంటె, లేక రోజుకు 12 గం. చొప్పున 12 దినములు నిరంతరముగ నొక్కడు చేసిన పనికంటెను 12 మంది మనుష్యులు కలిసి యొక్కటిగా చేసిన 144 గంటల సముదితశ్రమ యెంతో యెక్కుడు పణ్యముల నుత్పన్నము చేయును.

కొందఱు శ్రామికులు కలిసి యొకసమయమున సమాన ప్రకారక కార్యము చేసినపుడు, ప్రతి వ్యక్తి శ్రమ సముదిత శ్రమ కవయవమై శ్రమకు సంబంధించిన సమస్త ప్రక్రియ యొక్క వివిధ రూపములతో సంబద్ధ మగును. సంభూయ-కరణముయొక్క యీ ప్రభావమువలన వస్తువు తీవ్రవేగ ముతో శ్రమ రూపముల నన్నింటిని దాట నారంభించును. ఉదాహరణము : పండ్రెండుగురు శిల్పు లొక శ్రేణిలో నిలబడి, సోపానముల మొదటి ప్రదేశమునుండి చివరి వరకు రాళ్ళను పంప యత్నించిన, వారిలో ప్రతివాడు నొకే విధ మగు పని చేయును. అయినను వారిలో ప్రతి వ్యక్తి-వ్యాపారము సమస్త కార్యమునకు భాగమగును. వారు ప్రాతిస్విక రూపులు; వారినుండియే ప్రతిరాయి పోవలసి యుండెను.

ఇట్లే మనుష్యుల పంక్తియొక్క 24 చేతులు రాళ్ళను త్వరగా పైకి చేర్పగలుగును. ప్రతి మనుష్యుడు తన బరువుతో పాటు సోపానములమీాద క్రిందనుండి పైకి, పైనుండి క్రిందికి రావలెననిన నెంతో యాలస్య మగును. పదార్థము లంత దూరములో నల్పతర కాలములో చేరవు. మరల నెప్పు డైనను విశాలభవవ నిర్మాణము భిన్న దిశలలో నొక్కమాఱే యారంభము చేసినపుడు శ్రమ సముదిత మగును. ఈ దశ యందును శిల్పు లొక కార్యమునో లేక యొకే విధమగు కార్యమునో చేయుదురు.

ఒక శిల్పి 12 దినములలో, 144 గంటలలో నెంత భాగము చేయగలుగునో, దానినిబట్టి, 12 గురు శిల్పులు 144 గంటలతో సమమైన సముదితశ్రమదినమున నా భవన ములో నెక్కుడుభాగము రచింపగలుగుదురు. కారణము శ్రామికుల సముదాయముయొక్క కన్నులు, చేతులు ముందు వెనుకలలో రెండుప్రక్కల నుండును; కొంతవరకు సర్వ వ్యాపకము లనదగును.'' (క్యాపిటల్. పు. 357 - 59).

సముదిత శ్రమలో నింక ననేక గుణము లున్నవి. అయ్యవి వైయక్తిక శ్రమలో నుండవు. సాధారణముగ నెవరో యొకరు శ్రామికుల నొకచో జేర్చినకాని వారు కలిసి యొక స్థానమున పనిచేయరు. మూలపతి వారి నొకచో జేర్చును. మూలధన పరిమాణము ననుసరించి మూలపతి శ్రామికుల నొకచో చేర్చును; వారికి కావలసిన ముడిసరుకు, ఉపకరణములు పెద్ద మొత్తములో సంచయము చేయును. సముదిత శ్రమకు మూలధన మత్యావశ్యక మగును.

శ్రమయొక్క సముదితశక్తివలన పణ్యముల మూల్యము తగ్గిపోవును; లాభ మెక్కువ గలుగును. లాభములో గలుగు నీ వృద్ధికి సముదితశ్రమము కారణము. మూలపతి దాని మూల్యము శ్రామికుల కియ్యడు. అతడు వారికి వైయక్తికశ్రమ మూల్యము నిచ్చును. శ్రామికులు మూలపతి కధీనులై పనిచేయునంతకాలము, సముదితశ్రమ ప్రభావాధిక్యము ప్రకటము కాదు. మూలధన మీ మహాప్రభావమును ప్రకటించుటకు సాధన మగుచున్నది. కాని, భ్రమవశమున, నీ ప్రభావాధిక్యము మూలధనమునకు స్వాభావిక ధర్మముగ తోచ నారంభించును. శ్రామికులు పరస్పరము కలిసి ముడి సరుకును, ఉపకరణములను నొకచో చేర్చి పనిచేసిన వారి సముదితశ్రమ ప్రభావము కొంచెమైనను తగ్గదు.

అతీతకాలమున ననేక యుగములందు మూలపతులు కారణముగ మూలధన మనేక రూపములలో శ్రామికుల శ్రమ నపహరించుచు వచ్చుచున్నదను విషయము మరువ రాదు. నేటి మహాయంత్రముల యుగమున నిది విశాలాకారములో నుండుటవలన స్పష్ట మగుచున్నది. కాని, మహాయంత్రముల కారణమున మూలధనమునకు శ్రమాపహరణముతో నెడతెగని సంబంధ మున్నదనరాదు. మూలపతు లత్యంత లోభమునకు వశులు కాకున్న, సంభూయకరణము లోని మూలపతిశ్రమకు, శ్రామికుల శ్రమకు వారివారి శ్రమలకు తగినట్లు ఫలము లభించిన పక్షమున, మూలధనము శ్రమార్జనకు కారణ మగును. శ్రామికుడు హస్తపాదములతో పనిచేయును; మూలపతి జ్ఞానముద్వారా శ్రామికుల వ్యాపార

మున సామంజస్యము కలిగించును. అందువలన శ్రామికుల శ్రమ పరస్పర మనుకూల మగును. శ్రమహరణము కాన పుడు, సేనవలె శ్రామికుడు, సేనాపతివలె శ్రామికపతి యిరు వురు వేతనముబొంద నధికారు లగుదురు. మూలపతి శ్రామిక పతి రూపమును వహింపవలెను.

నేడు మూలపతుల ద్వారా శ్రమహరణ మధిక పరి మాణములో నగుటకు కారణము అందరియెదుట స్పష్టముగా నున్నది. ఇది యంతయు నవస్థల విశేష పరిణామముల వలన నయినది. దేశకాల భేదము ననుసరించి యవస్థలను మార్చిన శ్రామికుడు, మూలపతి మున్నగువారి స్వరూపములలో భేదము రాగలదు. శ్రామికులకు, నుపభోక్తలకు మధ్య యంత్రస్వామి - మూలపతి - లేకున్న నొకప్పుడు శ్రామికు డుపభోక్తలను, మరియొకప్పు డుపభోక్త శ్రామికులను పీడింప గలుగుదురు. మూలపతి, శ్రామికుడు, ఉపభోక్త యెవరైనను దేశము, కాలము, సాధనములు పొంది యొకరు మరియొకరి శ్రమను హరింప గలుగుదురు.

శ్రామికులదగ్గర పెద్ద యంత్రములుకానీ, ముడిసరుకు గానీ యుండదు. అందువలన వారు అణగియుందురు. శ్రామిక సంఘము లేర్పడిననాటనుండి వారి శ్రమను హరించుటలో మాంద్య మేర్పడినది. నేటికి నూరు, నూటయేబది సంవత్సర ములకు పూర్వము స్వచ్ఛందముగా వారి శ్రమను హరించి నట్లు నేడు హరింప ననువు గాదు. ప్రాచీనకాలమునందు పణ్యోత్పాదకు లయిన శ్రామికులు, శిల్పులు ననువారికి నుపభోక్తలకు మధ్య మూలపతి లేనపుడు వీలునుబట్టి శిల్పి

యెక్కువ మూల్యమును గ్రహించి యుపభోక్తల శ్రమను హరించుచుండెడివాడు. ఉత్పాదకులదగ్గర పణ్యములు తక్కువగా నుండి గ్రాహకు లెక్కువగా నున్నపుడు, ఉత్పాదకు లయిన శ్రామికులు వస్తువులను ప్రియముగా నమ్మెడివారు. అప్పు డుపభోక్తల శ్రమహరణ జరిగెడిది. ఇందులకు విపరీతముగ శ్రామికులదగ్గర పణ్యము లెక్కువై, యుపభోక్తల సంఖ్య తక్కువైనపుడు వారు తక్కువ మూల్యము నిచ్చి పణ్యములను తీసికొని శ్రామికుల శ్రమహరణ మొనర్చెడివారు. ఇట్లు లోభవశమున నెవని దగ్గర సాధనములున్న వారు ఇతరుల శ్రమను హరించెడివారు.

ప్రాచీనకాలమున శ్రామికుల దగ్గర కానీ, శిల్పుల దగ్గర కానీ పెద్ద సాధనము లుండెడివి కావు. కావున వారు చేయు శ్రమహరణ పరిమాణము స్వల్పముగా నుండెడిది. నేడు మూలపతులదగ్గర పర్వతములవంటి పెద్ద యంత్రము లున్నవి. కావున వారు శ్రామికులయు, వస్తువులను కొను వారియు శ్రమను యథేచ్ఛగా హరింప గలుగుచున్నారు.

ఒకరి శ్రమను మరియొకరు హరింపకుండు వ్యవస్థ లోకమున నవసరము. పణ్యోత్పాదకులకు, నుపభోక్తలకు మధ్య ధనవంతులైన మూలపతులు లేకున్న శ్రమాపహరణము చాలవరకు తగ్గగలదు. నేడు శ్రామికుల సంఘము లున్నట్లు నుపభోక్తల సంఘములు నుండవలెను. శ్రామికులు, క్రేతలు కలిసి పణ్యముల నుత్పన్నము చేయవలెను. పణ్యోత్పత్తి కేవల శ్రామికులే చేయరు. క్రేతలు నుత్పాదకులే. క్రేతలు - కొనువారు - లేకున్న శ్రామికులు పణ్యముల

నుత్పన్నము చేయరు. ఏ వస్తువు లవసరములు? అవి యెట్లుండవలెను? వాని పరిమాణ మెంత యుండవలెను? అను నీ విషయములు శ్రామికులు, క్రేతలు కలిసి నిశ్చయింప వలెను.

నేడు మూలపతి, శ్రామికులు ప్రధాన రూపమున పణ్యముల నుత్పన్నము చేయుచున్నారు. కావున, కలహములు, స్ట్రైకులు - హరతాళములు - నుపద్రవములును జరుగుచున్నవి. శ్రామికులు, క్రేతలు నిరువురు ముడిసరుకులకు, యంత్రములకు నధికారులై, వేతనములను, మూల్యమును వినిమయము చేసికొందురేని పరస్పర క్లేశము లుండవు. మూడవవ్యక్తి లేకున్న శ్రామికుడు, క్రేత యిరువురు వివశులై వ్యవస్థను స్థిరముగా నుంచుకొందురు. ఈ స్థితియందు మూలధనము శ్రమ నార్జించును. మూలధనమున కంకురము, పత్రపుష్పాదు లేర్పడి, బీజాంకురములవలె మూల్యము, లాభము వాని పరంపర నడచినపు డెల్లరికి లాభము కలుగును. మూలధనమువలన వేలాది విశాల ధనవృక్షములు జనించిన వాని ఫలపుష్ప పత్రచ్ఛాయాదు లెల్లరికి సుఖము నిచ్చును. శ్రామికునకు పూర్ణ వేతనము లభించును. క్రేతల కుచిత మూల్యమునకు పణ్యములు దొరకును. సముదితులై శ్రామికులు, క్రేతలు శ్రమ చేయుదురు. సముదితులై ఫలముపై నధికారు లగుదురు. అన్యాయము, వైషమ్యమును కలుగవు. రాజ్యము తరఫున పణ్యోత్పాదనమున భాగము తీసికొన దలచిన రాజ్యముద్వారా నొక యధికారి నియుక్తుడు కావలెను. అతడు అట్టి వ్యవస్థను స్థిరముగా నుంచును.

## పదమూడవ యధ్యాయము

# పణ్యముల రూపాంతరము–జీవుల శరీరాంతరము సామ్యము - వైషమ్యము

వినిమయము జరిగినపు డొక పణ్యము మరియొక పణ్య స్థానమును గ్రహించును. ఇది పణ్యమునకు రూపాంతరము - మరియొక రూపము. మొట్టమొదట, పణ్యము మరియొక పణ్యస్థానమును గ్రహించినపు డా రెండవ పణ్యమునుండి తనను వేరుచేసికొనును; తాను స్వయముగ పణ్యమై యుండును; రెండవ పణ్యము మూల్య మగును. వాస్తవమున రెండును పణ్యములే; అయినను వినిమయమున నొక పణ్యము మూల్య మయినపు డది మూల్యముగల పణ్యము కాదు. గోధుమలు వస్త్రమునకు మూల్యమైనపుడు వస్త్రమూల్యము మాత్రము ప్రకట మగును; గోధుమల మూల్యము ప్రకటము కాదు. కృషికుడు గోధుమల నిచ్చి వస్త్రవ్యాపారినుండి వస్త్రమును తీసికొనును. ఈ యాదానప్రదానములలో గోధుమలు వస్త్రమును దాని స్థానమునుండి తొలగించి యా స్థానము నాక్రమించును. పణ్యము, మూల్యము నను నీ రెంటియందును శ్రమ, మూల్యము సమాన రూపమున నుండును. కాని, పణ్యములయు మూల్యములయు కార్యములు పరస్పరము విరుద్ధములుగా నుండును. సువర్ణాదులు మూల్యమైన మీదట పణ్యముల వినిమయము సాక్షాత్తుగ జరుగక ముద్రలద్వారా జరుగ నారంభించును. అప్పుడుకూడ

వ్యవహారమున భేదము కలుగదు. వినిమయమున నొక యగ్రమున పణ్యము, మరియొక యగ్రమున మూల్యము నుండును. వాని స్థానభేదము వానిని విరుద్ధకార్యములకు వివశము చేయుచున్నది. లేకున్న రెంటి గుణములు సమానములే.

రూపాంతరప్రక్రియ కారంభము విక్రయమువలన, అంతము క్రయమువలన నగును. పండ్ల నమ్మువాడు రు 1 కి 8 మామిడిపండ్ల నమ్మును. విక్రయము వలన నొక్క రూప్యము సంపాదించి దానితో గోధుమలు కొనును. మొదట మామిడి పండ్లు రూప్య రూపమును, తరువాత గోధుమల రూపమును ధరించెను. మామిడిపండ్లు రూప్య రూపమున పరిణమించుట గోధుమల రూపమున మరియొక రూప (రూపాంతర) మును ధరించుటకు సాధనమయ్యెను. ధనముద్వారా వినిమయము ప్రతిష్ఠితమైన మీదట పణ్యములు ధనమయ రూపాంతర మును బొందక మరియొక పణ్య (పణ్యాంతర) రూపమునకు రాజాలవు.

మార్క్సు పణ్యముల రూపాంతరము (క్యా. భా. 1 పు. 116 - 138)ను గూర్చి విపులముగా నిరూపించి యున్నాడు. అతడు రూపాంతరాకారము నిట్లు చూపుచున్నాడు: పణ్య ములు - ముద్రలు - పణ్యములు = ప - ము - ప. సమస్త ప్రక్రియకు ఫలము ఒక పణ్యము మరియొక పణ్యరూపమున పరిణామమే = ప - ప. మొదటి రూపాంతరము ప - ము. రెండవ రూపాంతరము ము - ప. క్రయవిక్రయములు ఆపేక్షి కములు. పణ్యస్వామిదృష్టితో నేది విక్రయమో, యది

ధనస్వామిదృష్టితో క్రయ మగును. ఒకే సమయమున నొక వస్తువు అపేక్షాభేదమువలన క్రయము, విక్రయము రెండు నగుచున్నది. ఒకని చేతిలో నున్న ధనము పణ్యస్వామి యొక్క కొండొక పణ్యముయొక్క రూపాంతరము; అది విక్రయమువలన నేర్పడినది - ప్రథమ రూపాంతరము; ప - ము. పణ్యములు ధనరూపమును వహించినపుడు, వాని స్వాభావికమగు నాకారమున కవశేష మేమియు నుండదు. వాని నుత్పన్నముచేయు శ్రమవిశేషముకూడ నేరూపము నను నుండదు. ధనములో నేయంశమును చూచినను నది యేపణ్యమునకు వినిమయరూపమున వచ్చినదో చెప్ప జాలరు. నేతగాడు రెండు గజముల గుడ్డను రెండు పౌనుల కమ్మినా డనుకొనుడు. ఆ రెండు పౌనులతో నొక బైబిల్ కొనెను. వీని క్రమమును దెలుపు రూప మిట్లుండును. వస్త్రము - రెండు పౌనులు - బైబిల్. వస్తు విక్రయ రూపము ప - ము. ఆసమయముననే దాని క్రయరూపము ము - ప. రెండు పౌను లను వాని స్వామి గోధుమలమ్మి సంపాదించి యున్నాడు. ఇట్టి రూపాంతరమునకు రెండు శృంఖలము లగుచున్నవి. ఒకటి వ - ధ - బై = ప - ము - ప. మొదట శృంఖలమునకు మొదటి భాగము ప - ము = వస్త్రము - ధనము. అది రెండవ శృంఖ లమున కంతిమ భాగము ము - ప = ధనము - వస్త్రము. పణ్యముయొక్క ప్రథమ రూపాంతరము పణ్యమునుండి ధనముగా మారుట. ఆ ధనరూపము తప్పక మరియొక పణ్యముయొక్క రెండవ పరిణామమే యగును. ధనమునుండి పణ్యమున రూపాంతర మగుటయే యగును.

ఇది విక్రయ స్వభావము. క్రయ స్వభావము నిట్టిదే. ధన మొకవంక అమ్మిన పణ్యమును నిర్దేశించిన, రెండవవంక కొనబోవు పణ్యమును సూచించును. నేతగాడు వస్త్రమువలన రెండు పౌనులు సంపాదించెను. వానితో నతడు బైబిల్ కొనెను. ఇట్లు ధనము మరల పణ్య మయ్యెను. బైబిల్ నమ్మువాడు నేతగానినుండి ప్రాప్తించిన రెండు పౌనులతో బ్రాంది కొనినట్లు భావించుడు. ఇప్పుడు వస్త్రము - ధనము - బైబిల్ —— అను శృంఖలములో చివరి భాగము ము - ప. అది బైబిల్ - ముద్రలు - బ్రాంది——అను శృంఖలములో ప - ము. మొదటి భాగ మగును. కొండొక పణ్యము నుత్పన్నము చేయువానిదగ్గర కేవల మొక పణ్య మమ్ముట కుండును. దాని నతడు తరుచుగా పెద్ద పరిమాణములో చేసి యమ్మును. అతనికి లభించు ధనముతో నత డనేకములగు నవసరములను దీర్చుకొనుటకు వివిధ వస్తువులను కొనవలసినవా డగును. ఇట్లొక దాని విక్రయము అనేక క్రయములకు కారణ మగును.

పణ్యముల రూపాంతరము వాని పణ్యధర్మము నాశ్రయించి యుండును. పణ్యధర్మము స్థిరస్థాయి కాదు. వస్త్రమును కొని ధరించినపు డది భోగ్య మగును. అప్పుడు దాని క్రయవిక్రయములు జరుగవు. పణ్య మిచ్చి పుచ్చుకొనుటలో భోగ్యముగా నుండును. కాని, యపుడు దానియందు భోగ యోగ్యత యుండును; అపు డుపభోగ మారంభము కాదు. ఉపభోగ మారంభము కాగానే యందలి పణ్యధర్మము నశింప నారంభించును. ఒక్కొక్కప్పు డుపభోగింపకున్నను పణ్యము లిచ్చి పుచ్చుకొన నయోగ్యము లగును. సాధారణ దశలో

మల్లుగుడ్డ 20 గజములు రెండు పౌను లగును. నేత పద్ధతిలో క్రొత్త యావిష్కారములు వచ్చినందున మార్పులు వచ్చును. అంతకు పూర్వ మొక గజము మల్లుగుడ్డ నేయుట కెంత శ్రమ కాల మవసర మయ్యెనో యంత యిప్పు డవసర ముండదు. ఆ దశలో మల్లుగుడ్డ నమ్ము నితరవర్తకులు దానిని చౌకగా నమ్ముదురు. 20 గ. మల్లుగుడ్డ కప్పుడు 2 పౌను లెవడు నియ్యడు. మల్లుగుడ్డ యంతయు వ్యాపారమున నొకే పణ్య మగును. దాని ప్రత్యంశముయొక్క మూల్యము సామాజిక రూపమున నావశ్యకమగు మనుష్య శ్రమకు సంబంధించిన నియత పరిమాణమునకు రూపాంతరము. అందువలన పూర్వపు శ్రమ యనపేక్షిత పరిమాణములో నయినట్లు సిద్ధ మగును. మొదట మల్లుగుడ్డలో శ్రమ, యుపయోగిత యున్నను, నది మొదటి మూల్యమున కమ్మ యోగ్యము కాదు.

ఒక పణ్యము నిచ్చి మరియొక పణ్యము తీసికొనినపుడు సాక్షా ద్వినిమయ మగును. ధనముద్వారా పణ్య వినిమయము జరిగినపుడు నంతిమ పరిణామములో భేద మేమియు నుండదు. ఫలము రెంటికి నొక్కటియే. మల్లుగుడ్డకు సరాసరి సాక్షాత్ బైబిల్‌తో వినిమయము జరిగినపుడు వినిమయము బైబిల్‌తో నంత మగును. మధ్యలో ధనము వచ్చినను రూపాంతరము బైబిల్‌లోనే చివరకు ఆగిపోవును. ఫలము సమమైనను కొన్ని విషయములలో సాక్షా ద్వినిమయము, ధనము ద్వారా జరుగు వినిమయము పరస్పరము భేదించుచున్నవి. మొదటి భేద మాకారమునకు చెందినది. సాక్షా ద్విని

మయాకారము ప - ప. ధనముద్వారా జరుగు వినిమయాకారము ప - ధ - ప. రెండవ భేదము : సాక్షాద్వినిమయమున రూపాంతర ప్రక్రియ యొకమాటు రూపాంతరమైన మీదట సమాప్తమగును. ధనముద్వారా వినిమయము జరిగిన రూపాంతర మొక పర్యాయమున సమాప్తము కాదు. ధనము మొదటి పణ్యరూపమును ధరించిన మీదట రెండవ పణ్యమును రూపాంతరము చేయుట కుద్యమించును. ఇట్లు రెండవ రూపాంతరము తరువాత మూడవ రూపాంతరము, తరువాత నాలుగవ రూపాంతరము నొనర్ప సిద్ధమగును. అది పనినుండి విరమింపదు. మొదటి రూపాంతరము ముల్లు - బైబిల్; ఇక్కడ మల్లుగుడ్డ పోయి దాని స్థానమును ధనము - ముద్రలు ఆక్రమించును. మరల బైబిల్ స్థానమును విడిచిన నట ధనమువచ్చి చేరును. ఒక పణ్యము రెండవ పణ్యస్థానము నాక్రమించినపుడు ధనము మూడవ వాని చేతిలో నుండును.

ఈ పణ్యరూపాంతరమునకు, జీవుని శరీరాంతరముతో ననేకాంశములలో నద్భుత సామ్య మున్నది. పణ్యముయొక్క రూపాంతరమునకు మూల్య మున్నది: అది జ్ఞానము, శ్రమ. ఈ జ్ఞానశ్రమలే జీవుని నొక శరీరమునుండి మరియొక శరీరమునందు జేర్చుటకు సాధనములు. జ్ఞానము లేక యేక్రియయు పణ్యము నుత్పన్నము చేయజాలదు. జ్ఞానములేకయే సహజ భావమువలన నగు క్రియలు వ్యర్థము లగును. అవి యెవరికిని సుఖము కలిగింపవు. జీవునకు శరీరముకూడ తెలిసి చేసిన కర్మలద్వారా లభించును. శ్వాస

ప్రశ్వాసలవలె స్వాభావికముగ జరుగు క్రియలు, ఒకరికి సుఖదుఃఖములు కలిగించుటకు చేయబడని క్రియలును ఫలదాయకములు కావు. జ్ఞానము కర్మను విడిచి ఫలము నీయజాలదు; కావున సాక్షాత్ సంబంధముగల కర్మము స్వరూపమున కారణ మనబడును. పణ్యోత్పాదక కర్మకు పేరు శ్రమ. శరీరజనక కర్మల పేర్లు పుణ్యపాపములు.

పూర్వజన్మపు శరీరముద్వారా యే కర్మలవలన నితర ప్రాణులకు సుఖదుఃఖములు కలిగింపబడినవో యా కర్మలకు ఫల మీ శరీరము. ఈ శరీరముద్వారా యే శుభాశుభ కర్మలు చేయబడునో వాని ఫలము ననుభవించుటకు మరియొక శరీరము లభించును. ఇట్లు కర్మలు, శరీరము, వీని పరంపర నడుచుచుండును. బీజాంకురములవలె, కర్మ, శరీరము లనాదులు. ఈ పరంపరలో కర్మ మొదటిదిగ గ్రహింతుమేని రూపాంతర క్రమము 'శరీరము - కర్మ - శరీరము' నగును. కర్మ తనకంటె పూర్వమున నుండు శరీరమునుబట్టి కార్య మగును; రాబోవు శరీరమునుబట్టి కారణ మగును. అపేక్షాభేదమునుబట్టి కర్మ, శరీరములు నొకే కాలమున కారణము, కార్యము రెండును కాగలవు.

ఒక పణ్యము మరియొక పణ్యముగ రూపాంతరమైనపుడు మొదటి పణ్యము మరల మరియొక పణ్య రూపమును బొందదు. మామిడిపండ్లు గోధుమలలో రూపాంతరమయిన మీదట, గోధుమలస్వామిదగ్గర మామిడిపండ్లు చేరును. గోధుమలు పండ్ల స్వామికి చేరును. తరువాత నవి

యుపభోగ మారంభించిన మీాదట పణ్యములు కావు. వానిలో రూపాంతరము నొందుటకు శక్తి యుండదు.

కర్మ, శరీరము వీని స్వభావ మీా విషయమున విలక్షణము. కర్మ శరీరరూపము నొందియు బొత్తిగా క్షీణింపదు. ఈ శరీరము నే కర్మ లుత్పన్నము చేసినవో యవి నష్టమైనవి; కాని, యీా శరీరముద్వారా యన్యకర్మ లుత్పన్నము లగును. అవి యన్యశరీరము నుత్పన్నము చేయును. ఈ విషయమున కర్మ, శరీరము వీని స్వభావము ధనముతో పోలియున్న దన వచ్చును. ధనము పణ్యరూపము నొందియు రూపాంతరము నొందుటకు సామర్థ్యము కలిగి యుండును. మామిడిపండ్ల నమ్మిన ఒక రూప్యము లభించును. పండ్ల నమ్మినవా డా రూప్యముతో గోధుమలు కొనును. ఇక్కడ రూప్యము గోధుమల రూపమును బొంది రూపాంతర మైనది. ఇట్లయిన తరువాత కూడ నా రూప్యము మరియొక రూపాంతరమును బొందగలదు. ఇట్లు నిరంతరము దాని రూపాంతరములు నడుచును. గోధుమలస్వామి యా రూప్యములతో వస్త్రము తీసికొన వచ్చు. ఇట్లు ఎవనియొద్దకు ఆ రూప్యము బోవునో యతడు దానితో నేదో యొక పణ్యము కొనును. అందువలన ధనము నిరంతరము రూపాంతరము నొందగలదు.

ధనమును చూచి యది యే పణ్యమునకు రూపాంతరమో తెలిసికొనజాలము. ధనము మనుజుని శ్రమసామాన్యమునకు రూపాంతరము. దానిలో కొండొక విశేష శ్రమ చిహ్నము కానరాదు.

శరీరమును చూచినపుడు నిట్టి ప్రతీతియే కలుగును. ఒక శరీరమును చూచి యా శరీరస్వామి యేవో కర్మలు చేసి యా శరీరము బొందినా డనవచ్చును; కాని, యే కర్మల కది రూపాంతరమో చెప్పజాలము.

సుఖదుఃఖముల ప్రాప్తికి సాధనము లయిన పండ్లు, గోధుమలు, రథములు, వస్త్రములు, ఇండ్లు మున్నగున వేవియు శ్రమచేయక లభింపవు. ఇవి యన్నియు శ్రమకు రూపాంతరములు. శరీరము కూడ సుఖదుఃఖ ప్రాప్తికి సాధనము. గోధుమాది వస్తువులు భోక్తకు శ్రమచేయక లభింపనట్లు, శరీరముకూడ లభింపజాలదు. శరీరము ముఖ్యసాధనము. శరీరము లేకున్న గోధుమాది వస్తువు లన్నియు నిరర్థకము లగును. కన్నులున్న కంటిజోడు పనికివచ్చును. కన్నులు లేనపు డుత్తమోత్తమ మగు కంటిజోడు కూడ వ్యర్థమే యగును. ఇచ్చిపుచ్చుకొను వ్యాపారసీమ పణ్యముల తోనే యాగదు. శరీర సంబంధముకూడ నాదానప్రదానములకు చెందినదే.

పణ్యముల రూపాంతర మెట్లు మనుష్యుని సామాజిక శ్రమకారణముగ నగుచున్నదో యట్లే కర్మములు, శరీరములు వీని రూపాంతరములు కూడ మనుష్యుని సామాజిక కర్మముమీద నాధారపడి యుండును. ఒకడు తన కర్మద్వారా గోధుమ లుత్పన్నము చేసిన మరియొకడు వస్త్రముల నుత్పన్నము చేయును. ఒకడు గోధుమలతో నావశ్యకతను పూర్తిజేసిన మరియొకడు వస్త్రములతో చేయును. శ్రమ ఫలము నిచ్చుటకు పణ్యముల రూపాంతరము సాధన మగును.

శరీరాంతరము కూడ మనుజునకు కర్మఫలము నొసగుటకు సాధన మగును. మనుజు డితరుల కెంతటి సుఖదుఃఖముల కలిగించెనో యంతటి సుఖదుఃఖములను బొందుట కతనికి శరీరధారణ చేయవలసి యున్నది. ఈ విషయమున నొక తత్త్వము (యథార్థము) ధ్యానమున నుంచుకొన దగియున్నది. పణ్యముల రూపాంతరములకు మనుజుని శ్రమతో సంబంధ మున్నది. ఇతర ప్రాణులలో నిచ్చిపుచ్చుకొను సామర్థ్యము లేదు. కర్మ, శరీరము నను వీని రూపాంతరములకు కూడ మనుష్య లొనర్చు కర్మలతోనే సంబంధ మున్నది.

మనుష్యుడు చేయు కర్మ శరీరమునకు కారణము. మనుష్యునకు తన కర్మల ద్వారా మనుష్య శరీరము లభించును; పశు పక్ష్యాది శరీరములును లభించును. పశువులు, పక్షులు మున్నగునవి తమ కర్మల ద్వారా యన్య ప్రాణులకు సుఖదుఃఖములు చేకూర్చును. కాని, వాని కర్మలు వాని శరీరాంతరములకు కారణములు కావు. శుభాశుభముల యాలోచన మనుష్యులలోనే యున్నది. ఇతరులకు కష్టము కలిగించుట చెడుగు; మంచిచేయుట మనుజునకు కర్తవ్యము. మనుష్యేతర ప్రాణులలో నుచితానుచిత విచార ముండదు. పిల్లి యెలుకను చూడగానే దానిమీదికి లంఘించును. అది దానిని చంపుటలో చెడు గెంచదు; దాని క్రియ యంత్రగతివలె విచారశూన్యమైన స్వాభావిక ప్రవృత్తి. దాని కా కర్మవలన ననిష్ట ఫల మనుభవింపవలసిన యవసరము లేదు. కర్మలు ఫలప్రద మగుటకు కర్తవ్యాకర్తవ్య విచారణ మావశ్యకము. మనుష్యేతర ప్రాణుల శరీరములు కేవలము ఫలము ననుభ

వించుటకే యేర్పడినవి. కావున నా ప్రాణులు చేయు కర్మలు వ్యర్థములగును. వాని వినిమయములో ఫల ముండదు.

మనుష్యుని కర్మలు, శరీరములు ననువాని పరంపరలో, మనుష్యుని కర్మలు, పశుశరీరములు ననువానికి చెందిన పరంపరయు నొకటి యున్నది. ఈ పరంపరా రూపాంతరము, పణ్యముల సాటూద్వినిమయములో గల రూపాంతరమును పోలి యుండును. మామిడిపండ్లు గోధుమల రూపమును, గోధుమలు పండ్లరూపమును బొందును. తరువాత వాని యుపభోగము కాగా నవి పణ్యములు కావు. అట్లే మనుష్యుని కర్మలు గుఱ్ఱపు శరీర రూపమున రూపాంతరము బొందినపిదప వాని యుపభోగము ప్రారంభ మగును. కావున మరల గుఱ్ఱపు శరీర కర్మలు శరీరాంతరము నుత్పన్నము చేయవు. మనుష్యుని శరీరములో రెండు శక్తు లున్నవి. ఆ శరీరములో నుపభోగము కలుగును; ఫలప్రదములగు కర్మలు దానితో చేయబడును.

మనుష్యుని కర్మలు మనుష్యేతర ప్రాణి శరీరములలో రూపాంతరము లయినపుడా రూపాంతర మనేక విధముల నగును. ఒక మనుష్యుని కర్మలు గుఱ్ఱపు శరీర రూపమును ధరించి, మరల మనుష్యుని శరీర రూపమును ధరించుట యొక విధమగు రూపాంతరము. మనుష్యుని కర్మలు గుఱ్ఱము, ఏనుగు, మున్నగు జాతుల శరీర రూపమును ధరించినపుడు, కొన్ని కర్మలు గుఱ్ఱపు శరీర రూపమును, మరి కొన్ని యన్య జంతువుల శరీరరూపమును ధరించును. గుఱ్ఱపు శరీర రూపమును ధరించిన కర్మలే గజాది శరీర రూపముల

ధరింపవు. ఒకని దగ్గర నాలుగు రకముల పణ్యము లున్న వనుకొనుడు. పండ్లు, గోధుమలు, వస్త్రములు, కాగిత ములు. వీనిని వరుసగా నతడు నేయి, కొయ్యలు, పుస్తక ములు, ఇనుము ననువానికి వినిమయము చేసెను. ఇక్కడ నాలుగు పణ్యములకు నాలుగు రూపాంతరములు కలిగి న ట్లెంచవలెను.

ఇతర జాతులకు చెందిన యెన్ని శరీర రూపములను ధరించినను, మనుజుని కర్మలలో కొన్నింటికి చివరకు మరల మనుష్య శరీరమును ధరింపక తప్పదు. మరల నా పరంప రయే నడుచును.

ధనముద్వారా వినిమయము జరిగినపుడు, ధన మెవని చేతిలో జేరునో వాడు దానితో మరల పణ్యము కొనును; కాని కొనుటకు కాలనియమ మేమియు నుండదు. ధనస్వామి కోరినచో ధనము రాగానే పణ్యము కొనవచ్చును. లేక కాలాంతరమున కొనదలచిన నట్లు చేయవచ్చును. ధనము పణ్యముల మూల్యము. అది రూపాంతరము నొందవలసి యుండును. రూపాంతరము కాకున్న ధనము సంచయము కాజొచ్చును. అప్పుడు దాని పరిణామము శుభకరము కాదు. దానివలన నర్థసంకట మేర్పడును. ఇట్టి సంకటము కర్మసంబంధమైన రూపాంతరమున నెన్నడు కలుగదు. మనుజులు నూరు వత్సరములో యంతకంటె నెక్కుడు వర్ష ములో జీవింతురు. వా రా జీవితములో చేయు కర్మ లా జీవిత కాలములోనే యన్య శరీర రూపమును ధరింపవు. అవి సంచితము లగుచుండును. కాని వానివలన నెట్టి సంకటము

లోకమునకు కలుగదు. రెండవ శరీరము లభించినప్పుడా కర్మలు తమ ఫలము నొసంగ నారంభించును.

పణ్యములు రూపాంతరము నొందుటలో శరీర శ్రమయే కాక జ్ఞానముకూడ రూపాంతరము నొందును. కాని, జ్ఞానము శ్రమవలె ప్రత్యక్షము కాదు. ఇచ్చిపుచ్చుకొనుటలో శ్రమ తరుచుగ లెక్కింపబడును.

శరీరము మనుష్యుని శారీరిక కర్మల రూపాంతరమే కాక యాలోచనలయొక్క రూపాంతరముకూడ నగును. మనుజుడు చేయు శుభాశుభ విచారముల ఫలముకూడ శరీరముద్వారా లభించును. విచారము లొక భౌతిక శరీరమును తొలగించి మరియొక భౌతిక శరీరమును కలిగించును.

పణ్యముల నిచ్చిపుచ్చుకొనుటలో నొకప్పుడు ధనము సువర్ణాది ముద్రల రూపమున నుండక యాలోచనా రూపమున నుండును. ధనము విచారమయ రూపమున నున్నను భౌతిక పణ్యములను పూర్వమున్న తావునుండి స్థానాంతరమున చేర్చగలుగును. కొనుగోలుచేయు వాడనేక పర్యాయములు వస్తువులు కొన్న ఋణమున ధనమియ్యడు. తరువాత నెన్నడో యిత్తునని ప్రతిజ్ఞ చేసి, పణ్యములను తీసికొనును. పణ్యస్వామి ప్రతిజ్ఞను విశ్వసించి పణ్యముల నిచ్చును. ఆ ఋణమున మూల్యధనము భౌతికాకారమున నుండదు. విచారమయ (ప్రతిజ్ఞ) రూపమున నుండును. ఆ రూపమునందును నది పణ్యములను పణ్యస్వామినుండి తొలగించి కొనువాని కర్పించును. ఇచ్చిపుచ్చు

కొను వ్యాపారమున మిక్కిలి భాగము ప్రతిజ్ఞ నాశ్రయించి నడుచును. ప్రతిజ్ఞ చేయు కాలపు ధనమువంటివే మనుజుని శుభాశుభ విచారములుకూడ. అవియును శరీరరూపమును ధరించును.

పణ్యములకు శరీరములకు మధ్య పెద్ద భేదమున్నది. పణ్యముల నుత్పన్నముచేయు కర్మ ప్రత్యక్షము. శరీరోత్పాదక కర్మ లతీంద్రియములు - అప్రత్యక్షములు. ఇతర విషయములలో నవి సమానములే.

## పదునాలుగవ యధ్యాయము

# ఐశ్వర్యము, దారిద్ర్యము, వాని కారణములు

ప్రతి జన్మము నందును మనుజుడు చేయు కర్మలకు ఫలము తప్పక లభించును. ఫలము ననుభవింప జేయక కర్మ నశింపదు. ఇది యాత్మవాదమున నొక ముఖ్య సిద్ధాంతము. జన్మాంతరము, కర్మఫలమును నంగీకరించువారిలో ననేకులు మూలపతుల గొప్ప యైశ్వర్యము వారి కర్మలకు ఫలముగా చెప్పుదురు. 'మూలపతులు పూర్వ జన్మమున చేసిన శుభ కర్మలవలన వారి ధనము వృద్ధి పొందుచున్నది. రాత్రిం బవల్లు పరిశ్రమ చేసినను పొట్టనిండ నన్నము, శరీరమును కాపాడుకొన తగినంత బట్ట లభింపనందున ననేకులు దుఃఖ ముల పాలగుచున్నారు. వారి దుఃఖములకు కారణము, వారు పూర్వజన్మమున చేసిన కర్మలే' యందురు.

ఇట్టి కర్మ ఫల వ్యవస్థ నంగీకరించిన పక్షమున మూల పతు లన్యాయమొనర్చు వారని కానీ, శ్రామికులు వారి యత్యాచారముల ద్వారా పీడింపబడుచున్నారని కానీ చెప్ప వలనుపడదు. కారణ మేమన నందరు వారి వారి కర్మల ఫలమును బొందుచున్నారు; ఇం దన్యాయము కానీ, యత్యా చారము కానీ లేదు.

ఇట్లంగీకరించువారు ధనసంచయమునకు కారణము మూలపతి చేయు నన్యాయము కానీ, శ్రమహరణము కానీ కారణ మని యెంచరు. వాస్తవమున శ్రమహరణము ధన

సంచయమునకు దృష్టకారణము. పూర్వజన్మపు శుభాశుభ కర్మ లదృష్ట కారణములు. దృష్టకారణము లుండగా వాని నపేక్షించి యదృష్టకారణముల నంగీకరించుటకు విశేష హేతు వేదైన నుండవలెను. కార్యములు కొన్ని యనేక కారణములు గలవియై యుండును. ఆ కారణములలో కొన్ని ప్రత్యక్షములు; కొన్ని పరోక్షములు నగును. విశేష హేతు వేదైన లభించినపుడు దృష్టకారణములను విడిచి యదృష్ట కారణముల నూహింపవలసి వచ్చును; అట్టియెడ ప్రత్యక్ష ముగ కనబడు కారణములు వాస్తవమున కారణములు కావు.

పంచతంత్రములో నొక కథ యున్నది. ఒకా నొక స్త్రీ నువ్వులు పొట్టు తీసి బయట నారబోసి యుంచెను. ఒక కుక్క వచ్చి వానిపై మూత్రవిసర్జనము చేసెను. అప్పు డా స్త్రీ వానిని దూషితము లైనట్లు తలచి వాని నెవరికైన నిచ్చి మంచి నువ్వులు సంపాదింప నుపాయము నాలోచించెను. ఆమె పొరుగు స్త్రీలను బిలిచి వారితో 'నా కిప్పు డీ పొట్టుతీసిన నువ్వులతో బని లేదు—మీ కవసర మున్న వీనిని తీసికొని పొట్టుతోనున్న నువ్వులు నా కిండు' అని యనెను. వారిలో నొక స్త్రీ యా నువ్వులు తీసికొన నుద్యమించెను; కాని నీతి నిపుణుడైన యామె కొడుకు 'అమ్మా! నీవు వానిని తీసికొనకు. పొట్టు తీయుటకు పరిశ్రమ చేయవలసి వచ్చును. ఈమె నిష్కారణముగ తన పరిశ్రమ నితరుల కియ్యదు.' అని వారించెను. తరువాత విచారింపగా కుక్క మూత్రించి వానిని చెడగొట్టినట్లు తెలిసినది.

ఇక్కడ పొట్టుతీసిన నువ్వుల నితరుల కిచ్చుటకు రెండు కారణములు సంభవము కావచ్చును. వాని యావశ్యకత లేకుండుట యొక కారణము. దూషితవస్తువు నిచ్చి మంచి వస్తువును తీసికొనుట రెండవ కారణము. ఆవశ్యకత లేకుండుట ప్రత్యక్ష కారణము. ఈ కారణమునే చెప్పి యామె యియ్య నెంచినది. రెండవ కారణ మితరులను వంచించుట. నువ్వులు దూషితము లైనట్లు నిశ్చితమైనది కావున వాని నితరుల కిచ్చుటకు కారణము తన కవసరము లేకుండుట కాదు.

మూలపతిధనము లోకులు చూచుచుండగనే పెరుగు చున్నది. శ్రామికులయు, నుపభోక్తలయు శ్రమను హరింప కున్న నతని ధనము పెరుగదు. శ్రమహరణము ధనసంచయ మునకు దృష్టకారణము. ప్రాచీన జన్మమునకు సంబంధించిన కర్మల కారణముననుం మహదైశ్వర్యము లభింపవచ్చును. కాని, శ్రమహరణము ధనసంచయమునకు కారణము కాదని సిద్ధపరుపగల విశేషహేతు వొండును కానరాదు. మూల పతికి జన్మాంతర శుభకర్మలు కారణముగ వైభవము లభించిన దనుటకు ప్రమాణ మేమియు లేదు. శరీరము శుభాశుభ కర్మలకు ఫలము. శరీరము లేకున్న సుఖదుఃఖములు కలుగవు. సుఖదుఃఖముల ననుభవించుటకు తగిన భోగసాధనము కర్మల ద్వారా లభించును. శరీర మీ విషయమున స్పష్టప్రమాణము. ధనము కూడ సుఖభోగమునకు సాధనమే. శరీరమువలె ధనముకూడ ప్రాచీన కర్మలకు ఫలము కావచ్చును. కాని, మూలపతిధనము నతని ప్రాచీనకర్మ లుత్పన్నము చేసిన

వనుటకు ప్రమాణ మొకటి కావలెను. ధనము శ్రమహార ణము వలననో, పురాతన కర్మలవలననో యుత్పన్నము కాగ లుగును. శ్రమహారణము ప్రస్తుతమున దృష్టకారణము. ప్రాచీనకర్మ లదృష్టకారణము. అట్టియెడ నసాధారణ ప్రమాణము - హేతువు - దొరకనంతవరకు దృష్టకారణమే యంగీకరింపనగును.

కర్మఫలము కర్తకు లభించును. ఒకడు మరియొకనికి తన కర్మవలన నెంత సుఖమును, దుఃఖమును కలిగించునో యంతటి సుఖము, దుఃఖము నతనికి లభించును. సుఖదుఃఖ ములు కలుగుట కర్మలు ఫలప్రద మనుటకు హేతువు. ఒకడు తన యంగములతోను, వాణితోను మరియొకనికి సుఖ దుఃఖములను కలిగింప నెంచకున్న, నట్టివాని కర్మ లిహపర ములలో ఫలముల నీయజాలవు. అవి నిష్ఫలము లగును. ఎండ వలన వ్యాకులుడగు మనుజున కొకడు గొడుగుపట్టి సుఖము కలిగించిన నతని యా కర్మ ఫలము నిచ్చు సామర్థ్యము కల దగును. కాని, ఎండలో నిలబడి యుండి, గొడుగు తెరచి యుంచియు నొకని కష్టమును నివారింపనపు డతని ఛత్రధార ణము నిష్ఫల మగును. చేతిలో ఛత్రము పట్టుకొని యెండలో నిలబడుట కేవల క్రియ యగును. అది శుభా శుభ కర్మలలో చేరదు. క్రియకు గల స్వాభావిక ఫలము మాత్రము లభిం చును. శుభా శుభ ఫలములు దానివలన లభింపవు. ఛత్ర ధారణకు స్వాభావిక ఫలము మొదట ముడుచుకొని యున్న గొడుగు ఇప్పుడు విప్పారి యుండును. ఛత్రధారణ క్రియ కంతకు మించిన ఫలము స్వాభావికము కాదు. అది సుఖప్రద

మగుటకు నా ఛత్రధారణ వలన నెవరికైనను సుఖము కలుగ వలెను. ఒకని ఛత్రధారణము వలన మరియొకనికి సుఖము లభించినచో నందుమూలమున నా ఛత్రధారకునకు సుఖము పొందుట కధికారము కలుగును. సుఖవినిమయ మున సుఖము ప్రాప్తించును. ఎండచేత వ్యాకులు డగు వానికి ఛత్రధారణ వలన సుఖము కలిగిన నా సుఖమునకు కారణము ఛత్రధారణము. ఆతపవ్యాకులు డైన మనుజుని పూర్వకృత కర్మ లీ సుఖమునకు కారణము కావు. అవి సుఖజనకము లయిన ఛత్రధారణము వలన సుఖము లభింపకుండవలెను. మరియు ఛత్రధారకునకు ఛత్రధార ణము చేసినందులకు వినిమయమున సుఖము లభింపకుండ వలెను. ఛత్రధారణ ద్వారా యుత్పన్నమైన సుఖము వినిమయమునకు సాధన మగుచున్నది. వినిమయము ద్వారా లభించు సుఖము సాధ్య మగును. సాధనము లేకున్న సాధ్య ప్రాప్తి కలుగదు. ఛత్రధారణము చేసి యొకడు స్వయముగా నెండనుండి తప్పుకొనిన నా ఛాయ వలన సుఖ మితరునకు కలుగదు. ఈ స్థితియందు ఛత్రధారణము వలన జన్యసుఖము భోగ్య మగును. అది వినిమయసాధనము కాదు. కర్మ వినిమయముద్వారా సుఖజనకము కావలెననిన నది యన్యు నకు సుఖము కలిగింపవలసి యుండును.

ఇట నొక తత్వము ధ్యానమున నుంచుకొన దగిన దున్నది. వినిమయముద్వారా ప్రాప్తమగు ఫలభూత సుఖ దుఃఖములు కర్మనొనరించు కర్తలకు లభించును. కర్త సుఖమో, దుఃఖమో యనుభవింపనంతవరకు కర్మ నశింపదు.

కర్మ వినిమయసాధనమై కలిగించు సుఖముకానీ, దుఃఖము కానీ కర్తకంటె భిన్నుడైనవానికి లభించును. కర్తకంటె భిన్నుడయినవానికి సుఖదుఃఖములను కలిగింపకున్న పక్షమున కర్మలో వినిమయము ద్వారా కర్తకు సుఖదుఃఖములను కలిగించు సామర్థ్య ముత్పన్నము కాదు. వినిమయము ద్వారా పొందదగు సుఖదుఃఖములను ధ్యానమున నుంచుకొని 'చేసికొన్నవానికి చేసికొన్నంత మహాదేవ!' యను సామెత ప్రసిద్ధమైనది. ఈ తత్వమును బాగుగ నాలోచింపనివారు కర్మద్వారా యుత్పన్నమగు వినిమయమునకు సాధ్యమైన సుఖదుఃఖములను కర్త యొక్క కర్మల వలన నుత్పన్నము లైన నెంచకున్నారు. వారు ఆ సుఖదుఃఖములకు కారణము భోక్తృ (అనుభవించువాని) కర్మ లందురు. దీనివలన కర్మఫలములో వ్యవస్థ యుండదు. ఈ యుదాహరణమునందు గొడుగు పట్టువాని పేరు దేవదత్తుడు, ఛాయాసుఖము ననుభవించువాని పేరు విష్ణుమిత్రుడు ననుకొనుడు. దేవదత్తుడు ఛత్రధారణము చేయును. అతని కర్మ విష్ణుమిత్రుని సుఖమునకు కారణము కాక, విష్ణుమిత్రునికి తన ప్రాచీన కర్మల కారణమున సుఖము లభించి నట్లయిన దేవదత్తునకు దానికి బదులు వినిమయమున సుఖము పొందుట కధికార ముండదు. సుఖదుఃఖములు కర్మఫలము లగుట యనివార్య నియమము. కాని, సుఖదుఃఖములు రెండు రకములు. వినిమయ సాధనములు; వినిమయ సాధ్యములు. వీని యుత్పాదక కర్మలును సమానములు కావు. ఈ కర్మల నొనర్చు కర్త, ఫలము

ననుభవించు భోక్తయు భిన్నులే. దేవదత్తుని ఛత్రధారణము విష్ణుమిత్రుని సుఖమునకు కారణము. విష్ణుమిత్రుని సుఖము దేవదత్తుని సుఖమునకు సాధనము. విష్ణుమిత్రుడు ఛాయ వలన నే సుఖ మనుభవించునో యది దేవదత్తుడు ఛత్రధారణ చేయుటవలన జనించినది. ఇట కర్మ నొనర్చు కర్త దేవ దత్తుడు. సుఖఫలము ననుభవించువాడు విష్ణుమిత్రుడు. ఆ సుఖము విష్ణుమిత్రునిబట్టి చూచిన ఫలము, దేవదత్తు బట్టి చూచిన సాధనము నగును. దేవదత్తుని ఛత్రధారణము ద్వారా విష్ణుమిత్రుడు సుఖియైన కారణమున దేవదత్తునకు సుఖము లభింపగలదు. సాధనరూపమగు సుఖదుఃఖముల నను భవించువారు అన్యు లగుదురు. ఈ సాధనభూత సుఖదుఃఖ ములను తమ కర్మలద్వారా యుత్పన్నము చేయువారు భోక్తల కంటె భిన్ను లగుదురు. జడము, చేతనము నను రెంటిమీదను కర్మల ప్రభావము చూడనగును. ఆ ప్రభావ కారణమున జడము కేవలము వికృత మగును. కాని, చేతనము సుఖ మునో లేక దుఃఖమునో యనుభవించును. దేవదత్తుని ఛత్రధారణమువలన విష్ణుమిత్రునిమీద ఛాయ పడునట్లు భూమిమీదకూడ పడును. భూమి యచేతన మగుటవలన దానికి సుఖము కలుగదు. విష్ణుమిత్రుడు చేతనము కావున నతనికి సుఖము కలుగును. భూమి, విష్ణుమిత్రుడు నిరువురు దేవదత్తునికంటె భిన్నులు. ఛాయవలన భూమికి కలుగు వేడి తగ్గును. దేవదత్తుని ఛత్రధారణము భూమిమీద వేడి తగ్గుట కెట్లు కారణమో యట్లే విష్ణుమిత్రుని సుఖమునకును కారణ మగును. భేదదృష్టితో చూచిన భూమి, విష్ణు

మిత్రుడు నిరువురు సమానులే. దేవదత్తుని ఛత్రధారణ ప్రభావము భిన్నులైనంతమాత్రమున విష్ణుమిత్రునిమీద పడదందుమేని, భూమిమీదకూడ దాని ప్రభావము పడకుండ వలెను. కర్త యొనర్చు కర్మయొక్క సాక్షాత్ ప్రభావ మా కర్మతో సంబంధము గల వస్తువుమీద పడును. దేవదత్తుడు ఛత్రమును తన శిరస్సుమీద ధరించిన నతనికే ఛాయాసుఖము లభించును. విష్ణుమిత్రుని శిరస్సుపై ఛత్రము నుంచిన ఛాయాసుఖ మతనికి లభించును. దేవదత్తుడు తనకై ధరించిన ఛత్రధారణ మతని సుఖమున కెట్లు కారణ మగునో, విష్ణుమిత్రుని శిరస్సుపై నుంచిన నది యతని సుఖము నకు నట్లే కారణ మగును. విష్ణుమిత్రునికి సుఖము కలిగించు టలో ఛత్రధారణ సామర్థ్యము కుంటువడదు. కాని భేద మేమన: స్వయముగ తాను ఛాయాసుఖము ననుభవించి నపుడు దేవదత్తుడు వినిమయములో సుఖమును పొంద జాలడు. వినిమయములేక సుఖదుఃఖముల నుత్పన్నము చేయుటలో కర్మకు స్వపర భేదము లేదు.

వినిమయమువలన గలుగు సాధ్యములైన సుఖదుఃఖ ములవలె సాధన సుఖదుఃఖములు కూడ భోక్తయొక్క పూర్వ కర్మల వలన నుత్పన్న మగునెడల మిక్కిలి యవ్యవస్థ యేర్ప డును. దొంగ యెవరి సొత్తును హరించునో వారు పూర్వజన్మ మున నపరాధము చేసినవా రగుదురు. ఒక నిరపరాధి నెవ రైన తుపాకితో కాల్చినను, పర్వత శిఖరమునుండి క్రిందికి పడద్రోసినను, నీట ముంచినను నతని యా కష్టము లన్నియు నతని పూర్వజన్మ కర్మల ఫలములుగా సిద్ధమగును. ప్రస్తుతము

నిరపరాధి యగువాని పూర్వపు కర్మలే యిప్పటి చోరులను, ఘాతుకులను ప్రేరేపించిన వని యంగీకరించిన లోకమున దుష్టు లనబడువా రెవరు ? ఇప్పుడు పీడితులగువారి పాపములే చోరులయు, ఘాతుకులయు మనస్సును చౌర్యము చేయుటకు, హత్య నొనర్చుటకు ప్రేరేపించినవి కదా ? కాబట్టి చోరులు, ఘాతుకులు నిరపరాధు లగుదురు. న్యాయమూర్తి యాజ్ఞ వలన నపరాధి దండనీయుడు కాడు. పీడితుని దుష్కర్మలు చోరుని, ఘాతుకుని ప్రేరేపింపకున్నచో వారి కర్మలు పీడితుని దుఃఖములకు కారణ మగును. అప్పుడు వారు దండనీయు లగుదురు.

ప్రాచీన శుభాశుభ కర్మలు, నేటి కర్మలవలన నేర్పడని సుఖదుఃఖములకు కారణము లగును. 'ఒకడు మఱికొందఱను చంపుటకు బాణమునో, మరియొక యస్త్రమునో ప్రయోగించిన నతడు వారి నందరను చంపగోరినవా డగును. వారిలో కొందఱు చత్తురు. కొందఱు బ్రతుకుదురు' అనుకొనుడు. అట్టియెడ న్యాప్రహారము, తప్పుకొని బ్రతికినవారిని తప్పించుటకు కారణము కాదు. ఒక డొక మనుష్యుని ఘాతుకుని ప్రహారమునుండి రక్షించును. అట్టిచో రక్షకుని యత్నమువలెనే రక్షితుని యత్నముకూడ బాణాది ప్రహారమునుండి తప్పుకొనుటకు కారణ మగును. రక్షణ ఘాతుకుని కర్మఫలము కాదు. అది రక్షితుని కర్మలకు ఫలము. కాని నిరపరాధికి పీడ, ఘాతుకుని కర్మలవలన కలుగవచ్చును. కాబట్టి, యీ పీడ నిరపరాధియొక్క ప్రాచీన కర్మలఫల మనజనదు. అనేకపర్యాయములు రైళ్ళలో యెదురుతాకిడి కలుగును. అప్పుడు పలువురు క్షతులై చత్తురు. అట్టియెడ వారిలో

నా రేడు మాసముల శిశువు నిరపాయముగ మిగిలియుండి యెల్లరకు నాశ్చర్యము కలిగించును. ఆ శిశువున కెక్కడ నిసుమంతయైన దెబ్బ తగిలి యుండదు. అట్టి భయంకరా ఘాతములనుండి జరిగిన యా రక్షణ యా శిశువు పూర్వకర్మల ఫల మగును.

ఒక క్షణమున గలుగు సుఖదుఃఖముల నుత్పన్నము చేయుట కా క్షణపు కర్మలలో సామర్థ్యము లేనపు డా సుఖ దుఃఖములు పూర్వకర్మల ఫలము లగునని యింతకుపూర్వము చెప్పియుంటిమి. కాని తాత్కాలికపు కర్మ లన్నింటిలోను నిట్టి యసామర్థ్య ముండదు. మనుజుడు స్వాయముగ దుగ్ధ పానము చేయును; అన్నము తినును. వేసవిలో చెమట పట్టిన వీవనతో విసురుకొనును. ఈ కర్మల యన్నింటి ఫలము కర్మా నంతరము వెంటనే లభించును. తాత్కాలికపు కర్మలు ఫలము నుత్పన్నము చేయుటలో నసమర్థములైన నన్నపానీయముల వలన క్షుత్పిపాసలు దూరము కాగూడదు. స్వాయముగ నొక డన్నపానీయములను గ్రహించి క్షుత్పిపాసలు తీర్చు కొనుచున్నాడు. అత డన్యుల కన్నపానీయముల నిచ్చిన నవి వారి క్షుత్పిపాసలను దూరము చేయకపోవు. భోజనక్రియ తన యాకలిని తీర్చినట్లుగా నితరుని యాకలిని గూడ దీర్చును. ఒక డొనర్చిన కర్మల ఫలము నాశ్రయించి మరి యొకని ప్రాచీనకర్మలు ఫల మొసంగ నుద్యమింపవచ్చును. దేవదత్తుని కర్మ విష్ణుమిత్రుని శరీరముమీదనో లేక ఆత్మ మీదనో కలిగించిన ప్రభావము నాశ్రయించి విష్ణుమిత్రుని ప్రాచీనకర్మలు తమ ఫలము నీయగలవు. ఉదాహరణముగా

దేవదత్తుడు విష్ణుమిత్రుని పడద్రోసె ననుకొనుడు. అతనికి కాలిమీద చిన్న గాయము పడినది. ఆ గాయమువలన కలుగు దుఃఖమునకు కారణము దేవదత్తుని కర్మ. తదుపరి విష్ణుమిత్రుని పూర్వకర్మ లా గాయము నాశ్రయించి భయంకర రోగము నతనికి కలిగింపవచ్చు. ఇట్లు జరిగిన పక్షమున నెంతదుఃఖము దేవదత్తుని కర్మవలన నుత్పన్న మైనదో దానికి దేవదత్తుని కర్మ కారణ మగును. మిగిలిన యధిక దుఃఖమునకు కారణము విష్ణుమిత్రుని పూర్వపు కర్మ లగును.

సాధారణ మనుష్యు డిట్టి తావులందు విభజించి దుఃఖ కారణములను గుర్తింపజాలడు. కావుననే జను లిట్టి సమయములందు పొరపాటునకు లోనయి దుఃఖకారణములను గుర్తింపజాలరు.

ఎట్టి దశయం దైనను పూర్వపు శుభాశుభ కర్మలు వర్తమానకాలపు కర్మల సహాయములేక తమ ఫలములను చేకూర్పజాలవు. పీడితునకు కలుగు పీడ, సామాన్యముగ పీడకుడు, పీడితుడు ననువారి యిరువురి కర్మలవలన కలుగ వచ్చును. పీడకుని కర్మ వర్తమానము, పీడితుని కర్మ ప్రాచీనము నగును. వర్తమాన కర్మలు పూర్వపు కర్మలు లేకున్నను ఫలము నొసంగ గలవు. గతించిన కర్మలకంటె వర్తమానపు కర్మలలో గల విశేష సామర్థ్య మిదియే. పీడకుని వర్తమాన కర్మలను పీడితుని దుఃఖమునకు కారణ ముగ నంగీకరింపక, కేవలము పీడితుని యతీత కర్మలనే కారణము లనుట ప్రత్యక్ష విరుద్ధ మగును. దివ్యచక్షువు

లేక చర్మచక్షువులకు పూర్వకర్మల సాక్షాత్కారము కలుగదు. కాని, వర్తమాన కర్మలు సుఖదుఃఖములు కలిగించుట యనుభవ సిద్ధము. పీడించువాని కర్మ పీడితునకు దుఃఖమును, ఉపకారము చేయువాని కర్మ యుపకృతునకు సుఖమును కలిగించు ననుట సత్యము. 'అధర్మము మొదట నైశ్వర్యమునకు, శత్రువిజయమునకు కారణ మగుననియు, నంతమున సర్వనాశమునకు కారణ మగు' ననియు మనువు చెప్పియున్నాడు.

> "అధర్మేణైధతే తావత్తతో భద్రాణి పశ్యతి
> తతః సపత్నాన్ జయతి, సమూలస్తు వినశ్యతి"
>
> మ-4. 174.

ఇందు మనువు పరులను పీడించువాని యధర్మమును పీడితుని దుఃఖములకు కారణముగ చెప్పియున్నాడు.

కర్మగతి విచిత్రము. దానికొక పద్ధతి నియతమొనర్ప ననువుకాదు. ఒకచో కేవల వర్తమాన కర్మలు సుఖదుఃఖములు కలిగించిన, మరియొకచో వర్తమాన కర్మలు, నతీత కర్మలును కలిసి సుఖదుఃఖముల నిచ్చును. తల్లిదండ్రులు పుత్రుని పోషించుటలోను, పుత్రుడు తల్లిదండ్రులకు సేవ చేయుటలోను కర్మల నాచరింతురు. వానివలన సుఖదుఃఖములు కలుగును. ఆ సుఖదుఃఖములలో కొంతభాగము భోక్త యొక్క పూర్వకర్మలకు ఫల మగును. ప్రాచీనకర్మ లెటనుండి ఫల మొసంగ ప్రారంభించునో, యెట సమాప్తము చేయునో నిశ్చయింప వీలుకాదు. ప్రాణులయొక్క ప్రతి శుభకర్మ

తోను, ప్రతి యశుభ కర్మతోను పూర్వకర్మలు కలిసి పని చేయ గలుగును. పూర్వపు కర్మల నంగీకరించి, యపకారి యొక్కయు, నుపకారి యొక్కయు వర్తమాన కర్మలు సుఖ దుఃఖములకు బొత్తిగా కారణములు కావనియు, నవి నిష్ఫలము లనియు నంగీకరింపరాదనుట మరువరాదు. ప్రాణుల పూర్వ కర్మల ప్రభావము పడని యణువుకూడ ప్రపంచమున లేదు. కర్మవాదము ననుసరించి, యగాధమగు సముద్రతలమున మందతరంగముల ద్వారా నేర్పడు స్పందనము, నున్నత పర్వత శిఖరములపై బడు భయంకర పవనాఘాతములు, లక్ష లాది యోజనముల దూరమున నుండు సూర్యచంద్రాదుల కిరణప్రసారములు, భూమండలమున నొక యగ్రమునుండి మరియొక యగ్రమువరకు నగు వర్షపాతములు వీని యన్నిం టికి మూలము ప్రాణుల కర్మలే. గొప్ప గొప్ప యాఘాత ములు మొదలుకొని యతిలఘువు, నతీంద్రియము నగు స్పందనము వరకు గల క్రియ లన్నియు ప్రాణుల సుఖదుఃఖము లకు కారణము లగుచున్నవి. ప్రపంచమున గలుగు ప్రతి వస్తూత్పత్తియు ప్రాణుల కర్మాధీనమై యున్నది. జడములు, చేతనములు నన్నియు ప్రాణుల కర్మలమీాద తమ ప్రభావ మును కలిగించుచున్నవి. ఆ కారణముననే మనుజున కనేక పర్యాయములు చేసిన ప్రయత్నములకు ఫలము లభింపదు. అనేక పర్యాయము లనుకూల మైనందున నీ ప్రభావమే యలక్షిత రూపమున సిద్ధికి సాధన మగును. ఏది యెట్లైనను, పూర్వపు శుభాశుభ కర్మల ప్రభావ మెంత గొప్ప దైనను, నవి వర్తమాన కర్మలను విడిచి ఫలము నొసంగజాలవు. వర్త

మాన కర్మలద్వారా యుత్పన్నమగు సుఖదుఃఖములలోని భాగము పూర్వపు కర్మలద్వారా కొంచెమైనను తొలగదు.

ఇక ప్రకృత విషయ మాలోచింతము. మూలపతి శ్రామికుల దారిద్ర్యమున నెంతభాగము శ్రమహరణము ద్వారా కలిగించునో యా యంశమునకు కారణము శ్రమ హరణమే. శ్రామికుల పూర్వకర్మలు వారి దారిద్ర్యమునకు కారణములు కాకున్నను వారు దరిద్రులు కావచ్చును. మూలధనపతి వారి శ్రమను హరణము చేయక యుచితమైన శ్రమఫలము శ్రామికుల కిచ్చినను, కొండొక యసంభావిత ఘటన కారణముగ శ్రామికు డొకడు నిర్ధను డైనపుడు వాని నిర్ధనతకు కారణము వాని యతీతకర్మ లనవచ్చును. కాని యట్లెన్నడును కాదు. నిప్పుమీద చేయిపెట్టిన కాలుట స్వాభావికము. అట్టియెడ చేయి కాలుటకు కేవల పూర్వ కర్మలను కారణ మని చెప్పగల సముచిత తర్క మొండును లేదు. దొంగలు, బందిపోటుదొంగలు నప్పుడప్పుడు నెక్కువగ ధనములను ప్రోవుచేయుదురు. వారి యా ధనము వారి ప్రాచీనకర్మల ఫల మని యంగీకరింపబడదు. ఏ రాజ్య మును చోరులను దేశమున నుండనీయదు. అన్యాయపరు లగు మూలపతులు చేయు శ్రమహరణము, చోరుల చౌర్యము, లూటీలు చేయువారి లూటీలు నన్నియు సమానములే.

శ్రామికుడు, ఉపభోక్త యీ రిరువురు మూలపతియొక్క సంచిత కర్మరాశి కారణముగా కానీ, నకస్మాత్తుగా కానీ యకించనులు - దరిద్రులు - కాజాలరు. మూలపతి వలెనే

కాళ్లు చేతులు కలిగి శరీరధారులైన శ్రామికులు, ఉపభోక్తలు నశించను లగుటకు కొండొక ప్రక్రియ యున్నది. దానివలన నొకవంక మూలపతి ధనము పెరుగజొచ్చిన, శ్రామికులయు, నుపభోక్తలయు నశించనత మరియొక వంక పెరుగును.

మూలధనము కొంతవరకు న్యాయప్రాప్తము కావచ్చును. ఒకప్పుడు నందఱు శ్రమయొనర్చి యార్జించుచుండిరనుకొనుడు. ఒకనిలో నార్జించుశక్తి తక్కువగాను, మరియొకనిలో నెక్కువగాను నుండవచ్చును. కొందఱు తమ ఖర్చులకుపోను కొంత మిగులుటకు తగినంత యార్జింపగలుగుదురు. మరికొందఱు తమ జీవన నిర్వాహమున కవసర మైనంతయే సంపాదింపగలిగి యుందురు; కాని వారు నవసరమైనంత ఖర్చుచేయక తగ్గించి ఖర్చుచేసినందున కొలదిగా వారిదగ్గర ధనము మిగులవచ్చును. ఇట్లు మిగుల్చు వారిదగ్గర క్రమముగా ధనసంచయ మగును. మిగల్చలేని వారు క్రమముగ దరిద్రు లగుదురు. మిగిలిన ధనముద్వారా యుత్పాదకసాధనములు కొని, స్వయముగా శ్రమించి పణ్యము లుత్పన్నము చేయుదురు. అంతవరకు మూలధన ముత్పాదనమునకు సాధనముగా నుండును. క్రొత్తశ్రమ నార్జించును. కాని, యుత్పాదక సాధన స్వామి, సాధన హీనులైన శ్రామికులకు కూలి పూర్తిగా నీయక యుత్పాదన చేయ మొదలిడినప్పటినుండియు నైశ్వర్య మొకవంక వృద్ధి యగును. రెండవవైపు క్షయము కలుగును. నిరంతరము శ్రమహరణము చేయుచు కొంతకాలమునకు మూలపతి

ధనరాసులతో తులతూగును. శ్రామికుడు, నుపభోక్తయు పూర్వ మున్నట్లే యుందురు.

శ్రామికులకు పూర్తిగ కూలి నీయక, యుపభోక్తలనుండి యధిక మూల్యము తీసికొని మొదటి సంవత్సరము రు 500 ల మూలధనముతో రు 100 లు లాభము సంపాదించును. ఐదు సంవత్సరము లిట్లే వ్యాపారము నడచిన మూలపతికి సంచితలాభము మూలధనముతో సమాన మగును. లాభముగా వచ్చిన రు 500 ల నుపభోగించినను, మూలపతి దగ్గర మొదటి రు 500 లు మూలము స్థిరముగా నుండును. వాస్తవమున నా మొదటి రు 500 లు క్షీణించిపోయినట్లే; ఇప్పుడు కనబడు రు 500 లు శ్రామికులయు, నుపభోక్తలయు నపహృత శ్రమ - మూల్య - పుంజము మాత్రమే.

రు 1000 ల మూలధనము రు 200 ల లాభము నుత్పన్నము చేయగలదు. ఈ లాభమున రెండంశము లున్నవి. మూలధనము కారణముగ నయిన శ్రమలో మూలపతి యంశ మున్నది. దాని పరిమాణ మతి స్వల్పము. దాని వలన కలుగు లాభము మూలపతియొక్క శ్రమవలన నుత్పన్న మైనది. లాభములో మిగిలిన యధిక భాగము దోపిడికి చెందియుండును.

రు 200 ల లాభము మూలములో కలిపిన క్రొత్త మూలధనము రు 1200 లగును. క్రొత్త మూలధనమువలన క్రొత్త లాభాంకురములు కలుగును. మూలమువలన లాభము, లాభమువలన మూలము వీని ప్రవాహము బీజాంకురములవలె నడుచును. ఈ శ్రమహరణ ప్రక్రియతో

మూలపతి కొలది వత్సరములలో నాకసమునంటు ధనరాశి నేర్పరచును. శ్రామికులు నుపభోక్తలు తమకు లభించిన దానితో నెట్లో జీవననిర్వాహము చేసికొనుచుందురు. వారు నిర్ధనులుగానే యుందురు. శ్రామికున కుపభోగానంతర మేమియు మిగులదు. అందువలన వాని ధనము స్థిరము కాదు. వృద్ధియు నొందదు. శ్రామికు లుత్పన్నము చేయు పణ్యము లలో కొంతయు, నుపభోక్తలనుండి ప్రాప్తమూల్యమునుండి కొంతయు మిగిల్చి మూలపతి శ్రామికులకు కూలి నిచ్చును. అందులకై యత డెక్కువ శ్రమింపవలసిన యవసర ముండదు.

మొదట మూలపతి శ్రామికులయు, నుపభోక్తలయు శ్రమను హరించును. తరువాత మూలపతులలో పరస్పర స్పర్థ కలుగును. ఒకడు మరియొకని నోడింపజూచును. అందు వలన లఘుమూలపతి క్షీణించును. వాని మూలధనము విశాల మూలధనములో నంతర్భాగమై పోవును. పెద్ద పెద్ద ధనపతులు క్రొత్త యంత్రములద్వారా పణ్యముల నెక్కుడు పరిమాణములో నిర్మింతురు. యంత్రము లల్పశ్రమతో నధి కోత్పత్తిని చేయగలుగును. అందువలన శ్రామికుల నెక్కువ సంఖ్యనుండి తగ్గింపవలసి వచ్చును. క్రమముగ జీవికారహి తుల సంఖ్య పెరుగును. కొలదిమంది తక్క దేశమున మిగిలిన వారు దరిద్రు లగుదురు.

# పదునైదవ యధ్యాయము

# ధనముపై నధికారము

ప్రస్తుత కాలమునందు మూలధనము ధనోత్పత్తికి ముఖ్యసాధనము. నేడే కాదు; అతి ప్రాచీనకాలమునుండియు జనులు మూలధనముద్వారా ధనమును వృద్ధి చేయుచుండిరి. చిరకాలమునుండి వచ్చుచున్న యీ వ్యవహారమును చూచి యర్థశాస్త్రజ్ఞులలో కొందఱు మూలధనము శాశ్వత మని యెంచుచున్నారు. మనుష్యుడు వ్యాపారము నారంభించిన నాటనుండియు మూలధన మున్నట్లు వా రంగీకరించు చున్నారు. చిరకాలమునుండి యిట్టి యాచార మున్నందున మూలధనముద్వారా యధిక ధనము సంపాదించుట న్యాయో చిత మనియు నర్థశాస్త్రజ్ఞులలో ననేకు లభిప్రాయ పడు చున్నారు. కాని, చిరకాల మాచరణమున నున్నంత మాత్రమున నొక వ్యవహారము శాశ్వతముకానీ, యుచి తముకానీ కానేరదు. ఒకానొక వ్యాధి కొండొక మానవ సంఘమున శతాబ్దములకొలది యుండవచ్చును. అంత మాత్రమున నది మానవజాతి కంతటికి సహజధర్మము కాదు; అది హితకారి యనియు నెవరు నంగీకరింపరు. అయినను మానవజాతియొక్క ప్రారంభమునందే మూలధనము ప్రచ లితమై యున్నట్లు సిద్ధపరుప కొంద ఱర్థశాస్త్రజ్ఞులు పట్టుబట్టు చుందురు.

మానవజాతి యారంభకాల విషయమున ననేకమతము లున్నవి. పాశ్చాత్య విచారకులలో ననేకులు వికాసవాదము

స్వతఃసిద్ధ మందురు. ఆ వాదము ననుసరించి మానవుల యాదికాలము మిక్కిలి యజ్ఞానయుక్తమై యుండెను. మానవు లాదికాలమున పశుసమానులై యుండిరి. నాడు వారు వనచరులైన జంతువులు. మూలధనము మానవుల యాదికాలపు వస్తువనువారి దృష్టిలో మానవుడు వన్యదశలో కూడ మూలధనమును ప్రయోగించి యున్నాడు. కాని మార్క్సు ననుసరించు నర్థశాస్త్రజ్ఞుల దృష్టిలో మానవుడు వన్యదశలో మూలధనము నెరుగడు. నాడు మూలధన ముత్పన్నమే కాలేదు. వైయక్తికమగు సంపత్తియే నాడు లేదు. కావున మూలధన మెట్లుండగలదు?

పైన చూపిన యిరుతెగలకు చెందిన యర్థశాస్త్రజ్ఞులుకూడ ననాత్మవాదులే. వారి దృష్టిలో మానవు డాది కాలమున వన్యపశువులకు సమానుడుగానే యున్నాడు. సర్వ విధముల నత డజ్ఞానాంధకారమున నున్నాడు.

ఆత్మవాదులైన యర్థశాస్త్రజ్ఞు లా మత మయుక్త మందురు. ఆత్మవాదమునందు చేతనాత్మ శరీరముకంటె భిన్నము. అది యనాదికాలము నుండియు నానాజాతుల (యోనుల)లో నుత్పన్నమగుచు వచ్చుచున్నది. మానవుల శరీరములు, జ్ఞానాది గుణములు నొకటిగా నుండవు. ఒకని శరీరము దుర్బలమైన మరియొకనిది సబలము. ఒకనిది నీరోగశరీరమైన వేరొకనిది రోగసహితము. ఇట్లే యొకడు మందబుద్ధి; మరియొకడు తీవ్రబుద్ధి. జ్ఞానభేదము మానవుని శైశవకాలము నుండియు కనబడుచున్నది. నే డెట్లు తీవ్ర బుద్ధులు, మందబుద్ధులు నుత్పన్ను లగుచున్నారో యట్లే

సృష్టికి నారంభమునందును నుత్పన్నులు కావచ్చును. సర్గా రంభమునందు మానవుల జ్ఞానములో నుత్తమ, మధ్యమాధమ భేదములు లేకపోలేదు. సృష్టికి పూర్వము ప్రలయము, దానికి పూర్వము సృష్టియు నుండెను. బీజాంకురములవలె సృష్టిప్రలయముల ప్రవాహ మనాదికాలము నుండియు వచ్చుచున్నది. ఆరంభమున మానవు లుద్భవించినప్పుడు వారిలో కొంద అజ్ఞానాంధకారమున నున్న మరికొందఱు ప్రదీప్తమగు జ్ఞానప్రకాశమున నుండియుందురు. అప్పుడందఱు నజ్ఞానమున నున్నారనుట తప్పనిసరి కాదు. మానవుల జ్ఞాన భేదమునకు కారణము వారు పూర్వ మొనర్చిన భిన్న కర్మలు. పూర్వసృష్టియం దుత్తమకర్మ లొనర్చి, జ్ఞానమున నుత్తమాభ్యాస మొనర్చినవారికి తరువాతి సృష్టికి నారంభ మున వారి యభ్యాసము ననుసరించి తీవ్రజ్ఞానముకానీ, మంద జ్ఞానముకానీ లభించును.

నేడు భూమండలమున నొక భాగమునందు కొందఱు మానవులు వన్యపశువులను బోలియున్నారు. మరియొక దిశ యందు విశేష జ్ఞానముకలవా రున్నారు. సర్గారంభమునందు నిట్లే యుండవచ్చును. ఇంతేకాక సర్గారంభమున మానవు లెల్లరు నుత్తమ జ్ఞానవంతులై యజ్ఞానమే లేక యున్నారను టయు ససంగతము కాదు. ఇట్లు సర్గారంభమున నేదోయొక దశయే నియతముగా నున్నదనుట తర్కసంగతము కాదు.

జ్ఞానములోని తీవ్రతామందతాది భేదములకు కారణము జీవుల పురాతన కర్మలని నుడివి యుంటిమి. కర్మ లనేక విధములు. అందువలన జ్ఞానముకూడ నానావిధము లగు

చున్నది. ఈ దృష్టి ననుసరించి యాదికాలపు మానవుల కనేక విషయములకు సంబంధించిన విశేషజ్ఞాన ముండి యుండెను. అందువలన వారిలో ననేకుల కర్థశాస్త్రమునకు చెందిన మూలధనాదుల సూక్ష్మజ్ఞానముకూడ నుండి యుండ వచ్చు. ఆదికాలపు మానవులకు గల న్యాయప్రియత, ధర్మాసక్తియు నతి ప్రసిద్ధములు. వా రాదిమ యవస్థ ననుసరించి మూలధన వ్యవహారము నత్యంతన్యాయముగ చేసి యుండ వచ్చు. ఆది మానవ సంతానములో కొంతభాగము కాలాంతరమున ననేక కారణములవలన వేరై యుండవచ్చు. ఉపదేశాదులు లభింపమి వారు జ్ఞానహీనులై వన్యపశుతుల్యులై యుందురు. అట్లు వన్యదశలోనుండి క్రమముగా దేశకాల భేదముల ననుసరించి జ్ఞానుల సాంగత్యమును బొంది మరల వారు జ్ఞానవికాసము నందవచ్చు. ఇట్లు జరుగుట యసంభవము కాదు. కావున నాటవిక జాతులలో గలుగు జ్ఞానమునకు చెందిన క్రమికోత్కర్షను చూచి యాదిమకాలపు మానవులందఱు నజ్ఞానమయులనుట యుక్తముకాదు. ఆటవికులుగా నుండి యర్థమును తగినట్లు వ్యవహారింపలేని కాలములో గూడ విద్వాంసులైనవారు చక్కగా నాలోచించి, తగినట్లు అర్థము నుపయోగించి యార్థిక వ్యవస్థను చేసినవారుండి యుందురు. ఆత్మవాద మార్థిక వ్యవహారమునం దన్ని విధముల క్రమికవికాసమును విరోధింపదు.

మార్క్సు ననుసరించిన ఏంగల్సు మున్నగు నర్థశాస్త్రజ్ఞులు మానవుడు వన్యదశనుండి సభ్యదశకు చేరువరకు నర్థము నత డెట్లు వ్యవహారించినదియు వివరముగ వర్ణించి

యున్నారు. వన్యదశలో వ్యక్తిగత సంపత్తి లేదని వారి మతము. ఆ దశలో సంపత్తిమీద నెల్లరకు సమానాధికార మున్నదని వారి యూహ. మానవు లపు డొకే జాతికి చెందినవారై యుండిరి. వన్యదశలో స్త్రీ పురుషులు పరస్పరము కలిసి సంతానము గనుచుండిరి. వారు తమ తమ గుంపులకు వేరుగ తమ సత్తా నంగీకరించుటలో నసమర్థులుగా నుండిరి. వారికి స్వతంత్రమైన 'స్వమ్' (సొత్తు) అనునదే లేదు. ఉన్న దంతయు సముదాయమునకు చెందినదే. సొత్తు అనునది గుంపుకే యున్నది. నాటి మానవుడు 'తన శరీరముకూడ సమూహమునకు చెందినదేకాని తనది కాదు' అని యెంచెడివాడు. పరివారము కూడ గణపు పరివారమే. కొండొక పురుషునకు గానీ, స్త్రీకిగానీ స్వపరివార మనునది లేదు. పిల్లలు సమస్త గణమునకు (సముదాయమునకు) చెందినవారే. వారు తమ తల్లులను, తల్లి తోబుట్టువులను, వారికి సమాన వయస్కులగు స్త్రీలను నెల్లరను సమానముగ 'తల్లీ' యని పిలిచెడివారు.

వీరందరు కలిసి పశువులను వేటాడు చుండెడివారు. నదులలో చేపలు కలిసి పట్టెడివారు. కలిసి యట్లు చేసిన పనులవలన లభించినదానిమీద నెల్లరకు నధికారముండెడిది. గణమున కధికారము సమష్టి - సామూహిక - రూపమున నుండెడిది. వ్యస్త (వ్యష్టి) రూపమున నెవరికి నధికారము లేదు.

ఈ దశలో మనుజులు తిరుగుచుండెడివారు. ఒకానొక స్థలమున నిల్లేర్పరుచుకొని యుండెడివారు కారు. తరువాత కొంతకాలమున కిల్లు నేర్పరుచుకొన సాగిరి. ఆ యింటిపై నొక్కనికి స్వత్వ ముండెడిది కాదు. అది యెల్లరి సొత్తై

యుండెడిది. స్త్రీలు, పురుషులు నెల్లరు కలిసి యుండెడి వారు. ఆ యిండ్లలో నుండు భోజ్యపదార్థములు, నితర యుపయోగి వస్తువులు నన్నియు నుమ్మడివిగా నుండెడివి. ఉమ్మడి యిండ్ల జీవనమునుగూర్చి 'మారగన్' వర్ణించి యున్నాడు. అతడు అమెరికాలోని 'ఇరోకు ఓయిస్' అను వారి జీవనమును విశేషించి వర్ణించి యున్నాడు. గృహము లలో నుండెడి యాటవికుల గుంపుల జీవనము సామాన్య ముగా ఉమ్మడి జీవనమే. "ఇరోకు ఓయిస్ జనులలో నాక వ్యవహారమునకు నిశ్చితరూపము లభించినపుడు అన్యవన్య గణములలోకూడ నిట్టే యా వ్యవహార ముండునని సంభావింప నగును. వారి యావశ్యకతలు సమానము లగుటయే యిందు లకు కారణము" అని మారగన్ వ్రాసియున్నాడు. ఇరోకు ఓయిసులు కలిసి కృషిచేసెడివారు. పైరు కలిసి కోసెడి వారు. కోసి యిండ్లలో నింపెడివారు. ఆ పంట యందరి యుమ్మడిదై యుండెడిది. ('అమెరికా ఆదివాసుల ఇండ్లు, జీవనము.' 1881 క్రీ. శ.).

వన్య యుగమునందు, భ్రమణకాలములోను, స్థిర నివాస మేర్పడిన రోజులలోను జనులు సంపత్తిని సాముదా యికము - సముదితము - అని యెంచినంతవరకు వైయక్తిక స్వత్వము నెరుగకుండిరి. అంతవరకు వారికి మూలధన మనిన నేమో తెలియదు.

వన్యదశలోను మనుష్యుడు మూలధనము ద్వారా ధనము సంపాదించుచుండెడివాడని పలువు రర్థశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఒక వనచరుడు తన దగ్గర రెండు బాణము

లున్న నొకదానిని మరియొకనికిచ్చి దాని ద్వారా లాభము నందుచుండెడివాడు. రెండవవాడా బాణముతో చంపి సంపాదించిన మాంసములో కొంతభాగము బాణస్వామి కిచ్చెడివాడు. కాని, అడవి గుంపులలోని మనుష్యుడు వైయక్తిక సొత్తు నెరుగడు. వేటాడుటకు గల బాణములపై గుంపులో నెల్లరి కధికార ముండెడిది. ఆ బాణములలో నొకదాని నొకడు మరియొకని కప్పుగా నీయజాలడు. వేటాడి సంపాదించినదానిమీఁద నెల్లరికి సమానాధికార ముండెడిది. ఒకరికి మరియొకని సంపత్తిలో భాగస్వామి యగు కోరిక యుండెడిది కాదు.

ఆటవికుల గుంపులలో పారివారికజీవనము ప్రారంభ మైననాటినుండియు గణస్వరూపము నశింప నారంభ మయ్యెను. గుంపుల నివాస గృహములు విభజింపబడి వ్యక్తి గృహరూపమును ధరింపగానే యొక్కొక్క పరివారము - కుటుంబము - స్వతంత్రముగా నుండసాగెను. అప్పటినుండి భోజ్యపదార్థముల సాముదాయిక - సముదిత - స్వత్వరూపము నశించెను. క్రమముగా కౌటుంబిక - పారివారిక - స్వత్వ ముత్పన్న మయ్యెను.

మొదట కుటుంబమున తల్లికి ప్రధానాధికార ముండె డిది. కుటుంబమున తల్లి తనపిల్లలతోను, సోదరులతోను కలిసి యుండెడిది. ఆమె కనేకులు పతు లుండెడివారు. వారు భిన్నభిన్న గణములకు చెందినవారై యుండుటయు కలదు. వన్యపరివారములలో తల్లి స్థానము ప్రధానముగా నున్నంత వరకు స్థిరచరాస్తులమీఁద నామెకే యధికార ముండెడిది.

నాడు మనుజునకు సంపత్తిమీద నధికారము తల్లినుండి ప్రాప్త మగుచుండెడిది; తండ్రినుండి కానీ, యతనికి సంబద్ధులైన వారినుండి కానీ లభించెడిది కాదు. మాతృప్రధాన మగు నీ కుటుంబమునందు పురుషుని స్థానము మిక్కిలి నిమ్నముగా నుండెడిది. బాస్కూజనులలో నాదికాలపు రీతు లనేకములు నేటికిని సురక్షితములై యున్నవి. వారిలో తల్లి చనిపోయినపుడు పెద్దకూతురు ఉత్తరాధికారిణి యగును. ఆమె తమ్ములకు చెల్లెండ్రకు సంరక్షికగా నుండును. పురుషుడు కుటుంబము నాశ్రయించి యుండును. అక్క యనుమతి మీద పెండ్లాడి పురుషుడు తన భార్య వశమున నుండును. అతడు జీవనమున్నంత వరకు, పుత్రుడుగానో, సోదరుడుగానో, పతిగానో స్త్రీవశమున నుండును. వివాహ సమయమున నక్కగా రిచ్చినదానిమీద తక్క మరిదేనిమీదను నతని కధికార ముండదు. 'పతి తన పత్నికి ముఖ్య సేవకుడు' అను నిది బాస్కూజనుల సామెత. (పాల్‌లోఫార్గ - సంపత్తియొక్క ఉత్పత్తి. పు. 32).

స్త్రీవిషయమున భారతీయ ధర్మశాస్త్రములలో చెప్పిన దంతయు పై వర్ణనకు విపరీతముగ నుండును. మనుస్మృతిలో "కౌమార్యమున తండ్రి, యౌవనమున పతి, వృద్ధాప్యమున పుత్రుడు, స్త్రీని రక్షించును; స్త్రీకి స్వాతంత్ర్యము లేదు." అని యున్నది.

వికాసవాదుల దృష్టిలో స్త్రీల స్థితి పూర్వమున మిక్కిలి యున్నతమై యుండెను. సభ్యత పెరిగిన కొలది వారి స్థితి తగ్గిపోయినది. స్మృతుల కాలములో మిక్కిలి చెడినది.

ఉపర్యుక్త వికాస క్రమము ననుసరించిచూడ వన్య యుగమున నున్నదంతయు గణ మని బోధపడును. గణమే పరివారము. సంపత్తికి స్వామియు నదియే. వివాహాదులను గణమే చేయుచుండెడిది. క్రమముగా పరివార మేర్పడి యది సంపత్తి కధికారియైనది. అనేక పరివారములు కలిసి గణముగా వ్యవహరింపబడినవి. గణ సంపత్తిమీద గణము లోని ప్రతివ్యక్తికి సమానాధికార ముండెను. స్వతంత్ర పరివార మేర్పడిన తరువాత దానిస్వార్థము భిన్నమైనది. గణమునకు చెందిన భూమి పరివారములకు పంచిపెట్టబడినది.

ఆ పరివారములు నేటి పరివారములకంటె భిన్నములై యుండెను. నేటి పరివారమునందు తండ్రి, తల్లి, బిడ్డలు నున్నారు. నాటి పరివారములలో తండ్రి యధికారియైనపుడు అతని పత్ని, ఇతర భోగ్యస్త్రీలు, అతని పుత్రికలు, పుత్రులు, అతని తమ్ములు, తమ్ముల భార్యలు కలిసి యుండెడివారు.

సంపత్తి యేర్పడిన నాటనుండియు విధాన మేర్పడిన దని వికాసవాదులైన యర్థశాస్త్రజ్ఞు లందురు. వన్యదశలో నున్న పుడు జనులు గణసంపత్తిని తనదిగా నెంచెడివారు. ఇష్టము వచ్చినట్లు దానిని వ్యవహరించెడివారు. పారివారిక సంపత్తి యేర్పడిననాటినుండి పూర్వపు స్వేచ్ఛావ్యవహార మపరాధ మయ్యెను. దాని నరికట్టుటకు సదాచారము, శారీరికదండ వ్యవస్థయు నేర్పడినవి.

సంపత్తికి చెందిన పారివారిక రూపము ఖండితము కాగానే పరివారముకూడ విభక్తము కాజొచ్చెను. పారివారిక సంపత్తిమీద తండ్రికో, లేక పరివారములోని యొక్కొక్క

వ్యక్తికో యధికారము లేకుండెను. సమస్త పరివారమునకు సముదిత రూపమున నధికార ముండెడిది. పరివారములో ముఖ్యుడు సంపత్తికి తగినట్లు వ్యవస్థ చేయువాడై యుండెను. ముఖ్యుడు పరివారములో నెవడైనను కావచ్చును. తండ్రి కానీ, పెద్దసోదరుడు కానీ, చిన్నసోదరుడు కానీ, తల్లి కానీ యెవరైనను సంపత్తికి తగిన వ్యవస్థ చేయవచ్చును. కర్తవ్యమును నిర్వహించుటకు ముఖ్యున కనేకాధికారము లుండెడివి. అతని యధికారములో నుండు నితరవ్యక్తు లపరాధము నొనర్చినపు డతడు వారిని నిందించుటకు గానీ, గద్దించుటకుగానీ యధికారము గలిగి యుండెను. వారికి శారీరికదండనల నిచ్చుచుండెడివాడు.

పరివారమున కొక్కడు చొప్పున ముఖ్యు లనేకు లుండెడివారు. వీరిలో చదువు, యోగ్యత, బలము మున్నగునవి కలవానిని గ్రామాధిపతిగా నెన్నుకొనెడివారు. గ్రామవాసుల సంపత్తుల కతడు వ్యవస్థ చేయుచుండెడివాడు. అతడొక్కడే యితరులతో నాదానప్రదానములు చేయుచుండెడివాడు. అధికముగా నుత్పన్నమగు వస్తువులను, నధికములయిన పశువులను నమ్ముచుండెడివాడు. ఆ గ్రామమున నుత్పన్నము కాని వస్తువులను కొనుచుండెడివాడు. ఈ విధముగ చిన్నచిన్న గ్రామములు స్వతంత్రములై యుండెడివి.

పరివారమునకు సంబంధించిన సాముదాయిక సంపత్తి రూప మొక యెడ నెక్కుడుకాలము, మరియొక యెడ తక్కువ కాలము నుండుచుండెను. భిన్నభిన్నస్థానములలో నడుచు వ్యాపారపు రీతులు పారివారిక సంపత్తిని స్థిర

పడుచుచుండెను. ఇట్టి పారివారిక సంపదనుండియే వైయక్తిక - ప్రాతిస్వికి - సంపద రూపొందినది.

ఇల్లు, ప్రాకారముతో చుట్టబడిన తోట ప్రాతిస్వికి సంపత్తి యయ్యెను. ప్రతి వ్యక్తియు తానొనర్చు శ్రమ యీ సంపదకు కారణమై యుండెను. ఈ ప్రాతిస్వికి సంపద కొంచెముకాదు. దాసులు, పశువులు, నానావిధములగు చలవస్తువులు నీ వైయక్తిక సంపదలో లెక్కింపబడుచుండెడివి. పారివారిక - సాముదాయిక - రూపము భగ్నముకాగానే ప్రతి పురుషుడును వివాహానంతరము స్వతంత్రు డయ్యెను. ఉమ్మడి నివాసమును విడిచి తన యింటిలో నుండసాగెను. ఈ స్థితిలో భూసంపదకూడ సాముదాయిక రూపమును విడిచి ప్రాతిస్వికి మైనది. భూమి పిల్లలకు పంచబడినది. ఒక యఖండ సంపద యనేక స్వతంత్రఖండము లయినది.

వికాసవాదు లయిన యర్థశాస్త్రజ్ఞులు చెప్పిన పై వికాసక్రమ విషయమునందు ఆత్మవాదు లయిన యర్థశాస్త్రజ్ఞులకు విశేషమగు నాపత్తి యేమియు లేదు; కాని వన్య యుగపు జాతులలో కొన్నింటి వికాస మే క్రమమున నిరూపింపబడినదో యంతకంటె భిన్నమగు క్రమమునను నయ్యది వికసింపవచ్చును. వన్యదశపు మానవుల వికాస మేదో యొక క్రమముననే వికసింపవలయునను కఠోర నియమము చేయ వలనుపడదు. ఆత్మవాదు లయిన యర్థశాస్త్రజ్ఞు లార్థికవ్యవహారము సమస్త మానవులందు నొకేవిధముగ పైన వర్ణించి నట్లే వికసించిన దని యంగీకరింపరు. ఆరంభమున మానవు లందరు గణములుగానే విభజింపబడియుండిరని కానీ, గణ

వివాహములే జరిగెడివనికానీ, గణమే సంపదకు స్వామిత్వము వహించినదనికానీ, యా గణములలో గమ్యాగమ్య వివేకము లేదనికానీ, యొక గణపు పురుషు లందరు మరియొక గణపు స్త్రీలను వివాహమాడుచుండిరని కానీ, అన్నాచెల్లెండ్రు, అక్కా తమ్ముళ్లు పరస్పరము కలిసి సంతానము గనిరనికానీ యంగీకరింపక తప్పదనుటను వా రంగీకరింపరు. కొందరాటవికు లెక్కడనో యజ్ఞానాంధకారమున నుండి యట్లు చేసియుందురేమోకాని, మానవులెల్లరు నంతట నట్లే చేసియుండిరి; మరియొకవిధమే లేదనుట వారికి యుక్తిసంగతము కాదు. ఆరంభముననే నిర్మల జ్ఞానాలోకముచే నుద్దీప్తులైయున్న మానవులలో పతిపత్నులు, తల్లి కొడుకులు, అక్కా తమ్ములు ననువారిలో గల పవిత్ర సంబంధములు వికాసవాదుల సభ్యయుగమునాటి సంబంధములకంటె నెక్కుడు పవిత్రములయి యుండెను. వా రర్థశాస్త్రమున పారంగతు లగుటయే కాక వ్యవహారమున నిష్కపటులై యుండిరి. వారి సాధ్వాచారములకు కారణ మజ్ఞానము కాదు. సర్గారంభపు మానవులలో ననేకులకు నుత్తమమగు కృషిజ్ఞానముండెను. ప్రాచీన చరిత్రలనుబట్టి చూచిన నాటి భూమి నాగటితో దున్ని పంటలు పండింపవలసిన యవసరము లేకుండెను. వృక్ష ఫలము లనాయాసముగ లభించుచుండెడివి. జనులు పాలు, పెరుగు వాడెడివారు. గోధుమలు, బియ్యము మున్నగు ధాన్యము నాహారమున కుపయోగించెడివారు. మాంసమును తినువారే లేరనము. కాని, యందరు మాంసభక్షకులే యనుట పొసగదు. దేశకాలములలో మార్పులు

వచ్చి మానవుల చిత్తము లోభాదులచే దూషితము కాగా విద్వాంసులగు ఋషులు వ్యవహారార్థము శాస్త్రములను రచియించిరి. జీవునకు జన్మ, జన్మాంతరము లున్నవని యంగీకరించినమీదట నాదియుగమున జ్ఞానులైనవారి యున్నత వ్యవహారము సత్యమనియే సిద్ధమగును.

వికాసవాదులగు నర్థశాస్త్రజ్ఞుల దృష్టినిబట్టి, సాముదాయిక సంపదలను నిల్వచేయు గ్రామజాతుల వలన సామంతీయ సంపద యుద్భవించినది. సామంతీయ వ్యవస్థ ననుసరించి భూస్వామి నిర్వహింపవలసిన కర్తవ్యము లనేకము లుండెడివి. కాని, యతనికి, నేటి మూలపతికున్న స్వాతంత్ర్యము లేకుండెను. సామంతునకు భూమినిచ్చు నధికారమున్నను, పరంపర ననుసరించి వర్తింపవలసి యుండెడిది. అతని కతని కృషీవలుర శ్రమ మీదను, వారు పండించు పంటల మీదను నధికార ముండెడిది. అతడు తనకంటె పెద్దవారైన యధికారుల యాజ్ఞల పాలింపవలసినవాడై యుండెను. ఆశ్రితులకు సాహాయ్య మొనర్పవలసియుండెను. సామంతుడు తన శక్తి నంతటిని వినియోగించి యాశ్రితులను రక్షించెడివాడు. దానికి బదు లాశ్రితు లయిన కృషికు లతనికి సైనిక కార్యమును, సేవాకార్యమును నిర్వర్తించెడివారు. కృషికులు తన సంపదలో కొంతభాగము సామంతున కిచ్చుచుండెడివారు. సామంతుడు తన రక్షణకొఱకు మహాసామంతుని యాజ్ఞలలో నుండెడివాడు. మహాసామంతుడు సామ్రాట్టునకు సేవకుడు. దాసుడు మొదలు సామ్రాట్టువరకు గల సామంతీయ వ్యవస్థకు చెందిన వారందరు తమతమ ధర్మములకు - కర్తవ్యములకు -

బద్ధులై యుండెడివారు. సామంతీయ వ్యవస్థ క్షీణమైన మీదట సామంతుడు తన ధర్మములను విడిచిపెట్టెను. కాని, తన యధీనములోనున్న కృషికుల నుండి తనకు లభించుదాని మీద తనకున్న యధికారమును మాత్రము స్థిరముగా నుంచుకొనెను. అప్పుడప్పుడు నతడు తనకు రావలసినదాని పరిమాణమును పెంచుచుండెడివాడు. కృషికుల నుండి పన్నుతీసికొను నధికారము సామంతునకు ప్రప్రథమమున నతడు వారిని రక్షించుటచే నేర్పడినది.

వన్య యుగపు మానవులు భూమికొఱకే యే ప్రాంతముల కేగుచుండిరో యాప్రాంతపు నివాసులను చంపి వారి భూమి నాక్రమించెడివారు. అక్కడ స్థిరపడి తమపద్ధతులతో నాటి భూమిని సాగుచేయుచుండిరి. పరాజితులైన మూలనివాసులు తమతో నుండదలచినచో తమ పద్ధతుల ననుసరించి యుండనిచ్చెడి వారు. క్రమముగా వారి యుద్ధ స్వభావము సన్నగిల్లినది. యుద్ధస్వభావము మారనివారు సైనికులుగా నుండి కృషీవలుర రక్షణ కుపయోగపడుచుండెడివారు. ఆక్రామకులైన వన్యజను లీవిధముగ నొక యెడ స్థిరపడుచుండెడివారు. అట్టివారిని మరియొక వన్య సంఘ మాక్రమించి పరాజితులను చేసి వారితో పరాజితుల వలె వ్యవహరించెడివారు. అనేక శతాబ్దముల వరకు జను లిట్లు ఆక్రమణ భీతిలో మునిగి యుండెడివారు. వన్యజాతు లీవిధముగ బహుకాలము పరస్పర యుద్ధములలో నుండెను.

వన్యజాతులవారు గ్రామములలో పారివారిక సంపదలను స్థిరపరుచుకొనిన మీదట కొందఱను రక్షకులుగా

నెన్నుకొన సాగిరి. క్రమముగా నీ రక్షక వర్గమునకు వివాద ములను నిర్ణయించుటకు, కలహములు పోనాడుటకు, ప్రాత పద్ధతులను స్థిరపరుచుటకు నధికారము లభించినది. మొదట వీరు జనుల కధికారులైరి. గ్రామముఖ్యుల నిశ్చయమును పాలించుట వీరి కర్తవ్యముగా నుండెను. కర్తవ్యపాలనలో ప్రమత్తులైనపుడు వారికి కఠోరదండన లభించెడిది. గ్రామములో నెన్నుకొనబడిన గ్రామముఖ్యులు క్రమముగా సామంతులైరి.

గ్రామముఖ్యుడుగా నెన్నుకొనబడిన వానికి - చౌదరికి - గ్రామముఖ్యులసభ కొంత యెక్కువ భూమి నత డొనర్చు సేవకు పారితోషికముగా నిచ్చెడిది. మొదట గ్రామ ముఖ్యుడుగా నెన్నుకొనబడిన చౌదరమ్మలో సహజమైన విశేష ధర్మ మొండేమియు నుండెడిది కాదు. కాని, యొక పరివారములో మాటిమాటికి నెన్నుకొనబడుటచే నా పరివారములో నా పెద్దకు విశేషాధికారము కలిగెను. ఆ యధికారమే క్రమముగా వంశగతమైనది. ఇట్లధికారము వంశగతమైనమీదట నా యా వంశపు పెద్దను గ్రామీణు లెన్నిక జరుపకయే చౌదరిగా నంగీకరింపసాగిరి. గ్రామములకు సంబంధించిన సాముదాయిక రాజ్యములు నిరంతరము యుద్ధములు చేయుచుండెడివి. విజయులైన గ్రామముఖ్యునకు, నతని పరివారమునకు విజితభూమిలో మిగిలినవారికంటె కొంత యెక్కువ భూమి లభించెడిది.

సామంత పద్ధతికి చెందిన యధికారము వంశగతమైన మీదట నది స్వతఃసిద్ధమైనట్లు కనబడసాగినది. కాని, యది సమానజనుల నుండియే యేర్పడినది. శతాబ్దాలు గడచిన

కొలది యేర్పడిన యనేక ఘటనలద్వారా యొండొరులకు సహాయపడు భావము నష్టమై సామంతులు స్వేచ్ఛాచారులైరి.

గ్రామీణులు విశాలము, దృఢము నగు భవనముగల వానిని గ్రామాధిపతిగ నెన్నుకొనెడివారు. ఆపదలు వచ్చి నప్పుడు కృషికు లతనియండ జేరుచుండెడివారు. కావున గ్రామీణు లందరు కలిసి యా గృహమును దృఢపరుచు చుండిరి. భగ్నమైనపుడు దానిని సంస్కరించెడివారు. దానికి నలువైపుల గోడలు నిర్మించెడివారు. భేదమెంచక యందఱి యిండ్లను బాగుచేయుట గ్రామవాసుల కొక పద్ధతిగా నుండెను. అందునలన యుద్ధకాలములందు రక్షాస్థానములను బాగుచేయుటకుగాను కృషికులను బలవంతపెట్టగల యధికారముకూడ సామంతునకు లభించెను.

ఆక్రమణ జరుగునని తెలియగానే గ్రామాధిపతి కొంద ఱను నిరీక్షణకొఱకై యా స్థలములందు నియుక్తము చేసెడి వాడు. కృషికార్యమున నధికముగా నిమగ్నులై యున్నపుడు కృషికులు సేనాకార్యమును నిర్వర్తింపలేక సామంతునకు కానుక లిచ్చి తప్పించుకొన సాగిరి. దానితోబాటు గ్రామాధిపతి వేతనమిచ్చి కొందఱను గ్రామరక్షణార్థము సైనికులుగా నుంచుకొనుట యవసర మను నియమముకూడ నేర్పరుచు కొనిరి.

ఉపయుక్త స్థానములందు గల గ్రామములు కేంద్రము లయినవి. ఆక్రమణ సమయములందు సమీప గ్రామవాసులా కేంద్రముల నాశ్రయించుచుండిరి. రక్షణకు బదులు రక్షాస్థానములను దృఢపరుచుటకు, సైనికులకు వేతనముల నొసంగు

టకును జనులు తమ యాదాయమునుండి కొంతభాగము నా గ్రామాధిపతుల కియ్యసాగిరి. క్రమముగా నా గ్రామాధిపతుల యధికారము సమీప ప్రదేశములందు వ్యాపింప సాగినది. ఇట్లు సామంతపద్ధతి యేర్పడుటకు వలయు కారణము లుత్పన్నము లైనవి. తన ప్రజలను రక్షించుట, వారికి సహకరించుట సామంతులకు కర్తవ్య మయ్యెను. సామంతుని యెడ భక్తి గలిగియుండుట, కానుక లర్పించుట ప్రజల ధర్మ మయ్యెను.

ఈ సామంతపద్ధతి స్థిరపడినమీదట నది జనుల దుఃఖమునకు కారణ మైనది. తమ శాసనక్షేత్రములను, అధికారములను విశాల మొనర్చుకొనుటకుగాను సామంతులు పరస్పరము కలహములు - యుద్ధము - లాడజొచ్చిరి. భూమికొఱకు సంధి జరిగినమీదట తాత్కాలికముగ యుద్ధ మాగెడిది. విజేతలు పరాజితులను తమ వశము చేసికొని, వారి భూమిపై నధికారము వహింప దొడగిరి. విజయులైన సామంతులు మహారాజులు కాజొచ్చిరి. ఒకడు మహారాజయినపుడు గ్రామయుద్ధములు శాంతించెడివి. శాంతి యేర్పడినందున రక్షణకొఱకు సామంతు లుండవలసిన యవసరము తగ్గిపోయినది. సామంతులకు తమ ప్రాకారములను రక్షించు బాధ్యత తగ్గిపోయినది. అందువలన వారు మహారాజుల సభ నలంకరింప సాగిరి. ఇట్లు సామంతులు, నితర జనులు మహారాజుకు ప్రజ లయిరి. కావున సామంతులకు నితరజనులకు మధ్యగల భేదము తొలగి యందరు సమాను లైరి. అప్పుడు సామంతులు బలముతోనో, వంచనాదుల ద్వారానో తమ భూములను

విస్తృతము జేసికొనుచుండెడివారు. విశేషించి సాముదాయిక భూములను వారు స్వాధీనము చేసికొనిరి.

ఉపర్యుక్తసామంతపద్ధతియొక్క వికాసక్రమముతో నాత్మవాదమున కెట్టి విరోధమును లేదు. ఆత్మవాదము మనుష్యున కారంభమునుండి రాజ్యముతో నిత్యసంబంధ మున్నదని యంగీకరింపదు. వికాసవాదులు చెప్పునట్లు మొదట నస్పష్టముగాను, తరువాత స్పష్టముగాను రాజ్యము లావిర్భవించుట సంభవము కావచ్చును. కాని, క్రమములో భేదము నుండవచ్చును. ఒక దేశమున నొక విధముగను, మరియొక దేశమున మరియొక విధముగను రాజ్యపద్ధతి యేర్పడి యుండవచ్చును. ప్రప్రథమమున రాజ్యములు లేవనుట నాత్మవాదము కూడ నంగీకరించును. మహాభారతమున భీష్ముడు చెప్పుచున్నాడు. "ప్రాచీనకాలమున రాజుగానీ, రాజ్యము కానీ లేదు. దండించువాడు కానీ, దండితుడు కానీ లేడు. ధర్మానుసారము ప్రజలు పరస్పరము రక్షించుకొనెడివారు. అపరాధి నిందింపబడెడివాడు. నిందయే యప్పటి దండన." (శాం. ప. అ 184. శ్లో. 13—17.) ప్రాచీనేతిహాసమునకు చెందిన యితర చరకసంహితాదులలోను నిట్లే యుల్లేఖింపబడినది. (చ. సం. విమానస్థానము. అ. 3).

వికాసవాదుల మతమున రాజ్యము లుద్భవించుటకు పూర్వము మానవు లజ్ఞానమున మునిగి యుండిరి. కాని, ఆత్మవాదము మానవు లందఱు నజ్ఞానులుగానే యుండి రని యంగీకరించుట యవసర మనదు. భారతీయ ప్రాచీన పరంపర ననుసరించి మనువు మొదటి రాజు. అతనిని రాజుగా

నెన్నుకొనినవారు జ్ఞాన విజ్ఞాన సంపన్నులై యుండిరి. లోభ వశమున వారిలో నవ్యవస్థ యేర్పడినది. దానిని రూపు మాపుటకు వారు మనువును రాజుగా నెన్నుకొనిరి. నేడు కూడ జనులు రాగద్వేషములతో నిండియున్నారు. లోభము వారియం దిల్లు కట్టుకొని కూర్చున్నది. అయినను భిన్న భిన్న దేశములలో సూక్ష్మములు, గంభీరములు నగు రాజ్య విధులు లేకపోలేదు. నేడున్నవి వేలకొలది వత్సరములకు పూర్వముకూడ నుండవచ్చు. ఆదియుగపు మానవు లెల్లరు నన్నివిధముల జడులై యున్నారని ఋజువుచేయు ప్రమాణ మొండును కానరాదు.

ఆదికాలపు మానవు లేర్పరచుకొనిన రాజ్యము కావలసినంత పెద్దదై యుండవచ్చును. అది క్రమముగా భగ్నమై చిన్న చిన్న రాజ్యములుగా మారుట యసంభవము కాదు. చరిత్ర గ్రంథములం దిట్టి యుదాహరణములు చూడనగును. ఒక్కొక్కప్పుడు చిన్న చిన్న రాజ్యములను జయించి పెద్దరాజ్యము నేర్పరచుటయు గలదు. మరి యొక్కప్పుడు విశాలరాజ్యము భగ్నమై చిన్న చిన్న రాజ్యము లేర్పడుటయు వింతగాదు. ఆదికాలపు జనులు విశాలరాజ్యము నేర్పరుపగలవారే. అట్టి ప్రాచీన వర్ణన లనేక స్థలములలో చూడబడుచున్నవి. ప్రాచీన భారతమున నానావిధము లగు రాజ్యము లుండెను. గ్రామాధిపతులు, సామంతులు, మహాసామంతులు, రాజులు, మహారాజులు నెల్లరు నుండిరి. కొండొక క్రమము ననుసరించియే వీరి యుద్భవ మగుట నిస్సందేహము. క్రమములో భేద ముండ

వచ్చును. ఐరోపా దేశములో నున్న క్రమమే భారతమునను నుండవలయు నను నియమ మేమియు లేదు.

భారతమునందును సామంతులలోను, రాజులలోను, పరస్పర యుద్ధములు జరుగకపోలేదు. ప్రతాపవంతులగు మహారాజుల యావిర్భావ మిక్కడ కాకపోలేదు. సామంతులు, బలవంతులును నమాయకు లగు గ్రామవాసుల భూముల నాక్రమింప లేదనము. గ్రామాధిపతికి నత డొనర్చు సేవకు బదు లితరు లెక్కువ భూమి నిచ్చియుందు రనుటయు నసంభవ మనము. కాని, గ్రామాధిపతి యీ విధముననే పెద్ద భూసంపద కలవాడు కాడు. గ్రామములో నొక బలశాలి యైన మనుజుడు తన మిత్రుల సహాయముతో నొక పెద్ద భూభాగమునకు బలవంతముగా స్వామి కాగలడు. రాగ ద్వేషములు, లోభ మోహములు రాజ్యోత్పత్తికి మూలములు. రాజ్య మేర్పడినను నవి పూర్తిగ నశింపవు. రామ రాజ్యములోను, మరికొన్ని యితర ప్రాచీన రాజ్యములలోను తక్క తఱచుగా గ్రామాధిపతులు, సామంతులు మున్నగువా రన్యాయముగ దుర్బలులను పీడించి వారి ధనము నపహరించి వైభవములను సంపాదించినవా రైరి.

వికాసవాదులైన యర్థశాస్త్రుల మతమున సామూహికీయ సంపదనుండి మూలపతీయ సంపద యేర్పడినది; శిల్పులలో వైయక్తిక సంపద స్వతంత్రముగా నేర్పడినది. ఒక పెద్ద గుంపునుండి వేరై కొన్ని కుటుంబములు గ్రామములలో నుండ మొదలిడినపుడు తమ కవసరములగు వస్తువుల నుత్పన్నము చేసికొనసాగెను. గోదుమలు, సెనగలు, దూది,

పాలు, నేయి మున్నగు వస్తువులు గ్రామములోనే యుత్పన్న మగుచుండెను. కుమ్మరి, కమ్మరి, సాలె, దర్జీ మున్నగు శిల్పులను వారి పనులతో నవసరము కలిగినపుడు వారిని గ్రామములో నుండనిచ్చిరి. మొదట నీ గ్రామములందు పణ్యవినిమయము జరిగెడిది కాదు. శిల్పులు గ్రామమున కంతటికి సేవచేసెడివారు. సంవత్సరమున కొక్కసారి వారి సేవకు బదులు వారి కన్నవస్త్రముల నిచ్చుచుండిరి. పనివడి నపుడు వారు పనిచేయుచుండిరి. వస్తూత్పత్తికి కావలసిన ముడిసరకు వారి కియ్యబడుచుండెడిది. అప్పు డప్పుడు వారు గ్రాహకుల యిండ్లకు వెళ్ళి కూడ పని చేయుచుండెడివారు.

క్రమముగా శిల్పులు సమస్తగ్రామమునకు వలయు వస్తువులను ఆజ్ఞానువర్తులై చేయుట మానివేసిరి. అప్పటినుండి వారు చేయు కార్యములకు బదులుగా గ్రామవాసులు మూల్య రూపమున పణ్యముల నియ్యసాగిరి; లేక పనికి బదులు మరి యొక పనిచేయుట కారంభించిరి. గ్రామసీమలు చిన్నవిగా నున్నంతవరకు శ్రమవినిమయ మిట్లే జరుగుచుండెను. గ్రామాకారములలో మార్పు వచ్చినప్పటినుండి వ్యాపారము నందును మార్పు గలిగెను. సముద్రతీరమునందును, నదీతీర ములందును నున్న గ్రామములకు, ననేక గ్రామముల కూడలిలో నున్న గ్రామములకు, దేశాంతరములకు వచ్చిపోవు వ్యాపా రులు రా నారంభించిరి. ఆ గ్రామములలో నస్థిరములైన యంగడివీథులు ప్రారంభ మయ్యెను. ఆ యంగడి వీథులలో శిల్పులు తమ హస్తములచే నిర్మింపబడిన వస్తువుల నమ్ము నవకాశము కలిగెను. అందువలన వా రక్కడ చేర నారం

భించిరి. అట వారి నడ్డగించువారు లేరు. వారి నుపేక్షించు వారును లేరు. జనులు వారిని వెదకి వెదకి సత్కరింపసాగిరి. ఇట్లే గ్రామములు నగరములుగా మారజొచ్చినవి.

విశేషజ్ఞులయిన శిల్పులు తమ వస్తువులను యత్న పూర్వకముగ చేయసాగిరి. క్రమముగా స్థిరమైన యంగడి వీధు లేర్పడినవి. గ్రామవాసు లీ యంగడి వీధులకు వచ్చి తమ పణ్యావస్తువులను వినిమయము చేయదొడగిరి. లేక విదేశవ్యాపారుల కమ్మసాగిరి. ఈ స్థితిలో పణ్యవస్తువుల యుత్పత్తి క్రొత్తపద్ధతిలో కాదొడగెను. శిల్పి గ్రాహకుల కధీనుడు కాక స్వతంత్రు డయ్యెను. వస్తువుల నుత్పన్నము చేయుట కవసరమగు ముడిసరకు కొఱకు గ్రాహకులవంక జూడడయ్యె. ముడిసరకు స్వయముగా కొని తన చేతిలో నుంచుకొనెను. పనిచేయుట కితరుల యాజ్ఞ నపేక్షింప మానెను. స్వయముగానే యమ్మదగిన వస్తువులను సిద్ధము చేసెను. అప్పు డతడు కేవలము శిల్పి కాడు; వ్యాపారియు నయ్యెను. అతడు తన యంగడిని పెంపుచేసెను. వస్తువుల నిర్మాణ విద్యను నేర్చుకొనుటకు తన చెంత జేరినవారి సహాయముతో నెక్కుడు వస్తువులను నిర్మింపసాగెను. ఈ దశ యందు శిల్పి ధనము మిక్కిలి స్వల్పరూపమున మూలధన ముగా నుండెను. దాని సహాయముతో నతడు వస్తువుల నమ్ముటకు నిర్మించెను. క్రమముగా శిల్పుల సంఘ మేర్పడెను. ఆ సంఘముద్వారా శిల్పి తన హితములను రక్షించుకొనెను. శిల్పిసంఘముల కధిపతి యైనవాడు క్రొత్తగా వచ్చు శిల్పుల నందులో చేర్చుకొనెడివాడు కాడు. అతని గ్రామవాసులే

యతని సంఘములో చేరగలిగిరి. ఒక్కొక్కయెడ క్రొత్త శిల్పి ధనమిచ్చి సంఘములో చేరుటయు కలదు. శిల్పిసంఘము లకు వెలుపలనుండు శిల్పులు విదేశములకు వెళ్ళు వ్యాపారు లతో చేరి తమ స్వతంత్ర సంఘముల నేర్పరుచుకొనిరి. మధ్య యుగమున యైరోపా శిల్పిసంఘాధిపతులకు, దేశాంతరము లకు వెళ్లు వ్యాపారులకు మధ్య తగవులు జరుగుచుండెడివి. ఇరుతెగలవారును తమ పణ్యముల నమ్మి ధనికులు కాజూచెడి వారు.

సామంతులు భూమివలనను, శిల్పులలో కొందఱు హస్తనిర్మిత వస్తువుల నమ్ముటచేతను ధనికు లయిరి. సామం తుల సంపత్తిపైగల గ్రామవాసుల యధికారము క్రమముగా తొలగింపబడెను. ఇట్లు సామంతులు తమ సంపత్తిని మూల పతీయ సంపత్తిరూపమున మార్చుకొనిరి.

శిల్పుల సంపత్తికి చెందిన రూపాంతరములను పాశ్చాత్య విద్వాంసులు ప్రకటింపజాలక పోయిరి; ఈ విషయ మున ప్రాచీన భారతీయ విద్వాంసులుకూడ నేమియు వ్రాయ లేదు. అధ్యాత్మవాదియగు నర్థశాస్త్రము వైయక్తిక సంపత్తి విషయమున క్రమికపరిణామము నంగీకరించుచున్నది. దేశ కాల భేదముల ననుసరించి క్రమ మనేక విధములు కావచ్చును. ఐరోపా మున్నగు పశ్చిమ దేశములందు సంపత్తి రూప మెట్లుండెనో యట్లే భారతము మున్నగు ప్రాచ్య దేశములందు నుండవలయు నను నియమము కానరాదు.

భారత దేశపు గ్రామములలో కూడ వడ్రంగి, కమ్మరి మున్నగు చేతిపనులు చేయువారికి సంవత్సరమున కొకసారి

పంటలు పండినపుడు ధాన్యాదుల నిచ్చి వారిచే పనులు చేయించుకొనుచుండెడివారు. ముప్పది నలువది సంవత్సరములకు పూర్వ మిట్టి పద్ధతి గ్రామాచరణలో నుండెను. ఇప్పుడు నక్కడక్కడ నీ పద్ధతి కననగును. ప్రాచీన భారత గ్రామములలో గ్రామవాసుల యాజ్ఞల ననుసరించి పనిచేయు శిల్పులు, స్వతంత్రముగ పనిచేయు శిల్పులు, రెండు తెగలవారు నుండిరి. గ్రామవాసుల యాజ్ఞల ననుసరించి పనిచేయు వడ్రంగి 'గ్రామ తక్ష' యనియు, స్వతంత్రుడై పనిచేయువాడు 'కౌట తక్ష' యనియు చెప్పబడునట్లు పాణిని వ్యాకరణ శాస్త్రమున వర్ణించియున్నాడు. "గ్రామ కౌటాభ్యాంచ తక్ష్ణః" (పా. 54 - 95). గ్రామతక్షుడు గ్రామవాసుల యిండ్ల కేగి వారి పనులను చేయుచుండెడివాడు. కౌటతక్షుడు తన యింటి యొద్దనే పని చేసెడివాడు. 'కుటీ' అన గృహము. కుటిలో నుండి పనిచేయువాడు కావున కౌటతక్షు డనబడును. "గ్రామాధీనో గ్రామతక్షః, కౌటతక్షోఽనధీనకః" అని యమరకోశము.

శిల్పిసంఘములు నుండెడివి. వానిని శ్రేణు లనెడివారు. యాజ్ఞవల్క్య స్మృతిలో ('నృపేణాధికృతాః పూగాః శ్రేణయోఽథకులానిచ' 2. 30.) వీని నుల్లేఖించుట చూడ నగును. మధ్యయుగమున ఐరోపాలోని వ్యాపార ప్రధాన నగరములు దేశాంతరగాములైన వ్యాపారులకు, శ్రేణుల కధ్యక్షు లయినవారికి మధ్యజరుగు కలహములచే పీడింపబడుచుండెడివి. కాని భారతదేశపు నగరములలో నిట్టి కలహములు జరిగినట్లు తెలియదు. గ్రామవాసము గల పరివారముల

యాచారవిషయమున నధ్యాత్మవాదము ముఖ్యముగ నాక్షే పించును. వన్యదశలో నెటనేని కొన్ని పరివారములలో తండ్రి కూతురుతోను, అన్న చెల్లెలితోను చరించుట సంభవ మేమో కాని, సమస్త పరివారములలోను గమ్యాగమ్య వివేకము లేదనుట యప్రామాణికమని యధ్యాత్మవాదుల మతము.

వికాసవాదు లయిన యర్థశాస్త్రిల మతమున చాల కాలమునకు తరువాత కొన్ని వస్తువులు ప్రాతిస్వికవైయక్తిక-సంపదగా నంగీకరించుట ప్రారంభమైనది. భూమి ప్రథమమున గణము-గుంపు-నకు చెందినదై, తరువాత నుమ్మడికుటుంబము లకు, అటుపైన ప్రత్యేక కుటుంబమునకు సంక్రమించినది. ఒక్కొక్క కుటుంబమునకు చెందినపు డది ప్రాతిస్విక మైనది. తండ్రినుండి కొడుకులకు లభించెను. ఆరంభమున భూమి కలిసియున్న యనేక పరివారములకు చెందియుండవచ్చు నని యధ్యాత్మవాదము సైత మంగీకరించును; కాని, యా పరి వారములలో గమ్యాగమ్య విచార వ్యవస్థ లేదనుట యంగీక రింపదు. ఆరంభమున కొందఱు బుద్ధిమంతు లరణ్యమును నరికి భూమిని వాసయోగ్యము చేసికొని యుండవచ్చు. ప్రాచీన కాలమున కలిసియుండు పరివారములు, వేరు వేరుగా నుండు పరివారములును నుండెను. కొన్ని కుటుంబములలో సోదరు లెల్లరు తమ తమ సంతానములతోబాటు కలిసియుండుటయు కలదు. కొన్నింటిలో భార్యా భర్త లిరువురు కేవలము తమ బిడ్డలతో నుండుటయు కలదు. ఇట్లు వేరుగానుండిన పరి వారము తనకొఱకు వలయు భూమిని వాసయోగ్యము

చేసికొని యట పంటలు పండించుకొనిన నా భూమి యా పరి వారమునకే చెంది వైయక్తిక సంపత్తి యగును. ఆ భూమి యవిభక్త పరివారము భంగమైన మీదట వేరైన కుటుంబము నకు సంక్రమించిన దన వలనుపడదు.

భూమి స్థిరసంపద. అది ప్రథమమున సమస్త పరివార ములకు చెందిన నొక కులముయొక్క యధికారమున నుండెను. విభాగములు కాగా చివరి కొక్కొక్క పరివారము నకు చెందిన దయ్యెను. ఒక్కొక్కప్పు డది మొదటినుండియు నొకే పరివారమునకు చెందియుండుటయు కలదు. ప్రాతి స్వికరూపమున భూమిమీద నధికారము కలవారు భూమి హీనులకంటె నధిక ధనవంతు లగుదురు. భూస్వాములు శ్రామికుల శ్రమను హరించి పంటలద్వారా ధనమును పెంచు కొందురు. శ్రామికులు శరీరమునకు మాత్రము స్వాములై యుందురు. కడుపునిండ నన్నము, నొంటినిండ గుడ్డ కూడ వారికి సరిగ లభింపవు.

భూమివలె చలసంపద బహుకాలము సముదాయాధి కారమున నుండదయ్యె. కాని, మార్క్సు ననుసరించు పలువు రర్థ శాస్త్రిలు చలసంపత్తి కూడ మొదట సముదాయ మునకు చెందినదై వెంటనే ప్రాతిస్వికమైన దందురు. అజ్ఞాను లైన వన్యజనులు కూడ తమ యాభూషణములు, శస్త్ర ములు ప్రాతిస్వికములుగానే యెంచుచుండిరి.

శ్రమోపకరణములు శిల్పుల వైయక్తిక సంపదలే. పణ్యవస్తువులను నిర్మించి వాని నమ్ముటచే వచ్చు ధనముమీద వైయక్తికాధికారము సదా వారి కుండెను. వస్తువులను నిర్మిం

చుటకు, నమ్ముటకు నాటంకములేని యధికార ముండుటచే కొందఱు శిల్పులు, శ్రేణీపతులు ప్రాచీన కాలమున మూలపతు లయిరి. వీరుకూడ శ్రమహరణ మొనర్చి ధన సంచయము చేసెడివారే. అవకాశము లభించినపుడు స్వనిర్మిత వస్తువుల నధికమూల్యమున కమ్మి యుపభోక్తల శ్రమను హరించెడివారు. ఇతర శిల్పులను సహాయకులుగా తీసికొని వారిద్వారా నిర్మిత వస్తువుల నమ్మి, వచ్చిన ధనములో సహాయక శిల్పులకు శ్రమకు తగిన మూల్య మియ్యరు. ప్రాచీన కాలమునందు నిట్టి వ్యాపారు లుండిరి. వారు వందలాది మనుజులను సేవకులుగా నుంచుకొని దేశదేశము లందు వ్యాపారము చేయుచుండెడివారు. వీరందరు తఱచుగా కొలదిగానో గొప్పగానో యితరుల శ్రమను హరించి లాభము పొందెడివారు. న్యాయముగ నార్జించువారి సంపత్తి పెరుగజాలదు. చిరకాలమునుండియు నన్యాయము, నత్యాచారముద్వారా వైయక్తిక సంపద పెరుగ జొచ్చినది.

ప్రాచీనకాలమున మూలపతుల దగ్గర నుండు సాధనములతో వా రెంతగా కోరి యత్నించినను శ్రామికులనుండి కానీ, యుపభోక్తలనుండి కానీ మితిమీరిన ధనమును సంచయము చేయలేకుండిరి. ఆధునికులయిన మూలపతులు విశాల కాయముగల మహా యంత్రములను స్థాపించి వానిద్వారా యథేచ్ఛగా ధనము నార్జింప గలుగుచున్నారు - ఇతరుల శ్రమ నెక్కుడుగా హరింప గలుగుచున్నారు. ఇదియే ప్రాచీన మూలపతులకు, నవీన మూలపతులకు గల భేదము. మూలధనముద్వారా పరుల శ్రమను హరించి వైయక్తిక

సంపద నున్నత మొనర్చుటకు ప్రాచీనకాలమున గానీ, నేడుగానీ యెట్టి యాటంకమును లేదు.

అధికారము కారణముగా, సంపత్తిని ముఖ్యముగ రెండు విధముల విభజింపవచ్చును. మొదటిది సాముదాయికము; రెండవది ప్రాతిస్వికము - వైయక్తికము. ఒక కులమునకు గానీ లేక యనేక కులములకు గానీ యధికారమున్న సంపత్తి సాముదాయిక మగును. అనేక కులముల కధికారమున్న క్షేత్రము లధికముగా ప్రాచీనకాలమునుండి యున్నవి. ఇవి సాముదాయిక సంపత్తి కుదాహరణములు.

ప్రాతిస్వీక సంపత్తిలో ననేక భేదము లున్నవి. ఒకటి భోగ్యరూపము. రెండవది శ్రమ కవసరమగు సాధన రూపము. మూడవది మూలధనము.

అన్నము, వస్త్రములు, భూషణాదులు భోగ్యసంపత్తి. ఇవి యుపభోక్తకు సంబంధించిన ప్రాతిస్వీక సంపద. కృషీవలుని నాగలి, మంగలివాని కత్తి, కుమ్మరి చక్రము, మున్నగునవి శ్రమ సాధనములు. కర్మకరుడు స్వతంత్రుడై పని చేసినంతకాలము నాసాధనముల కతడు స్వామియై యుండును. వారు మూలపతి కధీనులై పనిచేయునపుడు శ్రమసాధనములకు స్వాములు కారు. ప్రాతిస్వీక సంపదకు గల మూడవ రూపము మూలధనము. భూమి, సువర్ణము, రజతము, రూప్యములు, శ్రమకు వలయు చిన్న పెద్ద యుపకరణములు నన్నియు మూలధన రూపమున నుండును.

ధనప్రాప్తికి సాధనమగు ధనము మూలధన మనబడును. మూలపతి పణ్యావస్తువులను లాభము సంపాదించుట

కుత్పన్నము చేయును. ఉత్పన్న వస్తువులలో కొన్నింటి నుపభోగించుట కుంచుకొనును. అధికముగా వస్తువులను విక్రయించి లాభము సంపాదించును. మూలపతి తఱచుగా శ్రమను హరించియే లాభమును బొందును.

మార్క్సు ననుసరించు నర్థశాస్త్రు లిట్టి యన్యాయమును చూచియే మూలధనమునకు శ్రమహరణ మావశ్యక ధర్మ మని తలంచుచున్నారు. కాని, మూలపతి శ్రమను హరింప కయే క్రొత్తగా తా జేసిన శ్రమకు తగినంత లాభమే పొందినను మూలధనస్వరూపము నశింపదు. నవీన శ్రమముద్వారా ధనమును గడింప జేయుట మూలధన స్వభావము. నేతగాడు ముందు నేతకు వలయు సాధనములు కొనును. తదుపరి నూలును వస్త్రముగా నేయును. దాని నమ్మి ధనమును పొందును. నేతసాధనములు మూలధనము. వాని ద్వారా యతడు శ్రమించును. వస్త్రము నుత్పన్నముచేసి దాని నమ్మి యుచితమైన ఫలము నందు నేతగాడును మూలపతియే. శ్రమసాధనములతో పని చేయించి శ్రమకు తగినంత ఫల మీయకుండుట మూలపతికి నేర మగును. ఈ దోషము శ్రమసాధనముల స్వాభావిక ధర్మము కాదు. త్రాసుతో తూనిక వేయుటలో ననేకులు మోసగింతురు. మోసగించుట త్రాసుకు సహజ ధర్మము కాదు. వస్తువుల తూనికను తెలుపుటయే దాని ధర్మము. మూలధన స్వరూపమును గూడ మనుజుని గుణదోషములనుండి వేరుచేసి చూడవలెను.

## పదునారవ యధ్యాయము

# భూమిపై నధికారము

భూమండలమున నేటి మానవులు చిన్నవో లేక పెద్దవో యైన భూఖండములమీద ప్రాతిస్విక రూపమున నధికారము వహించి యున్నారు. భూస్వామివంశజులకు వారి పూర్వజుల భూమిమీద జన్మతోనే యధికార మేర్పడును. వన్యదశలో, నసంస్కృతులైన జనులు గణముల రూపమున నుండునపుడు, కొండొక నిశ్చిత భూభాగముమీద ననేక కులములవారికి సముదిత రూపమున నధికార ముండెడిది. ఒక పరివారముకానీ, యొక వ్యక్తికానీ భూమిపై నధికారము కలిగియుండెడివాడు కాడు. అతి ప్రాచీనకాలమందు గమ్యాగమ్య వివేకశూన్యులైన యాటవికులు సాముదాయిక రూపమున భూమిపై నధికారము వహించి యుండెడివారు. ఆ సమయమునందును అక్క, చెల్లెలు, తల్లి, తండ్రి యని గుర్తించి గమ్యాగమ్య వివేకపూర్ణులైన సంస్కృత జనులుకూడ సాముదాయిక రూపముననే భూమిపై నధికారము గలిగి యుండెడివా రనుట కనేక శబ్దప్రమాణములున్నవి. వన్యజనులు క్రమముగా సంస్కృతులై భూమిమీదనున్న సాముదాయికాధికారమును తొలగించి వైయక్తికాధికారమును స్థాపించి యుండవచ్చు. ఆరంభకాలమున జ్ఞానవంతులైనవారి సంస్కృత పరంపరలోగూడ ననేక కారణములవలన భూమిమీదనున్న సముదితాధికార స్థానమును వైయక్తికాధికారము గ్రహించి యుండవచ్చును.

జైమిని మహర్షి భూమిమీద సమస్త జనుల కధికార మున్న ట్లెంచియున్నాడు. 'విశ్వజిత్' యాగమున సమస్త సంపత్తిని దానమొనర్చు విధానము బ్రాహ్మణ గ్రంథము లందు జూడనగును. అట 'భూమినికూడ దక్షిణగా నీయ వలసినదేనా ?' యని సందేహించి మహర్షి యిట్లు చెప్పి యున్నాడు :—

"న భూమిః స్యాత్ సర్వాన్ ప్రత్యవిశిష్టత్వాత్"
[మీ. సూ. 6-7-3.]

'భూమి దక్షిణగా నీయజనదు. అది యందఱకు చెందినది. దానిమీద మానవుల కందరకు సమానాధికార మున్నది.'

ఆచార్యుడైన శబరస్వామి యా సూత్రమును వివరించుచు, 'రాజుగానీ, సమస్త భూమండలముపై నధికారము గల సమ్రాట్టుగానీ యెవరైనను మహాపృథివిని దానము చేయరాదు. రాజుకు రాజ్యమునందలి భూమిమీద ప్రాతిస్వికాధికారము లేదు. భూమి మానవులు తిరుగాడుటకై యేర్పడినది. దానిమీద కేవలము రాజే నడువడు. సమస్త మానవులు నడువవలసి యున్నారు' అని వ్రాసి యున్నాడు. ఈ సూత్రమునే వ్యాఖ్యానించుచు శాస్త్రదీపికాకర్తయైన పార్థసారథి మిశ్రుడు, 'రాజు తన యధికారములోనున్న దేశమును పాలించును. శత్రువుల యాక్రమణను తొలగించును. ఈ పరిశ్రమకు ప్రతిఫలముగా కృషికులనుండి పన్నులు, దండితులనుండి దండరూపమున ద్రవ్యము తీసికొను నధికారమతని కున్నది. రాజు భూమికి స్వామిగాడు. కావున సార్వభౌముడు మహాపృథివినిగానీ, మాండలికుడు మండలభూమిని

గానీ దానముగా నీయజాలడు' అని వ్రాసియున్నాడు. శాస్త్రదీపికకు వ్యాఖ్యయైన 'మయూఖమాలిక'కు కర్తయగు సోమనాథుడు, 'మహాపృథివిమీద ప్రతిపురుషునకు నధికార మున్నది. గ్రామస్వామికికూడ గోచరభూమి - బీడు - మీద వైయక్తికాధికారము లేదు. గోచరభూములమీదను, నన్య భూములమీదను గ్రామవాసుల కందఱకు నధికార మున్నది. గ్రామాధిపతి తనయధికారమునకు లోబడిన నియతభూమిని తక్క యితరభూమిని దానము చేయజాలడు.' అని యుల్లే ఖించి యున్నాడు.

ఉపర్యుక్త ప్రమాణమును బట్టి ప్రాచీన కాలమున భూమిపై నొకవ్యక్తి కధికారము లేదని స్పష్టపడుచున్నది. శబరస్వామి మతమున సమ్రాట్టుకు భూమిలో కొంతభాగము మీద ప్రాతిస్వికాధికారము కలదు; కాని, సమస్త భూమి మీద లేదు. శాస్త్రదీపికమతము ననుసరించి మాండలిక రాజునకు మండల భూమిమీద ప్రాతిస్వికాధికారము లేదు. సోమనాథుని మతమున గ్రామాధిపతికి గ్రామభూమిపై ప్రాతి స్వికాధికారము లేదు. కాని, మాండలికరాజు, గ్రామాధిపతి తన భూమిమీద వైయక్తికాధికారము కలిగి యుందురు. కొందఱి యీ మతము ననుసరించి రాజు మున్నగువారు తన వైయక్తికాధికారమున నున్న భూమి నమ్ముటకును, దానము చేయుటకును నధికారము గలిగి యున్నారు.

సూత్రకారుడైన జైమినిమహర్షి భూమిమీద మనుష్య మాత్రున కధికారము గలదని చెప్పుట కిచ్చిన హేతువును గూర్చి బాగుగ నాలోచించితిమేని, సమ్రాట్టుకు గానీ,

మాండలిక రాజునకు గానీ, గ్రామాధిపతికి గానీ యెవరికిని ప్రాతిస్వికాధికార మున్నట్లు గోచరింపదు. భూమి మానవులు తిరుగాడుటకై యున్నది. కావున దానిపై నెవరికిని ప్రత్యే కాధికారము లేదు. ఒకని కొక భూమిపై నసాధారణాధికార మున్నదని చెప్పబడు భూమికి గూడ నీ హేతువు వర్తించును. సాగుచేయుటకు తగినట్లు శ్రమచేసి సిద్ధపరచిన కారణమున నా భూమిమీద నొకనికి కొంతకాల మధికారమున్న నుండ వచ్చు. ఆ యధికారము భూమిని ఫలప్రద మగునట్లు చేసిన శ్రమకు ప్రతిఫల మగును. కాని, భూస్వామి భూమిని శ్రమ హరణమునకు సాధనముగా చేసిన దానిపై నతని కధికార ముండజాలదు.

భూమిమీద నెల్లరకు సాధారణాధికార ముండును. ఒకడు దానిమీద శ్రమచేసి శ్రమకు తగిన ఫలము బొందు నంత కాలము నతని కా భూమిపై నధికార ముండును. భూమిలోని ప్రతి భాగము నెల్లరకు చెంది యున్నది. దాని యే యంశముమీద నైనను ప్రాచీనకాలమున నొక డధికారము సంపాదించి యున్నంత మాత్రమున నతని కసాధారణాధికార మాభూభాగముపై కలుగజాలదు. అతని వంశజులు దానిమీద నెంత పరిశ్రమ చేయుదురో యంతకు ఫలము పొందగలుగుదురు. కొండొక వంశ మెల్లప్పటికి నొక భూభాగమునకు స్వామిత్వము వహింపజాలదు.

యూదుల మతము, క్రైస్తవమతము ననుసరించి చూచినను భూమిమీద నెల్లరకు నధికార మున్నది. "భూమి నెన్నడును నమ్మరాదు. భూమి నాది. మీరు యాత్రికులు.

ఈ భూమిపై కొన్ని దినములు విహరించుటకు మీరు వచ్చి యున్నారు.'' (వైవిటకస్. 25-23)

ఆధునిక తత్వవిచారకులలో నొకడగు హాబ్స్‌కూడ భూమిమీద నెల్లరకు నధికార మున్నదని యంగీకరించు చున్నాడు. ''ప్రకృతి మన కందరకు నన్ని వస్తువుల మీదను సమానాధికార మొసంగినది. ప్రాకృతిక దశలో ప్రతి మనుజుడు తన కోరిక ననుసరించి ప్రతి వస్తువు తీసికొన వచ్చు. కావుననే 'ప్రకృతి యందరకు నన్ని పదార్థముల నిచ్చినది' యను సామెతకూడ నున్నది. దీనివలన ప్రాకృతిక దశలో నుపయోగిత యధికారమునకు కారణ మని సిద్ధమగు చున్నది.'' (డి. సీవ్.)

ఆత్మవాదుల దృష్టిలో భూమిమీదనే కాక, . భూమి యందు గల పర్వతములు, అడవులు మున్నగు పదార్థముల మీద కూడ మానవుల కెల్లరకు నధికార మున్నది. జలము, వాయువు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, ఆకాశము మున్నగు పదార్థముల కెల్లరు స్వాములే. మనుజులే కాక వీనిపై పశుపక్ష్యాదులును స్వామ్యము గలిగి యున్నవి. జీవులకు కర్మఫలముల నందజేయుటకు, పృథివి, సూర్య చంద్రులు, పర్వతములు, నదీనదములు నన్నియు రచింప బడినవి. జీవుల సముదిత కర్మలు వీని యుత్పత్తికి నిమిత్త ములు. మనుష్యులు, పశు పక్షి క్రిమి కీటకాది జీవులు నన్నియు నీ పదార్థములద్వారా సుఖదుఃఖములను బొందు చున్నవి. సుఖదుఃఖములు జీవుల కర్మలకు ఫలములు. ప్రపంచ మున నుపయోగకరములగు పదార్థము లన్నియు సర్వజీవుల

సాధారణ కర్మలఫలము. కావున వానిపై కొండొక మనుజునకో లేక యొకానొక పరివారమునకో కేవల మధికార ముండుట యనుచిత మగును. ప్రాణిమాత్రమునకు స్వామ్యమైన పదార్థముల ద్వారా యే మనుజు డెంత పరిశ్రమ మొనర్చునో యంత ఫలము బొందవచ్చు.

అనాత్మవాదులగు నర్థశాస్త్రిల దృష్టిలో పృథివ్యాది పదార్థములు ప్రకృతిపరిణామము వలన తమంత తాము జనించినవి. ఈ పదార్థములపై నెవ రెంత యధికారము వహించినను కాదనుటకు గల హేతు వొండును లేదు. వీరి దృష్టిలో జీవులుకానీ, వారి కర్మలుగానీ, కర్మలకు ఫలములు కానీ లేవు. కొండొక వ్యవస్థకు నిమిత్తమే కానరాదు. ఆత్మవాదుల పక్షమున ప్రపంచమం దంతటను కర్మఫల వ్యవస్థ యున్నది. పరమాణువు మొదలు పృథివి, సూర్యచంద్రులు మున్నగువాని గతియు కర్మాధీనమై యున్నది.

భూమి ప్రాణిమాత్రమున కాధారము. ఈ భూమి మీద మనుజుడు తనశ్రమము ద్వారా క్రొత్త భూములను నిర్మించుచున్నాడు. తా నుండుటకు గృహమును నిర్మించును. కొన్ని భవనములు రెండు మూడు నాలుగు భూమికలు - అంతస్థులు - కలవిగా నిర్మించును. భూమి నివసించుట కుపయోగించును. భవనములలో నంతస్థులు - భూమికలు - నివసించుటకే నిర్మింపబడును. కావున వానినికూడ భూము లందురు. మహాభూమి మీద ననేకు లుందురు. మనుజుడు తన నివాసార్థము రచించు భూములు చిన్నవి; కావున వాని మీద కొలదిమంది నివసింతురు. ఇవి యల్పాకారమున నుండును. కాబట్టి సంస్కృతమున వీనిని భూమిక లందురు.

ధనికులు నేడు గొప్పగొప్ప భవనములు నిర్మించి యవి యద్దెల కిచ్చి తద్ద్వారా మిక్కిలి ధనము సంపాదించుచున్నారు. భవన నిర్మాణమునందును, అద్దెలద్వారా ధన సంపాదనలోను శ్రమాపహరణము జరుగుచున్నది. ఇది యనుచితము. నివసించుటకు స్థలము లేనివారు శక్తినిమించి యద్దెలను చెల్లింపవలసి వచ్చుచున్నది. భవనస్వామి భవన నిర్మాణమునకు వ్యయించిన ధనము అద్దెలద్వారా తనకు లభించినమీదటకూడ ననేక సంవత్సరములా భవనముతో నద్దెలు సంపాదించుచునే యుండును.

ధనికుడు ధనము వెచ్చించి భవనము నిర్మించును. వెచ్చించిన ధన మతని శ్రమ. అత డా యింటిని అద్దె కిచ్చి కొంతకాలములో తాను వెచ్చించిన ధనము - తన శ్రమ - మరల పొందును. కాని యా భవన మంతటితో నష్టము కాదు. అది యట్లే నిలిచి యుండును. అద్దెనిచ్చువా డా యింటిలో నుండి సుఖ మనుభవించుచున్నాడు. ఆ సుఖాను భవమునకు కారణము భవనస్వామి. అతడు భవనము నిర్మింప కున్న నద్దెలవారు నివసింపలేరు. కాని, భవనస్వామికి నతడు వెచ్చించిన ధనము తిరిగి యద్దెలరూపమున పూర్తిగ లభించిన మీదట భవనస్థితిలో భవనస్వామి శ్రమ కారణమైనను నది యల్పమాత్రలో నుండును. ఇటికలు, సున్నము మున్నగు వాని స్వాభావిక సామర్థ్యమువలన భవనము బహుకాలము నివాసయోగ్యముగ నిలిచి యుండును. ఆ పదార్థముల కా సామర్థ్యము భూ జలాదులు కారణముగ లభించినది. ఇట్లే పదార్థముల స్వాభావిక సామర్థ్యము వలన భవనస్థితి యేర్పడి,

యందలి నివాసులకు సుఖము కలుగుచున్నది. ఆ సుఖములో భవనస్వామిశ్రమ ముఖ్యకారణము కాదు. భవనస్వామికి వెచ్చించిన ధనము లభింపనంతవరకు, నందలి నివాసులకు లభించు సుఖమునకు కారణము భవనస్వామి యొక్క శ్రమ, ఇటికలు మున్నగు పదార్థముల సామర్థ్యము రెండునునై యున్నవి. భవనస్వామి వెచ్చించిన ధనము పూర్తిగా లభించిన మీదట నతడు తన సంచిత శ్రమఫలము పూర్తిగ ననుభవించినవా డగుచున్నాడు. తరువాత నతడు తన ధనము - సంచితశ్రమ - ద్వారా చేసిన క్రొత్త శ్రమకూడ భవనస్థితికి కొంత కారణ మగుచున్నది. తాను భోగింపక, యితరుల నివాసార్థము భవననిర్మాణము చేయుట ధనికుని నవీనశ్రమ మగుచున్నది. దాని ఫలము ధనికునకు లభింపవలసినదే. కాని, ప్రాచీన సంచిత శ్రమఫలమున కొక సీమ - హద్దు - ఉన్నట్లు, ఈ నవీన శ్రమఫలమునకు నొక హద్దుండవలయు ననుమాట మరువరాదు. ఎంతటి శ్రమమైనను, నెట్టి శ్రమమైనను ననంతకాలమువరకు ఫలము నీయజాలదు. భవననిర్మాణమునకు తోడ్పడిన కూలివారి శ్రమఫలమున కంతమున్నట్లు, అద్దెకుండువారి శ్రమఫలమునకు నంతమున్నట్లు, భవనస్వామి యొక్క నవీన శ్రమ ఫలమునకుకూడ నంతముండవలయునుగదా!

ధనికుడు = మూలపతి, కూలివారు కలిసి యంత్రముల ద్వారా వస్త్రముల నుత్పన్నము చేయుదురు. యంత్రము మూలమున తీవ్ర వేగముతో వస్త్రము లుత్పన్నము లగును. వేగముతో వస్త్రోత్పత్తి యగుటలో ధనికుని శ్రమ, కూలివాని

శ్రమయు గౌణ కారణములు. యంత్ర బలము ముఖ్య కారణము. కూలివాడు తన చేతులతోనే పనిచేసిన వస్త్రము లధిక సంఖ్యలో నుత్పన్నము చేయలేడు. యంత్ర బల మధిక సంఖ్యలో చేయును. ధనికునికి పెట్టుబడి ధనము లభించిన మీదట, కూలివానికి తగిన పరిశ్రమ ఫలము దొరికిన తరువాత నేర్పడు వస్త్రోత్పత్తిలో ధనికుని నవీన శ్రమ యల్పమాత్రలో కారణ మగుచున్నది. ఇది యంతయు మనసున నుంచుకొని వస్త్ర మూల్యము నియత మొనర్చునెడల ఉపభోక్తల కన్యాయము జరుగ నేరదు. అట్లే యింటి యద్దెల విషయమునను ఆలోచించినచో భవనస్వామికి పెట్టుబడి ధనము లభించిన మీదట నింటి యద్దె మిక్కిలి స్వల్పముగా నుండవలసివచ్చును.

భవనస్వామికి కొలది యద్దెతో సంతోషము కలుగదు. మిక్కిలి లాభ మతనికి కావలెను. ఉపభోక్తలు కలిసి పణ్య పదార్థములను, భోగ్య పదార్థములను నిర్మించుకొందురేని శ్రమఫలమునకు సరియైన వ్యవస్థ యేర్పడగలదు. ఉపభోక్తలు కలిసి యంత్రాదుల నుపయోగించిన శ్రామికులకు తగిన వేతన మిచ్చి యల్ప మూల్యమునకే తమ యుపభోగమునకు వలయు వస్తువుల నుత్పన్నము చేయగలుగుదురు. అట్లే యుపభోక్తలు కలిసి భవన నిర్మాణము చేసికొందురేని పెద్ద యద్దెలనుండి వారు తప్పుకొనవచ్చును. తగిన స్థానము వారికి లభించును. ధనికులు వేలాది యెకరముల భూమి కధికారు లగుట యెట్లనుచితమో, కొండొక భూభాగము మీద ననేక భూమికలు గల భవనములను నిర్మించి వానిపై చిరకాల మధికారము వహించుటయు ననుచితమే.

# పదునేడవ యధ్యాయము

## అర్థము - పారివారిక వ్యవస్థ

పరివారముతో నర్థమునకు ననివార్య సంబంధ మున్న ట్లెల్లప్పుడు నంగీకరింపబడుచున్నది. కుటుంబపోషణ కర్థ మవసర మగుట యనుభవ సిద్ధము. పాశ్చాత్య విద్వాం సులు కుటుంబోత్పత్తి, దాని వికాసమును గూర్చి నిరూపించి నప్పటినుండి కుటుంబముతో నర్థమునకు గల సంబంధము క్రొత్త పద్ధతిలో వర్ణింపబడుచున్నది. పరివార స్వరూపము నైతిహాసిక క్రమముతో నన్వేషించువారి మతమున పరివార రూపము స్థిరముకాదు. అది మార్పు చెందుచు వచ్చినది. భూమండలమున గల నానా మతస్థులు తమ తమ పరివార స్వరూపము ననాది యనియు, శాశ్వత మనియు ననుచున్నారు. కాని, వీనిలో నొక పరివార స్వరూపముకూడ నానావిధము లగు చారిత్రక యుగములం దొక్కటిగా నున్నదనరాదు.

ఈ పక్షము నంగీకరించువారు వికాసవాదులు. వికాస వాదము ననుసరించి ప్రపంచము మొదట జడములయిన భౌతిక పదార్థముల రూపమున నుండెను. ఆరంభమున సజీవసృష్టి లేదు. కొండొక ప్రాచీన యుగమునం దజ్ఞాత దశలో కొండొక సూక్ష్మప్రాణి యెట్లో యుద్భవించినది. వేలాది వర్షములలో నా యేక ప్రాణి యనేకమైనది. ఒక జాతినుండి యనేక జాతు లుత్పన్నము లైనవి. అత్యంత ప్రాచీన కాలమున, నేటికి లక్షలాది వర్షములకు పూర్వ మొక జంతువునుండి మొదటి మానవుడు ప్రకటమై యుండెను. అత డొక విధమగు పశు

వుగా నుండెను. అతనిలో జ్ఞానము క్రమముగాను నెమ్మదిగాను వికసించినది. మానవులలో మొదటివాడు పశువువలె నాలుగు పాదములతో చరించెడి వాడు. జీవన రక్షార్థ మతడు తన వెనుకటి కాళ్ళమీద నిలబడ యత్నించెను. క్రమముగా నేటి మానవుని వలె నడువ నేర్చినాడు. అతని జ్ఞానమునందును వికాసము కలిగినది. ఈ వికాసము నేడును ముందుకు సాగుచునే యున్నది. మానవ పశువు యొక్క మొదటి రూపములు నశించినవి. భూగర్భమున నెక్కడో యణగియున్న వాని యస్థిపంజరము లప్పుడప్పుడు బయటపడుచున్నవి. నాటినుండి నేటికి వేలకొలది వత్సరములు గతించినవి.

పశుజాతినుండి యుద్భవమైనందున మానవుడును పశువులవలెనే సంతానము గనుచుండెను. తల్లి, అక్క, చెల్లెలు మున్నగు స్త్రీలందఱు నతనికి సమానలుగా నుండిరి. అత డందరితోను కలిసి సంతానము గనుచుండెడివాడు. అతడు జ్ఞానము వికసించినకొలది స్త్రీలలో భేదము గుర్తింపసాగెను. కొందఱను తాను సంతానము గన యోగ్యలుగా నెంచెను. మరికొందఱను నిషిద్ధలుగా నెంచెను. సంతానము గన యోగ్యలు కారని, అగమ్యలని నిషేధింపబడిన వారి సంఖ్య పెరిగినది. తల్లి, కూతురు, తోబుట్టువు వీరితో కలిసి సంతానము కనరాదని యెంచబడినది. ప్రపంచమున నాదిమ మానవు డెక్కడ నున్నను నీ స్థితియందే యున్నాడని వికాసవాదుల మతము.

మార్క్సు ననుసరించు నర్థశాస్త్రులంద రీవాదము నంగీకరింతురు. పరివార విషయమునను మార్క్సువాదులు వికాసవాదుల ననుసరింతురు. మార్క్సుకు పూర్వము అమెరికా నివాసి మార్గరేట్ వికాసవాదము ననుసరించియే పరివారోద్భవమును ప్రదర్శించి యున్నాడు. అతనిని ప్రమాణముగా నంగీకరించి, మార్క్సు కా జీవనమిత్రుడైన ఎంగల్సు మనుష్యరూపమున పశువుగానున్న యాదిమ మానవుని పరివారమును గణపరివార రూపమున వర్ణించి యున్నాడు. ఆ పరివారమున ప్రతి పురుషుడు ప్రతి స్త్రీతోను కలిసి సంతానము గనుచుండెడివాడు. తల్లి, కూతురు నని విచారింపక ప్రతి స్త్రీతోను కలిసి సంతానము గనెడివాడు. అట్టి గణపరివారము మొదలుకొని పవిత్ర దాంపత్యము గల పరివారము వరకు గల వికాసమునకు ముఖ్య కారణ మర్థవ్యవస్థయే యని మార్క్సువాదు లంగీకరించి యున్నారు. ఏ కాలమున నెట్టి యర్థవ్యవస్థ యున్న నా కాలమున నా యర్థవ్యవస్థ కనురూపముగ పరివార మేర్పడినది. పరివారమునకు చెందిన వివిధ రూపములతో నర్థ వ్యవస్థకు కార్య కారణ భావమును సంపాదించుట మార్క్సువాదుల యావిష్కార మనవలెను. వికాసవాదమును, మార్క్సువాదమును నంగీకరించిన కొందఱు భారతీయ విద్వాంసులును ప్రాచీన భారతమునందలి యార్య పరివారములు వన్యదశకు చెందినవిగా చెప్పియున్నారు. వారి దృష్టిలో భారతీయార్యులు కూడ కొండొక కాలమున తల్లి, కూతురు నను భేద మెంచక నెల్ల స్త్రీలయందును సంతానము గనుచుండిరి.

ఆత్మవాదులు కానీ, ఆత్మవాద్యర్థ శాస్త్రిలు కానీ యుపర్యుక్త వికాసవాదుల పరివార వికాసపద్ధతి నంగీకరింపరు. అది యయుక్త మందురు. ఆత్మవాదమున జడము, చేతనము నను రెండు పదార్థములు పూర్తిగా భిన్నములు. జీవుడు కర్మఫలము ననుసరించి యనేక యోనులందు తిరుగును. జీవుల శరీరములు, జ్ఞానములు సమానములు కావు. కొందఱి శరీరములు దుర్బలము లయిన మరికొందఱివి పబలములు. కొందఱి జ్ఞానము తీక్ష్ణమైన మరికొందఱిది మందము. కొందఱికి పూర్వజన్మస్మరణముకూడ కలుగును.

ఆరంభపు మనుష్యులలోను కొందఱు జ్ఞానవంతులు, మరికొందఱు మందబుద్ధులు నుండిరి. జ్ఞానులు, సంస్కృతులు నైన వారతి ప్రాచీనకాలమునుండి తల్లి, కూతురు, అక్క, చెల్లెండ్రు నగమ్య లనియు, వారితో కలిసి సంతానము కన రాదనియు నెన్నడో నిషేధించి యుండిరి. వారి సమకాలీనులలో కొందఱు వన్యదశయందుండి గమ్యాగమ్య విచారణ చేయకున్న నుండవచ్చు. అంతేకాని సమస్త మానవులు నారంభ కాలమున పశువులవలె నజ్ఞానమయులై గమ్యాగమ్య విచారణలేనివారై యున్నారనుట ప్రమాణ సిద్ధము కాదు. జీవుడు నిత్యుడు, జన్మజన్మాంతరములను బొందుచుండునని యంగీకరించిన మీదట 'మనుష్యు డారంభమున నజ్ఞానిగానే యుండెను; అత డసంస్కృత బుద్ధియై యుండె' ననుట యెంతమాత్రము యుక్తముకాదు. పూర్వజన్మము లేని వర్తమానజన్మ మనునది లేనేలేదు. వికాసవాదుల దృష్టిలో నేది యాదికాలమో యప్పటి మానవులలో

కొందఱు తమ పూర్వజన్మపు టభ్యాస ఫలముగ జ్ఞానవంతులై యుండుటలో సంశయ ముండరాదు. వారికి గమ్యాగమ్య జ్ఞాన ముండియుండును. కాబట్టి యారంభ కాలము నుండియు మానవులలో గమ్యాగమ్య జ్ఞాన ముండనే యున్నది. ఆరంభ కాలమున ప్రతి మానవుడు గమ్యాగమ్యజ్ఞానశూన్యుడై యుండవలె ననుట ప్రమాణ సిద్ధము కాదు, యనివార్యము కానీ కాదు.

ఆత్మవాదము ననుసరించి యాదిమ మనుష్యులలో ననేకదశ లుండి యుండవచ్చు. కొండొక యుగమున మనుష్యు లెల్లరు జ్ఞానవంతులై యుండుటయు సంభవము కావచ్చు. వారు పూర్వజన్మల కర్మఫలముగా నట్లు జన్మించి యుండవచ్చు. వారి సంతానము కారణాంతరములచే వారి నుండి వేరై క్రమముగా జ్ఞానహీనులై వన్యదశను బొందియుం డుటయు నసంభవము కాదు. అజ్ఞానవశమున వారిలో గమ్యాగమ్య వివేకము లేకుండవచ్చును. జ్ఞానసంపన్నుల సంతాన మొకప్పుడు పరమమూఢు లగుట యసంభవము కాదు. ఆదిమ మానవుల సంభావిత దశను ప్రకటించుట కిది ప్రథమ ప్రకారము.

రెండవ సంభావితదశ : ఆదికాలమున కొందఱు మానవులు తమ పూర్వకర్మల ననుసరించి జ్ఞానులుగా నుత్పన్నులై యుండవచ్చు; కొంద అజ్ఞానులుగా నుద్భవింప వచ్చు. జ్ఞానులలో గమ్యాగమ్య జ్ఞానముతోబాటు ఇతర జ్ఞానము కలవారు నుండియుందురు. అజ్ఞానులు పశుతుల్యు లుగా నుండియుందురు. తరువాతి కాలమునందు జ్ఞానుల

సంతానములో నధికులు జ్ఞానులుగాను, నజ్ఞానుల సంతాన ములో నధికు లజ్ఞానులుగాను నుండి యుండవచ్చు. కావుననే నాటినుండి నేటివరకు రెండు తెగల మానవులు చూడనగు చున్నారు.

మూడవదశ : కొండొక యుగారంభమున కర్మాధీ నులై యెల్లరు నజ్ఞానులుగా నుత్పన్నులై యుండవచ్చు. తరువాత వారి సంతానములో కొందఱు జ్ఞానులై యుందురు. వారు గమ్యాగమ్య వివేకమును గలిగి యుండవచ్చు. జ్ఞానుల సంతాన మజ్ఞానియైనట్లు అజ్ఞాని సంతానము జ్ఞానవంతమును కావచ్చు.

ఉపర్యుక్తములగు మూడు దశలు సంభవములే కాని గగన కుసుమము వలెనో, కుందేటి కొమ్మువలెనో, వంధ్యా పుత్రుని వలెనో యసంభవములు కావు. ఏ కాలమున నేదశ యుండెనో యనుమానింప వలనుపడదు. ఇయ్యది చరిత్రకు సంబంధించిన విషయము. ఆదిమ మానవు లెల్లరు వన్య పశువులై యుండి రనువారు సత్యమగు నితిహాసమును ప్రమా ణముగా చూపవలసి యుందురు. నేటివరకు నట్టి యితిహాస మెక్కడను లభించియుండదయ్యె.

భారతీయ విద్వాంసులు వేదములను, స్మృతులను, రామాయణ మహాభారతములను, పురాణాదులను ప్రమాణ ములుగా నంగీకరించుచు వచ్చుచున్నారు. వేదాదుల ననుస రించి చూచినచో నాదికాలపు ప్రాచీనాచార్యులు జ్ఞాన సంపన్నులై యుండిరి. వారిలో గమ్యాగమ్య విషయమునకు సంబంధించిన వ్యవస్థ మిక్కిలి సుదృఢమై యుండెను. వికాస

వాదులు, మార్క్సు మున్నగువారు కూడ నాదిమయార్యుల నన్యదేశపు వన్యమానవులతో సమానముగా నెంచిరి. — వారిలో కూడ గమ్యాగమ్య వివేకము లేదని వా రభిప్రాయ పడియున్నారు. ఆర్థికవ్యవస్థ ననుసరించి యార్యుల పరివార స్వరూపము మారుచు వచ్చిన దనియు మార్క్సువాదు లెంచి యున్నారు. ఈ విషయమున నిరుపక్షములు చూపు ప్రమాణ విషయముల నిట విచారింపవలసి యున్నది.

స్మృతులు వేదములను ప్రమాణముగా నంగీకరించును. వేదములు వానికి మూలములు. స్మృతులు తల్లిని, కొమార్తెను, తోబుట్టువును నపవిత్రదృష్టితో చూచుట మహాపాప మనును. స్మృతుల ననుసరించి చూచిన వేదములు పతిపత్ను లను గూర్చి వర్ణించిన తావులలో నిరువురిని భిన్న భిన్న కులజులుగా వర్ణించుచున్నవి. వేదవాక్యములలో కొన్నింటిని చూచినపుడు తండ్రి తన బిడ్డను, అన్న తన చెల్లెలిని వివాహ మాడుట విహితమేమో యను సందేహము కలుగును. ప్రాచీన పండితు లా వాక్య విషయమున సందేహించి సమాధానముల నిచ్చియుండిరి. నేడు మరల కొందఱు వికాసవాద మును, మార్క్సు వాదము నండగా చూచుకొని యా వాక్యముల విషయమున క్రొత్త యాక్షేపములను చేయు చున్నారు. వానినిగూడ పరీక్షించుట యావశ్యక మగు చున్నది.

“ ప్రథిష్టయస్య వీరకర్మ మిష్ణ దనుష్ఠితం నునర్యో అపోహాత్;
పున స్తదావృహాతి యత్క_నాయా దుహితురా అనుభృతమనర్వా ”
(ఋ. 10 - 61 - 5).

ఈ మంత్రమున, "ప్రజాపతి సుందరియైన తనకొమార్తె యందు వీర్యాధానము చేసెను" అని చెప్పబడినది.

"పితాయత్ స్వాందుహితర మధిష్కన్
క్ష్మయారేతః సంజగ్మానో నిషించత్
స్వాధ్యోఽజనయన్ బ్రహ్మదేవా
వాస్తోష్పతిం వ్రతపాం నిరతక్షన్"

(ఋ. 10 - 61 - 7.)

ఈ మంత్రమునందును తండ్రి పుత్రికపై నాక్రమణముచేసినట్లు చూడనగును. మైత్రాయణీసంహితయందు నొక వాక్యమున్నది. అందును పై మంత్రములలో పితాసుతల సంబంధమును గూర్చి వ్రాయబడియున్నది.

"ప్రజాపతిః స్వాం దుహితరమభ్యైదుషసంతస్య రేతః పరాపతత్"
మై. సం. 3, 6-5.

ఉపర్యుక్త వాక్యముల నాధారము చేసికొని కొందఱు 'వేదకాలమున తండ్రి పుత్రికతో కలిసి సంతానము గనుచుండెడివాడు; తరువాత నయ్యది పాపముగా నెంచబడినది' అని యాక్షేపింపసాగిరి. ఇట్టి యాక్షేపములకు చాల కాలమునకు పూర్వమునందే కుమారిలభట్టపాదు లిట్లు సమాధానము చెప్పియున్నాడు. "ప్రజాపతి యొకానొక దేవతా నామము కాదు. ప్రజాపతి యన సూర్యుడని యర్థము. ప్రజలను పాలించువాడు కావున సూర్యుడు ప్రజాపతి యనబడును. ఉదయకాలమున సూర్యు డుషస్సును సమీపించును. సూర్యుని యాగమనముచే నుష స్సుత్పన్న మగును. అందువలన నది సూర్యపుత్రికగా చెప్పబడినది. సూర్యుడు కిరణ

రూప బీజము నుషస్సునం దుంచుటచే స్త్రీ పురుష వ్యవహార మా సూర్యోషఃకాలములం దారోపింపబడినది. ఇట్టి యర్థము నెఱుగక ప్రజాపతి యను దేవత పుత్రికతో చరించినట్లు చెప్పుచున్నారు. అట్టి స్త్రీపురుష సంబంధ మిట లేనే లేదు. ఇది సూర్యోషఃకాలముల వర్ణన మాత్రమే. ఇందు పతి పత్నుల వ్యవహార మారోపింప బడినది.'' (మీ. ద. తంత్ర వార్తికము. పు. 2-8.).

కుమారిలుని యర్థము క్లిష్ట కల్పన యందురేని యది యును కాదు. ఐతరేయ బ్రాహ్మణము (పంచిక 3. అ 3. ఖండము 9) లో నీ విషయ ముల్లేఖించి; 'కొందఱు ఆకాశ మును, మరికొందఱు ఉషఃకాలమును దుహిత - పుత్రిక - యందురు' అని చెప్పబడి యున్నది. కుమారిలుని యర్థ మీ యైతరేయ బ్రాహ్మణము ననుసరించుచున్నది. బ్రాహ్మణ గ్రంథములు వేదమంత్రములకు ప్రాచీన వ్యాఖ్యానములు.

వైదిక శబ్దములు యౌగికములు. యోగబలము ద్వారా శబ్దము లనేకార్థములలో ప్రయోగింపబడగలవు. ఇందులకు ప్రమాణము ఐతరేయ బ్రాహ్మణము దుహితృ శబ్దమునకు చేసిన యర్థమే.

ఉపర్యుక్త మంత్రవాక్యములకు సూర్యపరముగా చేయబడిన యర్థము నంగీకరింపక యైతిహాసికులు చెప్పినట్లు కొంత తడవున కంగీకరించినను, ప్రజాపతి తన పుత్రికతో పత్నివలె వ్యవహరించినట్లు సిద్ధమగును. కాని యాసంబంధ మా గ్రంథమునం దుచిత మని యంగీకరించినట్లు సిద్ధము కానేరదు. ప్రజాపతికి పుత్రికతో గల సంబంధ ముచిత మని

మెంచి నాటి శిష్టు లట్లాచరించి రని యైతిహాసికులు ఋజువు చేయగలరా? నేడుకూడ ననేకులు చౌర్య మాచరింతురు; కాని, యాచౌర్యము నెవరైన నాదరింతురా ? శిష్టులు దాని నంగీకరింతురా ? లేదు. అట్లే వేదకాలమందును పితా పుత్రి కల సంబంధము గర్హింపబడినట్లు ఐతరేయ బ్రాహ్మణమును చూచిన బోధపడును. అందు 'ప్రజాపతి తన పుత్రికను భార్యా రూపమున ధ్యానించెను. అతడు పుత్రిక సమీపమునకు మృగరూపమున బోయెను. ప్రజాపతి యకార్య మొనర్చుట జూచి దేవతలు పరస్పర మాలోచించిరి. రుద్రుడు ప్రజాపతిని దండింపగల డని నిర్ణయించి యతని దగ్గరకు వెళ్ళిరి. 'ప్రజాపతి యకార్య మొనరించినాడు. కావున నతనిని బాణముతో కొట్టు'మని కోరిరి. రుద్రు డతనిని బాణముతో కొట్టగా నత డెగిరిపడెను. ఆ ప్రజాపతిని నేడు మృగశిర నక్షత్రముగా చెప్పుదురు. అతని పుత్రిక రోహిత వర్ణముగల మృగి యయ్యెను. అదియే రోహిణీ నక్షత్రము.' అని బ్రాహ్మణ మున వర్ణన చూడనగును. ఈ వర్ణన యైతిహాసికుల దృష్టిలో మానవ చరితగా భావింపబడినను వేదకాలమున పితాపుత్రిక లలో పతిపత్నీభావము నిందనీయముగ నెంచినట్లు సిద్ధమగు చున్నది. వాస్తవమున నిది మానవచరిత్ర వర్ణన కాదు. మృగశీర్ష, రోహిణీ నక్షత్రములకు సంబంధించిన వర్ణన యని స్పష్టముగా తెలియుచున్నది.

ఋక్సంహితలో యమయమీ సూక్త మొకటి యున్నది. ఇందు యమయమీసంవాద మున్నది. చారిత్రకముగా ప్రసిద్ధమైన యర్థమునుబట్టి యముడు, యమియు

నన్నచెల్లెండ్రు. వా రిరువురు వివస్వంతుని సంతానము. యమి యముని మాటిమాటికి సంభోగార్థము ప్రేరేపించును. యము డది నిషేధించును. ఈ ప్రసంగమున గల యమి వాక్యములను పురస్కరించుకొని యన్నాచెల్లెండ్రలో సంభోగము నాడు కలదందురేని యది యుక్తముకాదు. అట్టి యాచారమున్న యము డేల నిషేధించును ?

" ఉశన్తి ఘా తే అమృతాస ఏతదేకస్య
చిత్త్యజసం మర్త్యస్య " (ఋ. 10. 10 - 3.)

ఈ మంత్రమున యమి 'దేవతలుకూడ పుత్రికలను, తోబుట్టువులను కామించుచున్నారు.' అనును. ఈ మంత్రమున 'త్యజసమ్' పదము పుత్రికలకు, తోబుట్టువులకు బోధకము. శబ్దార్థము త్యజసమ్ = త్యాగయోగ్యము. 'పుత్రికలు, తోబుట్టువులు త్యాగయోగ్య లయినను దేవతలుకూడ వీరిని కామించుచున్నారు. కావున నీవుకూడ సంకోచింపకుము' అని యమి యభిప్రాయము. ఈ యభిప్రాయమును బట్టి చూచినను, 'త్యజనమ్' పదార్థమును బాగుగా గ్రహించినను, నాటికి పుత్రికలు, తోబుట్టువులు గమ్యలు - సంభోగయోగ్యలు - కారనియు, త్యాగయోగ్య లనియు బోధపడుచున్నది.

యముడు, యమివాక్యమునకు బదులు చెప్పుచు, 'తోబుట్టువుల కుచితముకాని కార్యము వా రాచరించు యుగము రానున్నది' (ఋ. 10 - 10 - 10.) యనును. ఈ వాక్యార్థము ప్రాచీనకాలమున నన్నాచెల్లెండ్రు పతిపత్నులుగా వ్యవహరించుట నిందనీయమైనట్లు స్పష్టముగా

చెప్పక చెప్పుచున్నది. అంతేకాక మంత్రమున నే రానున్నయుగము సూచింపబడినదో యా యుగము నేటి కతిసమీపములో నుండవచ్చును. కారణ మేమన: నేటి వికాసవాదులు, మార్క్సు శిష్యులు పుత్రికలతోను, తోబుట్టువులతోను చరించుట దోషరహితము, మానవ స్వభావజనితము నని సిద్ధపరుప ప్రబల ప్రయత్నము లాచరించుచున్నారు కదా! ఇట్టి ఘృణితము - జుగుప్సాకరము - నగు యుగమును రప్పింప నెంతగా యత్నించినను యత్నింతురుగాక! ప్రాచీన భారతీయ వైదికార్యుల భూతకాలము నీ విధమగు పాపాచరణములో కలంకిత మొనర్పజాలరు.

ఇట్టి శంకలు మంత్రముల నైతిహాసికముగ నన్వయించి నపుడే కలుగును. సూక్తమునందు యముడు, యమి యను పేరుగల శరీరధారి వ్యక్తులు పేర్కొనబడిన నుపర్యుక్త శంక కలుగును. కాని, నిరుక్తకారుల పక్షము నంగీకరించి యర్థమొనర్చిన నిట్టి శంకల కట తావే లేదు. మంత్రపదములకు యౌగికార్థము చెప్పిన యము డన నగ్ని యనియు, యమి యన పృథివి యనియు చెప్పనగును. శతపథ బ్రాహ్మణము నందు,

> "యమేన త్వా యమ్యా సంవిదానేత్యగ్ని ర్వై
> యమ ఇయం యమీ" (7. 2-1-10.)

అగ్ని యము డనియు, పృథివి యమి యనియు చెప్పబడినది. ఈ యర్థము నంగీకరించినచో నగ్నిని పతిగాను పృథివిని పత్నిగాను వర్ణించిన ట్లగును. జైమినిమహర్షి మతమున, వేదమంత్రములలో నితిహాసము సంభావింపబడిన తావులందది

ప్రపంచమునగల నిత్యపదార్థముల వర్ణనగా నెంచవలయును. సూర్య చంద్రులు, పృథివి, అగ్ని మున్నగు పదార్థములు నిరంతరము కార్యము లాచరించుచున్నవి. అవియే వేదములం దాలంకారిక భాషలో వర్ణింపబడినవి.

నేటి మార్క్సు శిష్యు లీహేతువులను పరికింపరు. ఇతర దేశములందు వన్యజాతీయు లయిన మానవుల సంఘములలో నాచరణలోనున్న పారివారిక స్వరూపముల నాధారముగా తీసికొని మార్గన్ పరివారవిషయమున నొక మతమును స్థాపించి యున్నాడు. దానిని నమ్మి ఎంగల్సు ఐతిహాసిక యుగమునకు పూర్వమున గల ప్రపంచ మానవులలో గమ్యాగమ్య వివేకము లేదని యుద్ఘోషించి యున్నాడు. మార్క్సు, ఎంగల్సుయొక్క ప్రత్యక్షరము సత్యసిద్ధ ప్రమాణమని యంగీకరించు మహనీయులు వాదావేశమునకు లోనై యర్థము ననర్థము చేయదొడగిరి. వస్తుస్వరూపము తమవాదమునకు విరుద్ధమైన తావులందుకూడ తమ కల్పనా రూపమునే చూడసాగిరి.

ప్రాచీన వైదికులు, పతిపత్నులలో నవ్యభిచరితమగు ననురాగధర్మము నంగీకరించుచుండిరి. కాని నేటి వికాసవాదులు వారిని గమ్యాగమ్య వివేకశూన్యులుగా నెంచుచున్నారు. కల్పనకు లోబడి మనుజు డసత్యమును సత్యముగా చూచును. మోహావశమున మానవుడు వస్తుస్వరూపమును నెరుగజాలడు. భ్రాంతునకు ముత్యపుచిప్ప వెండిగాను, మృగతృష్ణ జలముగాను తోచును. మార్క్సు వాదము

ననుసరించువారిలో కొందఱు జడవాదము నట్లే యనుకరించు చున్నారు.

ఎంగల్సు పరివారోత్పత్తి విషయము నొకచో నిట్లు వ్రాయుచున్నాడు. "ఇట్లు ప్రాగైతిహాసిక యుగములందు పరివారవికాస మీ విషయమునందే నిహితమై యుండెను. స్త్రీ పురుషుల మధ్య వైవాహిక సంబంధమునకు చెందిన సామాజిక క్షేత్రము మిక్కిలి చిన్నదైపోయెను. ప్రప్రథమమున మూలరూపమునం దీ క్షేత్రము సమస్త గణమును తనలో నిముడ్చుకొనెను. కాని క్రమక్రమముగా వైవాహిక సంబంధ క్షేత్రమునుండి తోబుట్టినవారు తొలగింపబడిరి. తరువాత దూరపు సంబంధము గలవారు కూడ వేరు చేయబడిరి. చివరకు వివాహితులను కూడ నా క్షేత్రమునుండి తొలగించిరి. ఇట్లు యూథవివాహములు వ్యవహారమున లేకుండ పోయినవి. చిట్టచివరకు ఒక్క పురుషున కొక్క స్త్రీతో వివాహము మిగిలిపోయినది. అందు కొంత కాలమునకు గాను శిథిల బంధనములతో బద్ధులయిన స్త్రీ పురుషుల యుగ్మ మొక యణువువలె నుండెను. ఆ బంధనము తెగినచో వివాహమే యసంభవ మయ్యెడిది. ఇది కేవల సత్యము. దీనివలన నాధునిక యుగమున వ్యక్తిగత ప్రణయ మెంత తక్కువగా నుండుటచే నేకనిష్ఠ వివాహము జన్మింపగలిగినదో బోధపడగలదు. ఈ యవస్థలో నుండు జనుల వ్యవహారము వలన నుపర్యుక్త విషయమున కనేక ప్రమాణములు లభింపగలవు. ప్రాథమిక పరివార స్వరూపమున పురుషునకు స్త్రీల కొఱత యుండెడిది కాదు. వారికి కావలసినవారికంటె

నెక్కుడుగా స్త్రీలు లభించెడివారు. కాని, నేటి స్థితిలో స్త్రీలు తక్కువమైరి. అందువలననే జంట వివాహములతో బాటు స్త్రీల నపహరించుటయు సంభవించినది. ఇంతేకాక క్రయవిక్రయములు కూడ నారంభమయ్యెను. ఇవి యన్నియు సమాజములో ప్రవేశించిన పరివర్తనమునకు చిహ్నములు.'' (పరివారోత్పత్తి పు. 68 - 69.)

ఈ లేఖవలన ఎంగల్సు కానీ, వారి యనుగాములు కానీ, 'ప్రాచీన కాలమున యూథవివాహములు జరుగు చుండెడివి. క్రమముగా వానిలో సంకోచ మేర్పడి చివరకు యుగ్మవివాహము లేర్పడినవి' యని చెప్పుటయే తమ యుద్దేశ మందురేని యాపత్తి యొకింతయు లేదు. కాని, యీ స్థితి యాదిమానవుల కందఱకు నంటగట్ట జూతురేని యందులకు ప్రమాణము చూపు డని యడుగవలసి వచ్చును. వన్యదశలో కొందఱు యూథవివాహము లాచరించునపుడు సంస్కృతులు, విజ్ఞానవంతులు నైన జనులు ఏకనిష్ఠమగు పవిత్రభావనతో నోతప్రోతులై యుగ్మవివాహము లాచరించు చుండుట యసంభవము కాదు.

వన్యదశలో నేసమాజమున పురుషునకు స్త్రీలకొఱత లేకుండెనో యప్పుడును స్త్రీల నపహరించి బలాత్కారముగ వారితో భోగించుట యసంభవము కాదు. వన్యదశలోని మనుష్యులకు పశువులకు మధ్య నెక్కుడు భేద ముండదు. పశువులలో పురుషపశువునకు స్త్రీపశువుల కొఱత యుండదు. అయినను నొక స్త్రీపశువుకొఱకు పురుషపశువు లెన్నో కలహించుట చూడనగును. స్త్రీనిమిత్తము జరుగు యుద్ధము

లలో బలహీనులు నశింతురు. యూథవివాహము లున్నను, నొక వన్యమానవపశువు కొండొక స్త్రీని తన వశములోనే యుంచుకొన దలచినపు డితరులతో నతడు కలహించును. వీలైనంతవర కాస్త్రీని తన వశమున నుంచుకొనును. యూథ దశకు చెందిన పురుషుడుకూడ వాసనావశుడై యొక స్త్రీపై బలాత్కారము చేయవచ్చు. కాబట్టి యుగ్మవివాహములు కారణముగా స్త్రీల నపహరించుటయు, క్రయవిక్రయము లారంభమగుటయు యుక్తిసిద్ధము కాదు. పశుదశలో నున్న మానవుడు కామవేగమునకు లోనయి కొండొక స్త్రీపై బలాత్కారము చేయడని కానీ, తనకోరిక కాటంకము కలి గించినవానితో కలహింపడని కానీ ఎంగల్సు, వారి యను యాయులు తప్ప మరియెవరును చెప్ప సాహసింపరు. వన్య మానవ సమాజములో సంవత్సరముల కొలది నివసించి, యభిమానమున నిట్లు పలుకువారు వన్యదశలోనున్న మానవ పశువుల మానస వికారములను బొత్తిగా తెలిసికొనజాలక పోయి రనక తప్పదు.

'అర్థ వన్యావస్థకు చెందిన మధ్యయుగమున చాల కాలము వరకు నాదిమ సామ్యవాది యగు పరివారము సమస్త మానవ సంఘమునందును కలదు.' (పరివారోత్పత్తి. పు. 56) అని ఎంగల్సు ప్రమాణ రహితముగా నుల్లేఖించి యున్నాడు.

ఇట్టి లేఖలను చదివి విభ్రాంతులై కొందఱు, వేద కాలపు టార్యుల సమాజమందును యూథవివాహ పద్ధతి యాచరణములో నున్నట్లు సిద్ధపరుప యత్నించుచున్నారు.

శ్రీపాద అమృతడాంగే యిట్లు చెప్పుచున్నారు: “ హిందువుల ప్రాచీన సమాజమున గల గోత్రము, వివాహ దృఢ సంబంధము నను నీ రెండును ‘ పూర్వమున యూథవివాహమునకు సంబంధించిన యవస్థ యొకటి యుండవచ్చును; దాని నాధారము చేసికొని వివాహ పద్ధతి వికసించియుండ వచ్చును. ’ అని ప్రమాణితము చేయుచున్నవి. కాని యీ యూథవివాహము దగ్గరబంధువులైన యొక్క వంశజులలో పరస్పరము వివాహము కానివిధమున నుండెను.” (భారత్ - పు. 83)

హిందువులలో సగోత్రవివాహము జరుగదు. స్మృతులన్నియు నొక్కుమ్మడిగ సగోత్ర వివాహమును నిషేధించినవి. ఈ నియమమును శ్రీ డాంగే యెఱుగును. కాని మొదట సగోత్ర వివాహములు జరిగినట్లు చెప్పుచున్నారు. మహాభారతమున నాదిపర్వమునందును, హరివంశము నందును బ్రహ్మనుండి కుటుంబోత్పత్తి యైనట్లు వర్ణింపబడినది. ఈ వర్ణనలనుబట్టి వారు సగోత్ర వివాహములను సిద్ధపరుచు చున్నారు.

ఇట నొక తత్త్వము ధ్యానమున నుంచుకొనవలెను. సగోత్ర వివాహముల యాభాసనైనను కలిగించు చిహ్నములు వేదమంత్రములలో నెక్కడను కానరావు. మహాభారతపు టాదిపర్వము నందును, హరివంశము నందును నయోనిజోత్పత్తి వర్ణింపబడినది. అన్నా చెల్లెండ్రలోను, పితా పుత్రికలలోను పతిపత్నీ భావము కూడదనుటకు ముఖ్యకారణము రక్తసంబంధ ముండుటయే. అయోనిజుల కొక శరీరముతో

సంబంధ ముండదు. కావున వాస్తవమున వారిలో పితా పుత్రికల భావముకానీ, అన్నాచెల్లెండ్ర భావముకానీ లేదు. అయోనిజు లయిన స్త్రీ పురుషుల నెవడో యొక పురుషు డుత్పన్నము చేసియున్నాడు. కావున నయోనిజులు పరస్పరము కలిసి సంతాన ముత్పన్నము చేయుటకానీ, యుత్పాదకునితో కలిసి సంతానోత్పాదన చేయుటకానీ, నిషిద్ధముకాదు. బ్రహ్మ వామపాదమునుండి పుట్టిన దక్షుడు దక్షిణపాదమున పుట్టిన కన్యను వివాహమాడెను. వారిరువురికి నరువది కన్య లుత్పన్నలైరి. దక్షునకు మరి యిరువురు సోదరు లుండిరి; మరీచి; ధర్ముడు. దక్షుని యరువది పుత్రికలలో పదిమందిని ధర్ముడు వివాహమాడెను. మరీచి పుత్రుడు కశ్యపుడు వారిలో పదముగ్గురిని వివాహమాడెను.

ఈ కథనుబట్టి దక్షుడు తన తోబుట్టువును, కశ్యపుడు తన పెదతండ్రి బిడ్డలను వివాహమాడి రని యెంచుట భ్రమ యగును. అయోనిజు లగుటచే వీరిలో నన్నాచెల్లెండ్ర భావము పారమార్థికము కాదు; ఆరోపించిన భావమే. ఈ యారోపిత సంబంధముల నాధారముచేసికొని సగోత్రవివాహములను సాధించుట యసంగతము. వాస్తవమున నంగుష్ఠాదులనుండి సంతానము కలుగుట యసంభవము. అందువలన దక్షాదు లయోనిజు లని యంగీకరింపవలెను. అయోనిజోత్పత్తి విశ్వసనీయముకాకున్న నంగుష్ఠాదులనుండి మనుష్యోత్పత్తి బొత్తిగా నంగీకరింపరాని దగును. ఈ తర్కము మహాభారతాదు లందలి లోకవిరుద్ధపు మానవోత్పత్తికి సంబంధించిన కథల కన్నిటికి వర్తించును. అసంభవగాథలుగా వానిని

సిద్ధపరుచును. అసంభవ దోషము నంగీకరించిన మీదట నా కథలనుబట్టి సగోత్ర వివాహముల నంగీకరించుట ప్రమాణ విరుద్ధ మగుచున్నది. దక్షాదుల యుత్పత్తి సంభవమైనను, లేక యసంభవమైనను నుభయ విధములలోను సగోత్ర వివాహము సిద్ధము కాదు.

ఎంగల్సు మున్నగువారి ననుసరించుచు శ్రీ డాంగే యి ట్లనుచున్నారు: "సమాజ సంగఠనములలో యౌన సంబంధములను నిషేధించుటకు తగిన వేరు వేరు శ్రేణులకు చెందిన వ్యక్తు లుండెడివారు కారు. కాని, యనియంత్రిత యౌనసంబంధము సంతాన ప్రగతికి హానికరమని సిద్ధపడినది. కావున మొట్టమొదట సంతానముతో మాతా పితలకు గల యౌనసంబంధము నిషేధింపబడినది. ఈ విధముగ సగోత్ర సపిండ కుటుంబముల యునికి యేర్పడినది. దీని ననుసరించి వివాహమున కాధారము తరము లైనవి. తాతలు, నాయ నమ్మలు నెల్లరు పరస్పరము పతి పత్నులు కాగలిగి యుండిరి. అట్లే వారి సంతానములు తమ తరములకు చెందినవారితో వివాహితులు కాగలిగిరి. వారు స్వయముగా మాతా పితలై యుండిరి. అట్లే అన్నా చెల్లెలు, పినతండ్రి పెత్తండ్రిబిడ్డలు, మేనమామల సంతానము పరస్పరము పతిపత్నులగుచుండిరి." (భారత్. పు. 82.)

పూర్వ ముల్లేఖించిన తర్కములను స్మరియింతు రేని శ్రీ డాంగేగారు చూపిన పశుతుల్య వ్యవహారము ఆటవిక దశలోనున్న మనుష్యులలో సంభవము కావచ్చునని తెలి యును. వేదము ననుగమించు సంస్కారవంతులగు నార్యుల

మనస్సులలో నిట్టి యాలోచనకూడ నంకురించి యుండదు. అన్ని యుగములలోను మర్యాదోల్లంఘనము జరిగి యుండ వచ్చు. అంతమాత్రమున మర్యాదయే లేదనరాదు. యమ యమీ సూక్తములోని తత్త్వము నిదివరకే ప్రదర్శించి యున్నాము.

వన్యదశలో నన్నా చెల్లెండ్ర యానసంబంధ నిషేధము రెండవ యవస్థ యనియు, ప్రప్రథమమున నన్నా చెల్లెండ్రలో యానసంబంధము నిషేధింపబడిన దనియు, నయ్యది మిక్కిలి కఠినకార్య మనియు, దీనిని తరువాతి వేద మంత్రములలోని యమయమీ సంవాదముద్వారా తెలిసికొన వచ్చు ననియు, యమి తన వివాహముద్వారా దేవత లీ సంబంధమును స్వీకరింతు రని సిద్ధపరచిన దనియు శ్రీ డాంగే చెప్పుచున్నారు. ఇంతటితో నాగక మరియు వారు, "ఈ సంవాదమునకు ఫల మేమైనది ? ఋగ్వేదములో నిది వ్రాయ బడి యున్నట్లు చూడము. కాని, యము డంతమున స్వీక రింప లేదని యంగీకరించినను, ప్రాచీన పరంపరకు విరుద్ధముగా కలపించుట యెంత కఠినమో సిద్ధమగుచున్నది." అని యేమో వ్రాసియున్నారు.

వన్యదశలోని మానవులకు తోడబుట్టిన వారితో యానసంబంధమును నిషేధించుట యెంత కఠినమైనను, యమయమీసూక్తమునందు దీని ఛాయయైనను కనిపింపదు. సూక్తమును బట్టి చూచిన దేవత లట్టి సంబంధమును చెడుగుగా నెంచిరి. కావుననే 'వరుణు డీ కార్యము వలన నప్రసన్నుడగు' నని యముడు చెప్పియుండెను. అంతమున

యము డస్వీకారమును దెలుపుటచే సంవాద ఫలము స్పష్టముగా తెలియుచునే యున్నది. పట్టపగటి వెలుతురులో వస్తువు కనబడకున్న నది వస్తుదోషమగునా? ప్రకాశ దోషమగునా? 'యమి కామవాసనావశయై యన్నను విచలితుని చేయ జూచినది; కాని యముడు ధర్మమును విడువడయ్యె' నని సంవాదము వలన సిద్ధమగుచునే యున్నది.

తైత్తిరీయ సంహితలోని "ఏష తేరుద్ర భాగః సహ స్వస్రాఽంబికయా సహ తం జుషస్వ" (1. 8. 6. 1). యీ వాక్యము ననుసరించి అన్నాచెల్లెండ్ర వివాహము వైదిక మని యందురు. ఈ వాక్యమున నంబిక రుద్రునికి తోబుట్టువుగా చెప్పబడినది. కాని, అంబిక రుద్రుని పత్నియని పురాణాదులు వర్ణించినవి. అందువలన చెల్లెలయిన యంబికను రుద్రుడు వివాహమాడినట్లు శంకింపనగును. కాని, యన్యగ్రంథము లన్నియు నంబికను రుద్రుని పత్నిగానే వర్ణించినవి కాని తోబుట్టువుగా చెప్పలేదు. తోబుట్టువువలె హితమొనర్చునది కావున నంబిక మంత్రవాక్యము నందు(స్వసా=తోబుట్టువు) స్వసృపదముచే పేర్కొనబడిన దని సాయణుడు వ్రాయుచున్నాడు. ఈ యర్థము నంగీకరించిన నంబిక తోబుట్టువు కాదు. రుద్రుడు తోడబుట్టినవాడును కాడు.

"శరద్వా అస్యాంబికా స్వసా" తై. బ్రా. 1-6. 10. అను తైత్తిరీయ బ్రాహ్మణ వాక్యమును బట్టి చూచిన శరదృతువు స్వసృపదముతో చెప్పబడినది. కాబట్టి యీ యర్థమునందు తోడబుట్టువుల వివాహమునకు సంబంధించిన శంకకు తావేలేదు.

ప్రసిద్ధులైన పాండవుల యుత్పత్తి గాథనుబట్టి ప్రాచీన వైదికులలో వివాహాచారము లేదందురు కొందఱు. పాండు రాజు రోగి. అతడు తన పత్నికి నియోగముతో సంతానము గను మని చెప్పెను. కుంతి యది యధర్మ మనగా నతడు 'పరపురుషుని ద్వారా సంతానము గనుట యధర్మము కాదు. ప్రాచీన కాలమున స్త్రీలు స్వతంత్రలై యుండిరి. వారు పతికంటె భిన్నుడైన పురుషునితో కలిసినను వారికి పాపము గలుగకుండెను. అప్పు డదియే ధర్మముగా నుండెను. తిర్యగ్యోనులకు చెందిన ప్రాణు లిప్పుడు నట్లే చేయుచున్నవి. ఉత్తర కురుదేశమునం దిప్పుడు నీ ధర్మము ప్రచారములో నున్నది. ఈ వివాహ మర్యాద తరువాత వచ్చినది. ఉద్దాలకు డను మహర్షి యొక డుండె నని వినుచున్నాము. అతనికి శ్వేతకేతు వని పుత్రు డుండెను. అతని తల్లి నొక మాటొక బ్రాహ్మణుడు చేయిబట్టుకొని 'పోదమురా' యని యతని తండ్రి యెదుటనే లాగినాడు. అప్పుడు శ్వేతకేతువు క్రుద్ధుడయ్యెను. అంతట తండ్రి కొమారుని వారించి 'ఇది సనాతన ధర్మము. కాబట్టి కోపింపకు. స్త్రీలకు బంధన మేమియులేదు. గోవులవలె స్త్రీలు స్వచ్ఛందలు.' అని చెప్పగా శ్వేతకేతు వా వ్యవహారము యుక్తము కాదని యెంచి 'నేటినుండి యే స్త్రీ యైనను భర్తను విడిచి యన్య పురుషునితో సంబంధము కలిగించుకొనిన మహాపాపము వాటిల్లును' అని మర్యాద నేర్పరచినాడు. అంతేకాక సుదాసుని పుత్రుడు కల్మాషపాదుడు తన పత్ని మదయంతికి వసిష్ఠునిద్వారా నియోగము చేయించి యున్నాడు. అందు

వలన నా మెకు అశ్మకు డను పేరుగల కుమారుడు పుట్టెను. మా జన్మము కూడా కృష్ణద్వైపాయనునిద్వారా కలిగిన దని నీ వెరుగుదువు కదా!' అనెను. అంతట కుంతి యంగీకరించి నియోగము ద్వారా సంతానము గనెను. ఇట్లు ప్రసిద్ధులైన పాండవులు కుంతీమాద్రులకు నియోగముద్వారా జనించిరి. (మ. భా. ఆది. 115 అ. 3 - 22).

ఈ వృత్త మంతయు మహాభారతమున నున్నది. భారతీయు లెల్లరు దీని నెరుగుదురు. శ్వేతకేతువు కథను జూచి ప్రాచీన విద్వాంసులకును శంక గలిగినది. అప్పయ్య దీక్షితులు బ్రహ్మసూత్రములలోని దేవతాధికరణములో ప్రసంగవశమున నిట్లు వ్రాసిరి: "మహాభారతమున శ్వేతకేతువు కథ కల్పితము. అది సత్యమైన యితిహాసము కాదు. శ్వేతకేతువుకాలమున వివాహమునకు, లేక పత్నీభావమునకు చెందిన వ్యవస్థ లేకున్న నతనికి క్రోధమే కలుగకుండ వలసినది. ఆ క్రోధమువలన నేకపత్నీభావ మనాది సిద్ధమని సూచింపబడుచున్నది. పాండురాజు నియోగముద్వారా సంతానము గనుటకు కుంతిని ప్రేరేపించుటకై యీ కథ నల్లియున్నాడు. ఇది యర్థవాదము. యథారమైన వర్ణన కాదు. (న్యాయరక్షామణి 1 - 3 - 31.)

దీక్షితులు వ్రాసిన ట్లది యంతయు కల్పితమే యగు నెడల శంకకు తావే లేదు. వేదమంత్రములలో పతిపత్నుల యవ్యభిచారమును గూర్చి యనేక పర్యాయము లుల్లేఖింపబడి యున్నది. వైదికులలో నిది యనాదిగా వచ్చుచున్నది; కొండొక కార్యమునందు ప్రవృత్తి కలిగించుటకు కథలను

కల్పించు స్వభావము ప్రాచీనులలో చూడనగును. ఒకానొక విహితకార్యమునందు ప్రవృత్తి కలిగించుటకు, నిషిద్ధకార్యమునుండి నివృత్తి కలిగించుటకును బ్రాహ్మణ గ్రంథములలో ననేకార్థవాదములు ప్రసిద్ధములై యున్నవి. అర్థవాదములలో బహువిధములైన కథలు వర్ణింపబడినవి. మీమాంసా దర్శన భాష్యమున నీ విషయము విస్తారముగా చెప్పబడినది.

మహాభారతకర్త యగు వ్యాస మహర్షి మంత్రగ్రంథములయు, బ్రాహ్మణ గ్రంథములయు ప్రవచనములు చేయుచుండెడివాడు. బ్రాహ్మణ గ్రంథముల యభ్యాస మధికముగా నుండుటచే కథాకల్పనలో బ్రాహ్మణముల శైలినే యత డనుకరించెను. కుమారిలభట్టపాదు లిట్లు చెప్పియున్నారు: "భారతాదుల వాక్యములను బ్రాహ్మణ గ్రంథములవలె వ్యాఖ్యానింపవలెను. నాలుగు వర్ణములవారికిని భారతము వినిపింపవలె నను విధి యున్నది. ధర్మార్థకామమోక్షములు, అధర్మము, అనర్థము, దుఃఖము, సంసారము ననువాని స్వరూపము, వాని సాధనజ్ఞానము, భారత శ్రవణమునకు ఫలము. జను లది విని ధర్మార్థములను సాధింతురు; అధర్మానర్థాదులను త్యజింతురు. దానధర్మము, రాజధర్మము, మోక్షధర్మమునకు చెందిన భారత వాక్యములు కొన్ని సాక్షా ద్విధివాక్యములు. కొన్ని యితిహాసరూపమున నర్థవాదములు. ఒకానొక వస్తువును స్తుతియించుటకో, లేక నిందించుటకో యా కథలు కల్పింపబడినవి. కావున నుపాఖ్యానములు యథార్థము లని భావింపరాదు. వేదముల నభ్యసించుటచే వాల్మీకి, వ్యాసాదులు తమ వాక్యములను వేద

శైలి ననుసరించి రచియించి యున్నారు. 'తల కొక బుద్ధి'యని జనుల బుద్ధు లనేక విధములు. అందువలన నిట్టి యుపాఖ్యాన ముల కల్పన యుచితమే. కొందఱు విధానవాక్యములతోనే గ్రహింపగలరు. మరికొంద అర్థవాదము, విధి రెంటిద్వారా గ్రహింపగలుగుదురు. అందునను కొందఱ కధికముగాను, కొందఱకు న్యూనముగాను నర్థవాదకల్పన యవసర మగును. మహాభారతాదు లెల్లరకు బోధింప యత్నించును. కావున ననేక విధముల నవి రచియింపబడినవి. ఈ గ్రంథములలోని విధినిషేధములు కొన్ని వేదమూలకములు; మరికొన్ని లోకమూలకములును. ధనము, సుఖము మున్నగు విషయ ములకు చెందిన విధినిషేధములు లోకమూలకములు. లోక వ్యవహారమును జూచి వాని రచన జరిగినది. మహాభారతా దులలో కొన్ని యర్థవాదములు నున్నవి. అందు కొన్ని వైదికములు; కొన్ని లౌకికములును. అన్నివిధములైన యర్థ వాదముల ప్రయోజనము స్తుతియే. విధివాక్యమున కంగ ములుకాని యర్థవాదములలో కొన్ని యానందము నుత్ప న్నము చేయుటకే యుపయోగించును. గంధమాదన పర్వతా దుల వర్ణన యిట్టిదే. యుద్ధవర్ణనలు వీరులు, ధీరులు నైన వారి మనస్సులలో నుత్సాహమును కల్పించును. అవి రాజుల కుపయోగించును. ప్రత్యక్ష ఫలము కనిపింపని వర్ణనలకు నదృష్టఫలము కల్పించుకొనవలెను. ఇట్టి వర్ణనలు కొండొక దేవతను స్తుతియించును. అందువలన కాలాంతరమున నీ జన్మముననో, మరియొక జన్మముననో ఫలము లభించును." (మీ. సూ. తం - వా. 1-2-7.)

బ్రాహ్మణ గ్రంథములలో ననేక స్థలములలో నసంభవము లగు కథలను కల్పించి యొక కార్యమునందు ప్రవృత్తి కలిగించుటయు, మరియొక కార్యమునుండి నివృత్తి కలిగించుటయు కలదు. శ్వేతకేతువు కథయు నిట్టిదే. దానిని సత్యమని యెంచి పురాతన యుగములందు వివాహ మర్యాదయే లేదనుట యంగీకరింపజనదు. వైదికగ్రంథములలో నసంభవకథ లున్నవనుట కొక యుదాహరణము నిట నుల్లేఖించు చున్నాము. దక్షిణగా వెండి నీయరాదని విధాన మున్నది. వెండిని దక్షిణలో నీయకుండుట కీ నిషేధము కల్పింపబడినది. "రుద్రు డొకమాటు రోదనము చేసెను. రోదనము చేయుటవలన నతనికి రుద్రు డని నామ మేర్పడెను. రోదనము చేసినపు డతని నేత్రములనుండి జారిన యశ్రువులు వెండి యయ్యెను. కావున వెండి దక్షిణగా నిచ్చువాని యింటిలో నొక సంవత్సరము ముందుగా నేడుపు ప్రారంభమగును." (తై. సం. 1-5-1. - 2-1-1. - 6-1-5.)

వాస్తవమున రుద్రు డేడ్చుటకానీ, యశ్రువులు వెండి యగుటకానీ యంతయు నసత్యమే. అంతేకాక వెండిని దక్షిణగా నిచ్చువాని యింట నొక సంవత్సరము ముందే రోదనము కలుగుటయు నబద్ధమే. ఇట్టి కథలు విని వెండిని దక్షిణగా నిచ్చుట మానుదు రని యెంచి చేసిన కల్పనయే. శబరస్వామి మీమాంసా భాష్యమున నిట్లే నుడివియున్నాడు. (మీ. సూ. భా. 1-2-10.)

ఒక్కొక్కెడ నర్థవాదములందు సత్యమైన ఘటనలు వర్ణించుటయు కలదు; కాని, వేదమునందలి సర్వామ్నా

విధులతో నా ఘటనలకు విరోధ ముండదు. వేదమున వివాహ మర్యాదకు చెందిన స్పష్టవిధాన మున్నది. శ్వేత కేతువు కథ వేదవిధులకు విరుద్ధముగా నున్నది. వేదము ప్రాచీన తమము. అనాదిగా నెన్నబడుచున్నది. దాని ననుసరించి వివాహ మర్యాద సృష్ట్యాదినుండి యున్నది. శ్వేత కేతువు కథ ననుసరించి చూచిన పౌరాణిక యుగమున స్త్రీ పురుషు లలో వివాహమర్యాద లేనట్లు కనిపించును. వేదముకంటె మహాభారత మతి నవీనము. అందువలన నందలి వేదవిరుద్ధ వచనములు, కథలు సత్యములు కాజాలవు.

అయినను శ్వేత కేతువు కథను పురాణయుగమునకు చెందిన సత్యేతిహాస మని యంగీకరించువారు కూడ పురాణ యుగపు మానవు లందరు వివాహమర్యాదారహితు లని ఋజువు చేయజాలరు. ఒకానొక కాలమున కొందఱు మాన వులు మర్యాదలేకయే స్త్రీలతో సంబంధ మేర్పరుచుకొని సంతానము గనుచుండవచ్చు. వారిలో తరువాత మర్యాద యేర్పడి యుండవచ్చు. కాని మర్యాద నెరుగనివారి కాల మందును గమ్యాగమ్య వివేకముగల మానవు లెందరో యుండి యుందురు. వన్యదశకు జెందిన మానవ పశువుల వ్యవహార మెంత పురాతనమైనను నది విచారశీలసమాజమున కుచితమని యెన్నడును సిద్ధము కాదు.

ద్రౌపది నాధారముగా తీసికొని పతి పత్నుల యేకనిష్ఠ వివాహము నవీన మని చెప్పబడుచున్నది; ద్రౌపది నిస్సందే హముగా పంచపాండవులకు పత్నిగా నుండెను. మహా భారతమున నీ ఘట్టముపై ననేకములయిన యూహాపోహలు

చేయబడినవి. 'అర్జునుడు నేడు విధిపూర్వకముగ ద్రౌపదీ పాణిగ్రహణము చేయు' నని ద్రుపదుడు యుధిష్ఠిరునితో ననగా యుధిష్ఠిరుడు తానుగూడ నామెను వివాహమాడ దలచినట్లు చెప్పెను. ద్రుపదు డందులకు 'నా పుత్రికను మీరే వివాహ మాడుడు; లేక మీ యిష్టము వచ్చిన వాడు వివాహ మాడుగాక' యని నుడివెను. అంతట యుధిష్ఠిరుడు 'రాజన్ ! ద్రౌపది మా కందఱకు పత్నియగును' అనెను. ద్రుపదు డది విని 'ఒకని కనేక పత్ను లుందురు; కాని యొక స్త్రీ కనేక పతు లుండు విధానము లేదు గదా!' యనెను. అందులకు యుధిష్ఠిరుడు 'ధర్మ గతి యతి సూక్ష్మ' మనెను. మరియు 'నా వచన మెన్నడు నసత్యము కాదు' అనియు ననెను. పాండవుల మాతయు భిక్షను పంచుకొని యనుభవింపు డనెను.

వారిలో నిట్లాలోచనలు జరుగుచుండగానే యటకు వ్యాసు డరుదెంచెను. అతడు ద్రుపదు నేకాంతమునకు గొనిపోయి 'మహాదేవుని శాపమువలన నింద్రులు పాండవులుగా నుత్పన్నులైరి. లక్ష్మి యా యింద్రులకు పత్నిగా నొనరింపబడెను. ద్రౌపది లక్ష్మియవతారము.' అని తెలిపెను. వ్యాసుని ప్రభావమువలన ద్రుపదుడు దివ్య చక్షువుతో చూడగా పాండవు లింద్రుల రూపమునను, ద్రౌపది లక్ష్మిరూపమునను గనిపించెను. వ్యాసుడు మరియొక కథయు వినిపించి యుండెను. 'ఒకానొక ఋషికన్య యుగ్ర తప మొనర్చి మహాదేవుని ప్రసన్నుని చేసెను. మహాదేవుడు ప్రత్యక్షుడై 'వరమడుగు'మన నామె పలుమారు గుణవంతు

కైన పతి కావలె నని కోరెను. శంకరు డందులకు బదులు 'నీకు నైదుగు రుత్తమపతులు లభింతు 'రనెను. ఆ ఋషి కన్యయే నీకు ద్రౌపదిగా జనించినది. ఈమె యైదుగురికి పత్ని యగును.' అనంతరము ద్రౌపది పాండవులకు పత్ని యైనది.

మహాభారతములోని యీ వర్ణనంబట్టి చూడ ద్రౌపది లక్ష్మి కావున నామె కైదుగురు పతు లయిరి. రెండవ కారణము వరదానము. కాని మహాభారతమున నొక్క వాక్యమైనను నా కాలమున నొక స్త్రీని పలువురు పురుషులు వివాహమాడు నాచార మున్నట్లు తెలుపునది లభింపదు. పైగా ద్రుపదుని వాక్యములనుబట్టి యట్టి వివాహము లోకవేద విరుద్ధ మనియు స్పష్టమగుచున్నది. యుధిష్ఠిరుడు మాత్రము పాండవుల కైదుగురకు ద్రౌపది పత్ని కావలె నని తన మనస్సు కోరుచున్నట్లు నుడివియున్నాడు. ఇంతేకాక పురాణములలో జటిల యను పేరు గల యొక ఋషికన్య వర్ణన చూడనగును. ఆమె యేడుగురు ఋషులతో సంబంధము కలిగి యుండెను. ఈ ప్రసంగము లన్నియు చదివినమీదట, 'వైదికార్యులలో నొక స్త్రీకి నొక పతియే యెల్లప్పుడు నుండెను; కాని, యప్పుడప్పు డీ మర్యాదకు భంగము కలుగుచుండె' నని మాత్రము స్పష్టమగుచున్నది. (మ. భా. 1-187-19.)

కుమారిలభట్టపాదులుకూడ నీ విషయమును గూర్చి యాలోచించి యున్నారు. వారి దృష్టిలో, "పాండవుల కైదుగురకు నొకే పత్ని యుండెను. ఈ విషయమున గలిగిన శంకకు

సమాధానము వ్యాసు డిట్లు చెప్పియున్నాడు. 'కృష్ణ-ద్రౌపది-యౌవనదశలో వేదిమధ్యమునుండి ప్రకటమైనది. ఆమె లక్ష్మి. అనేకు లుపభోగించినను నామె దూషిత కానేరదు. కావుననే రోజు లెన్ని గడచినను నామె కన్యగానే యుండెను. మానవస్త్రీలలో నిట్టి దశ యుండనేరదు. అందువలననే కృష్ణుడు కూడ కర్ణునితో 'నారవ దినమున ద్రౌపది నీ కడకు రాగల' దనెను. ద్రౌపది లక్ష్మియే కాక సాధారణ మానవ స్త్రీ యగు నెడల జనులకు ప్రమాణభూతు డగు కృష్ణభగవాను డట్లెందుకు పలుకును?'

లేక, ద్రౌపదు లనేకు లుండి యుందురు. వారి యందరి రూప మొక్కటిగా నుండియుండును. మిక్కిలి సామ్య ముండుటచే నొకే నామముతో నొక్కటిగా వ్యవహరించి యుండవచ్చును. భాషలో నిట్టి వ్యవహారమును గౌణ మందురు. లేక, ద్రౌపది యర్జునుని భార్యయే కాని, పాండవులలో భేదబుద్ధి లేనందున నా భావమును వెల్లడించుట కామె యైదుగురికి పత్ని యని యుండవచ్చు. ద్రౌపదిని సభలోని కీడ్చి తెచ్చినపు డామె దుర్యోధనాదుల నపకీర్తి పాలొనర్చుటకు వెంటనే యుధిష్ఠిరునీ యుపదేశము వలన రజస్వల వేషమును ధరించి యట్లు తనను ప్రకటించి యుండును. ఇందువలన నామె లక్ష్మి యవతారమని సిద్ధమగును. 'పాండవులలో నత్యంత ప్రేమ కలదు. వారిలో భేదబుద్ధి జనియింపజేయ ననువుకాదు.' అను నభిప్రాయముకూడ నీ విధముగ ప్రకటింపవచ్చును.'

రాగలోభాదుల వలన చేయబడిన వ్యవహారము ధర్మముగా నంగీకరింప జనదని ప్రాచీనాచార్యులు చెప్పి

యున్నారు. కావున నెవరేని మర్యాదకు విరుద్ధముగా నాచరించినంతమాత్రమున నది ధర్మముగా గ్రహింపరాదు.'' (పూ. మీ. తం. వా. 1. 3. 7. పు. 209).

భట్టపాదు లిట ముప్విధముల దోషమును పరిహరింప యత్నించి యున్నారు. మొదటి విధము: ద్రౌపది లక్ష్మి యొక్క యవతారము. అందువలన నైదుగురికి పత్నియగుటలో దోషము లేదు. కాని, లక్ష్మి శరీరధారిణి యైన చేతన దేవి యనియు, నామె యవతరింప గలదనియు నమ్మినవారే యీ సమాధానము నంగీకరింతురు. ఇందులకు ప్రమాణము - హేతువు - కావలె నను వారీ విషయమును సత్యమని నమ్మరు. భట్టపాదులు స్వయముగా శ్లోకవార్తికమునం దిట్లు నుడివి యున్నారు. ('ఏవముచ్యమానంతు శ్రద్ధధానేషు శోభతే.' శ్లో. వా. సూ. 2. 139.) భట్టపాదుల వచనానుసారము యుక్తులతో నిట్టి మతము సిద్ధము కాదు. సువర్ణ, రజతాది రూపమున లక్ష్మి యనేకులచెంత నున్న దోష ముండదు. కాని, మానవీరూపమున లక్ష్మి యైదుగురితో వర్తించిన నామె మర్యాదాభంగము చేసినట్లే యగును. 'ద్రౌపది లక్ష్మి కాకున్న వాసుదేవుడు కర్ణునకారవదినమున ద్రౌపది నీ చెంతనుండు నను నాశ యేల కల్పించును?' అను నీ భట్టపాదుల వచనములు వాసుదేవుని యందు వారికి గల శ్రద్ధాప్రయుక్తము లనక తప్పదు. వాస్తవమున యుద్ధమునందు మహాపురుషులు కూడ మర్యాద నుల్లంఘించుచుందురు. వాసుదేవుడు కూడ కర్ణునకు ద్రౌపది నెరగా చూపి యతనిని తమ పక్షమున చేర్చుకొన

గోరెను. రెండవ పరిహార విధములో ద్రౌపది యొక్క తె కాదనుటలో ప్రమాణ మేమియు లేదు. మహాభారతమున ననేక స్థలములందు ద్రౌపది యొక్క తెగానే ప్రయోగింప బడినది.

మూడవ పరిహారవిధమున ద్రౌపది యర్జునున కొక్క నికే పత్నిగా చెప్పబడెను. కాని యీ కల్పనయు మహా భారత స్పష్ట వచనములకు విరుద్ధ మనక తప్పదు. ద్రౌపది కేవల మర్జునునికే పత్నియైన ద్రుపదుని శంక, వ్యాసుని ప్రయత్నములు నన్నియు నసంగతము లగును. సోదరులలోని పారస్పరిక ప్రేమను వెల్లడించుటకు నైదుగురికి నొకే పత్ని యని ప్రసిద్ధమొనర్చుట మంచి యుపాయ మెన్నడును కానేరదు.

వాస్తవమున ద్రౌపదికి పతు లైదుగురే. అర్జునునితో నామెకు వివాహము కావలసి యుండెను. కాని యుధిష్ఠిరుని మనస్సు విచలితమై యుండెను. అతని హఠము వలన ద్రౌపదికి నైదుగురను వివాహ మాడవలసి వచ్చినది. మర్యాదకు విరుద్ధముగా తన కోరికను నెరవేర్చుకొనుటకు యుధిష్ఠిరుడు జటిలకు సంబంధించిన కథను కల్పించి యున్నాడు. అందువలన పంచపాండవులతో ద్రౌపదికి జరిగిన వివాహము మర్యాదను భంగపరుచుటయే యని యంగీకరించుటయే దీనికి పరిహారము. అది ధర్మము కాదు. రాగ, మోహ లోభాదులకు వశులై మానవీయు లాచరించు వ్యవహారమునుగూడ ధర్మమని యంగీకరింపరాదు.

భట్టపాదులుకూడ నంతమున నీ యాశయమునే సూచించి యున్నాడు. భట్టసోమేశ్వరుడు కూడ భట్టపాదుల యాశయ మిదియే యని యెంచుచున్నాడు. (న్యాయసుధా. పు. 194)

ఏది యెట్లైనను, ద్రౌపదిసమయమున గానీ, యంతకు పూర్వమునగానీ, యొక స్త్రీ ననేకులు వివాహమాడు నాచారము ప్రచారములో లేదు. ద్రౌపదీవివాహము నాధారముచేసికొని 'ప్రాచీన వైదికులలో యూథవివాహములు జరుగుచుండె'నని శ్రీ డాంగే చేయు కల్పన నిరాధార మనక తప్పదు. (భారత్ పు. 87)

మహాభారతమున గణములయు, గణరాజ్యములయు వర్ణన గలదు. అందువలన శ్రీ డాంగే యార్యుల ప్రాచీన సమాజమునందు సగోత్రవివాహము ప్రచారములో నున్నట్లు చెప్పుచున్నారు. "ఆర్యులకు గణజన మనినను, గోత్ర మనినను నొక్కటియే. అవి వారి యార్థిక, వైవాహిక సంబంధముల కాధారములు. గణమునకు చెందిన యార్థికత, యొకే కులపు సదస్యుల యార్థికతయై యుండెను. కులసదస్యులందరు నొకే సామాన్య - సామూహిక - అర్థవ్యవస్థలో నుండెడివారు. సామ్యసంఘము - గణము - నకు వెలుపల నుండువా రెల్లరు శత్రువులే. వారు సామ్యసంఘమున సదస్యులు కాజాలరు. యజ్ఞపద్ధతిలో భాగస్వాములు కాజాలరు. యజ్ఞక్రియలలో భాగస్వామి కానివాడు విదేశి యగుచుండెను. అట్టివానిని నాశము జేయుటయు, వాని సంపదను వశపరుచుకొనుటయు ననుచితము కాకుండెను.

సర్వము గోత్రమే యై యుండెను. కావున జీవనము, జీవిక రెంటి నుత్పన్నము చేయుటకు గోత్రమే సీమయు, నాధారము నై యుండెను. అందువలన గోత్రములోనే వివాహము కాగలిగి యుండెను. ప్రాచీనార్యులు యజ్ఞపద్ధతిలో బద్ధులై యుండు సామాజిక ప్రాణులు; వారు గోత్రమునకుగానీ, లేక యగ్నికిగానీ వెలుపల వివాహము చేసికొను విషయము మనసునందును తేలేకుండిరి. వన్యము, నర్ధవన్యము నగు దశలలో నార్యులు శతాబ్దముల పర్యంతము గడపిన జీవనముల యనుభవముద్వారాను, నిరీక్షణలద్వారాను సగోత్ర వివాహములు, సపిండవివాహములు గణవికాసమున కహితకరములనియు, సమీపబంధువులలో యౌనసంబంధ మున్న నీ సమస్య పరిష్కరింప బడదనియు గుర్తించి యుందురు. నేడు మనలో నున్న వంశబంధువుల మధ్య వివాహము చేసికొనకుండు నాచారము వికసించుటకు చరిత్రలో వేలకొలది వత్సరములు గతించి యుండును. ఆదిమావస్థలో నార్యులు తమతమ గోత్రములందే వివాహ మాడుచుండిరి. తరువాత సగోత్ర వివాహమును నిషేధించి యుందురు. ఆర్యులలో జనసంఖ్య పెరిగి భిన్నభిన్న క్షేత్రములలో వ్యాపించు రోజులలోను, వారి జ్ఞానసీమ, ఆర్థికస్థితి విస్తారమైనపు డీ నిషేధము సంభవించి యుండును.'' (భారత్. పు. 74.)

యజ్ఞము నాచరించు నార్యులు వన్యు లనియు నర్థవన్యు లనియు నెంచుటచే నీ భ్రమ యంతయు డాంగేగారికి కలిగినది. వాస్తవమున యజ్ఞ మొక గంభీర జ్ఞానము. దీనిలో భిన్న భిన్న సమయములలో వికారములు వచ్చిన మాటయు

నిజమే. కాని వాస్తవమున యజ్ఞరూపము నిర్మలము. ప్రాచీనార్యులు వన్యదశకు గాని, యర్ధవన్యదశకు గాని చెందినవారు కారు. డార్విన్, మార్క్సు మున్నగువారి తర్క విరుద్ధములగు ననేక విషయములను నమ్మి చెప్పిన దంతయు ప్రామాణికము కానేరదు. ప్రాచీన గణముల కుల మొక్కటే యైయుండెను. మహాభారత మిందులకు ప్రమాణము. (మ. భా. శాం. 107-30.) కాని, వారు తమ కుల-గోత్రములలో వివాహమాడుచుండి రనుటకు ప్రమాణము లేదు. గణ సదస్యులు భిన్నకులమువారిని శత్రువులుగా నెంచి రనుటయు సరికాదు. యజ్ఞము సమస్త ప్రపంచమునకు శుభము చేకూర్చునది. సమాజముద్వారా లాభము నొంది యజ్ఞముద్వారా సమాజమునకు హితము చేయనివానిని స్వార్థియైనందున నిందించెడివారు. యజ్ఞ ప్రతిపాదక వాక్యములలో నొక్క వాక్యము కూడ భిన్నకులజుని చంపి, యతని సంపదను వశపరచుకొనుట యుచిత మని చెప్పదు. ఎవరేని కొందఱు వన్యదశలోను, నర్ధవన్యదశలోను గమ్యాగమ్య వివేకములేక చరించి యుండవచ్చును. అట్టివారు నేటి సమాజమునను నున్నారు. కాని వైదికులైన యార్యులను వన్యదశకు చెందినవా రనుట సర్వవిధముల ప్రమాణ శూన్యము.

ఇట నొకవిషయ మెన్నడు మరువరాదు. వైదికులు గమ్యాగమ్య వివేకవిషయమున ముఖ్యముగ రెండు విషయములు గమనించెడివారు. ఒకటి గోత్రము; రెండవది పిండము. గోత్రము సమానమైనపుడు వివాహము కాజాలదు. స్మృతులన్నియు నీ విషయమున నేకమతమునే వెల్లడించుచున్నవి.

పిండ మొక్కటియైనను స్మృతులు వివాహమును నిషేధించు చున్నవి. పిండసామ్య మెంతవరకను విషయమున భిన్న మతము లున్నవి. ఒక మూలపురుషుని శరీరముతో సంబంధ మున్నచో పిండము సమాన మగును. మూలపురుషుని పరంపరలో నేడవ పురుషుని యనంతరమునను సపిండత యుండును. నూరవవాడుకూడ సపిండుడు కావచ్చును. స్మృతులు మాత్రము మూలపురుషునినుండి యేడవ పురుషునివరకు సపిండత నంగీకరించును. వధూవరుల తండ్రులు మూలపురుషునికి నేడవవా రగుదురేని వారిలో సపిండత యుండదు. ఆ వధూవరులకు వివాహము కావచ్చును. వధూవరుల మాత మూలపూరుషున కైదవతరమునకు చెందినదియైన వారిలో సపిండత యుండదు. తండ్రి ద్వారా ప్రాప్తమగు సపిండత యేడవ పురుషుని వరకు, తల్లి ద్వారా ప్రాప్తమగు సపిండత యైదవతరము వరకు నుండును.

స్మృతులలో తఱచుగ సపిండత యిట్లే చెప్పబడినది. కాని, కొన్ని వాక్యములలో నీ హద్దు సంకోచింపబడియు నున్నది. మనువు, యాజ్ఞవల్క్యుడు మున్నగువారి ప్రామాణిక స్మృతులలో నుపర్యుక్త సపిండతకు సంకోచము కానరాదు. కాని నిబంధ గ్రంథములలో కొన్ని వచనము లున్నవి. వానిలో మూలపురుషుని నుండి యేడవ, ఆరవ, యైదవ, నాలుగవ, మూడవ తరపు కన్యను వివాహమాడ వచ్చునను విధాన మున్నది. భారతదేశపు కొన్ని ప్రాంతములలో సపిండతను సంకోచింపజేసి వివాహమాడు నాచారములు లేకపోలేదు. అట్టి వివాహములను కొందఱు గ్రంథ

కర్త లనుచిత మందురు. దక్షిణ ప్రాంతమున మేనమామ బిడ్డను వైదికులు కూడ వివాహమాడుదురు. దాక్షిణాత్య విద్వాంసు లనేకు లీ వివాహము వేదానుకూలమని సిద్ధపరుప యత్నించిరి. వారు మంత్రమును, బ్రాహ్మణమును ప్రమాణీకరింతురు.

మంత్రము :

"తృప్తాం జ హుర్మాతుల స్యేవ యోషా
భాగ స్తే పైతృష్వసేయీ వపామివ"

శతపథ బ్రాహ్మణము :

"తస్మాదు సమానాదేవ పురుషా దత్తాచాద్యశ్చ
జాయేతే ఇదంహి చతుర్థే పురుషే, తృతీయే
సంగచ్ఛామహ ఇతి" [1-8-3-6]

అర్జునుడు సుభద్రను, శ్రీకృష్ణుడు రుక్మిణిని వివాహమాడుట, మేనమామ పుత్రికను వివాహమాడుట యుచితమని తెలుపును. కాని కుమారిలభట్టు ఇట్లనుచున్నాడు: "వాస్తవమున సుభద్ర యర్జునిని మామయగు వసుదేవుని పుత్రిక కాదు. సుభద్ర వాసుదేవుని తోబుట్టువుగా చెప్పబడుచున్నది. కాని, యామె సొంత చెల్లెలు కాదు. వాసుదేవుని సవతి తల్లి రోహిణి. ఆమె కొక తోబుట్టు వుండెడిది. సుభద్ర యామె కూతురు. లేక, రోహిణి తండ్రి కొక తోబుట్టు వుండెను. సుభద్ర యామె పుత్రికయై యుండెను. ఈ విధముగ నీసంబంధమున వ్యవధాన ముండుటచే దోషముండదు. రుక్మిణీ వివాహము నిట్టిదియే. సుభద్ర వసుదేవుని శరీరమునుండి యుత్పన్నయై యున్న, నామెతో

నర్జునుని వివాహము వాసుదేవు డుచిత మని యెంచి యుండడు. "అర్జున! మనుష్యులు నామార్గము ననుస రింతురు, శ్రేష్ఠు లాచరించునదియే సాధారణ జను లాచ రింతురు. మహాపురుషుని ప్రమాణముగా నెంచి యతని ననుగమింతురు." అని చెప్పు వాసుదేవుడు విరుద్ధాచరణ మెట్లు చేయగలడు!" (తంత్రవార్త్తికము 1 - 3.7)

ఇట సుభద్రా సంబంధము దూరపు సంబంధ మని సిద్ధ పరచుటకు భట్టపాదులు చేసిన కల్పనలకు ప్రమాణము శూన్యము. మాతులపుత్రికతో వాసుదేవుని సంబంధము శాస్త్రానుకూల మని యంగీకరింతుమేని యాచారమునకు విరోధ ముండదు. తంత్రవార్త్తికమునకు వ్యాఖ్య నొనర్చిన భట్టసోమేశ్వరుడు కుమారిలభట్టునకు విరుద్ధముగా మాతుల పుత్రికతో వివాహ ముచిత మని సిద్ధపరచి యున్నాడు. అతని దృష్టిలో స్మృతులకంటె మంత్రబ్రాహ్మణములు ప్రబలములు. 'మంత్రబ్రాహ్మణములందు మాతులకన్యావివాహము ప్రతి పాదింపబడి యున్నది. కావున నిషేధమొనర్చు స్మృతుల నుపేక్షింపవలెను.' (న్యాయసుధ. 3 - 3 - 14)

ఇం దేపక్షము యుక్తమైనను ప్రాచీనకాలమున కొందఱు మాతులకన్యను వివాహమాడుచుండుటయు, కొంద ఱట్లాచరింపకుండుటయు కలదని తెలియుచున్నది. అక్కచెల్లెండ్రను వివాహమాడుట వర్జితమై యుండెను. మాతులకన్యను తక్క వైదికులు గోత్రముకానీ, పిండము కానీ కలిసినచోట వివాహమాడెడివారు కారు.

నియోగమును నిమిత్తముగా తీసికొని కొందర లేకనిష్ఠ వివాహము నాక్షేపించుచున్నారు. పతి యొకానొక కారణము వలన సంతానోత్పాదన కసమర్థుడైనను, పతి మరణించినను, స్మృతులు స్త్రీకి నియోగముద్వారా సంతానోత్పాదన కవకాశ మిచ్చుచున్నవి. నియోగ మొనర్చిన పిదప స్త్రీకి భర్తతో నవిచ్ఛిన్న సంబంధ ముండునను మాట నిస్సందిగ్ధమే. మరియు స్మృతులు నియోగము నుత్తమధర్మముగా ప్రతిపాదింపవు. పై రెండు స్థితులలోను స్త్రీ సంయమపూర్వకముగ నుండుటయే యుత్కృష్టధర్మ మగును. నియోగము సాధారణ ధర్మము కాదు. అది యాపద్ధర్మము. సాధారణ దశలో స్త్రీ పతిని విడిచి యన్యుని తలంపనైన తలంపదు. ఆపద్ధర్మము సామాన్యరూపమున నాచరింపబడదు. స్మృతులాకలిగొన్నవానికి చౌర్యముకూడ విధించును. కాని యీ విధినిబట్టి పూర్వమున నెల్లరు చౌర్యము నుచితముగా నెంచిరని కానీ, యెల్లరు చౌర్య మొనర్చుచుండెడివారని కానీ యూహించుట బుద్ధిమత్త కాదు.

మొదటి వైదిక యుగమునందును నియోగము నెల్లరకు విధించి యుండలేదు. మనువు, 'వివాహ మంత్రములలో నియోగ వర్ణనము లేదు. బ్రాహ్మణులు దీనిని పశుధర్మమందురు. వేనరాజునాటినుండి యిది ప్రచారమున నున్నది' అనుచున్నాడు. (మ. 9-65.) యాజ్ఞవల్క్య స్మృతి వ్యాఖ్యాకారుడైన విశ్వరూపాచార్యుడు 'నియోగము శూద్రులకే' యనుచున్నాడు.' (యా. స్మృ. 1-69). ఈ పక్షమే యుచితము. వేదమునందుగల 'దేవరునికి విధవా స్త్రీ సేవ చేయ

వచ్చును’ అను విధానము శూద్రాభిప్రాయముతో చెప్ప బడిన దని యెఱుంగవలెను.

వివాహ మంత్రములు మాటిమాటికి పతిపత్నుల ప్రేమ నవ్యభిచారిగా వర్ణించుచున్నవి. కాని, వైదికార్యు లలో పురుషులు స్త్రీలవలె నేకనిష్ఠులు మాత్రము కారు. పురుషులలో కొందఱు విశేషముగా ధనికులు బహు వివా హము లాడుచుండిరి. కాని స్త్రీలు, ముఖ్యముగా కులీన వనితలు, పతివ్రతలు, నేకనిష్ఠులునై యుండిరి.

వేదము ననుసరించి చూచిన ప్రాచీనతమయుగముల లోను గమ్యాగమ్య వ్యవస్థ యుండి యుండెను. అవైదిక మతముల ననుసరించి చూచిన నేటివలె ప్రాచీన కాలమున వివాహవ్యవస్థ లేకుండె నని తెలియును. జైనబౌద్ధమతములు వేదములను ప్రమాణముగా నంగీకరింపవు. జైనమత దృష్టిలో నత్యంత ప్రాచీనకాలమునందు పదార్థముల విస్తృత జ్ఞానము లేకుండెను. జైనమతమున ప్రపంచము నిత్యము; ప్రవాహరూపమున నెల్లపుడు నడుచుచుండును. ప్రపంచ మున రెండు రకముల కాల ముండును. ఒకటి యుత్సర్పిణీ కాలము; రెండవది యవసర్పిణీకాలము. ప్రతిదానికి నారు భాగము లుండును. అవి యర లనబడును. ‘దశ కోటాకోటి సాగరోపమ’ వరకు ఉత్సర్పిణీకాల ముండును. అవ సర్పిణియు నింతటి పరిమాణము కలదియే. ఒక్క సాగరోపమ యసంఖ్యాత సంవత్సరము లగును. ఉత్సర్పిణి, యవసర్పిణి కలిసి యొక కాలచక్ర మగును. ఇట్టివి యనంత కాల చక్ర ములు గతించినవి. అనంతము రానున్నవి.

అవసర్పిణీయొక్క మొదటి యర యేకాంతసుషమ మనబడును. ఇది నాలుగు కోటాకోటి సాగరోపమకాల ముండును. ఈ కాలమున భరతక్షేత్రము - భరతభూమి - మిక్కిలి సుందరముగా నుండును. మనుజులు చాల మంచి వారుగా నుందురు. రాగద్వేషములు, కామక్రోధములు నల్పముగా నుండును. శరీరము రోగరహితముగా నుండును. దశవిధము లగు కల్పవృక్షముల ద్వారా యన్నవస్త్రాదులు లభించును. కొన్ని మద్య మిచ్చును, కొన్ని పాత్రల నిచ్చును. కొన్ని వాద్యములను మ్రోయించును, కొన్ని ప్రకాశము నిచ్చును. కొన్ని వస్త్రములను, మరికొన్ని ఖాద్యములను నిచ్చును. కొన్ని యిండ్లను నిర్మించును. ఈ కల్పవృక్షముల వలన కష్టము లేక యన్నివస్తువులు లభించెడివి. భూమి చక్కెరవలె తియ్యగా నుండెను. మనుష్యుల యాయువు మూడు పల్యములు. శరీరము మూడు గవ్యూతుల యెత్తుం డెను. నాలుగవ దినమున భోజనము చేయుచుండిరి.

మొదటి యర సమాప్తముకా నారంభించినవు డాయువు మున్నగునవి తక్కువ యగును. కల్పవృక్షముల ప్రభావము క్షీణించును. రెండవ యరలో మానవుడు రెండు పల్యములవరకే జీవించును. రెండు గవ్యూతుల యెత్తు శరీరము లుండును. మూడవ దినము భోజనము చేయుదురు. పృథివిలోను, జలములోను మాధుర్యము తగ్గును. ఇట్లే మూడు నాలు గైదు అరలలో నన్నింటియందును క్షీణత యేర్పడును. ఆరవ యరవరకు హ్రాసము. తరువాత నుత్స ర్పిణీ కాల మారంభ మగును. దీనియం దరలు నవసర్పిణికి

విపరీత క్రమములో నుండును. పంద్రెం డరలు గల యీ కాలచక్రము భరత, ఐరావత క్షేత్రములలో తిరుగుచుండును. ఈ కాలచక్ర కారణమున యుగయుగమునందు వ్యవస్థలు మారుచుండును. కాని యీ కాలచక్రము మహావిదేహ క్షేత్రమున నుండదు. మొదటి మూ డరలలో అన్నా చెల్లెండ్రు యుగళరూపమున జనింతురు. యువకులైన తరువాత వారు పతిపత్ను లగుదురు. యుగళధర్మము గల స్త్రీ పురుషులయాయు వారు మాసములు మిగిలియున్నపుడు వారినుండి అన్నా చెల్లెండ్ర యుగళము జనించును. ఆరు మాసము లా యుగళమును పోషించి వారు పరలోకగతు లగుదురు.

మూడవ యర యంతమున భరతక్షేత్రపు దక్షిణ ఖండమునందు సాగరుడు, ప్రియదర్శన యను యుగళము అన్నా చెల్లెండ్ర రూపమున నుత్పన్నమయ్యెను. ప్రియదర్శనుడు విమల మను పేరుగల గజము నెక్కి తిరుగుచుండెడివాడు. కావున నితరయుగళము లతనిని విమలవాహను డనెను. ఇతని కాలమున యుగళములకు కల్పవృక్షముల మీద మమత యేర్పడెను. అంతకు పూర్వపు యుగళములలో రాగద్వేషములు లేకుండెను. రాగమువలన యుగళములలో జగడములు కలుగసాగెను. ఆ కలహములు తీర్చుటకు విమలవాహనుని స్వామిగా చేసికొనిరి. ఆ కాలమున నెవడేని యన్యుని కల్పవృక్షపు కోరికవలన మర్యాదను భంగపరచిన నతనిని దండించుటకు విమలవాహనుడు హాకార నీతిని ప్రకటించెను. యుగళములకు 'హా! మీరు మిక్కిలి

చెడ్డపనిచేసిరి' అని చెప్పినపుడు, ఆ యుగళములు 'దండాదులతో ప్రహరించుట మంచిది కాని, యీ హాకారము ద్వారా తిరస్కరింపబడుట మంచిది కా'దని యెంచుచుండిరి. విమలవాహానునకు చంద్రయశ యను పేరుగల పత్నియందు చక్షుష్మాన్, చంద్రకాంత యను పేరుగల యుగళ ముత్పన్నమైనది. అంతిమకాలమున వీరివలన యశస్వి, సురూపనామక యుగళము జనించెను. యశస్వి శాసనకాలమున యుగళములు హాకారము నుపేక్షింప దొడగిరి. అప్పుడు వారిని దండించుటకు మాకార దండన రచియించెను. అతడు హాకార, మాకార నీతులను రెంటిని నుపయోగించెడి వాడు. ఆ యిద్దరివలన మధిచంద్రుడు, ప్రతిరూప యను పేర్లుగల యుగళము జనించెను. వారికి పుట్టిన యుగళము ప్రసేనజిత్, చక్షుష్కాంత యనబడిరి. వీరికాలమున హాకార, మాకార నీతు లుల్లంఘింపబడెను. అప్పుడు ప్రసేనజిత్ ధిక్కార దండన చేసెను. ఆయుగళమునుండి మరుదేవుడు, శ్రీకాంత యను యుగళము బుట్టెను. వారికి నాభి, మరుదేవి జనించిరి. ఆ యుగళమునకు బుట్టిన పురుషుడు జినుడు. ఇతడే యాది తీర్థంకరుడు. ఇతని జన్మకు దేవతలు గొప్ప యుత్సవము చేసిరి. ఇంద్రుడు స్వయముగ, 'భగవన్! నీకు ప్రణామము. భరతక్షేత్రపు మానవుల కింతవరకు నెవడును మోక్షమార్గమును ప్రదర్శింపలేదు. సమయము వచ్చినపుడు మీరు ప్రకటింతురు.' అనెను.

మరుదేవి పుత్రుని గనుటకు పూర్వము పదునాలుగు స్వప్నములు కనెను. మొదటి కలలో నెద్దు కనిపించినది.

పుత్రుని యూరువునందా మెద్దు గుర్తున్నది. అందువలన తల్లిదండ్రులు తమ పుత్రునకు ఋషభు డనియు, పుత్రికకు సుమంగల యనియు నామము లుంచిరి. ఈ సమయమున నిద్ద రన్నాచెల్లెండ్రు ఒక తాళవృక్షముక్రింద నాడుకొను చుండిరి. తాటిఫలము పడి పిల్లవాడు మరణించెను. అప్పుడు నాభి ఋషభునకిచ్చి వివాహ మొనర్చుట కా బాలికను తన చెంతకు తీసికొనెను. యువకుడైన పిదప ఋషభు డా యిద్దరి కన్యలను వివాహ మాడెను. సుమంగల యతని తోబుట్టువే. రెండవకన్య పేరు సునంద. ఈ యుగళ కాల మున వివాహవిధి లేకుండెను. కాబట్టి ఋషభుని వివాహము నందు ఇంద్రుడు పురుషకార్యమును, ఇంద్రాణి స్త్రీలకార్య మును నిర్వహించిరి. ఋషభ దేవుడు విషయసుఖము లనుభ వించుచు ఆరు లక్షల పూర్వవర్షములు గతించిన మీదట సుమంగలకు భరతుడు కుమారుడు, బ్రాహ్మి కుమార్తెయు నుద్భవించిరి. అప్పటి మానవులు హాకార, మాకార, ధిక్కారములను మూడు దండనల నుపేక్షింపసాగిరి. యుగళ ములు ఋషభుని సమీపించి, 'ఇప్పుడు జనులు దండన భయము లేనివారైరి.' అనిరి. దండించుటకు రాజుగా నొక డుండవలెనని ఋషభు డనెను. అంతట వారు మా కొక రాజు కావలెననిరి. ఋషభుడు వారిని నాభికడ కంపగా నతడు ఋషభునే రాజుగా చేసెను.

ఋషభుని వివాహానంతరము జనులలో వివాహ విధి జరుగ జొచ్చెను. అయోధ్యలో ఋషభునకు రాజ్యము చేయుచు కొంతకాలము గతించినది. కొంతకాలమునకు

తమపరి కల్పవృక్షములు నష్టమయ్యెను. జనులు కందమూల ఫలములను తినజొచ్చిరి. వడ్లు, గోదుమలు, సెనగలు తృణములవలె నుత్పన్నము లగుచుండెను. వానిని పక్వము చేయకయే తిన నారంభించిరి. వానిని జీర్ణింపజేసికొనలేక పోగా ఋషభుడు వానిని చేతితో నలిపి, నీటిలో నానవేసి, ఆకులమీదనుంచి తినుడని యాజ్ఞాపించెను. అయినను అన్నము జీర్ణము కాదయ్యె. రాజు వాని నెండబెట్టి తినుడనెను. అయినను జీర్ణముకానందున జనులకు పీడ గలుగుచుండెను.

ఈ రోజులలోనే శాఖల పరస్పర ఘర్షణవలన నగ్ని యుత్పన్న మయ్యెను. దానిని ప్రకాశించు రత్న మని పట్టుకొన జనులు పరువిడిరి. అగ్నిని స్పృశించినపుడు కాలుటచే భయపడి 'ప్రభూ! అద్భుతమగు క్రొత్త భూత మొకటి ప్రకటమైనది' యని ప్రభువుతో చెప్పిరి. 'నేటిసమయము రూక్షము, స్నేహయుక్త మగుటచే నగ్ని యుత్పన్న మైనది; అత్యంత రూక్షము, అత్యంత స్నేహయుక్తము నైన సమయమందు అగ్ని జనింపదు. అగ్నిసమీపమున నిలబడి గడ్డిని తొలగింపుడు. తరువాత నగ్నిని పట్టుకొని గోధూమాదుల నగ్నిలో కాల్చి తినుడు' అని చెప్పెను. జను లమాయకులు. గోధూమాదుల నగ్నిలో వైచిరి. కాలిపోయినందున వానిని వారు వెలుపలికి తీయజాలక పోయిరి. అప్పుడు ఋషభదేవుడు మట్టిపాత్రల నొనరించెను. ఇట్టి పాత్రలను చేసి యగ్నిలో కాల్చుడని చెప్పెను. తరువాత నా పాత్రలలో గోధూమాదుల

నుంచి యుడికించి తిను డనెను. జను లతడు చెప్పినట్లు చేయ నారంభించిరి. అప్పటినుండి కుమ్మరి యేర్పడెను. తరువాత వడ్రంగి, కమ్మరి, నేతగాడు, చిత్రకారుడు, మంగలి అను నైదుగురు శిల్పులను మహారాజు నిర్మించెను. వారినుండి యనేకులైరి. లోకుల జీవిక కొఱకు కృషి, వ్యాపారాదుల నుపదేశించెను. ఋషభుడిట్లు భరతునకు డెబ్బదిరెండు కళల నుపదేశించెను. భరతు డితర సోదరులకు చదువు జెప్పెను. కొలతలు తూనికలు నన్నియు ఋషభుడే నడిపెను. జంబూ ద్వీప ప్రజ్ఞప్తి మున్నగు గ్రంథములలో నీ సమస్త చరిత్రము విస్తారముగ వర్ణింపబడి యున్నది. హేమచంద్రాచార్యుడు దీని సరసవర్ణనము త్రిషష్టిశలాకాపురుషచరిత్రపు రెండవ సర్గలో చేసియున్నాడు.

ఈ వర్ణనంబట్టి చూడ మొదట నన్నాచెల్లెండ్ర వివాహము ప్రచారములో నున్నట్లు తెలియును. అంతేకాక జను లజ్ఞానులుగా నుండిరి. అగ్నిని గూడ వారెరుగరు. ఈ యంశములలో జైనచరిత్రము వికాసవాదుల మతముతో నేకీభవించుచున్నది. కాని భేదముకూడ మిక్కిలిగా నున్నది. పై చరిత్రను బట్టి చూచిన మాతాపుత్రులకు తండ్రి కూతురులకు మధ్య యౌనసంబంధ మున్నట్లు కానీ, వివాహము జరిగినట్లు కానీ కానరాదు. యూథవివాహ ములును కానరావు. సహోదర వివాహము మాత్రము జైనుల ప్రాచీన చరిత్ర స్పష్టముగా నంగీకరించుచున్నది. నాటి ధర్మము యుగళధర్మ మనబడెను. నేటి వ్యవస్థ ఋషభ దేవునినాటినుండి ప్రచారములో నున్నట్లు తెలియుచున్నది.

ఋషభుడు భరతుని తో బుట్టిన బ్రాహ్మిని బాహుబలి కిచ్చి వివాహ మొనర్చి యుండెను. నాటినుండియు నేకోదరోత్పన్నులలో పరస్పర వివాహము నిలిచిపోయెను.

ఇట ధ్యానమున నుంచుకొనదగిన దేమన : జైనమతమునను త్సర్పిణి, యవసర్పిణి కాలవ్యవహారము భరత, ఐరావత క్షేత్రములందే జరుగుచుండెను. మహావిదేహ క్షేత్రమున నిట్టి కాలము లేదు. అట యుగళధర్మ మెన్నడును లేకుండెను. అక్కడి జనులు జైనశాస్త్రము ననుసరించియే వ్యవహరించిరి. జైనాగమముల ననుసరించి చూచిన ఎంగెల్సు మున్నగువారికి విరుద్ధముగా నొక విషయము సిద్ధమగును. ప్రాచీన యుగమున గమ్యాగమ్య విచారము లేనప్పుడు జనులు మూర్ఖులుగా నుండిరి. జైనాగమముల ననుసరించి భరతాది క్షేత్రములలో యుగళధర్మ మాచరణలో నున్నపుడుకూడ మహావిదేహాది క్షేత్రములందు వివాహములు గమ్యాగమ్య వివేకపూర్వకముగ జరుగుచుండెడివి.

ఉపర్యుక్తవర్ణన మంతయు జైనాగమములకు చెంది యున్నది. ఇందలి ప్రత్యంశము తర్కసిద్ధము కాదు. కల్పవృక్షములు, వానివలన భోగభాగ్యములు లభించుట మున్నగునవి శ్రద్ధావిషయములు. ఉత్సర్పిణి మున్నగు కాలచక్రము, దాని గతియు తర్కసిద్ధము కాదు. అప్పటి మానవు లందరు మూఢులుగానే యుండిరనుటకు ప్రమాణము సున్న. డార్విన్, మార్క్సు మున్నగువారి దృష్టిలో నీ వాద మంతయు నసంభవదోషదూషితమే.

బౌద్ధమతము ననుసరించియు ప్రాచీన కాలపు మాన వులలో కొందఱు సహోదర వివాహముల నొనర్చినట్లు తెలి యును. దీర్ఘనికాయమునందు బుద్ధ భగవానుడు అంబష్ఠ నామక బ్రాహ్మణుని కులమును నిందించుచు నిట్లనును: "పూర్వకాలమున నిక్ష్వాకురాజు తనకు ప్రియుడైన పుత్రునకు రాజ్యము నిచ్చుటకు నలుగురు పెద్దపుత్రులను నిర్వాసితుల నొనర్చెను. వారు హిమాలయపు శాకవనమున నివసింప సాగిరి. జాతి చెడునను భయముతో వారు తమ తోబుట్టువు లతో సంవసించిరి. అప్పటినుండి యీ కుమారులు శాక్య నామముతో ప్రసిద్ధు లయిరి. ఇక్ష్వాకుని యొక దాసిపేరు దిశ. దాని పుత్రుడు కృష్ణుడు. అతని వంశజులు కాష్టర్గాయన నామముతో ప్రసిద్ధు లయిరి. కావున నో అంబష్ఠ! నీవు శాక్యుల దాసీపుత్రుడవు. శాక్యు లార్యపుత్రులు." (దీర్ఘ నికాయము 1 వ. 3 సుత్తము).

అంబష్ఠుడు దాసీపుత్రు డని చెప్పుట కీకథ చెప్పబడినది. దీర్ఘనికాయపు వచనము వలననే యొకనిని దాసీపుత్రు డని యంగీకరింపజనదు. శాక్యులు తమ తోబుట్టువులతో చరించి సంతానము గనియుండవచ్చు; కాని వైదికులలో నిట్టి పతితాచారము కనిపింపదు.

దీనికంతకు సార మిది. ప్రాచీనకాలపు వైదికులు గమ్యాగమ్య వివేకము బాగుగ కలిగియుండిరి. తండ్రి పుత్రికను, తల్లి కుమారుని, అన్న చెల్లెలిని మిక్కిలి పవిత్ర దృష్టితో చూచుచుండిరి. గమ్యాగమ్య విచారపు సీమా

విషయమున ప్రాచీనార్యులలో మతభేద ముండెడిది. కొందఱు మాతులకన్యను పెండ్లాడుట తగునసెడివారు. మరికొందఱు కాదనెడివారు. కొన్ని దేశములలో నవైదికు లయినవారిలో నన్నాచెల్లెండ్రు కలిసి సంతానము కనెడివారు. తరువాత క్రమముగా వారట్టి సంబంధమును త్యజించిరి. ఇంతకుమించి మరియొం డేమియు లేదు.

## పదునెనిమిదవ యధ్యాయము

# అర్థమునకు పరివారమునకు గల యాశ్రయాశ్రిత భావము

పరివార (కుటుంబ) మర్థము నాశ్రయించి యుండును. ఇది నిర్వివాద విషయము. మొదట ధనము నార్జించు సామర్థ్యమును సంపాదింపు మని శాస్త్రములు నుడువుచున్నవి. పిదప పురుషుడు వివాహమాడ యోగ్యు డగును. ధనము లేకున్న తన పొట్ట నింపుకొనుటయే కష్టము. ఇక భార్యను బిడ్డలను నెట్లు పోషింప వీలగును ? మార్క్సు, ఎంగల్సు కూడ నీ విషయమున నేకీభవింతురు. ఇంతేకాక వారు, 'ప్రాచీన కాలమున నర్థవ్యవస్థ యొక్కటిగా లేక యనేక రూపములలో మారుచుండె' ననియు చెప్పుదురు. కుటుంబమున కాశ్రయము ధనము; కావున నర్థవ్యవస్థ మారినపుడు కుటుంబ రూపము కూడ మారునని వారి దృష్టి.

అర్థవ్యవస్థ ముఖ్యముగా నైదు విధములుగా నుండును. (1) పూర్వపు పంచాయతీ వ్యవస్థ. (2) దాసప్రధాన వ్యవస్థ. (3) సామంత వ్యవస్థ. (4) పెట్టుబడిదారి వ్యవస్థ. (5) సమాజ వాది వ్యవస్థ. ఇందు మొదటి నాలుగువిధములైన యర్థ వ్యవస్థలును ప్రాచీనకాలములో భిన్నభిన్న సమయములం దాచరణలో నుండియుండెను. ఆ యా సమయములం దున్న యర్థవ్యవస్థలకు తగినట్లు పరివారముల రూపములు మారు

చుండెను. ఈ యుగమునందు సమాజవాదమునకు చెందిన యర్థవ్యవస్థ రూపొందినది.

వన్యదశలో మానవులు కలిసి వస్తువుల నుత్పన్నము చేయుచుండిరి. నాడు మానవులకు ప్రాతిస్వికీ (వ్యక్తిగత) సంపత్తి లేకుండెను. అప్పటి పరివారము కూడ ప్రాతిస్వికము కాదు. అది తన కాధారమైన యర్థవ్యవస్థ ననుసరించి యెల్లరకు నుమ్మడిగా నుండెను. వస్తువుల నెల్లరు కలిసి నిర్మించి, కలిసి యనుభవించుచుండెడివారు. స్త్రీలు కూడ నుమ్మడి సొత్తుగా నుండిరి. స్త్రీ పురుషులలో నియత సంబంధము లేకుండెను. ప్రతివ్యక్తియు తనయిచ్ఛానుసార మే స్త్రీతో నైనను కలిసి సంతానము గన గలిగియుండెను. ఒక స్త్రీ మొదట నొకనితో కలిసి సంతానమును కని, తరువాత మరి యొకనితో, నటుపై నింకొకనితో నిట్లనేకులతో కలిసి సంతానము కనుచుండెడిది. ఆ యుగమున స్త్రీ పురుషు లేక నిష్ఠులు కాజాలకుండిరి. గుంపునుండి వేరై యొకడు వస్తువుల నుత్పన్నము జేయుట సంభవము కాదయ్యె. వ్యక్తిగత సంపత్తినిగూర్చి యెవరు నాలోచింపజాలని రోజు లవి. వ్యక్తిగత (ప్రాతిస్వికీ) సంపత్తిలేకున్న నిరువురు స్త్రీపురుషులు వేరుగ జీవన నిర్వాహము చేయజాలరు. కాలాంతరమున గుంపులు విడిపోయి, కలిసి వస్తువులను నిర్మించుట మానిన పిదప వ్యక్తులు స్వతంత్రు లయిరి. అప్పుడు వ్యక్తికి ధనము మీద నిజాధికారముకూడ గలిగినది. అప్పుడు రెండవవ్యక్తికా ధనముమీద నెట్టి యధికారము లేకపోయినది. ఈ స్థితిలో స్త్రీపురుషులలో నేకనిష్ఠవివాహములు ప్రారంభ

మయ్యెను. ఇట్లర్థవ్యవస్థ ననుసరించి పరివారరూప మేర్పడిన దని సమాజవాదు లభిప్రాయపడుచున్నారు.

అర్థమునకు గల పరిణామ స్వభావము ననుసరించి పరివారములందు రూపపరివర్తనము కలుగుట యసంభవము కాదు. కాని, సంభవమైనంత మాత్రమున నొకవస్తు వట్లే జరుగునను నియమము లేదు. కొండొక పరిణామము జరుగ వలయు ననిన దానికి వలయు కారణము లన్నియు నుపస్థిత ములు కావలెను. అట్లుకానినా డా పరిణామము జరుగదు. విత్తనమునుండి యంకుర మేర్పడుట సంభవమే. కాని, యంకురోత్పత్తికి వలయు నితర కారణము లన్నియు సమకూ రిన నా డది యేర్పడును. భూమిని దున్ని విత్తనములు వేసి తగినంత నీరుపెట్టిన పిదప కొన్ని దినముల కంకురము లేర్ప డును. విత్తనము లింటిలో నెంతకాల మున్నను నంకురము లేర్పడవు. సహకారి కారణములు లభింపనంత కాలము విత్తనమునుండి యంకుర మేర్పడదు.

కొండొక భూభాగమున ప్రాచీన యుగమున నాటవికు లలో యూథవివాహములు జరిగి యుండవచ్చును. కాని నే డేకనిష్ఠ వివాహముల నాచరించువారి పూర్వజు లందరు ప్రప్రథమమున యూథవివాహములను జేసికొని యుండి రనుట యనివార్యము కాదు. వా రాటవికులుగా నుండు టయు, యూథవివాహము లాచరించుటయు రెండును సంభవము కాదనము. అందులకు వలయు సహకారి కారణము లన్నియు నాడున్న పక్షమున నట్లు జరిగియుండుట నిశ్చితమే యగును. కాని, నేటి సభ్యజనుల పూర్వజు

లతి ప్రాచీన కాలమున - ఆదియుగమున - నున్నతజ్ఞానము కలవారై యూథవివాహములకు తగిన సహకారి కారణము లయిన యజ్ఞానాదులు లేనందున, నేకనిష్ఠ వివాహములనే యాచరించి యుందురని చెప్పుట సంభవమేల కాదు?

జీవులు నిత్యులు. తమ తమ ప్రాచీన సంస్కారముల మూలమున నే యుగమునందైనను జీవులు జ్ఞానసంపన్నులై యుండవచ్చును. ఆదిమయుగమునందును నేటివలె కొందఱు వస్తూత్పాదన మొనర్చి వినిమయ మొనర్చుచుండి రనుట యసంభవము కాదు. నాటి మానవులకు వ్యక్తిగత సంపత్తి లేనంతమాత్రమున నేకనిష్ఠ వివాహములు కూడ వారిలో లేవనరాదు. అప్పటివారు ప్రాతిస్వికముగ సంపదలను చేకూర్ప లేదనియు నెట్లు చెప్పగలము? మరియును బీజ మంకురమునకు నియతకారణము - ఉపాదాన కారణము - అయినట్లు వన్యదశ సభ్యదశకు నియతకారణము కాదు. కావున వన్యదశ లేకున్న సభ్యదశ కలుగనేర దనుట బుద్ధియుక్తము కాదు.

మనుష్యుని మనస్సును పరీక్షించి చూచిన నీ విషయము బాగుగ తెలియగలదు. బాలబాలికలలో కొందఱు విషయముల నతిశీఘ్రముగ గ్రహింతురు. మఱికొందఱు విలంబముగ గ్రహింతురు. వారి మనస్సులు పూర్వసంస్కారములతో కూడియుండని పక్షమున వారి ప్రతిభలో భేద ముండరాదు. శూన్యావస్థలో భేద ముండదు. భావపదార్థములలో భేద ముండును. బాలుర గ్రహణశక్తి నానావిధములుగ నున్నందున వారి మనస్సులు పూర్వసంస్కారయుక్తము లనుట యుక్తియుక్తము. అందువలననే వారి

గ్రహణశక్తిలో తీవ్ర మందభేదములు చూడనగును. తీవ్ర సంస్కారములు గలవారు శీఘ్రముగను, మందసంస్కారములు గలవారు విలంబముగను గ్రహింప గలుగుచున్నారు. ఇయ్యది యనుభవసిద్ధము. కొండొక విషయమున నభ్యాసము చేసినందున నా విషయమున బుద్ధి తీవ్రమగును. పసితనమున చదువుకొనునపుడు తీవ్రబుద్ధి గలిగియుండు బాలురు పూర్వమున నభ్యాసము చేసియుందురనుట యసత్యము కాదు. ఈ జన్మమున వారు చేసిన యభ్యాస మేమియు లేనందున పూర్వ జన్మమునందా యభ్యాసము చేసియుందురు. జన్మాంతరమున చేసిన యభ్యాసమువలన నేర్పడిన సంస్కారము లీ జన్మమున బుద్ధిని తీవ్రము చేయును. అత్యంత తీవ్రసంస్కారములు గలవారి కీ జన్మమున శిక్షణను బొందవలసిన యవసరము కూడ నుండదు. వారా సంస్కారములద్వారా పూర్వజన్మపు జ్ఞానమును స్మరించి జ్ఞానవంతు లగుదురు. నేడు మనము నిన్నటి విషయములను స్మరింపగలిగినట్లు వారు పూర్వ జన్మపు జ్ఞానము నీ జన్మమున స్మరియింతురు. ఈ రెండు స్మరణలలోను కాలభేదము తక్క మరి యొం డేమియు లేదు. అభ్యాసమాంద్యమువలన మూడు నాలుగు దినములకు పూర్వపు విషయములను మాత్రము స్మరియింపగలుగుదుము. తీవ్రాభ్యాసమువలన ననేక వర్షములకు పూర్వపు విషయములను గూడ స్మరింప గలుగుచున్నాముగదా! అట్లే యత్యంతము తీవ్రసంస్కారములు గలవారు పూర్వజన్మమునకు చెందిన యనుభవములనుగూడ స్మరియింపగలుగుదురు. అతి ప్రాచీన కాలము - ఆదిమ యుగము - నందును నిట్టి స్మరణశక్తి గలవా రుండిరనుట యసంభావ్యము కాదు.

మానవుడు ప్రప్రథమమున పృథ్వీమీద ప్రకటమైన కాలము మానవుల కాదిమ యుగ మగును. నాటి ప్రథమ మానవులలో ననేకులు పూర్వజన్మ సంస్కారముల తీవ్రతవలన పూర్వస్మృతి గలిగి యుందురు. ఆత్మ యనాది యైనందున నే సృష్టియందైనను ప్రథమమున నావిర్భవించు జీవులు పూర్వపు సృష్టికి సంబంధించిన యనుభవములు లేనివారుగా నుండ వలను పడదు. వారు పూర్వపు సృష్టిలో నుత్పన్నులై యనుభవము సంపాదించినవారై యుందురు. అందువలన వారు పూర్వానుభవములను స్మరింపగలిగి యుందురు. ఆరంభము నుండియు వారు వ్యక్తిగత రూపమున వస్తువుల నుత్పన్నము చేయగలిగియు నుందురు. పూర్వ సృష్టియందు వా రేవిధముగ వస్తూత్పాదనము చేసియుండిరో యట్లే యీ సృష్టియందును చేయ నారంభింప గలుగుదురు. అట్టివారు ప్రారంభమునుండియు సభ్యదశ ననుభవించు జ్ఞాన సంపన్నులై యుందురు. వన్యదశ ననుభవించి సభ్యదశకు రావలసిన యగత్యము వారి కుండదు. ఇట్టి జ్ఞానసంపన్ను లయిన వారి సంతానము తదుపరి యజ్ఞానదశలో నాటవికు లగుటయు నసంభవము కాదు.

ఆత్మవాదులలో జైనులు, మీమాంసకులలో కొందఱును ప్రళయము నంగీకరింపరు. జైనుల మతము ననుసరించి చూతుమేని, భరతక్షేత్రమున నుండువా రే యుగమునందును జ్ఞానముకలవారు కారు. వారికి తీర్థంకరులు వ్యవహారమును నేర్పుదురు. మహావిదేహక్షేత్రమున నుండువారు సర్వకాలము లందును కృషి, క్రయవిక్రయములు

చేయగలిగి యుందురు. దీనింబట్టి మానవులలో కొంద ఱొక భూభాగమున జ్ఞానహీనులై యుండ మరికొందఱు మరియొక భూభాగమున జ్ఞానసంపన్నులై యున్నట్లు స్పష్ట మగుచున్నది. ఇక ప్రళయము నంగీకరించని మీమాంస కుల దృష్టి ననుసరింతుమేని, ఆదిమయుగపు మానవులు జ్ఞానులు, శాస్త్రజ్ఞులు, వ్యవహారదక్షులు నై యున్నారు. ఆత్మవాదులలో పరస్పర మెన్ని భేదము లున్నను, వా రెల్లరు నాదిమయుగపు మానవులను జ్ఞానవంతులుగా నంగీకరించుచున్నారు. వారి దృష్టిలో మొదటి మానవులు మిక్కిలి జ్ఞానవంతులు, మిక్కిలి బలముగలవారు, మిక్కిలి యాయువు గలవారుగా నెంచబడుచున్నారు. క్రమముగా వారి సంతానమునందు జ్ఞానము, బలము, ఆయువు నన్నియు తగ్గిపోవుననియు వారి దృష్టి.

ప్రాచీన యుగములలోని ప్రతి విషయమును ననుమా నముద్వారా స్పష్టముగా నెరుగజాలము. ఈ విషయమున ముఖ్యాధికారము శబ్దప్రమాణమునకు, నితిహాసమునకు గలదన వలెను. అనుమాన ప్రమాణముద్వారా మానవు డేయుగము నందైనను ప్రాజ్ఞుడుగా నున్నా డనియో, లేక యనభిజ్ఞుడుగా నున్నా డనియో చెప్పవచ్చును. ఆదిమ మానవులు కొందఱు వన్యదశలో నుండిరనియు, మరికొందఱు మిక్కిలి జ్ఞానసంప న్నులై సభ్యదశలో నున్నారనియు నూహింపవచ్చును. కాగా సభ్యులు వస్తువుల నుత్పన్నముచేసి వాని వినిమయము చక్కగా చేయగలిగి యుండిరనుట యసంభవము కాదు. నాడు కూడ వారిలో ప్రాతిస్వికసంపత్తి, యేకనిష్ఠ వివాహ

ములు నుండి యుండును. కావున నాదిమయుగమున మానవు లెల్లరు ప్రాతిస్వికసంపదల నెరుగ రనియు, యూథ వివాహములు గలిగి పశువులవలె వ్యవహరించి యుందు రనియు చెప్పుటకు తగిన ప్రబల ప్రమాణ మొండును గానము. జీవు లనాదు లైనందున నట్టి కల్పన యుక్తి సంగతము కాదు.

అయినను పరివార మర్థము నాశ్రయించియే యున్నది. కాని, స్త్రీపురుషులలో నున్న గమ్యాగమ్య వ్యవస్థ యర్థముమీద మనుజులకు గల వ్యష్టి, సమష్టి అధికారముమీద నాధారపడి యుండలేదు. సామ్య వాదుల మతము ననుసరించి చూచిన, 'నాదిమ మానవ సమూహములలో యూథవివాహములు ప్రచలితమై యున్న నాడు వారిలో సామ్యవాద ముండెను. భూమి, పంటలు, పశువులు, దాసజనులు ననువాని యన్నింటిమీదను గణ ములో నున్న వ్యక్తుల కందరకు నధికార ముండెను. తరువాత గణములు ఖండితము లయ్యెను. అప్పుడు మాత గృహమున కధికారిణి యయ్యెను. మాతృ ప్రధాన పరివారమున మాత తన పిల్లలతోను, తన సోదరులతోను నుండెడిది. ఆమె యితరగణములనుండి యొకరితరువాత నొకరిని పతులనుగా ననేకులను పొందుచుండెడిది. పరివారమునకు సంబంధించిన సంపత్తి యేర్పడిన దశ యిదియే. ఈ దశనుండి పితృప్రధాన మైన పరివార మేర్పడినది.'

మరికొందఱు సామ్యవాదు లిట్లందురు: 'గణము (సముదాయము) ఖండితమై పరివార మేర్పడినపుడు పారి వారిక సంపత్తి యేర్పడినది. ఇదియే సామాన్య నియమము.

కాని యొక్కొక్కప్పుడు పారివారిక సంపత్తి యేర్పడుటకు ముందే పితృప్రధాన పరివార మేర్పడుటయు, మాతృప్రధానత లేకయే పితృప్రధానత గలుగుటయు గలదు.'

ఇట గమనింపదగిన విషయ మేమన : పరివారము స్వతంత్రమై యర్థోత్పాదన చేయదు. అయినను పరివారము లేర్పడును. గణములకు, పరివారములకు గమ్యాగమ్య సీమలలో భేద మున్నది. అర్థోత్పాదన పద్ధతిలోను, నధికారములోను పరివర్తనము కలుగకున్నను, గమ్యాగమ్య విషయమున ననేక భేదములు కలుగుట కవకాశము లేకపోలేదు. ఏకనిష్ఠ వివాహములందు, మాతాసుతలే కాక, పత్ని తక్క మిగిలిన స్త్రీలు, పతికాక మిగిలిన పురుషులు నెల్లరు నగమ్యు లగుచున్నారు. ఈ వ్యవస్థ పెట్టుబడిదారి సిద్ధాంతమువలన వచ్చిన పరిణామము కాదు. అట్లయిన పక్షమున సామంతీయ పద్ధతితో నర్థోత్పాదన జరిగిన సమయమున నేకనిష్ఠ వివాహము లుండకుండెడివి. సామంతు లెక్కుడుగా నున్నప్పుడు సాధారణ జనులలోగూడ నేకనిష్ఠ వివాహము లాచరణములో నుండెను.

వాస్తవమున పతి పత్నుల హృదయైక్యతవలన వివాహములం దేకనిష్ఠత యుద్భవించినది. తర్కసిద్ధము కాకున్నను స్త్రీపురుషులలో ననేకులు 'పతి పత్నులలో జన్మ జన్మాంతరము లందును నెడ తెగని యనురాగ ముండు' నని యంగీకరించుచున్నారు. అనాదికాలమునుండి వచ్చుచున్నందున భారతీయ సమాజమునకు వివాహ ధర్మ మొక యంగమై యున్నది. ఇయ్యది వాద వివాదముల ద్వారా తెలియదగిన

వస్తువు కాదు. ధనికులు, దరిద్రులు, పండితులు, పామరులు చిరకాలమునుండియు వివాహధర్మపు దివ్యరూపమును స్వాయముగా ననుభవించుచు వచ్చుచున్నారు. ఎవరిలో నిట్టి యను భవము పూర్తిగ నశించినదో వారిమూలమున, నభిన్న హృదయులైన స్త్రీపురుషుల పవిత్రానుభూతి నపలాపింప నలవికాదు. వేదమంత్రముల దృష్టిలో వధువు గృహమునం దత్తమామలకు, నాడుబిడ్డలకు, మరదులకు, నెల్లరకు సమ్రాజ్ఞి యన బరగుచున్నది. కులవధువులను వేశ్యలవలె నుచ్ఛృంఖలల నొనర్చి స్వచ్ఛందచారిణులనుగా చేయదలచు భారతీయులు వారిని దాసీలనుగా చూచుచున్నారు. ధనిక లలో ననేకులు తఱచుగా నేకపత్నీవ్రతమును పాలించినవారు లేరు. ఈ యన్యాయమునకు ప్రతీకారము పతివ్రతలను సదాచారమునుండి భ్రష్టలను చేసినంతమాత్రమున జరుగ నేరదు. పురుషులు స్త్రీలపై నత్యాచారము జరుపకుండుట కేదైన నొక కఠోర దండన విధింపవలసి యున్నది.

మార్క్సుయొక్క యైతిహాసిక భౌతికవాదము ననుస రించి యాదిమ సామ్యవాదము ఉత్పాదక సాధనములు పరిష్కృతములు కాక సాధారణరూపమున నున్నందున నుద్భవించినది. ఆదియుగపు మానవుల జ్ఞాన ముత్కృష్టము కాదు. కావున వారు పెద్ద పరిమాణములో వస్తువులను నిర్మింపజాలకపోయిరి. తమ ప్రయోజనముల కవసరములైన వానిని కలిసి నిర్మించి, కలిసి యనుభవించిరి. ఉత్పాదనము కానీ, యుపభోగము కానీ నాడు ప్రాతిస్వికము కాదు. అందు వలననే స్త్రీపురుషుల సంబంధముకూడ వ్యక్తిగతము -

ఏకనిష్ఠము-కాకుండెను. ప్రపంచమున కొన్ని దేశములం దిట్టి మానవ సముదాయము లుండెను. ఇట్టి వ్యవహారమే ప్రాచీన భారతీయ సమాజమునందును వెలసియుండె నని సిద్ధపరుప యత్నములు జరుగుచున్నవి.

శ్రీ డాంగేగారు, ఆర్యులు సత్రయజ్ఞము ననుష్ఠించుచుండెడివారు కావున మంత్ర, బ్రాహ్మణ కాలములందు వారిలో నాదిమ సామ్యసంఘ ముండియుండె నని ప్రతిపాదించుచున్నారు.

"సత్రయాగమున పాల్గొనువా రందరు, ఋత్విజులు, యజమానులు నై యుండిరి. తరువాత చివరిరోజులలో యజ్ఞములలో ఋత్విజులు, యజమానులు వేరువేరుగా నుండెడివారు. యజమానులు ఋత్విజులకు యజ్ఞము చేసి నందులకు దక్షిణల నిచ్చెడివారు. కాని సత్రయాగమున నిది యుండదు. దానిలో తరగతుల విభాగము కానీ, శ్రమ విభాగము కానీ యుండెడిది కాదు. అందరు సమూహికముగా పరిశ్రమలో పాల్గొనెడివారు" అని డాంగే వ్రాసి యున్నారు. (భారత్. 49 - 51)

సత్రయాగమును బాగుగ పరిశీలించినచో దాని నాచరించువారిలో శ్రమవిభాగ మున్నట్లు తెలియగలదు. జైమినిమహర్షి మతము ననుసరించి చూతుమేని, సత్రమును జేయువారు బ్రాహ్మణులై యున్నారు. క్షత్రియులకు గానీ, వైశ్యులకు గానీ సత్రముజేయు నధికారము లేదు. దీనింబట్టి సత్రయాగ కాలమున వర్ణవిభాగ మున్నట్లు సిద్ధమగుచున్నది.

శ్రమవిభాగమునకు గల మరియొక నామమే వర్ణవిభాగము. కావున నాడు శ్రమవిభాగము లేదనుట కల్ల.

సత్రము నొనర్చువా రేకగోత్రమునకు చెందినవారై యుండవలె ననుట సత్రమున కొక విశేషధర్మముగా శ్రీ డాంగే యెంచుచున్నారు. కాని, వాస్తవమున బ్రాహ్మణులలో నన్నిగోత్రములవాడును సత్రము నాచరింప వీలులేదు. వైశ్వామిత్ర గోత్రమువారు, వారికి సమాన కల్పముగల బ్రాహ్మణులు మాత్రమే సత్రము నాచరింపవలెను. భృగు, శునక, వసిష్ఠగోత్ర బ్రాహ్మణులీ సత్రము నాచరింపరాదని జైమిని నుడివియున్నాడు. (మీ. సూ. 6 - 6 - 24 - 26.) దీనింబట్టి సత్రయాగ కాలమున నాదిమ సామ్యసంఘ మార్యులలో నున్నదనుట సిద్ధముకాదు. పైపెచ్చు లేదనియే తేలుచున్నది.

వన్యదశకు చెందిన యాదిమ సామ్యసంఘ మున్నపుడు సమస్త కులమువారును సమష్టిగా (సముదిత రూపమున) వస్తూత్పాదన చేసెడివారు. కొందఱు సమష్టిగాను, కొందఱు ప్రాతిస్వికము (వ్యష్టి) గాను వస్తువుల నుత్పన్నము చేయుట కానీ, వానిపై నధికారము కలిగియుండుట కానీ నాడు లేదు. భృగు, శునక, వసిష్ఠ గోత్రములవారు విశ్వామిత్ర గోత్రము వారికి సమకాలికులు. అయినను వారు సత్రముజేయుట కధికారులు కారు; కాబట్టి డాంగేగారి తర్కము ననుసరించి వారు సమష్టిగా వస్తువుల నుత్పన్నము నెట్లు చేయగలరు? నాడు వస్తువులమీద నెల్లరకు సముదితాధికార మున్నదని యెట్లు సిద్ధమగును? ఇంతేకాక నాడు ప్రాతిస్విక రూప

మున వస్త్రోత్పాదన జరుగుచుండెడిదని చెప్పుటకు మరియు ననేక ప్రమాణము లున్నవి.

సత్రాంతమున పృష్ఠశమనీయమును చేయుచుండెడి వారు. ఇందులకై నియుక్తులగు ఋత్విజులు యజమానులకంటె భిన్నులై యుండవలెను. (మీ. సూ. 1-2-43-44) ఈ ఋత్విజులను దక్షిణలద్వారా కొనుచుండెడివారు. సత్ర మును సమష్టిగాచేయు యజమానులు, పృష్ఠశమనీయము నొక్కరొక్కరుగా చేసెడివారు. అందువలన వారి ప్రాతి స్వీక (వ్యక్తిగత) అధికారము స్పష్టము కాగలదు. మరియు సత్రమును జేయువారి కందరకు సమాన ఫలము లభింపదు. సత్రమున యజమాను లందరును ఋత్విజుల కార్యము నొనర్తురు. ఒక్కడు మాత్రము యజమానుని కార్య మొనర్చును. అతనిని గృహపతి యందురు. (మీ. సూ. 12-4-35-38.) సత్రయాగ కాల మున నాదిమ సామ్యసంఘము లేదనుట కిదియు నొక ప్రమాణము.

సత్రమున స్త్రీలు, పురుషులు నెల్లరు పాల్గొనెడివారు. కాని, తరువాత యజ్ఞములలో నీ విధానము లేదని డాంగే గా రనుచున్నారు. ఆధారము చూపకయే యిట్లు చెప్పిన నేమియు సిద్ధముకాదు. యజ్ఞమునందు పతితోబాటు పత్ని కధికార ముండుట యొక ప్రసిద్ధ తత్వము. పతి పత్నులకు ననేక యజ్ఞములందు సమానాధికార మున్నందుననే వైదికులు యజ్ఞమునందు పతితో పాల్గొను స్త్రీని పత్ని యందురు. పాణినిముని (వ్యాకరణశాస్త్రకర్త) పత్నీ శబ్దమునకు గల

ముఖ్యార్థమున యజ్ఞసంబంధ మపరిహార్య మనుచున్నాడు. (అష్టాధ్యాయి - 4-1-32). జైమినిముని యొక యధికరణమున స్త్రీపురుషులకు యజ్ఞమున నధికార మున్నదని చెప్పి, తరువాతి యధికరణమున స్త్రీపురుషుల కిరువురకు తోడ్తో నధికార మున్నట్లు నిరూపించి యున్నాడు. (పూ. మీ. 6-1-3. సూ. 6-16; 17-29.) "యే యజ్ఞపత్నీ........" ఆదిమంత్రములందు స్త్రీలకు గల యజ్ఞాధికారము స్పష్టముగా వర్ణింపబడినది. పత్నీశబ్దము పతిశబ్దము వలన నేర్పడినది. పతిశబ్దమున కర్థము స్వామి. పత్నీ శబ్దమున కర్థము గృహస్వామిని యని పార్థసారథిమిశ్రు లనుచున్నారు. (శాస్త్రదీపిక. ప్ర. అ.). కావున సత్రయాగకాలమున ప్రాచీనార్యులలో నాదిమ సామ్య సంఘ ముండియుండె ననుట యెంతయు నసంగతముగా నున్నది.

వన్యదశలో స్త్రీపురుషులు కలిసి పనిచేసెడివారు కావున, కలిసి పనిచేయు స్త్రీపురుషు లెల్లరు వన్యదశకు చెందినవా రనుట యుక్తిసంగతము కాదు. కృషి, వ్యాపారము, ధర్మశాస్త్రముల నెరిగెడి సభ్యసమాజమునందును కొన్ని కార్యములు స్త్రీపురుషులు కలిసి నేడును చేయుచున్నారు. కొండొక కార్యమును స్త్రీపురుషులు కలిసి చేసినంతమాత్రమున వారు ఆదిమ సామ్యసంఘమునకు చెందినవారు కాజాలరు. సభ్యులు, ప్రాతిస్వికరూపమున కార్యముల నొనర్చువారు, గమ్యాగమ్య వివేకము గలవారు కూడ కొన్ని కార్యములను స్త్రీ పురుషులు కలిసి చేయుచుందురు. కొలదిమంది స్త్రీలు పలువురు పురుషులతో కలిసి

పనిచేయుటయు చూచుచుందుము. అంతమాత్రమున వారెల్లరు నాదిమ సామ్య సంఘ సదస్యు లగుదురా!

వాస్తవమున యజ్ఞములు ప్రాచీన వైదికార్యుల ప్రాతిస్వికాధికారమును ప్రకటించును. ద్రవ్య మున్నవాడు యజ్ఞము నొనర్చును. అతడే ఋత్విజులకు దక్షిణల నీయ గలడు. దక్షిణ నిచ్చుట యన కొనుట యని యర్థము. వ్యక్తిగత (ప్రాతిస్వికి) అధికారము లేనివాడు దక్షిణ నీయజాలడు. ప్రాచీనార్యులలో నాదిమ సామ్యసంఘ మున్నదని తెలుపునట్టి యంశ మొకింతయు యజ్ఞములందు కనిపింపదు.

# పందొమ్మిదవ యధ్యాయము

## స్వ - స్వామి భావసంబంధరూపములు, వాని కారణములు

శిల్పులు తమతమ స్థానములం దుండి పణ్యవస్తువులను నిర్మించి యమ్మినందున వచ్చు ధనము వారి వారి ప్రాతిస్వికసంపత్తిగా నుండును. ప్రత్యేక శిల్పికి నతడు చేయు శ్రమ మీదను; శ్రమసాధనముల మీదను నధికార ముండును. కృషికుడు కృషి చేసి సంపాదించును. అతనికి చిన్న చిన్న క్షేత్రములమీద నధికార ముండును. అతడు పైరుపంటల నెంతగా నుత్పన్న మొనర్చునో యంతటి ధనమున కతడు స్వామి యగును. కాలాంతరమున స్థితి మారును. కృషికులకు తమ క్షేత్రములమీద ప్రాతిస్వికాధికార ముండదు. శిల్పుల సమీపమున శ్రమ యుండును. కాని, నిర్మాణ సాధనము లితరుల సమీపమున నుండును. పెద్ద క్షేత్రములను, పెద్ద పెద్ద యంత్రములను స్వాధీనములో నుంచుకొను వారి సంఖ్య యల్పముగా నుండును. కృషీవలురయు, శిల్పులయు సంఖ్య యెక్కుడుగా నుండును.

ఒక పెద్ద భూస్వామియధీనమున పలువురు రైతులు పనిచేయునపుడును, మహాయంత్రపతికి లోబడి యనేక శిల్పులు పనిచేయునపుడును శ్రమ వారిలో విభక్త మగును. ఒక పణ్యవస్తువు ననేక శ్రామికులు కలిసి నిర్మింతురు. కొందఱొక భాగమును నిర్మింతురు; మఱికొందఱు మఱియొక భాగ

మును. శ్రామికుల శ్రమ సముదితరూపమున వస్తువును నిర్మించును. మూలపతీయ పద్ధతికి చెందిన నిర్మాణములో గల విశిష్టత శ్రమయొక్క సముదిత రూపమే. శిల్పులకు తమతమ సాధనములమీద స్వతంత్రాధికార మున్నంతవరకు శ్రమ వ్యస్తరూపమున నుండును. వ్యస్తశ్రమము సముదితశ్రమ నెదుర్కొనజాలదు. మూలపతులచెంత శ్రమహరణము ద్వారా సంపదలు ప్రోవయిననాడు జనులలో దరిద్రత, యన్యాయము, దాసత వ్యాపింపసాగును.

ఈ యవస్థయు స్థిరముగా నుండదు. క్రమముగా మూలపతులలో స్పర్థ యేర్పడును. సంఘర్షములో కొందఱు వెనుకబడుదురు. కొందఱు అగ్రేసరు లగుదురు. గెలిచిన మూలపతుల సంపదలు విద్యుద్వేగముతో పెరుగును. కొందఱు మూలపతులు మూలధనముమీద నేకాధికారు లగుదురు. ఏకాధికారమువలన ధనవృద్ధి కాటంక ముండదు.

మార్క్సు చెప్పుచున్నాడు: "స్వామిభావమున గల మూలపతీయరూపము మూలపతీయనిర్మాణ ఫలము. ఇది మూలపతీయరూప ప్రాతిస్వికసంపత్తి నుత్పన్నము చేయును. ఇది వైయక్తికసంపత్తికి మొదటి నిషేధము. వైయక్తిక (నిజ) సంపత్తి నిర్మాతశ్రమ నాశ్రయించి యుండును. కాని, మూలపతీయ నిర్మాణము ప్రకృతియొక్క యపరిహార్య నియమము ననుసరించి తన నిషేధము నుత్పన్న మొనర్ప నారంభించును. ఇది నిషేధమునకు నిషేధము. ఇది నిర్మాత యొక్క నిజ సంపత్తిని మరల ప్రతిష్ఠితము చేయదు. ఇయ్యది నిర్మాతకు మూలపతీయ యుగనిర్మాలము నాశ్రయించు

ప్రాతిస్వికసంపద నిచ్చును. ఆ దశలో భూమిమీదను, నుత్పాదక సాధనములమీదను నుత్పాదకులకు - నిర్మాతలకు - సముదితాధికారము కలుగును. వారు కలిసి పనిచేయుదురు." (క్యాపిటల్ పు. 837).

నిషేధమునకు నిషేధ మున్న దని చెప్పి మార్క్సు అర్థముమీద నధికారమున కున్న యైతిహాసిక క్రమమును ప్రకటించిన స్థల మిదియే. ఇట ధ్యానమున నుంచుకొన వలసిన విషయ మేమన: మొదట శిల్పులకు - చేతిపని వారికి - ఉత్పాదక సాధనములమీద స్వాధికార ముండెడిది. వస్తువుల నమ్ముటచే వచ్చు ధనముమీదను వారికి స్వాధికార ముండెడిది. తరువాత ధనపతుల యుగమున చేతి పనివారు కేవలము శ్రామికు లయిరి. సంపదమీద నుత్పా దకులకు, మూలపతి - ధనపతి - కి గల యధికార మీ క్రమమున నుండుట నిజమే. కాని, దీని నపరిహార్యము, స్వతఃసిద్ధము నని యెంచరాదు. కారణమేమన నిర్మాతలైన శిల్పుల యధికారము మూలపతి యధికార రూపమున పరిణమించుటను కొందఱు న్యాయముగా నంగీకరింప వచ్చు. అట్లంగీకరించుట యసంభవము కాదు. మనుజు డాలోచించి యత్నము చేయకయే యేర్పడు క్రమము స్వతఃసిద్ధ మగును. బీజమును క్షేత్రమునందు నాటిన మీదట నంకురము, కాండము, శాఖా పత్ర పుష్పాదులు క్రమముగా నేర్పడును. విత్తుటకు మనుజుడు శ్రమింపవలసి వచ్చును. కాని, యంకురాదులు క్రమముగా నుత్పన్న మగుటలో మనుజుడు చేయునది యేమియు లేదు. అది

బీజములోని స్వాభావిక ధర్మము. శిల్పులు వేరువేరుగా తమ సాధనములద్వారా వస్తువుల నుత్పన్నముచేసి యమ్మి జీవించుచుండిన వేలకొలది వత్సరములకు తరువాతను వారు ధనపతులు కాజాలరు. ధనపతి - మూలపతి - యగుటకు పెద్దపెద్ద యంత్రము లవసర మగును; అవస్థలకు వశులై శిల్పులు నిర్మాణసాధనములనుండి వంచితులు కావలసియుందురు. ఏ శిల్పియు తన సాధనములను స్వయముగా దూరము చేసికొనడు. శిల్పులను వివశులంజేసి కూలికి పనిచేయువారినిగా జేయనంతవరకు నెవడును మూలపతి కాజాలడు. ఇది యంతయు స్వార్థులైనవారి లోభబుద్ధి మూలమున జరుగును. శిల్పి బుద్ధిపూర్వకముగ వస్తువుల నిర్మాణమును విడిచిపెట్టడు. అతడు వివశుడై యట్లు చేయును. స్వార్థపరులు మూలపతుల యుగమును బుద్ధిపూర్వకముగ సృష్టింతురు. అది స్వయముగా నేర్పడదు. మార్క్సుకు సహకారియు, మిత్రుడు నగు ఎంగల్సు డ్యూరింగు మతమును ఖండించుచు నిట్లనును: "అధికార ప్రక్రియ మార్క్సు ననుసరించి యైతిహాసిక రూపమున ననివార్యము కాదు. ఈ ప్రక్రియ యపరిహార్యమగు ననుట మార్క్సు స్వప్నముననుం లేకుండెను." (డ్యూరింగ్ మత ఖండనము. పు. 150.)

అయినను, ననేకులు, మొదట నుత్పాదకుల నిజాధికారము, తరువాత వర్తమానమున నున్న మూలపతీయ ప్రాతిస్వికాధికారము, అటుపైన నంతమున నుత్పాదక సాధనములమీద సముదితాధికారము, భోగ్యవస్తువులమీద నొక్కొక్కనికి వ్యస్తాధికారము నను క్రమ మనివార్య మని

యెంచుచున్నారు. దీనికి కారణము: మార్క్సు స్వయముగ, స్పష్టశబ్దములలో 'అధికార ప్రక్రియ యీక్రమమున నైనది' యని వ్రాయకుండుటయే. కాని, దీని క్రమ మన్యరీతిని కూడ నుండనగును.

నిషేధమునకు నిషేధ మొక నియమము. మహా విద్వాంసుడైన 'హీగల్' దానిని ప్రకటించి యున్నాడు. ఎంగల్సు దాని ప్రభావమును, గణితము, కృషి, భూగర్భ విద్య, ఇతిహాసము, దర్శన శాస్త్రము మున్నగు ననేక శాస్త్రములందు చూపియున్నాడు. కాని, యీ నియమము యొక్క కార్యము లని చెప్పబడునవి వాస్తవమున దాని నాశ్రయింపవు. ఎంగల్సు ఒక యవబీజము నుదాహరణ ముగ గ్రహించి దానిలో నిషేధమునకు నిషేధమును చూపెను. యవ బీజ మొక యోగ్యమగు క్షేత్రమున బడిన, తగిన ప్రకాశము, నీరు దొరకిన మీదట దానిలో నొక పరిణామ మేర్పడును—బీజమునుండి యంకురము కలుగును—. అపుడు బీజము తనరూపమున నుండదు. దాని నిషేధము (నాశము) జరుగును. బీజస్థానమున నంకురము వచ్చును. బీజ నిషేధమునుండి యంకుర మగును. అంకురము వర్ధిల్లును. దానికి పుష్పఫలము లేర్పడును. చివరకు మరల నది యొక మాటు యవబీజముల నుత్పన్నము చేయును. ఆ బీజములు ఎండి పక్వమై క్రింద పడును. పైరు నశించును. నిషేధమునకు నిషేధము కలిగిన కారణమున మరల మూలదశకు చెందిన యవబీజము లభించును. కాని యీమాటు బీజ మొకటి

కాక యొకటికి పది, యిరువది, ముప్పది రెట్లు బీజములు లభించుచున్నవి.

ఈ యుదాహరణమును బాగుగ విచారించిన తెలియును :— అంకురము బీజ నిషేధమువలన కలుగదు. క్షేత్రమున విత్తనము నాటినమీదట నీరు, ప్రకాశము లభించినచో బీజ మంకురముగా పరిణమించును ; కాని, నిషేధము - వినాశము - కాదు. బీజము పూర్తిగ నశించిన నంకురము కలుగదు. బీజము నశించిన తదుపరి యంకుర ముత్పన్న మగునెడల క్షేత్రమున విత్తనములు విత్తుటయే వ్యర్థ మగును. బీజము విత్తిన మీదట క్షేత్రమున నది నశించినచో దాని యభావ మేర్పడిన దని యర్థము. ఆ యభావము విత్తనము వేయక ముందును గలదు. బీజవినాశము - అభావము - వలన నంకుర ముత్పన్న మగునెడల బీజాభావము దానిని విత్తక ముందు నుండును గదా! అపు డేల యంకురము కలుగదు ?

అభావమునకు రెండు రూపము లున్నవి. ఒకటి వస్తు వేర్పడిన తరువాత కలుగునది. మరియొకటి వస్తు వేర్పడకముం దుండునది. వస్తు వేర్పడినమీదట కలుగు నభావమువలన నంకురము కలిగిన వస్తు వేర్పడుటకు ముందుండు నభావము వలనను నంకుర మేర్పడవలెను. బీజములను క్షేత్రమున విత్తి నశింపజేయుటకంటె విత్తకుండుట మేలుకాదా! విత్తి యభావమును సంపాదించుటకంటె విత్తకయే వాని యభావ మట నున్నదిగదా! కాని బీజములు విత్తక యంకురము లేర్పడవు. కావున బీజము క్షేత్రమునందు కలిసిపోయినప్పటికి నది పూర్తిగా నశింపదు. ఏదో యొక రూపమున నుండును.

బీజ మట్లే యుండును. దాని రూపము మాత్రము మారును. బీజముయొక్క యొక రూపము నశించి మరియొక రూపము ప్రకట మగుచున్నదని యంగీకరింతురేని బీజనిషేధమువలన నంకుర మేర్పడుచున్నదని చెప్పక యుండవలెను.

అంకురము పెరిగి పెద్దదై ఫలించినపు డేర్పడు ననేక రెట్ల బీజములు కూడ బీజనిషేధముయొక్క నిషేధము - బీజాభావాభావము - వలన కలుగుటలేదు. అంకురము బీజ ముల నుత్పన్నముచేసి నశించును; కాని తాను నశించి బీజ ముల నుత్పన్నము చేయదు. మరల బీజము లేర్పడుట యంకుర పరిణామము.

మంచి విత్తనమును తీసికొని, దానిని సంస్కరించి యందు క్రొత్తగుణముల నాధానము చేయవచ్చు నని ఎంగల్సు చెప్పుచున్నాడు. ఉదాహరణము - 'డాలియా' (ఒకవిధమగు నంటుమొక్క), లేక 'ఆర్చిడ్' (ఒక యోషధి) అనునవి గుణాధానమువలన నధిక సంఖ్యలో బీజముల నిచ్చు టయే కాక యుత్తమ బీజముల నిచ్చును.

ఈ యుదాహరణమునందును గుణాధానము, బీజము యొక్క యవినాశమునే సిద్ధపరచును. బీజము పూర్తిగా నశించి దాని యంశ మేమియు మిగులకున్న గుణాధానమే కలుగదు. ద్రవ్యము లేకున్న గుణము లుత్పన్నములు కావు. ఇక బీజమునుండి యుత్పన్నమగు నంకురము అనేక బీజముల నుత్పన్నముచేసి యెన్నటికిని నశింపదు. యవాంకుర మిట్టిదిగా నున్నది. మరికొన్ని యితరాంకురములు నిట్టివే. కాని యంకురము లన్నియు నిట్టివే యన వలనుపడదు. ఆమ్ర

బీజమునుండి యంకుర ముత్పన్నమై యది విశాల వృక్షమగును. దానికి వందలాది ఫలము లేర్పడును. ఫలములందు బీజము లుండును. ఆమ్రవృక్షము మొదటిసారి యనేక ఫలముల నిచ్చి యంతటితో నశింపదు. ప్రతివర్షము ఫలముల నిచ్చును. నిషేధమునకు నిషేధము కాదు. అయినను ననేక ఫలము లేర్పడును. ఉద్భిజ్జము - వృక్షము - లన్నిటి యందును 'నిషేధమునకు నిషేధము' అను నియమము వర్తింపదు. ఎంగల్సు కియ్యది తెలియును. దృష్టాంతము నిచ్చి కొన్ని యోషధులలో మాత్ర మీ ప్రక్రియ యునికిని సిద్ధపరుచుచున్నాడు. ఉనికి మాత్రమే చూపుట యిష్టమేని నిషేధ నిషేధమును నియమ మనరాదు. రెండు మూడు దృష్టాంతములతో నొక వస్తువు నియమము కాజాలదు.

దర్శనశాస్త్రమునందును ఎంగల్సు ఈ ప్రక్రియా స్వరూపమును ప్రకటించి యున్నాడు. (డ్యూరింగు మతఖండనము - పు. 155.) ప్రాచీన దర్శనశాస్త్రమునందు స్వాభావిక ప్రవృత్తివాద మొకటి యుండెను. అది విచారమునకు ప్రకృతికి మధ్యగల సంబంధమును నిరూపించుటలో నసమర్థమై యుండెను. కాని, దాని నిరూపణ మవసరమై యుండెను. అందువలననే శరీరముకంటె భిన్నమగు నాత్మసిద్ధాంత ముద్భూతమైనది. ఆత్మ యమరమనియు నంగీకరింపబడినది. అంతమున నేకాత్మవాదము ప్రకట మయ్యెను. కావున ప్రాచీన భూతచేతనావాదమును జ్ఞానవాదము నిషేధించినది. దర్శన మధికముగా వికసించినమీదట జ్ఞానవాదముకూడ స్థిరముగా నుండజాలకపోయెను. దానిని నేటి భూతచేతనా

వాదము నిషేధించినది. నేటి భూతచేతనావాదము నిషేధమునకు నిషేధము. ఇది కేవలము ప్రాచీన భూతచేతనావాదమును తిరిగి ప్రతిష్ఠించుట కాదు. ఇది దాని యాధారమును, రెండువేల సంవత్సరముల కాలపు దర్శనము, భౌతిక విజ్ఞానమునకు చెందిన వికసిత విచారములు నను రెండింటి ద్వారాను, మరియు రెండువేల సంవత్సరములలో జరిగిన హైతిహాసిక వికాసముద్వారాను బలపరుచుచున్నది.

ఇక్కడకూడ నిషేధ నిషేధము నియమరూపమున ప్రకటము కాదు. ప్రాచీన భూతచేతనావాదమును నిత్యాత్మవాదము నిషేధించినది; కాని కేవల నిత్యాత్మవాదమే దానిని నిషేధించిన దనరాదు. భారతమున బౌద్ధులు క్షణికజ్ఞానము ద్వారాను, జైనులు నిత్యానిత్యాత్మవాదము ద్వారాను భూతచేతనావాదమును నిషేధించి యున్నారు. అంతమునగూడ నేకబ్రహ్మ-ఆత్మ-వాదము వరకు వచ్చి విచారపరంపర యాగిపోదయ్యె. శంకరభగవత్పాదు లేకబ్రహ్మవాదమును ప్రతిష్ఠించిరి. కాని, రామానుజాచార్యులు, పూర్ణప్రజ్ఞాచార్యులు, వల్లభాచార్యులు దానిని నిషేధించి యుండిరి. ఆధునిక భూతచేతనావాదము కూడ దానిని నిషేధించినది. అంతమాత్రమున నది సత్యమనరాదు. ఆధునిక భూతచేతనావాదమునుకూడ నాత్మవాదము నిషేధించుచున్నది.

గత రెండువేల సంవత్సరములలో నయిన భౌతిక విజ్ఞానోన్నతిద్వారా ఆత్మవాదము ఆత్మయొక్క యపర స్వరూపమును, జన్మాంతరములను మిక్కిలి బలముతో సిద్ధ

పరుచుచున్నది. పూర్వపు మతమును పరవర్తి - తరువాతి-విచారము నిషేధించినంతమాత్రమున నాపరవర్తి విచారము సత్య మన నొప్పదు. ఒక జ్ఞానము సత్యమగుట కది ప్రమాణముద్వారా ఋజువు కావలెను. ప్రమాణముద్వారా జ్ఞానము యథార్థమని ఋజువు కానంతవరకు నది పూర్వవర్తి యైనను లేక పరకాలమునకు చెందిన దైనను తత్వజ్ఞాన మన నొప్పదు. ఒక మనుష్యు డొక వృక్షమును జూచి యది వృక్ష మనును. మరియొకడు దానిని నిషేధించుచు నది పురుషు డనును. మూడవవాడు దానిని శిలామూర్తి యనును. ఇందు రెండవ మూడవ జ్ఞానములు పరవర్తులు - తరువాతివి. అయినను సత్యములు కావు. భూతచేతనా వాదమును నాధునికులలో కొంద రంగీకరించుచున్నారు. కాని వారి మతము ప్రాచీన, నవీన ప్రమాణములకు ప్రతికూల మగుచున్నది. కావున నది పరవర్తి యైనంతమాత్రమున తత్వజ్ఞానము కానొల్లదు.

ఏ వస్తువుల పూర్వాపర భావము మనుష్య యత్నాధీనమో యా వస్తువుల క్రమము స్వభావ నియతము కాజాలదు. శిల్పులకు ప్రథమమున నుత్పాదక సాధనములమీదను, పణ్యముల నమ్ముటచే వచ్చిన ధనముమీదను స్వాధికార ముండెడిది. తరువాత మూలపతు లుత్పాదన సాధనములను తమ వశమొనర్చుకొనినమీదట శిల్పులు వివశులై శ్రామికులు శ్రమకు స్వాములైరి. అప్పు డుత్పాదనసాధనములపై నుత్పాదకుల కధికారమున్న పక్షమున, మూలపతులు పెద్ద పెద్ద యంత్రములకు ప్రాతిస్వికరూపమున స్వాములు కాజాలరు. ఉత్పాదకులు,

మూలపతులు తమ తమ యత్నములద్వారా నిజ సంపదల నుత్పన్న మొనర్చుకొని యుండిరి. అధికారమునకు సంబంధించిన యీ ప్రక్రియాక్రమము జ్ఞానయత్నముల నపేక్షించును. ప్రాచీనులలో జ్ఞాన ముండిన, వారు ఉత్పాదకుల నిజాధికారానంతరముననే సముదితరూపముతో సంపత్తిమీాద గల యధికారమును వ్యవస్థీకరింపగలిగి యుండెడివారు. ఇప్పుడుకూడ నుత్పాదకులలో కొందఱకు నుత్పాదక సాధనములపై నధికారముండనే యున్నది. భారతమున చర్మకారులదగ్గర పాదరక్షలను చేయుటకు వలయు సాధనములు వారి స్వంతములై యున్నవి. వారు కొండొక మూలపతికి స్వాధీనులై మహాయంత్రాగారమున పనిచేయరు. రాజ్యముద్వారా యట్టివారికి మహాయంత్రములమీాద సముదితాధికారము కలిగింపవచ్చు. అట్లు జరిగినచో నుత్పాదకుల నిజాధికారము, సముదితాధికారము పూర్వాపరములు కావచ్చును. మధ్యలో మూలపతీయ యుగోత్పత్తి, దాని కారణమున సంపదమీాద మూలపతుల ప్రాతిస్వికాధికారము కలుగకుండును.

భారతమున ప్రాచీనకాలమం దిట్టి యుగము లేక పోలేదు. ఆ యుగమున కొన్ని పెద్ద యంత్రము లుండెడివి. అవి యాధునిక యంత్రములవలె నధిక సంఖ్యలో నధిక పరిమాణములో వస్తువుల నుత్పన్నము చేసెడివి. అయినను నా యంత్రయుగపు మూలపతులను నాశన మొనర్చి యంత్రములమీాద నుత్పాదకులకు సముదితాధికారము కల్పించు నవసర మేరికిని కలుగలేదు. యంత్రకాలపు మూలపతీయోత్పాదనమున దాని నాశకారణములు

స్వతఃసిద్ధముగా వర్తమానములై యున్నయెడలను, వాని జ్ఞానము, జ్ఞానానుసార మగు యత్నము ననవసరములై యున్న పక్షమునను, నా ప్రాచీన భారతమున మూల పతియ యుగోత్పాదనమును తొలగించి యుత్పాదన యంత్రములమీద నుత్పాదకులకు సముదితాధికారము తనకు తానే కలిగి యుండెడిది. అట్లు కలుగలేదు. భారతమున యంత్రకాలమునాటి మనుజులు మూలపతుల యనల్పము లగు నైశ్వర్యములకు కారణము ముఖ్యముగా శ్రామికుల శ్రమను హరించుటయే యని యంగీకరింపరైరి. ఈ యనభిజ్ఞత వలననే యుత్పాదక సాధనములమీద వారికి సముదితాధికారము కలుగదయ్యె.

భూమిమీద గల యధికారక్రమము నుదాహరించి ఎంగల్సు నిషేధముయొక్క నిషేధమునకు గల ప్రభావము నితిహాసమున ప్రదర్శించి యున్నాడు. “మొదట భూమి మీద జనులకు సముదితాధికార ముండెను. వన్యదశను దాటినమీదట భూమిమీదగల సముదితాధికారము ఉత్పాదనమునకు విఘ్న మగును. తరువాత చిరకాలముననో యచిర కాలముననో సముదితాధికారము ప్రాతిస్వికాధికార రూపమున మారిపోవును. కాని, కృషి యున్నతదశ నొందినపుడు, చిన్న, పెద్ద భూములపై క్షేత్రపతుల కున్న నిజాధికారము ఉత్పాదనమునకు విఘ్న మగును. అప్పుడు దానిని తొలగింపవలె నందురు. అంతేకాక మరల నొకమాటు భూమిమీద సముదితాధికార మేర్పడవలె నందురు. కాని, జనులు భూమిమీద సముదితాధికారమును ప్రతిష్ఠింప నెంచరు.

వా రత్యంత మున్నతమైన సముదితాధికార వ్యవస్థ కావలె నందురు. అందువలన నుత్పాదనములో నాటంకము కలుగ కుండవలెను. మరియు నాధునిక రసాయనములు, యంత్ర ములలో నగు నావిష్కారములు నన్నియు పూర్ణముగ నుపయోగింప వలయును.'' (డ్యూరింగు మతఖండనము పు. 154-155)

భూమిమీద గల యీ యధికారక్రమము సామ్య వాదము ననుసరించి చెప్పబడినది. ఈ విషయము నాలో చించిన నాదిమయుగమునందు భూమిపై నధికారము సము దితమై యున్నట్లు స్పష్ట మగుచున్నది. కాని, శిల్పులకు ఉత్పాదక సాధనములమీద నిజాధికార ముండెను. ఆ యుగమునందును గణము ప్రతి వస్తువునకు స్వామి యనుటకు వీలులేదు. శిల్పు లా యుగమునందును నుత్పాదక సాధన ములపై నిజాధికారము కలిగి యుండిరి. ఆత్మవాదము ననుస రించి యాదిమయుగమునందును కొందఱు క్షేత్రపతులు కొన్ని క్షేత్రములమీద ప్రాతిస్వికనిజాధికారము గలిగి యుండిరి. ఎంగల్సు లోకుల కోరికను భూమిమీద గల ప్రాతిస్వికాధి కారమునకు, సముదితాధికారమునకు కారణముగా చెప్పు చున్నాడు. కోరిక కారణ మందుమేని, జనుల జ్ఞానేచ్ఛలు, ప్రయత్నము కారణము లని యంగీకరింపవలయును. భూమి మీద గల యే యధికారవ్యవస్థ యైనను జ్ఞానేచ్ఛాప్రయ త్నములు లేక రూపాంతరము నొందజాలదు. పెద్ద పెద్ద భూస్వాములు పనిచేయు కృషికుల భరణపోషణల నుచితరీతులం జేయుచు, వారి శ్రమను హరింపకున్న మూల

పతీయరూపమున భూమిమీాద నధికారము స్థిరము కాగలదు. భూస్వాములు లోభవశులై యన్యాయ మొనర్చిన కృషీవలురు దుఃఖితులై భూస్వాముల నాశన మాకాంక్షింతురు.

దుఃఖకారక మగు నధికార వ్యవస్థ రోగ మగును. రోగము స్వయముగ తన నాశన కారణముల నుత్పన్నము చేయదు. రోగనిదాన మెరిగిన కుశల వైద్యుడు ఔషధము నిచ్చి రోగమును తొలగించును. వైద్యు డౌషధజ్ఞానము లేనివాడైన రోగి జీవిత మున్నంతవరకు దుఃఖము ననుభవించును. రోగము వృద్ధినొంది తగిన యౌషధము లభింపకున్న నంతమున మృత్యువువాత బడును. అసంగత మగు నధికార వ్యవస్థను తొలగించుటకును నర్థశాస్త్ర జ్ఞాత యవసర మగును. వ్యవస్థలోని దోషములను పూర్ణముగ నెరుగనంత వరకు నెంతకాలము గడచినను నా వ్యవస్థ వినాశము నొందదు. రోగ స్వరూపము దేశకాలభేదములను బట్టి మారుచుండును. సమస్త దేశకాలము లందును రోగముల పరిణామము నియత క్రమమున జరుగదు. అర్థము మీాద గల యధికారమునకు చెందిన యవ్యవస్థలును నన్ని దేశకాలములందు నొకే క్రమమున నుండవు. ప్రచారములో నున్న యర్థవ్యవస్థలోని యే యంశము వలన జనులకు కష్టములు వర్థిల్లునో యా యంశమును తొలగింప యత్నము జరుగును. ప్రచారములోనున్న వ్యవస్థ తనకు తానై తన స్థానమును విడువదు. పదార్థములలోని కొన్ని పరిణామములు యత్నమువలన నేర్పడును. కొన్నింటికి జ్ఞానయత్నము లవసరము లగును. రెండింటి క్రమమునను భేద ముండును.

యత్నము నపేక్షించునట్టియు, నపేక్షింపనట్టియు పరిణామములలో గల భేదమును గుర్తింపని కారణమున ఎంగల్సు నిషేధ నిషేధమును సంగతరూపమున నిరూపింపజాలక పోయెను. ఔపచారిక - గౌణ - వ్యవహారము చేయదలచినచో నర్థవ్యవస్థ తన నాశమునకు కారణమగు ననవచ్చును. నదీప్రవాహమువలన తటము- ఒడ్డు - పడ నున్నపుడు, 'ఒడ్డుపడగోరుచున్న'దని జను లందురు. తటము జడము. దానియందు పతనేచ్ఛ కలుగదు. కాని యిచ్ఛ నారోపించి వ్యవహరింతురు. రోగము వృద్ధియైనపుడు వైద్యుని బిలిచి చికిత్స చేయింతురు. ఆ కారణమున రోగము తనలో తన నాశమునకు హేతువగు విరోధి పరిణామమును తానై కలిగించుకొనినదందుమేని యిది యౌపచారిక - గౌణ - వ్యవహార మగును. ఆచరణములో నున్న యర్థవ్యవస్థ వలన జనులు దుఃఖ మనుభవింప దొడగినపుడు దాని నాశనమునకు వారు యత్నింతురు. రెండవ వ్యవస్థ యందును త్రుటి యేర్పడిన దాని నట్లే తొలగింప యత్నింతురు. దోషము లున్నంతకాలము క్రొత్త వ్యవస్థలను రచియింప యత్నము జరుగుచునే యుండును.

ఒక రోగమున కనేకములగు నౌషధము లుండును. వానిలో కొన్ని త్వరగాను, కొన్ని యాలస్యముగాను రోగము నివారింపగలిగి యుండును. మందవేగముతో రోగ నివారకము లగు నౌషధములకు తరువాత తీవ్రవేగముతో నివారింపగల యౌషధములు కనిపెట్టబడును. పూర్వపు టౌషధము యొక్క ప్రభావము, గుణములు వీని జ్ఞానము క్రొత్త యౌషధ

మును చమత్కారిగా చేయుటకు సహకరించును. ఒక్క యాపధ విషయముననే కాక పూర్వపు ఆవిష్కారములు నవీనావిష్కారములను విశేష ప్రభావ సంపన్నములుగా చేయుటలో సహకరించును. కాని, కొందఱు ప్రతిభావంతులు ప్రప్రథమముననే యుత్తమావిష్కారములను చేయుటయు కలదు. అట్టి యుత్తమావిష్కారముల నెరుగనివారు తరువాత చేయు సామాన్యములగు నావిష్కారములందు గుణవిశేష ముండనేరదు.

ఆవిష్కారము వస్తుధర్మము కాదు. అది జ్ఞాన కార్యము. జ్ఞాన మెల్లరిది సమానము కాదు. కావున దాని క్రమము నియతము కానేరదు. అర్థవ్యవస్థయు వస్తువు స్వాభావిక ధర్మము కాదు. అర్థశాస్త్రిలు దానిని ప్రతిష్ఠింప జేయుదురు. మొదటి యర్థవ్యవస్థలోని గుణదోషముల జ్ఞానము తరువాతి క్రొత్త యర్థవ్యవస్థ నొనర్చుటకు తప్పక కారణ మగును. కాని, యుత్తరకాలీ నార్థవ్యవస్థల క్రమ మును, పూర్వపు టర్థవ్యవస్థ యేదియు నియత మొనర్ప జాలదు. అనేక దేశములలో నొకే కాలమునందు సమాన రూపముగల యర్థవ్యవస్థ ఆచరణమున నుండవచ్చును. కాని తరువాత రాబోవు పరిణామము లన్ని దేశములలోను సమాన ములు కావలెనను నియమము లేదు. విచార భేదమువలన పరిణామములలో భేదము కలుగవచ్చును.

ప్రస్తుతమున మూలపతీయ రూపమున నిజసంపత్తి యాచరణలో నున్నది. దానిమూలమున కోట్లకొలది జనులు దుఃఖితు లగుచున్నారు. ఈ స్థితిలో సుఖము ననుభవించు

వారి సంఖ్య యత్యల్పము. నేడు తఱచుగా జనులు దాని స్థలమున సామ్యవాది వ్యవస్థను ప్రతిష్ఠింపజేయ దలచుచున్నారు. వారి కా యత్నమువలన నుత్పాదన సాధనములపై సముదితాధికారము కలుగవచ్చు. కాని, సామ్యవాదులకంటె నుత్కృష్ట మగు నర్థవ్యవస్థకు సంబంధించిన జ్ఞానమున్నపుడే దానిని ప్రతిష్ఠింప గలరు. మూలపతీయ రూపమున ప్రాతిస్వికాధికారమున గల దోషములు కారణముగా క్రొత్తవ్యవస్థను చేయ యత్నములు జరుగుచున్నవి. కావున నౌపచారికముగా - గౌణముగా - మూలపతీయ ప్రాతిస్వికాధికార వ్యవస్థయే తన నాశమునకు కారణ మగుచున్న దనవచ్చు. వాస్తవమున నిషేధముయొక్క నిషేధము స్వాయముగా నర్థవ్యవస్థలోనుండియే ప్రకటముకాదు. అది పురుషప్రయత్న ఫలము.

## ఇరువదియవ యధ్యాయము

# శ్రమ ఫల వ్యవస్థ

సుఖమును గలిగించునట్టియు, దుఃఖమును నివారించునట్టియు శ్రమ ప్రయోజనకర మగును. శ్రమ ప్రయోజనకారి యగుటకు సహకారి కారణముల నపేక్షించును. సహకారము లభింపకున్న, కారణము కార్యము నుత్పన్నము చేయజాలదు. బీజము జలవాయువాదుల సహకారముతో నంకురము నుద్భవింపజేయును. శ్రమకు జ్ఞానము సహకారి. రైతుకు వ్యవసాయజ్ఞాన ముండును. ఆ జ్ఞాన మతని శ్రమను సుఖదాయకము చేయును. కమ్మరికి శ్రమజ్ఞాన ముండును. కాని యతని జ్ఞానము కృషికి సహాయకము కాదు. కమ్మరి వ్యవసాయముచేయ మొదలిడిన ననుకూల ఫలము లభింపదు. అతని శ్రమ వ్యర్థమగును. శ్రమయుపయోగిత జ్ఞానాశ్రితము. జ్ఞానము, శ్రమ - ప్రయత్నము - రెండు నొకే యాత్మయం దుండును. కావున రెండును కలియును. కలియుటయేకాదు, రెండు నొకే రూపముగలవి యగును. శ్రమ యంగములలో కనిపించును; జ్ఞానము ప్రత్యక్షము కాదు; వానికి గల భేద మింతయే. ఉపయోగియగు శ్రమవినిమయము జ్ఞానకర్మల వినిమయ మని తెలియనగును.

మార్క్సు కేవల శ్రమను వినిమయకారణముగ నెంచియున్నాడు. మానసికశ్రమనుకూడ నతడు కారణ మని చెప్పియున్నాడు; కాని, దానిని తగినంత బలముగా చెప్పి

యుండలేదు. యంత్రపతి ముఖ్యముగా శారీరకశ్రమ నొనర్చు శ్రామికుల శ్రమను హరించి ధనికు డగును. అంగ ములద్వారా మహాయంత్రములను నడుపుటలో మానసిక శ్రమయు తోడగును; కాని యది మిక్కిలి సాధారణ మగును. జ్ఞానప్రయత్నములు రెండు నాత్మగుణము లని యింతకు పూర్వమే చెప్పియున్నాము. చేతనప్రాణి చేయు ప్రతి పని యందు నీ రెండు నుండుట యావశ్యకము. కొండొక వస్తు నిర్మాణమున శ్రమ ముఖ్యము, జ్ఞానము గౌణ మగును. మరియొక వస్తువు నిర్మాణములో జ్ఞానము ముఖ్యమై, ప్రయ త్నము గౌణ మగును. మహాయంత్రములలో వస్తూత్పత్తి కవసరమగు వీలు గలుగుటకు తగిన యావిష్కారముల నొన ర్చుటలో మానసికశ్రమ ముఖ్య మగును. అట్టి శ్రమ నొనర్చు వారికి లభించు ధనము మానసికశ్రమకు ఫల మగును.

మహాయంత్రములలోనే మానసికశ్రమ యుపయో గించు నను నియమము లేదు. శాస్త్రాధ్యాపకులు, వైద్యులు యంత్రరచన చేయరు కాని, వారి మానసికశ్రమ సమాజ మున కెంతో యుపయోగి యగుచున్నది. వీరు ముఖ్యముగా జ్ఞానవినిమయము చేయుదురు. అధ్యాపకులు వ్రాసి, పలికి శిక్షణ నొసంగుదురు. అతడు వస్త్రాదులవంటి భౌతికవస్తువుల నిర్మించి యియ్యడు. అధ్యాపకులకు యోగ్యతానుసారము వేతన మియ్యబడును. అది ముఖ్యముగా జ్ఞానమున కిచ్చు వేతనమే. మంచి వైద్యుడు రోగమును గుర్తించి యల్ప మూల్యముగల యౌషధము నిచ్చి ప్రాణమును రక్షించును. ఆరోగ్యలాభము నంది జనులు యథాశక్తి ధనమిచ్చి వైద్యుని

ప్రసన్నుని జేయ యత్నింతురు. ఒకటి రెండు రూప్యముల యౌషధ మిచ్చి చికిత్స చేసినందుకు వంద, రెండు వందల రూప్యము లిచ్చి వైద్యుని ప్రసన్నుని జేయుటయు కలదు. ఈ విధముగ కుశలుడైన చికిత్సకుడు జ్ఞానవినిమయము ద్వారా ధనికు డగును. పెద్ద పెద్ద కవులు, గాయకులు తమ జ్ఞానము ద్వారా ఆనందము గలిగించి ధనమును పొందుచున్నారు.

మహాయంత్రముల ద్వారా పనిచేయు శ్రామికుల విషయమున జరుగు నన్యాయమును మిక్కిలిగా చూచి యా విషయమున నెక్కుడు ధ్యాన ముంచినందున మార్క్సు వాదులు అధ్యాపకులు, కవులు మున్నగు బుద్ధిజీవుల విష యము నుపేక్షించి యున్నారు. బుద్ధిజీవులలో పెక్కురు జీవన మునకు వలయు సాధారణావసరముల నుండియు వంచితు లయి యున్నారు. మూలపతి, కృషీవలుడు, కమ్మరి, మున్నగువారే కాదు, పెద్ద పెద్ద రాజ్యాధికారులు కూడ వీరి విషయమును పట్టించుకొనువారు లేరు. శారీరిక శ్రమనే ముఖ్యరూపమున మూల్యకారణముగా నంగీకరించినందున తఱచుగా బుద్ధి జీవుల విషయమున నన్యాయము జరుగుచున్నది.

మూలపతి శ్రామికుల శ్రమను హరించి ధనికు డగు చున్నాడు. రాజ్యవ్యవస్థయు ముఖ్యముగా నతనిపై నాధార పడి యున్నది. కావున సామ్యవాది యగు రాజ్యమున శ్రామికుల శాసన మత్యావశ్యక మని మార్క్సు చెప్పి యున్నాడు. కాని, శ్రామికు డైన మాత్రమున నతడు శుభ ప్రదశాసకు డగునను నియమము లేదు. వీరులు, జ్ఞానసంప న్నులు నగువారు ప్రజలలో యథార్థ సామ్యమును ప్రతిష్ఠింప

గలరు. అన్యాయ విరహిత సామ్యమును స్థాపింపదలచినచో శ్రమ, పణ్యముల వినిమయవ్యవస్థ చక్కచేసిన జాలదు. జ్ఞానము, రాజ్యశాసనము ననువాని వ్యవస్థయు చేయవలసి యున్నది. అందరిలోను నీ సమస్త శక్తులు నుండవు. ఒకడు గంభీర జ్ఞానవంతుడైన మరియొకడు పణ్యవినిమయమున నిపుణుడగును. కొందఱిలో శాసనక్షమత యున్న మరి కొందఱిలో శారీరిక శక్తి మిక్కుటముగా నుండును. సంఘశ్రేయస్సుకు ప్రత్యంగమును వ్యవస్థీకరింపవలసి యున్నది.

ధనవైషమ్యము సమస్తానర్థములకు మూలము. కావున మహాయంత్రాగారముల మీద మూలపతుల యేకాధిపత్యమును తొలగింపవలయును. కాని, మూలపతులను దొలగించి భూమిమీదను, యంత్రముల మీదను రాజ్యాధికారులను స్వాములుగ చేసినంత మాత్రమున సామ్యము రాజాలదు. శాసనముతో కూడిన మహాయంత్ర ప్రబంధముల యధికారము శ్రమఫలమును హరించుటకు పెద్ద కారణము కాగలుగును. మూలపతులవలె రాజ్యాధికారులు వ్యవస్థాపకులై యథేచ్ఛగా చరించిన శ్రామికులకు, నుపభోక్తలకు కష్టములు, దారిద్ర్యము తప్పని వగును. నాడు శ్రామికులు, ఉపభోక్తలు నన్యాయము నేవిధముగను నెదిరింపజాలరు కూడ.

వాస్తవమున శ్రామికులు, ఉపభోక్తలు, రాజ్యాధికారులు ముగ్గురు భూమిపై, యంత్రములపై నధికారులు కావలెను. పణ్యవస్తువుల నుత్పన్నము చేయుటలో శ్రామికులకు, నుపభోక్తలకు నధికార ముండవలెను. శ్రామికుల

శ్రమకు పూర్ణమగు వేతనము, పణ్యములమీద నుపభోక్తల కుచితమగు మూల్యము, రక్షణ నిమిత్తముగా రాజ్యమున కుచితమైన పన్ను లభింపవలెను. ఇట్లు వీరందరు కలిసి వ్యవస్థ చేసినచో నవసరములకు మించి పణ్యము లుత్పన్నములు కావు. ఉత్పాదకులలో పోటీ లుండవు. జనులకు భోగ సాధనములనుండి వంచితులు కావలసిన యగత్య ముండదు. రాజ్యమునకు వలయు ధనము కష్టము లేకయే లభించును.

శ్రామికుడు కానీ, యుపభోక్త కానీ, రాజ్యాధికారి కానీ, యెవడైనను భయము లేకున్న నన్యాయముతో ధనమును హరింప యత్నించును. మూలపతీయ పద్ధతి నాశ్రయించి యుత్పాదనము, శాసనము జరిగిన శ్రామికులు, నుపభోక్తలు నధిక కష్టములపా లగుదురు. సామ్యవాదపు టాధునిక పద్ధతిలో శ్రామికులకు నన్నపానములలో కొంత వీలు కలుగ వచ్చును. కాని, యుపభోక్తలకు జరుగు నన్యాయమున కాటంకము లేదు. యంత్రాగారములమీదను, సమస్త మూలధనముమీదను నధికార ముండుటచే రాజ్యమున కభూతపూర్వసంపదలు సంచితము లగును. అధికారులు సంపదల నిష్టమువచ్చిన ట్లనుభవింతురు. వారి నడ్డగించుటకు శ్రామికులకుగానీ, యుపభోక్తలకు కానీ యవకాశ ముండదు. యంత్రాగారములమీదను, భూమిమీదను, ముడిసరకును కొనుటకు వలయు మూలధనముమీదను శ్రామికులు, ఉపభోక్తలు, రాజ్యాధికారులు ముగ్గురికి నధికార మున్న నన్యాయమును దూర మొనర్ప నొక్కొక్కడు యత్నించును. ముగ్గురును మూలపతు లగుదురు. ముగ్గురును తమ తమ

మూలధనమును రక్షింప యత్నింతురు. ముప్వురికంటె వేరుగా నొకరుగానీ, యనేకుల సముదాయముకానీ మూలపతిగా నుండరు. ఒకడు మరియొకరి శ్రమను - రక్తమును - చవి చూడడు.

పణ్యాముల యుత్పత్తిలోను, విక్రయములోను ఉపభోక్తల కధికారము లేకున్న వారు శ్రామికులయు మూలపతులయు చేతులలోబడి కష్టముల పాలగుదురు. రోగి యైనపుడు ప్రతి వ్యక్తియు చికిత్సకొఱకు వైద్యుని శరణు జొచ్చును. వైద్యుడు ఔషధముల సిద్ధముచేయుటలో శ్రామికు డగును. ఔషధ ముల నుత్పన్నము చేయువాడు మరియొక డైనపుడు ఉప భోక్తలకు, ఉత్పాదకులకు మధ్యనుండు వ్యాపారి వైద్యు డగును. ఆ స్థానమును మరియొకడు గ్రహింపజాలడు. ఈస్థితి నుపయోగించుకొని వైద్యుడు రోగులనుండి స్వేచ్ఛగా ధనము సంగ్రహించును. కుశల వైద్యులద్వారా చికిత్సను చేయింప జాలక పలువురు మృత్యువాతం బడుటయు జరుగుచున్నది. కొందఱు సంవత్సరములకొలది రోగగ్రస్తులై యుండుటయు కలదు. రోగులగువారే సముదితరూపమున నౌషధము లను సిద్ధపరుచుకొనిన వైద్యున కుచిత ధన మొసంగి యెల్లరకు నుచితచికిత్స చేయించుకొనవచ్చును. వైద్యులు, రోగులు పరస్పర ముత్పీడకులు కాక హితైషులు కావచ్చు. నీరోగదశలో నెవడును వైద్యుని సుఖదుఃఖముల నాలో చింపడు. కావున వైద్యుడు రోగి తనచెంతకు చేరినపుడు వీలైనంత వసూలు చేయజూచును.

నేడు రైలుబండ్లు, బస్సులు మున్నగు యాత్రాసాధనముల వ్యవస్థ పలుతావులందు రాజ్యాధీనమై యున్నది. యాత్రికుడు తన సుఖమునకొఱకు కందు నెట్టి పరివర్తనము చేయజాలడు. అట మూలపతుల యధికారము లేకున్నను యాత్రికుల కష్టములకు కొఱంత లేదు. వాహనముల వ్యవస్థాపకులు లంచము తీసికొని యాత్రికుల ధనము నపహరించుటయు కలదు. ఒక స్థానమునుండి మరియొక స్థానమునకు పణ్యవస్తువులను బంపునిమిత్తము వ్యాపారులు నధికారులకు లంచము లీయక తప్పదు. ఇట్టి భ్రష్టాచారము తఱచుగా నున్నది.

వ్యావహారిక దోషములను పరిహరించుటకు వ్యవహారమున నుపభోక్తలకు, నుత్పాదకులకు రాజ్య వ్యవస్థాపకులకు సముదితాధికార ముండుట తగును. పరస్పరాపేక్ష యనివార్యమైనపు డొకడు మరియొకని కన్యాయము చేయజాలడు. పరప్రయోజనమును తన ప్రయోజనముగా నెంచనంతవరకు వా రొండొరులకు సహాయము చేయజాలరు. స్వార్థమును సాముదాయిక మొనర్చుటకు పణ్యోత్పాదన విక్రయములలో శ్రామికులకు, నుపభోక్తలకు, రాజ్య వ్యవస్థాపకులకు ముప్వురకు సమానాధికార ముండుట యవసరము. సంఘమునకు చెందిన ప్రతి వ్యవహారమునందు నిట్టి వ్యవస్థ యుండవలెను. అందువలన ప్రతివ్యక్తియు చిన్నదికానీ, పెద్దది కానీ, ప్రతి కార్యమునందును తన స్వార్థమును గుర్తింపగలడు. చర్మకారుడు, కమ్మరి, కుమ్మరి, చాకలి, మంగలి, అధ్యాపకుడు, మంత్రి, న్యాయపతి, సైనికుడు నెల్లరు కొండొక వస్తు

వును నిర్మించువారే యగుదురు. ఒకడు వస్తువున కుత్పాదకుడైన రెండవవాడు భోక్త యగును. ఉత్పాదకునకో, మూలపతికో వస్తువుమీాద నధికార మున్నంతవరకు నుపభోక్తల స్వార్థముతో నైక్య ముండదు. రాజ్యము, నుపభోక్తయు ప్రతి కార్యమునందును మూలధనము నుపయోగించినచో శ్రామికుడు, మూలపతియే కాక యెల్లరు వీధుల నూడ్చుట మొదలు ప్రధానమంత్రి చేయు కార్యమువరకు గల పను లన్నియు వ్యవస్థితరూపమున నడుప యత్నింతురు. అప్పుడే జ్ఞానము, శ్రమ రెండును తగిన రూపములో ప్రతిష్ఠితము లగును.

# ఇరువది యొకటవ యధ్యాయము

# జ్ఞానశ్రమల ప్రభావము

ఆడమ్ స్మిథ్ మొదలు మార్క్సు వరకు గల యర్థ శాస్త్రులందరు శ్రమయే సంపత్తికి మూలమని చెప్పిరి. వాస్తవమున శ్రమ, జ్ఞానము రెండును సంపత్తికి ప్రధాన కారణములు. ఎంగల్సు శ్రమలోనున్న మహాప్రభావమును ప్రకటించుటకు శ్రమయే మనుష్యుని నిర్మించినదని చెప్పియున్నాడు.

ఎంగల్సు డార్విన్ వికాసవాదమును యథార్థమని నమ్మినవాడు. కావున, లక్షలు, కోట్లు వర్షములకు పూర్వమున వనమానవుల జాతి యొకటి యుండెడిదనియు, నది యధిక వికసిత ప్రాణివర్గ మనియు నతడు చెప్పుచున్నాడు. శ్రమ కారణముగ నాజాతినుండి యనేకయుగములకు తరువాత మనుష్యులు ప్రకటమైరి. మానవులకు పూర్వజులయిన వారు హిందూమహాసముద్రమున నెన్నడో మునిగి పోయిన భూమిపై నుండిరి. వారు వృక్షముల మీదను, పొదలలోను నుండెడివారు. అవసరములను బట్టి యీ శాఖామృగములు సమతలభూమిమీద నడుచునపుడు చేతులతో పని తీసికొనుట మానిరి. వీలయినంతవరకు నిలువుగా నడువసాగిరి. వృక్షములమీద నెక్కునపుడు కాళ్లకంటె భిన్న పద్ధతులలో చేతుల నుపయోగించిరి. భూమిమీద నడుచుటకు చేతులు క్రొత్తపద్ధతులతో పను లొనరింప ప్రారంభించెను.

కోతినుండి మనుష్యు డగుట కిది ముఖ్యకారణము. ఇది యంతయు వికాసవాదుల యూహ.

కాని, యొకజాతినుండి మరియొకజాతి యుద్భవించిన దను కల్పన ప్రమాణశూన్యము. విషయాంతర మగునను భయముతో నీ విషయము నిట నెక్కుడుగా పరీక్షింప దలప లేదు. కూర్చుండుటలోను, లేచుటలోను, తినుటలోను, త్రాగుటలోను భేదము వచ్చినంతమాత్రమున శరీరాకృతిలో నొకింత యల్పభేదము కలిగిన కలుగవచ్చును; కాని, యెక్కుడు భేదము కలుగదు. ఒకజాతి మరియొక జాతిగా మారదు. మొదట యంగములు దుర్బలములైన, తరువాత సబలములు కావచ్చు; లేక సబలాంగములు దుర్బలములు కావచ్చును. గుఱ్ఱములు వేగముగా పరుగెత్తగల జంతువులు. వాని సంతాన మొకప్పుడు మందగతి గలవి కావచ్చును. కొన్ని కుక్కలు పెద్దవిగాను, భయంకరముగాను నుండును. వాని సంతాన మొకింత చిన్నదిగాను, చూచుటకు సాధువులుగా నుండునట్లు చేయవచ్చును. కాని, కుక్కను గుఱ్ఱము, గుఱ్ఱమును కుక్క చేయజాలము.

యుగములవరకు భిన్నావస్థలలో నున్నందున నొక ప్రాణి సంతానము శరీరాకృతిలోను, మానసిక స్వభావము లోను కొంత భేదము కలిగినది కావచ్చు. అవి విజాతీయము లుగా కనిపింపవచ్చును. గుఱ్ఱము, గాడిద ఆకారమునను, స్వభావమునందును భిన్నములుగా నుండును. కాని వీని పూర్వజు లొక్కటిగా నుండెను. గుఱ్ఱము, గాడిద వీని సంయోగమువలన కంచరగాడిద యుత్పన్న మగును.

స్త్రీపురుష వ్యక్తులు పరస్పరము కలిసి సంతాన ముత్పన్నము చేయుట ప్రాణుల జాత్యైక్యతకు ముఖ్య ప్రమాణము. ఒక పూర్వజుని సంతాన మాకారమున మిక్కిలి భిన్నమైననాడు పరస్పరము కలిసి తఱచు సంతానమును గనవు. కాని, భిన్నమైన వానిలో స్త్రీపురుష వ్యక్తులు కలిసిన సంతానము తప్పక కలుగును. గుఱ్ఱము, గాడిద వేనితో కలిసి సంతానము నుత్పన్నము చేయగలుగునో వాని యన్నింటి జాతి పూర్వమున నొక్కటియై యుండును. కుక్కలతోను, పిల్లులతోను కలిసి గుఱ్ఱముకానీ, గాడిదకానీ సంతానము గనజాలదు. కావున వాని జాతి యొక్కటి కాదు. ఈ నియమమే వనమానవులు - శాఖామృగములు - మానవులు నొక్క-జాతివారు కారని ఋజువు చేయును. వారు పరస్పరము కలిసి సంతానము గనజాలరు. వారి శరీర రచనలో లోపల, వెలుపల కొంత సామ్య ముండవచ్చు. ఆ సామ్యము జాత్యైక్యతకు ద్యోతకము కాదు.

చింపాజీ ......... యొక విధమగు వనమానవుడు. ఇవి వృక్షములమీద వర్షాదులనుండి తప్పుకొనుట కొక విధమగు నాచ్ఛాదనము కలిగించుకొనును. శత్రువుల నెదుర్కొనుటకు చేతిలో దండగ్రహణముకూడ చేయును. మానవుల పనులలో కొన్నింటి ననుకరింప యత్నించును. అవయవములలో, నెముకలలో, మాంసకండరములలో మానవులతో వీనికి కొంత సామ్య ముండును. అయినను, ఎంగల్సు ననుసరించి చూచిన నెట్టి యాటవికుడైనను నతడు తన చేతులతో చేయు పను లనేకము లున్నవి. వానిని కోతికానీ, వనమానవుడు

కానీ యనుకరింపజాలడు. ఏ వనమానవుడు కానీ, కోతికానీ రాతిని కత్తిగా చేయజాలదు.

ఈ భేదము వనమానవుని జ్ఞానమునకు, మానవుని జ్ఞానమునకు గల యతిభేదమునకు కారణము. ఇట్టి జ్ఞానభేదమునకు కారణము జాతిభేదమే. జాతుల భేదము స్వాభావికము. పరస్పరము కలిసి సంతానము కనలేని జాతు లనాదీ కాలమునుండి భిన్నజాతులుగానే యున్నవి.

చేతుల యభ్యాసము కారణముగ గలుగు లాభప్రభావము శరీరముయొక్క యితరాంగములమీదను పడును. అన్యాంగముల యాకారమును కొంత మారవచ్చు. కాని, యీ మార్పు లన్నియు కొంతవరకే కలుగును. మానవుని చేతిలో క్రమముగా ప్రావీణ్యము కలిగియుండవచ్చును; కాని, యది మొదటినుండియు మానవహస్తమే కాని యన్య శాఖామృగ హస్తము కాదు.

హస్తవికాసము, శ్రమ కారణములుగ మానవుడు ప్రకృతిమీద నధికారము కలవాడు కాలేదు. అతడు తన జ్ఞానమును వృద్ధిపరచుకొని ప్రాకృతిక శక్తులను గుర్తింప గలిగెను. వానిని వశపరచుకొనెను. మనుష్యునిచెంత నుత్కృష్టజ్ఞానమే లేకున్న నత డుత్కృష్ట శ్రమయు చేయ జాలడు. శ్రమోత్కర్షవలన లాభము కలిగినది. జనులు పరస్పర మెక్కుడుగా నాశ్రితు లయిరి. కాని దీని కంతటికి మూలకారణము జ్ఞానము. దేశకాల భేదములవలన మానవుని మార్గమున ననేక విఘ్నము లుప్పతిల్లినవి. వానిని దూర మొనర్చుటకు నవీనసాధనముల యావిష్కారము కలిగెను.

ఇది యంతయు జ్ఞానోత్కర్ష కారణమున సంభవ మయ్యెను. నవీనావస్థ లేర్పడినంత మాత్రమున జ్ఞానములేక యే యావిష్కారములు జరుగజాలవు.

స్పష్టవాక్కు కారణముగ మానవులకు నితర ప్రాణులకు మిక్కిలి భేద మున్నది. ఈ విషయమునందు శ్రమ ప్రభావమును ప్రదర్శించుటకు కల్పన చేయబడినది. మాటలాడ యత్నించినందువలన కోతి కంఠనాళములో క్రమముగా మార్పులు వచ్చిన వనియు, ముఖావయవములు సంయుక్తములు, నసంయుక్తము లగు వర్ణముల నుచ్చరింప నేర్వగలిగిన వనియు చెప్పుదురు. కాని, కోతి కంఠరచనకు మానవ కంఠరచనకు మొదటినుండియు భేద మున్నది. కోతి నిరంతరము యత్నించియు వర్ణములను స్పష్టముగ నుచ్చరింపజాలదు. నేటివరకు నే కోతియు వర్ణముల నుచ్చరింప లేదు. అన్యప్రాణుల కంఠనాళము మానవుల కంఠనాళముతో సమానము కావచ్చును; కాని యిది యభ్యాసవశమున వచ్చిన సామ్యము కాదు. సహజసిద్ధము. మానవ శరీరమునకు శుక శరీరమునకు నెంతో భేద మున్నది. నేర్పినచో శుకకంఠము మానవకంఠమువలె వర్ణోచ్చారణ చేయగలదు. కాని శుకకంఠమున నీ శక్తి జన్మసిద్ధమే కాని యభ్యాస బలమున వచ్చినది కాదు. శక్తి యున్నందున నది వర్ణోచ్చారణ నేర్వగలదు. శ్రమవలన సహజశక్తులలో భేదమేర్పడిన నర, వానర కంఠములు మిక్కిలి సమానములై యుండవలెను. కాని వానర మెంత కాలము మానవుని చెంత నున్నను వాని భాషను నేర్వజాలదు.

వికాసవాదము ననుసరించి పూర్వకాలమున వానరమునకు తాను మానవుడు కాదగిన విధమున శ్రమ చేయవలసి వచ్చినట్లు తెలియుచున్నది. ఆ శ్రమ యన్ని యంగములమీదను తన ప్రభావమును కలిగించినది. కావున నా శ్రమనుబట్టి చేతులేకాక మస్తిష్కము కూడ మార్పు చెంది యుండవలెను; ఇట్లే యన్యేంద్రియములలోను మార్పు వచ్చి యుండవలెను. కావున వానరవాణి మానవవాణి కంటె నెంతో వెనకబడరాదు. వానరజన్మకు మానవ జన్మకు మధ్య వ్యవధాన మేమియు లేదు. వికాసవాదుల దృష్టిలో శుకమునకు మానవునకు మధ్య ననేక జన్మల యంతర మున్నది. శుకజన్మము తరువాత నెన్నో జాతులు వికసించి చివరకు వానరము దాని యనంతరమున మానవుడయ్యెను. మధ్య ననేక జాతుల యంతర మున్నందున శుకకంఠమునకు మానవకంఠముతో నెట్టి సామ్యము నుండరాదు. శ్రమవలన శుకకంఠము మానవకంఠ సామ్యమును సంపాదించిన, శుకమునకు తరువాత వికసించిన జాతుల కంఠము శుకకంఠమును బోలి యుండవలెను. శుకమువలె నవియు నేర్పినచో వర్ణోచ్చారణ చేయగలిగి యుండవలెను. కాని యట్లుకాక శుక మెంతో వ్యవధాన మున్నను మానవునిబోలి వర్ణముల నుచ్చరింప గలుగుచున్నది. వ్యవధానము లేని వానర ముచ్చరింప లేకున్నది. కాబట్టి శ్రమ, వానరకంఠమును గానీ, మరియొక ప్రాణి కంఠమును గానీ మానవకంఠమునకు సమాన మొనర్ప లేదని స్పష్ట మగుచున్నది.

గ్రద్ధ మనుజునికంటె నెక్కుడు దూరము చూడగలదు. కుక్క పసిపట్టగలదు. కాని, మానవునివంటి మస్తిష్కము లేనందున నవి రూపములలోని, గంధములలోని యవాంతర భేదములను కనిపెట్టజాలవు. ఉత్కృష్టమగు మస్తిష్కము మానవునకు సహజసిద్ధమగు నంగము. ఇతర జాతులనుండి గ్రహించి యిది సంస్కరింపబడినది కాదు. ఎంగల్సు వికాస వాదము ననుసరించి మస్తిష్కములోని యుత్కర్షకు కారణము శ్రమయు వాణియు ననుచున్నాడు. ఇదియంతయు కల్పనయే. శ్రమవలన వాణి ప్రకటమైన దనుట మొదటి కల్పన. దానిద్వారా వాణి కారణముగ వానర మస్తిష్కము మానవ మస్తిష్కముగా పరివర్తిత మైనట్లు అంగీకరించి యున్నారు.

జ్ఞాన మాత్మగుణము. భిన్నభిన్న జాతుల ననుసరించి యది యొకయెడ తీవ్రముగ ప్రకట మగును. మరియొకట మందముగ ప్రకట మగును. జ్ఞానమును ప్రకటించుట కనువగు భౌతిక సాధనము మస్తిష్కము. అది మానవేతర ప్రాణులలో మిక్కిలి యున్నతము కాదయ్యె. మానవునం దది చరమోత్కర్ష నందినది. ఆ మస్తిష్కమునుండి ప్రకటమై జ్ఞానము తన చమత్కారమును చూపుచున్నది. నానావిధ రత్నముల రూపభేదములో సూక్ష్మతను మనుజు డెరుగుచున్నాడు. వానరము రత్నపరీక్ష నొనరింపజాలదు. కుక్క దూరమునుండి గంధమును గ్రహించును; కాని యది నానావిధ గంధభేదము నెరుగజాలదు. దీనికి ముఖ్యకారణము జ్ఞానము.

జ్ఞానము కారణముగ మానవుడు సమాజమును రచించినాడు. అందునను మానవునకు నితర ప్రాణులకు నెంతో భేద మున్నది. అన్యప్రాణులు కలిసి యొకచో నుండును; తిరుగాడును. సమూహములుగా నుండును. కాని వాని సమూహము సమూహము మాత్రమే. దానిలో నొక వ్యవస్థ యేమియు నుండదు. ఒకవేళ నట్టిది యున్నను నిమ్నకోటికి చెంది యుండును. సంస్కృతమున నీ భేదమును తెలుపుటకు సమాజ, సమజపదములు ప్రయోగింపబడును. మానవ సమూహము సమాజ మనబడును. జంతు సమూహము సమజ మనబడును. ఈ రెండు సమూహములలో గల యంతరము వాని కర్మలవలన తెలియును. మానవుడు శ్రమద్వారా ప్రాకృతిక పదార్థములను మిక్కిలి సుఖదాయకములుగ చేసికొనును. పశువు లట్టి శ్రమ నొనరింపజాలవు. వానర సమూహము వృక్షఫలములను, పత్రములను తినును. కాని విత్తనములను విత్తి వృక్షములను పెంచజాలవు. విత్తనములను నాశనముచేయుచు నవి బాధ పడవు. ఖాద్యములు దొరకనపు డాకలిచే చచ్చును. ఈ భేదము కేవలము కర్మభేదము కాదు. జ్ఞానభేదమువలన కలిగిన కర్మభేదము. మానవుడు జ్ఞాని. కావున పైరుచేసి పంటలను పండించును. పశువులు జ్ఞానములేనివి కావున దొరకినంత తినును. ఖాద్యములను సులభమొనర్చుటకు మానవుడు జ్ఞానము ననుసరించి యనేకోపాయముల నొనర్చును. పశువు జ్ఞానహీన మగుటచే నెక్కుడు ఖాద్యమును నాశ మొనర్చును; కొలదిగా తినును.

భక్షణము ద్వారా ఖాద్యమును నాశ మొనర్చుటయు వానరము నర డగుట కొక కారణముగా చెప్పబడినది. 'ఎక్కుడు నాశ మొనర్చుటవలన పశువులకు ఖాద్యము దుర్లభ మైనది. అంతట గత్యంతరము లేక మరియొక విధమగు ఖాద్యము గ్రహింపవలసి వచ్చెను. అందువలన జాతిలో భేద మేర్పడినది. భోజన పరివర్తనము శారీరక రచనలో రసాయ నిక పరివర్తనము కలిగించును. క్రమముగా శరీర ప్రకారము మారినది. ఒక కాలమున నున్న జాతి నశించి దాని కన్నివిధ ముల భిన్నమగు మరియొక జాతి యుద్భవించును' అని నవజాతి నిర్మాణమును గూర్చి చెప్పుదురు.

పశువులు వివశములై దొరికినది తినవచ్చు. దానివలన వాని రుధిరమాంసాదులలో హెచ్చుతగ్గులు కలుగవచ్చును. పలుతరములకు తరువాత నాకారములలో నవి చిన్నవి పెద్దవి కావచ్చును కాని, పశువులకు పక్షములు కలిగించునట్టియు, అశ్వాదులకు తొండము నుత్పన్నము చేయగలట్టియు నాహార భేద మెక్కడనైన నున్నదా ? భిన్నజాతులలో నత్యంత భిన్నములుగా నుండు నంగముల నుత్పన్న మొనర్చు భోజన పరివర్తన మూహింపరానిది.

వానరులు నర లగుటకు మాంసభక్షణ మొక విశేష కారణముగ చెప్పబడును. ఆదిమ మానవుడు శాకాహార మునుండి మాంసభక్షణ చేయ మొదలిడినా డని యంగీక రించినను, వృక్షములవలె నతని శరీరము వృద్ధియగుటకు తగిన యవకాశము లభించిన దని యెంచినను, మాంస భక్షణము శరీరము నొకింత బలవంతము చేయుటకు మించి

మనుష్యునియందుగల యన్యములగు నుదాత్త గుణముల నెటనుండి కలిగింపగలదు? మాంసభక్షణవలన మానవ మస్తిష్కములో కొంత మార్పు వచ్చునని యంగీకరించినను దానివలననె యాదిమానవుని ప్రతిభ తీవ్రమైన దని యంగీకరించుటకు ప్రమాణ మేమి? ఆదిమానవు లందరు పశువుల వలె మూఢులు కారనియు, వారిలో కొందఱు ప్రతిభావంతు లుండి రనియు నిదివరకే పలుమారు లుల్లేఖించి యుంటిమి. వారు మాంసము తినకుండిరి. శాకాహారు లయినను వారి శరీరములో ప్రచండ బల ముండెను. కావున మాంస భక్షణము చేయకున్న మానవ మస్తిష్కములో నున్నతి కలుగదనుట మిక్కిలి భ్రమ యగుచున్నది.

శారీరిక బలమునందును, జ్ఞాన బల మునందును, ఇంగ్లండు, ఫ్రాన్సు మున్నగు దేశములు నేడు మరికొన్ని దేశములకంటె ముందంజ వేయుచున్నవి. ఈ దేశములలో తఱచుగా నందరు మాంసభక్షకులే యున్నారు. అందు వలన భ్రమ కలుగుచున్నది. కాని భారతమున కోట్లకొలది మానవులు శాకాహారులై యుండిరి. నాటి పండితులు వ్రాసిన గ్రంథములు చూచి నేటి పాశ్చాత్య విద్వాంసులు కూడ చకితు లగుచున్నారు. దీనివలన నేమి సిద్ధమగును?

జ్ఞానము, శ్రమయు మానవుని స్వాభావిక గుణములు. అభ్యాసమువలన నివి వృద్ధినొందును. పశువు, వనచరు డగు నజ్ఞాని మనుజుడు, శిక్షిత నాగరికుడు నను వీరి ముగ్గురిలో గల భేదమును జ్ఞానము శ్రమయు ప్రకటించును. వంశ పరంపరవలన మానవుని జ్ఞానము వృద్ధిజెందును. పశువు

సహజజ్ఞానమును పెంపు చేసికొనజాలదు. పశువు తినగలుగును, త్రాగ గలుగును. సంతానము కనగలుగును. శత్రువు నెదుర్కొన గలుగును. ఈ కర్మల నజ్ఞానియు, జ్ఞానియు నిరువురు చేయగలుగుదురు. అజ్ఞానియైన మనుజుడు కూడ తా నుండుటకు గృహము నిర్మించుకొనును. వృక్షముల నుండి ఫలాదులను కోయుటకు వలయు సాధనములను నిర్మించుకొనును. అగ్నిని ప్రజ్వలింపజేసి యన్నము వండును. ఇట్టి పనులు పశువు చేయజాలదు. శిక్షితుడైన వాడీ పనులను బాగుగ చేయగలుగును. అనభిజ్ఞుల శ్రమలో కౌశల ముండదు. శిక్షితుల శ్రమ కుశలతాపూర్ణమై యుండును. దీనికి కారణము జ్ఞానము. మానవుని జ్ఞాన మెంత యుత్కృష్టమైన నత డంత యుత్కృష్ట సాధనములను సుఖప్రాప్తికి, దుఃఖ నివృత్తికి ననువగువానిని నిర్మించును. మందజ్ఞానము వలన వనచరు డట్లు చేయజాలడు. ఇది యంతయు జ్ఞానము, శ్రమ వీని రెంటి మహిమయే.

ఆత్మవాదము ననుసరించి యాత్మజ్ఞానము వనస్పతి మొదలు మానవునివరకు గల ప్రాణులలో మంద తీవ్ర భేదములతో ప్రకట మగుచున్నది. వనస్పతులలో జ్ఞాన మత్యంత మందముగా నున్నది. క్రిమి కీట పతంగ పశ్వాదులలో నది క్రమముగా తీవ్రరూపమును ధరించును. మానవునం దన్నిటికంటె నెక్కుడు తీవ్రరూపమున ప్రకట మగుచున్నది. జ్ఞానము ననుసరించి శ్రమలో నుత్కర్షాపకర్షలు జరుగుచుండును. శుకములు వృక్షఫలములను వ్యర్థముగా నష్టపరచును. మూషకములు పైరు కొట్టివేయుచు చింతింపవు.

మేకలు, లేళ్ళు వృక్షములమీద నాకుల నుండనీయవు. మనుష్యు డాలోచింపక మొక్కల నూడబెరుకడు. పైరుకు నష్టము కలిగించు మొక్కలను మాత్రము పెరికివేయును. తానున్న హితాహితముల నాలోచించి పనిచేయువాడు కావున మానవు డితర ప్రాణులకంటె భిన్నుడగుచున్నాడు. పశుపక్షులు మున్నగువానియందును భావియాలోచన కొంత లేకపోదు. కాని బహుదూర మవి యాలోచింప జాలవు. కుక్కలు ఖాద్యవస్తువులను దాచియుంచి యాకలి యైనపుడు వానిని మరల తినును. అంతకంటె నెక్కుడవి చేయజాలవు. మనుజు డన్నము నెక్కువ పండించుటకు తగిన ట్లాలోచింపగలడు. ఉత్తమరీతుల ననుసరించి యుత్తమఫలములను సంపాదింపగలడు. మనుజు డొనర్చు శ్రమను చూచి నపుడు ప్రకృతి యతని వశమైనదా యన్నట్లు గోచరించును. కాని మానవునకు నన్యప్రాణులకు గల యీ భేదమునకు కారణము కేవలము శ్రమ యనుట పొరపాటు. జ్ఞానము, శ్రమ రెండు ననక తప్పదు. మొదట జ్ఞానము, తరువాత శ్రమయు ప్రకృతికి గల సహజాకారమును మార్చును.

కాలభేదమును బట్టి మానవుని జ్ఞానములోను, శ్రమయందును తారతమ్య మేర్పడుచు వచ్చెను. ఒకప్పుడు భారతీయ విద్వాంసు లాకాశ గమనమున కనువగు విమానముల నిర్మించియుండిరి. సముద్రములమీద నావలపై విహరించిరి. భోజరాజ నిర్మిత సమరాంగణము, సూత్రధారాది సంస్కృత గ్రంథములలో వీని వర్ణన చూడనగును. దండిచే రచియింపబడిన దశకుమార చరితమునందు జలములోపల

చరించు 'మద్గు' నామక సముద్రపోతమును చూడవచ్చు. నీళ్ళలో మునిగిపోవునది కాబట్టి 'మద్గు' అని దానికి పేరు గలిగినది. మరియు ననేకాశ్చర్యకరములయిన యావిష్కారములు పూర్వపు గ్రంథముల గనవచ్చును. కాలాంతరమున నా జ్ఞాన మిట లుప్త మయ్యెను. నేడు పాశ్చాత్య దేశములు జ్ఞానమునందును, శ్రమలోను నత్యంత వృద్ధిని కాంచుచున్నవి. ఈ దేశములు ప్రకృతిని మిక్కిలిగా వశపరుచుకొనుచున్నవి. ప్రకృతిమీద నియంత్రణ మెక్కుడైన కొలది మానవుని జ్ఞానము, శ్రమయు నెక్కుడు ప్రకట మగును. ఆధునికావిష్కారములు శ్రమను ప్రకటించును. ఆ శ్రమ జ్ఞానమును ప్రకటించును.

పశువులకు మనుష్యులకును, మనుష్యులలో శిక్షితులకు నశిక్షితులకును గల భేదమును జ్ఞానము, శ్రమయు రెండును ప్రకటించును. జ్ఞానము, శ్రమ రెండును భిన్న భిన్న సమాజములనుండి యుత్పన్న మగును. కార్యము తన యుత్పత్తికి కారణము నపేక్షించును. కారణము ప్రత్యక్షము కానితావున కార్యమునుబట్టి యూహింపనగును. 'అన్నవస్త్రములు, భవనములు, విమానాదులు, వాని వ్యవస్థలు చూచినపుడు జ్ఞానము, శ్రమ రెండును తెలియ నగును. వీనిని తెలిసికొనినపుడు జ్ఞానులయు, శ్రామికులయు సమాజములందు గల యంతరము తెలియ నగు ననుట మరువరాదు.

## ఇరువదిరెండవ యధ్యాయము

# అర్థవ్యవస్థద్వారా ధర్మరక్షణ

పూర్వాధ్యాయములను చదివిన మీదట నేడాచరణలో నున్న యర్థవ్యవస్థ వలన ధనపతుల ద్వారా కలుగు నన్యాయమునకు ప్రతీకారము కలుగదని స్పష్టమగును. సమాజమున ధర్మము ప్రతిష్ఠించుటకు భౌతికములు, నాధ్యాత్మికములు నగు సుఖముల పరాకాష్ఠను సంపాదించుటకు క్రొత్త పద్ధతిలో నార్థికవ్యవస్థ యేర్పడవలసి యున్నది. జీవనోపయోగివస్తువులను సంపాదించుట కగు కష్టములు దూరము కానంతవరకు జనులు ధర్మము నుచిత రీతిని పాలింపజాలరు.

గృహధర్మము సర్వధర్మములకు మూలము. అర్థవ్యవస్థ వికృతమైనపుడు గృహధర్మము స్థిరము కాజాలదు. అందువలన సమాజ మధోగతిని బొందును. తఱచుగా జనులు ధర్మమును వ్యావహారికముగా నెంచరు. అది వారి కొక దూరపు వస్తువు. అనేకులు వ్యవహారమునకు ధర్మముతో సంబంధమే లేదందురు. వారి దృష్టిలో వ్యవహారమునకు ధర్మముతో సంబంధము కలిగింప నెంచినవానిలో విరోధ మేర్పడుట తథ్యము.

తనకొఱకు, తన కుటుంబముకొఱకు చేయునదంతయు వ్యవహార మనబడును. జీవన నిర్వాహముకొఱకు చేయు కృషి, వ్యాపారము, నౌకరి మున్నగున వన్నియు వ్యవహార

ములే. మనుష్యున కన్నవస్త్రముల కొఱకే దేని చేయక తప్పదు. అతనికి ధర్మాచరణమునకు సమయ ముండదు. ధర్మ మాచరింపబూనిన దినమున నెక్కుడుకాల మందులోనే వ్యయ మగును. అతనికి ధనము లభింపజాలదు. ఆకలితో నుండి ధర్మ మాచరింప వలయును. ధర్మ మాచరించువానికి వలయు పదార్థములు లభింపజాలవు. జనులలో నిట్టి విశ్వాసము లెన్నియో యేర్పడి యున్నవి. అందువలన మానవ జీవనోపయోగివ్యవహారము ధర్మము కాదని యభిప్రాయ పడుచున్నారు.

కాని, యిట్లు విశ్వసించుట ధర్మము నత్యంతము సంకుచితము చేయుట యగును. ప్రాతః సాయం సంధ్యాగ్ని హోత్రములు, యజ్ఞోపవీతధారణము, నిత్యవేదపఠనము, భగవన్నామ జపము మాత్రమే ధర్మము కాదు. పరులకు పీడ కలిగింపక వలయు ధనము నార్జించుటయు ధర్మమే. అగ్నిహోత్రాదులే ధర్మ మగునెడల నితర వ్యవహారములందు సమయము వెచ్చించు మనుష్యుడు ధర్మ మాచరింపలేని మాట వాస్తవమే. ఈ దశలో ధర్మము వాస్తవమున నుండనేరదు. అన్నపానములు లేక శరీరము నిలువజాలదు. శరీరము లేకున్న సంధ్యాగ్నిహోత్రాదులు చేయజాలరు. అన్నపానములు జీవికకు లోబడి యుండును. జీవికను విడిచి జపాదులలో నిమగ్నుడెవడును కాజాలడు. అట్లుచేసిన జీవననాశమగును. ధర్మము శుభప్రద మగును కాని, నాశకము కాదు. మానవ సమాజమునకు హితము కలిగింపవలయు ననిన జపతపాదులు జీవికకు విరోధులు

కారాదు. సహాయకములే కావలెను. సంధ్యాగ్నిహోత్రాద్యాచరణ సమయముననే కాక యితర లౌకిక వ్యవహారముల నాచరించునపుడును ధర్మము మూర్తీభవించి కన్నులకు కనిపింపవలెను. అప్పుడే అఖండము, నిర్మలము నగు ధర్మ స్వరూపము ప్రకట మగును.

సంధ్యాగ్నిహోత్రాదులను విధించు శాస్త్రములే మానవునకు వలయు జీవికలను కూడ విధించుచున్నవి. మన్వాది స్మృతులు బ్రాహ్మణునకు అధ్యాపనము, యజ్ఞము చేయించుట, ప్రతిగ్రహము; క్షత్రియునకు ప్రజాపాలనాదులు; వైశ్యునకు గోరక్షణ, వాణిజ్యాదులు; శూద్రునకు కృషి, శ్రమ మున్నగునవి విధించుచున్నవి. స్మృతికర్తల మతమున నానావిధ జీవికోపాయములు కూడ ధర్మమే యగుచున్నవి. అట్లు కాకున్న వాని నేల విధింతురు. హస్త పాదాద్యవయవములు కలిసి శరీర మైనట్లు జపతపాదులు, జీవికయు కలిసి ధర్మ మగుచున్నది. హస్తములు పాదములు కావు. పాదములు హస్తములు కావు. అయినను రెండును మిత్రములే. అన్నియు శరీరాంగములే. వాని కార్యములన్నియు కలిసినపుడు శరీరము రక్షింపబడును. నేత్రాదులను శరీరాంగములుగా నెంచి హస్తపాదాదుల నా శ్రేణినుండి తొలగించిన శరీర స్వరూపము పూర్ణము కాదు.

భేదము, విరోధము రెండును నొక వస్తువు కాదు. నేత్రములు చూచుటకు, చేతులు గ్రహించుటకు నుపయోగించును. రెంటిపనులు భిన్నములే కాని విరుద్ధములు కావు. పరస్పరానుకూలములే యగుచున్నవి. అందువలన నివి యన్నియు శరీర

మున కంగములే. సంధ్యాగ్నిహోత్రములు, జప తపములు, అధ్యాపనము, కృషి, మున్నగు క్రియలు భిన్నములే యయినను నవి పరస్పరము ననుకూలములే. జపతపములు, నధ్యాపనము, క్రయవిక్రయములు, నన్నియు కలిసి మానవ జీవనము నున్నత మొనర్చును. శరీరమునకు హిత మొనర్చును కావున నేత్రాదులు శరీరాంగములు. జపతపాదులు, కృష్యాదులు ధర్మమున కవసరములు. కావున నవి ధర్మాంగములు. వీనిలో నేవి లేకున్నను ధర్మ మఖండము కాదు. స్మృతులు ధర్మముగానే జీవికాదులను స్మరించి యున్నవి. ధర్మస్వరూపము సరిగా నెరుగక జీవికాదులను ధర్మమునుండి వేరుచేసి యవి ధర్మవిరుద్ధము లనుచున్నారు. కణాదమహర్షి ధర్మమును సమస్త జీవనోత్కర్షకు కారణముగ నంగీకరించి యభ్యుదయ మోక్షములకు సాధన మని నుడివియున్నాడు.

"యతోఽభ్యుదయని శ్రేయససిద్ధిః సధర్మః" వై. ద.

ప్రాపంచిక పరమసుఖము లభ్యుదయము. ఆ సుఖములు కేవల మగ్నిహోత్రాదులలో నిరంతర నిమగ్నతవలన లభింపవు. ఉత్కృష్ట లౌకిక సుఖప్రాప్తికి సాధనము జీవిక. బ్రహ్మచర్యము జపతపాదులు జీవిక కనివార్యాంగములు. కేవల జపతపాదులవలన ధనము లభింపదు. ధనప్రాప్తికి యజ్ఞ మాచరింపజేసి దక్షిణ గ్రహింపవలెను. అధ్యయన మొనర్చి వేతనము తీసికొనవలెను. వ్యాపారాదు లొనర్చి లాభము గడింపవలెను. రాజ్య రక్షణార్థము సైనికుడు కావలెను. ఇవి యన్నియు చేయక తప్పదు. ధనసంగ్రహమునకు సాధనములు కావున నివి యన్నియు ధర్మములే.

తఱచుగా జనులు ధర్మ మభ్యుదయనిఃశ్రేయసము లకు కారణ మందురు. స్త్రీ పుత్ర పౌత్ర, పశు, ధనధాన్యా దుల ప్రాప్తి ధర్మపూర్వకముగా నుండవలె నందురు. కాని వా రిట్టి సమయములందు సంధ్యాగ్నిహోత్రాదులనే మన స్సున నుంచుకొందురు. స్నానసంధ్యాదులను ముఖ్యధర్మముగా నెంచువారు వానివలన శరీరాత్మల శుద్ధియే కాక ధనాదుల ప్రాప్తియు కలుగునని చెప్పుదురు. సర్వరోగములు, దుఃఖ ములు, శత్రుభయాదులు నన్నియు వానివలన దూరము లగు ననియు నెంచెదరు. కాని, రెండు మూడు సాధనములే సర్వ ఫలముల నొసంగజాలవు. నేత్రము చూడగలుగును, గంధ మును గ్రహింపజాలదు. జిహ్వ రుచి చూడగలదు, రూపము నెరుగజాలదు.

ఇంద్రియములవలె ధర్మములు ననేకములు. అవి శరీరమునకు, నాత్మకు విభిన్న విధముల సుఖము నొసంగును. ఒక ధర్మాచరణమువలన లభించు సుఖ మన్యాచరణమున లభింపదు. సంధ్యా బ్రహ్మచర్యాదుల వలన నాత్మ పవిత్రము కావచ్చును. రాగద్వేషములు క్షీణము లగును. కాని దప్పిక దూరము కాదు. ఆకలి తీరదు. గాయత్రీ మంత్రజపము కూపనిర్మాణము చేయలేదు. కూలిపని చేసి వ్యాపార మొనర్చి ధనము సంపాదింప వచ్చును; కాని, యగ్నిహోత్రము ధనప్రాప్తిని కలిగింపదు.

ధర్మముద్వారా నైశ్వర్యప్రాప్తి కలుగు నందురు. కాని, కృష్యాదులను ధర్మము కాదందురు. మంత్ర జపా దులు ధర్మమని, ధనసంపాదనకొఱకు రాత్రింబవళ్లు వానిలో

మునిగి తేలుదురు; కాని, యిష్టప్రాప్తి కలుగదు. ఇట్టి తపస్వుల జీవన మంతయు భయంకర దారిద్ర్య కష్టములతో నిండియుండును. అకాల మృత్యువాతం బడుదురు. సంతానము రోగగ్రస్తమై కృశించి పోవును. వారి శిక్షణకు గానీ, చికిత్సకు కానీ ధన ముండదు.

గాయత్రీ మంత్రజప మహిమ మెంతో వర్ణింపబడినది. శాస్త్రములం దెంత శ్రద్ధ యుంచినను గాయత్రీ జప మే ఫలము నీయగలదో యదియే లభించును కాని, యంతకు మించి యేమియు లభింపదు. జపమువలన బుద్ధి నిర్మలమగునేమో కాని తల దాచుకొనుట కొక పూరి యిల్లైన నది నిర్మింపగలుగునా? కాని, గాయత్రీజపమువలన నొక కుటీర మైనను నిర్మింపబడనంత మాత్రమున దాని మహిమ తగ్గిపోదు.

భగవద్భక్తి కెంతో మహిమ చెప్పబడును. భగవంతుడు బ్రహ్మాండ రచయిత. పృథివి, సూర్యచంద్రాదు లతని నియమము నుల్లంఘింపవు. అత డేది కావలె ననిన నది యొసంగగలడు. అతని యనుగ్రహ మున్న కష్టములు సమీపింపవు. వేలాది శత్రువులు శస్త్రాస్త్రములను ధరించియు భక్తుని వెంట్రుకనైన నూడబెరుకజాలరు. భయంకరారణ్యమున క్రూరమృగములు, సముద్రతలమున హింసాకరములగు మకర మత్స్యములు నేవియు భగవంతుని వరదహస్తము తలపై నున్నంతవరకు భక్తునకు కష్టములు కలిగింపజాలవు. భగవంతుని వర్ణింపజాలము. వచనములు లట నసమర్థములగును. కాని, పరమేశ్వరుని మహిమలో నపార శ్రద్ధ

యుంచినమాత్రమున జీవనమున వైభవజ్యోతి ప్రకాశింప నేరదు. పలువురు భక్తులు భక్తిపై నిర్భరులై 'భగవంతుడే మా విషయము నాలోచించును. కావలసిన దేదో యతడే యిచ్చును. మా కష్టముల నతడే దూరమొనర్చు' నని యెంచుదురు. 'ఏకచిత్తులై నన్ను ధ్యానించువారి పాలన పోషణలు నేనే వహింతును' అను గీతావచనము వా రెల్లపుడు స్మరింతురు. కాని గీత జీవిక కవసరమగు కర్మలనుండి మానవులను దూరముగా నుండమనదు.

మానవులు తమతమ స్వభావానుకూలమైన కర్మలను చేయుచు నుండవలెను. కాని, వాని నెన్నడు విడువరాదు. కర్మల నాచరించుచు భగవంతు నుపాసించువారి భారమును భగవంతుడు వహించును. సైనికునకు రాజభక్తి యుండుట యావశ్యము. భక్తుడైనందుకు రాజు వాని నాదరించును. ధన మిచ్చి వానిని పోషించును. కాని కేవల భక్తితో నిది యంతయు జరుగదు. సైనికుడు తాను చేయవలసిన కర్మలను చేయుట ముఖ్యము. దానితోబాటు భక్తియు నవసరము. సైనికుడేకాదు ప్రతి కర్మకర్తయు భక్తియుతుడు కావలసి యుండును. రాజ్యమునందలి కార్యకర్త లందరు భక్తిపూర్వకముగ తన కర్తవ్యములను నెరవేర్చి దాన, మానముల నందుటకు యోగ్యు లగుదురు. లోకవ్యవస్థను మించి భగవద్వ్యవస్థ యుండదు. 'భక్తులు చేయవలసిన దేమియు నుండదు. అంతయు భగవంతుడే చేయును' అను కథ లెన్నియో భక్తులలో వ్యాపించి యున్నవి.

'ఒక లేడి నొక యరణ్యములో నొక వ్యాధుడు పట్టుకొననెంచి యొకవైపున వలపన్ని యుంచినాడు. మరి యొక వంక నగ్నిని ప్రజ్వలింపజేసెను. ఇంకొకవంక పెద్ద ముండ్లకంచె నేర్పరచెను. తా నొక దిశయందు విల్లునమ్ములు తీసికొని దానిని చంప సన్నద్ధుడై యుండెను. లేడి యెటు పోవుటకును దారి లేకుండెను. కాని, భగవంతుడు దానిని రక్షింప నున్నాడు. అకస్మాత్తుగ ప్రబల వేగముతో వాయువు వీవ నారంభించెను. అగ్ని, వాయువశమున వలమీద బడి వల భస్మమై పోయెను. అవకాశము కనిపెట్టి లేడి పారిపోయి తనను రక్షించుకొనెను.'

అప్పుడప్పుడు రైలుదుర్ఘటనలు జరుగుచుండును. ఎందరో చనిపోవుదురు. వారిమధ్య నొక్కొక శిశువు, రెండు మూడేండ్ల వయసుగలది నిరపాయముగ రక్షింపబడును. అట్టి యుదాహరణములను చూచి, చంపువానికంటె రక్షించు వాడు మిక్కిలి బలవంతు డనక తప్పదు.

ఇట్టి యుదాహరణములను మనసులో నుంచుకొని యాపదలనుండి రక్షించుకొనుటకు తగిన యత్న మాచరింప కున్న కలుగు ఫలిత మేమో బుద్ధిమంతులు చెప్పకయే యూహింపగలరు. ఒకటి రెండు ప్రాణు లెటనైన యసంభావిత రూపమున నుపస్థితములగు కారణములద్వారా రక్షింప బడవచ్చును. కాని ప్రపంచమున ననేక స్థలములందు నిరపరాధు లయిన ప్రాణు లెన్నో వధింపబడుచున్నవి. వాని రక్షణ జరుగదు. దుర్ఘటనలలో నొకరిద్దరు బ్రతికినను వందలాది మానవులు రక్తసిక్తులై యెందరో తిన్నగా స్వర్గవాసు లైరి.

అన్ని స్థానములందును భగవంతుని శక్తి యచింతిత రూప ముతో రక్షించునదైన యేదుర్ఘటనలోను ప్రాణినాశము కాకుండవలెను. అప్పుడప్పుడు తలవనితలంపుగా రక్షణ కాశలేనిచోట జరుగు రక్షణ భగవంతుని యలౌకికశక్తికి ద్యోతకము కావచ్చు, కాని యేదో యొక లౌకిక కారణము నుండవలెను. కొండొక భౌతిక కారణము తోడు లేకయే యలౌకిక కారణము పనిచేయజాలదు. భగవంతుడే రక్షకుడైన పాండవులకు యుద్ధము చేయవలసిన యగత్య ముండెడిది కాదు. కౌరవులు స్వయముగానే పరాజితులై యుందురు. ద్రౌపదికి భగవంతునిపై భక్తి తక్కువలేదు. కాని శ్రీకృష్ణుడు రాయబారమునకు వెళ్లినపుడు "భగవన్! కృష్ణ! పాండవులు నిశ్చేష్టులై క్రోధమును విడిచి యూరక చూచు చున్నారు. నేను రక్షణకు నిన్ను ప్రార్థించుచున్నాను. ఇప్పుడు నీవు శత్రువులతో సంధిచేసికొన నేగుదువేని, దుఃశాసనుడు నా కేశములను పట్టి యీడ్చినమాట గుర్తుంచుకొందువుకాక. దుఃశాసనుని భుజము తెగి భూమిపైబడి ధూళిధూసరిత మగు చుండుట చూడకున్న నాకు శాంతి యెట్లు లభించును ?' అని చెప్పినది. ద్రౌపదిమాట యటుంచుడు. శ్రీకృష్ణుడుకూడ స్వయముగ భజనతోనే దుర్యోధనాదుల దురాచారమునకు ప్రతిఫలము లభించు నని యంగీకరింపడు. శ్రీకృష్ణుని మత మున న్యాయరక్షణ కొఱకు నాడు యుద్ధ మపరిహార్య మైనది. కావుననే యుద్ధమువలన బంధునాశము జరుగునని వ్యాకులు డయిన యర్జునునకు 'అర్జున! యుద్ధమునకు నిశ్చ యించి నిలబడు.' అని యుపదేశించెను.

భగవద్భక్తి కారణముగ నవశ్య కర్మలను త్యజించుటకు గీత యంగీకరింపదు. ధర్మము వ్యవహారమున కెంతో దూరమని యెంచి, దాని నన్నపానములు, స్నానసంధ్యలు, జపతపములు వీనివరకే సంకోచింపజేసి యున్నారు. అందువలన కలిగిన మేలు సున్న. వ్యవహారమునుండి దూరముగా నున్నందున ధార్మికులలో కర్మల నొనర్చు సామర్థ్యము తొలగిపోయినది. విషమ మగు కర్మమార్గమును విడిచి నిర్జనారణ్యముల నివసించుట వారి కనివార్య మైనది.

సాంసారికు లయినవారును ధర్మపాలన మవశ్యకమని యెంచి యాలోచించుటయే మానిరి. కావున వ్యవహారము, ధర్మము పరస్పర మెంతో దూరమైనవి. అవి యొండొరులను చూడనైన చూడలేకున్నవి. చివరకు నిత్యకృత్యములైన సంధ్యాగ్నిహోత్రములనుండియు చిత్తోచ్చాటనము జరుగసాగెను. సమస్త ధర్మము మడికట్టుకొనుటతో ముగించినది.

ఇది యంతయు ధర్మమును వ్యవహారమునుండి దూరమొనర్చుటచే గలిగినది. మనుష్యుని జీవనములో నధికభాగము వ్యవహారముతోను, జీవికకృత్యములతోను నిండియున్నది. జీవన వ్యవహారమున ధర్మభావన లేకున్న శుభము కలుగదు. ఏకాంతవాసమో, లేక సన్యాసమో ధర్మరక్షణము కాజాలదు. గృహస్థుడు కూడ ధార్మికుడు కావలసియున్నాడు. వీధులు చిమ్మువానినుండి పెద్ద పెద్ద రాజ్యకార్యముల నెరవేర్చువారివరకు నెల్లరు ధర్మముతో వ్యవహరించిన సముచిత ధర్మప్రతిష్ఠ కలుగును. ఇరువురు మనుష్యు లొకరితో నొకరు వ్యవహరింపవచ్చును. ఇయ్యది

వ్యవహారమునకు లఘుతమ రూపము. సంఖ్య పెరిగిన కొలది వ్యవహారరూపము పెద్ద దగును. రాజ్యరూపమున వ్యవహారమున కొక వ్యవస్థ యేర్పడును. వ్యవస్థిత రాజ్యము వ్యవహారమునకు పూర్ణరూప మనదగును.

రాజ్యమునందలి జను లందరు తమ తమ కర్మలను నిజస్వభావానుసార మొనర్చి సమాజమునకు సుఖము చేకూర్చునంతవరకు రాజ్యము వ్యవస్థితము కాదు. జనులు తమ కర్మలందు నియతులై యుండుట వారికి ధర్మము - స్వధర్మము. వ్యవస్థిత రాజ్యమునం దెల్లరు స్వధర్మ మును పాలించినచో వ్యవహారమునకు, ధర్మమునకు గల యంతరము స్పష్ట మగును. వ్యవహార విశాలరూపము, రాజ్యాకారమున ధర్మమయ మగును. ధర్మముయొక్క ప్రభావవంతమైన యమృతమయరూపము నలుదిశ లందును గోచరము కాగలదు. ఈ రూపమును సాక్షాత్కార మొనర్చుటకు నర్థవ్యవస్థ న్యాయముమీద ప్రతిష్ఠింప జేయుట యావశ్యకము.

ధర్మవ్యవహారము జరుగవలెనని యెల్లరు కోరుదురు. ప్రతివ్యక్తియు సత్యముచెప్పి నిర్వాహణము చేయజూచును. చౌర్యమో, బలాత్కారమో జరిగినదని విని మానవుడు దుఃఖితు డగును. చౌర్యాదులు జరుగకుండునట్టి వ్యవస్థ యుండుట శ్రేయస్కరమని యెల్లరు నందురు. ఒకడు మరి యొకనికి దుఃఖము కలిగింప నెంచడు. ధర్మోపదేశకులు మందిరములలోను, సార్వజనిక సభలలోను నుపదేశింతురు. ధర్మమహిమను వర్ణింతురు. పూర్వకాలమున ధర్మపాలన

చేసి ధనధాన్యములతో సంపన్ను లయినవారి చరిత్రలను వర్ణింతురు. 'ఆకలిగొన్నవాని కన్నమిడి యొకడు మరు జన్మమున కోటీశ్వరు డైనాడు. ఒకానొక రాజు వేలకొలది రోగులకు చికిత్స జేయించినాడు. వస్త్రముల నిచ్చినాడు. సత్యముకొఱకు ప్రాణముల నర్పించినాడు. కొండొక ప్రలోభన మతనిని సత్యమార్గమునుండి తొలగింపజాలక పోయినది.' అని యనేక ఘటనలు వర్ణించి వినిపింతురు. కాని దీనివలన నుత్తమఫల మేమీ చేకూరదు. నేడుకూడ జను లసత్యము లాడుచున్నారు. అంగడికి వెళ్ళి వస్తువును కొను నపుడు వస్తు వెట్టిదో, మూల్య మెంత యెక్కువ తీసికొను చున్నాడో యను భయము వెన్నాడుచుండును. పాలు, నేయి, కూరలు, బొగ్గులు, నూనె, వస్త్రములు, నే వస్తువును విశ్వసించి కొన ననువుకాదు. అమ్మువాడు వీలైనంత యెక్కువ తీసికొనగోరును. కొనువాడు వీలైనంత తక్కువ యీయ నెంచును. ఎవనికి వీలైన వాడు రెండవవాని ధనమును హరింప జూచును. అన్యాయముగ నితరుని ధనమును హరించుట పాపమని యెవరికిని తోచదు. ఈ జన్మములో కాకున్న పరజన్మములో నైన పాపఫల మనుభవింపక తప్పదు. చెడు గని తెలిసియు వ్యాపారి యనృతమాడి వస్తువు నధికమూల్య మున కమ్మును.

ఆకలిగొన్నవానిని, వస్త్రహీనుని జూచి యెల్లరి హృదయమునందును దయ కలుగును. అయినను నతని దుఃఖ మును దూరమొనర్ప సాహసముచేయువా రరుదు. ఎవడేని యితరుల కష్టముల దూరమొనర్ప నెంచినను నతనిని

స్వీయదుఃఖము లాక్రమించును. 'ఇతరుల పొట్ట నేను నింపుదునేని నా పొట్ట నెవడు నింపు' నని యాలోచించును. పొట్టనింపుకొను నాలోచన హృదయమున గలిగి కరుణను నశింపజేయును. హృదయము రాయివలె కఠోర మగును. పగలంతయు పనిచేసినను పొట్టనిండ నన్నము, దేహమునిండ వస్త్రము, శీతోష్ణములనుండి దేహమును రక్షించుకొనుటకు వసతియు లభింపక యేదో యొక విధమున జీవనము నిర్వహించుటకై వ్యాకులు డగును. అట్టివానికి ధర్మోపదేశ మెంత జేసినను నన్యోపాయము లభింపనపుడు ఛలబలముల నాశ్రయించి జీవికను నడుపజూచును. ఇట్లు జీవికకొఱకై కపటము, నన్యాయము, పరపీడనము మున్నగున వన్నియు వ్యవహారమున జేయును.

జీవన మెట్లు జరుగునా యని యాలోచనలో మునిగియుండు సమాజములో దరిద్రుడుకానీ, ధనవంతుడుకానీ ధర్మపాలన చేయజాలడు. రానున్న నాలుగైదు రోజులలో తిండి దొరకునో లేదో యను భయమునకు లోబడి దరిద్రు డనృత మాడును. వ్యాపారములో నెన్నడు మాంద్యమేర్పడునో యను భయమునకు ధనికుడు వశు డగును. తోటి వ్యాపారులను పోటీలో నోడింపగోరును. శ్రామికులకు తగినంత శ్రమఫల మీయ నెంచడు. గ్రాహకులనుండి యధిక మూల్యమును గ్రహింపజూచును. ఇట్లు సమాజమున మత్స్యన్యాయము వర్తించుచున్నది. పెద్దచేప చిన్నచేపను మ్రింగివేయును. ప్రబలవ్యాపారి దుర్బల వ్యాపారిని భక్షింపజూచును.

ఒక వస్త్రవ్యాపారి తన గ్రాహకులకు సుందరములై, త్వరగా చిరిగిపోవని వస్త్రములను తక్కువ మూల్యమున కిచ్చును. కాని, యీ యత్న మంతయు నతడు గ్రాహకుల మేలుకోరి చేయడు. అన్య వ్యాపారుల బేరము సాగనీయ కుండుటకై యత డట్లు చేయును. ఉత్తమ వస్తువు నల్ప మూల్యమునకు గ్రహింప నెల్లరు తనకడకే రావలె నని యతని యుద్దేశము. ఇట్టి వ్యాపార స్పర్ధవలన నెల్లరకు దుఃఖమే కలుగును. పోటీలో నితరులను జయించి యొకడు పెద్ద వ్యాపారి యైనంత నతడు వెంటనే వస్తువుల ధరలను పెంప యత్నించును. జనులు వివశులై యతనినుండియే వస్తువులను కొందురు. ఒక వ్యాపారి మరియొక వ్యాపారిని చెడగొట్టక తన వ్యాపారము జరుగజాలదని యెంచినంత కాల మత డితరులకు హానిని గలిగించుచునే యుండును.

పరిస్థితులు పరపీడన మనివార్య మొనర్చిన సమయ మున సత్యము, అహింస, దయ, శౌచము మున్నగునవి యుద్భవము కాజాలవు.

అరణ్యమున నుండు తోడేలు లేడి మున్నగు సాధు జంతువులను చంపి తిన నారంభించును. దానికి 'నీ ప్రాణ ములు నీకు ప్రియమైనట్లు ఇతర జంతువులకును వాని ప్రాణ ములు ప్రియమే. కావున వానిని చంపకు. నిన్ను మరియొక జంతువు చంపజూచిన నీ కెంత కష్టము కలుగునో యాలో చింపుము.' అని యుపదేశింపవచ్చును. కాని, ఆకలిగొని యున్న తోడే లా యుపదేశమును వినునా! ఆకలిగొన్న

మానవుడు కూడ తోడేలువంటి వా డగును. వా డితరుల దుఃఖముల నాలోచింపడు.

ప్రపంచమును రచియించు నీశ్వరుని నమ్మువాడు తన కర్మల నన్నింటిని భగవంతుడు చూచుచుండు నని యెరుగును. మానవులకు తెలియకుండ తా నేమైన చేయగలడు కాని భగవంతునికి తెలియకుండ తా నేమియు చేయజాల డని వా డెరుగును. భగవంతుడు కర్మల కవశ్యము ఫల మిచ్చును. ఇది యంతయు తెలిసినను నెందరో నానావిధములగు మోసముల నొనర్చి సంపదలను హరించుచుందురు. కారణ మేమి? వారు వివశులు. జీవన నిర్వాహమునకై వా రిట్లు చేయుదురు. పరమాత్మ డనంత శక్తిశాలి యని యెరిగియు, నన్యాయము చేయునపు డతని నశక్తు డని యెంచుదురు. పరమేశ్వరుడు తాను చేయు పనుల కడ్డపడ డనియు, వారి చేతులను పట్టుకొన డనియు వారికి తెలియును. వెంటనే తమ కర్మలకు ఫలము లభింపదనియు గుర్తెరుగుదురు. ఇక కావలసిన దేమి? నిఃశంకులై యితరులకు హాని చేయుదురు.

కొందఱు పరమేశ్వరుడు, జగత్కర్త యొక డున్నాడని యంగీకరింపరు కాని, కర్మఫలములు, జన్మాంతరములు నంగీకరింతురు. ప్రాణులకు శుభాశుభ కర్మలఫల మవశ్యము లభించును. కర్మలు, ఫల మనుభవింప జేయక నశింపవు. జైనులు, బౌద్ధులు, కుమారిలుని యనుచరులు, ప్రభాకరుని శిష్యులు నిట్టి మత మంగీకరింతురు.

జనులు క్రయవిక్రయము లొనర్చునపు డెక్కువ మూల్యమును సంపాదింప జూతురు. బ్రహ్మచర్యము నవలం

బించి, జపతపాదుల నొనర్చుచు, సంధ్యాగ్నిహోత్రాదులను శ్రద్ధతో నాచరించువారుకూడ క్రయవిక్రయములలో పరపీడన మొనర్చుటకు వెనుకంజ వేయరు. అన్యాయము, మోసము, నబద్ధము లేకున్న జీవననిర్వాహ మసంభవ మని యందరు నంగీకరించుచున్నారు. జీవననిర్వాహ మత్యంతము కఠిన మైనపుడు జరుగు దుఃఖదాయక ఘటనలు హృదయవిదార కము లగుచుండును.

సాధారణ జీవననిర్వాహము గల కుటుంబములో నొకడు ప్రబల రోగముచే నాక్రమింపబడినపు డా కుటుంబము లోనివా రందరు వ్యాకులు లగుదురు. రోగికి తగిన చికిత్స చేయింపలేరు. వైద్యుల కీయవలసినంత ధన మియ్యలేరు. మందులు కొనుటకు ధన ముండదు. అసహాయదశలో రోగి మరణించును. డాక్టర్లు, వైద్యులు నీ భయంకరస్థితిని గుర్తించియు నా రోగికి తగిన సహాయము చేయరు. కఠిన హృదయులై యుపేక్షింతురు. వా రట్లు చేయకున్న వారి జీవననిర్వాహ మగుట దుర్ఘట మగును.

ఇ ట్లెందరో ధనాభావమువలన నకాలమృత్యువునకు గురియగుచుండ కొందఱు ధనమును బ్యాంకులలో నిలువ చేయుచున్నారు. వైభవముల ననుభవించుచున్నారు. అవసర మైనపు డొకరి కిద్దరు ముగ్గురు చికిత్సకు లా ధనికుల యిండ్ల పడిగాపులు కాయుదురు. కారులు, విమానములు, సౌధములు, ఆరామములు నన్నియు వారికి స్వాధీనములు. వారి మనోరథము లమోఘము లగుచుండును. అపార ధన సంచయము లున్నను వా రనృతము లాడుటకు, వంచించు

టకు వెనుకాడరు. వెనుకాడినచో వారికి నిత్యము వేలకొలది లాభము లభింపదు.

సమాజమున నిట్లు ధనికులు, నిర్ధనులు నని భేదములేక యెల్లరు పరపీడనము, పరవంచనము మున్నగు దుష్కార్య ములతో మునిగియుండుట చూడ కోట్లాది దరిద్రులలో వ్రేళ్ళమీద లెక్కపెట్టగలిగినంతమంది మాత్రమే మిక్కిలి ధనవంతులై యుండుటకు కారణ మధర్మప్రసార మనక తప్ప కున్నది. ఈ పరిస్థితి తొలగింప వీలుకానిది కాదు. ఈ పాపమునకు పరిహారము లేకపోలేదు. అందులకు తగిన యత్న మవసరము. అది చేయక సమాజమున ధర్మము ప్రతిష్ఠితము కాదు. సుఖసమృద్ధులు పెరుగవు.

కొలదిమంది ధనికులే పరధనమును హరింప ననువుగ సాధనములు చిన్నవి పెద్దవి సంపాదింతురు. వానిద్వారా నిర్ధనులను పీడింతురు. నిర్ధనులు ధనవంతుల నెదుర్కొన జాలరు. పరస్పరము కలహించి యశాంతి నొందుచుందురు. కావున ధనికులద్వారా జరుగు శ్రమహరణ ధనహరణాద్య న్యాయములను ముందుగా నడ్డగింపవలెను.

కొందఱు పెద్దపెద్ద భూస్వాములై రైతులద్వారా వ్యవసాయము చేయించుచుందురు. వారికి శ్రమకు తగినంత ప్రతిఫల మొసంగరు. గ్రాహకులనుండి పంటల కధిక మూల్య మును గ్రహింతురు. ఈ యన్యాయమును నరికట్టక దుఃఖ ములు దూరముకావు.

ధనపతులు, భూస్వాములు, యంత్రస్వాములు ప్రస్తుతమున్న స్థితిలో నున్నంతకాలము సామాన్యజనుల

నిర్వాహమునకు తగిన సంపత్తి వారికి లభింపదు. వారి కష్టములు దూరముకావు. కాబట్టి యుత్పాదన సాధనముల మీద శ్రామికులకు, నుపభోక్తలకు నధికార ముండునట్లు చూడవలసి యున్నది.

ఈ యిరువురికి భూమిపై నధికారము కలిగించి యీ యిరువురిమధ్య ప్రస్తుతమున నాచరణలోనున్న మూలపతు లను తొలగింపవలసి యున్నది.

రాజ్యము లేకున్న వ్యవస్థ యేర్పడజాలదు. అందువలన రాజ్యాధికార మొం డవసర మగుచున్నది. కాని కేవల రాజ్యమే యన్నింటిపై నధికారము కలిగి యుత్పాదనము చేయ నారంభించిన రాజ్యాధికారులు మూలపతు లగుదురు. వారికి నాధునిక మూలపతులకు వలె యంత్రములమీద నధికార ముండకున్నను, నుత్పాదనము, మూల్యనిశ్చయము, శ్రామికులు పనిచేయవలసిన కాలనిర్ణయము, మున్నగు ననేక విషయములలో వారు తమ యిచ్ఛవచ్చినట్లు ప్రవర్తింప బూనుదురు. రాజ్యాధికారులు నిరంకుశముగా శాసనము చేయ నారంభింతురు. మూలపతులు లేకున్నను శ్రామికులకు, నుపభోక్తలకు మరల కష్టములు తప్పవు. ఒకప్పు డవి యెక్కువ కావచ్చును.

కేవల రాజ్యాధికార మన్యాయాదులను తొలగింప జాలదు. నేడు పెట్టుబడిదారి పద్ధతితో పణ్యావస్తువు లుత్పన్న మగు దేశములలో కొన్ని విషయములను రాజ్యమే వ్యవస్థ జేయుచున్నది. అక్కడను జనుల కష్టములకు కొఱంత లేదు.

రాజ్యముతో బాటు శ్రామికులకు, నుపభోక్తలకు నధికారమున్న ప్రతివాడును తమ తమ శ్రమకు తగిన ప్రతిఫలమును బొందుటకు యత్నింతురు. యంత్రములను బాగు చేయుటకు వలయు ధనము వేరుచేసి యుంచ వీలగును. వాని మీద నెల్లరకు సముదితాధికార ముండును. అధికాదాయమును రాజ్యము, నుపభోక్తలు, శ్రామికులు నెల్లరు సమముగా శ్రమము ననుసరించి పంచుకొన వీలగును. శ్రామికులకు నియత కాలమునకు మించి పనిచేయు నవసర ముండదు. శ్రామికుడు తన శ్రమకు తగిన ఫలము, రాజ్యాధికారులు వ్యవస్థ కవసరమగు శిస్తు పొందవచ్చును. పణ్యావస్తువుల నుత్పన్నము చేయుటకయిన ఖర్చునుబట్టి వాని మూల్యమును నిశ్చయింప వీలగును. మూలధనమువలన నధికాధిక లాభమును సంపాదించుటకుగాను శ్రామికునకు తక్కువ వేతనము తీసికొను నవసర మేర్పడదు, ఉపభోక్తలు తమ యావశ్యకతకు తగినంత వస్తూత్పాదనము చేయ వీలగును. కావున పణ్యావస్తువులకు సంబంధించిన కరువు కలుగదు. వ్యర్థసంచయము కూడ జరుగనేరదు. ఉపభోక్తల తరఫున వస్తువులను విక్రయింప ననువుగ దుకాణము లుండును. వ్యాపారులు పరస్పరము పోటీ చేయవలసిన యవసర మేర్పడదు. విక్రేత లుపభోక్తలనుండి యధిక మూల్యమును గ్రహింప నెంచరు. ఇట్లు పరపీడనమున కవకాశము లభింపనందున నెల్లరు సుఖముగ జీవననిర్వాహము చేయగలుగుదురు.

ఈ స్థితిలో మిథ్యావాదు లుండరు. అన్యాయము నశించును. జీవికచింత దూర మగును. కావున జపతపములు, సంధ్యాగ్నిహోత్రములు, భగవద్భజనము, శాస్త్రాధ్యయనము జరుగ నారంభించును. రాజ్యాధికారులు, నితరులు కలిసి వైద్యులకు తగిన వేతనములు, నౌషధముల కుచిత మూల్యము నిర్ణయింతురు. వైద్యులు రోగులను పీడించి ధనసంగ్రహము చేయుటకుగానీ, యౌషధసహాయము లేక వ్యాధిపీడితులైన రోగులు నిరాశతో మరణించుటకానీ సంభవింపదు. ప్రజల స్థితిగతులలో మార్పులు వచ్చును. మానసికశాంతి యేర్పడును. చిత్రకళలు, లలిత కళలు వర్ధిల్లును. విద్వాంసులు నవనవావిష్కారముల నొనర్ప బూనుదురు. దార్శనికు లుత్తమ విచారములను జనులలో వ్యాపింపజేయ గలుగుదురు. వారికి జీవననిర్వాహ చింత యేమియు నుండదు. సుఖసమృద్ధులు దేశమున వర్ధిల్లును. ధర్మాభివృద్ధి కిది చిహ్నము.

ధనము తగిన పరిమాణములో ప్రతివానిచెంత నుండ కున్న భౌతిక సుఖమే లభింపదు; ఆధ్యాత్మిక సుఖమున కవకాశ మెటనుండి కలుగును ? నేడును ధర్మోఘ దేశములు చేయబడుచునే యున్నవి. గుడిగోపురముల కనల్పధనము వెచ్చింపబడుచున్నది. సాధువులు, సత్పురుషులు పూజాపాఠముల నొనర్చుచునేయున్నారు. ధర్మప్రచారమున కనేక సభలు, సంస్థలు నేర్పడి యున్నవి. వార్షికోత్సవములు జరుపబడుచున్నవి. అన్యాయమును, అత్యాచారమును, అనృతమును, నాడంబరమును దొలగింప ననేక యత్నములు జరుగు

చునే యున్నవి. ధనమును మిక్కిలిగ ఖర్చగుచున్నది. అయి నను జనులు ధర్మమును నిత్య వ్యవహారములందు పాలింప కున్నారు. ఉపదేశమందిరముల ప్రతిష్ఠలు, సామూహిక భజ నలు, ధార్మిక పుస్తక ప్రకాశనము నన్నియు ధర్మమునందు జను లకు ప్రవృత్తి కలిగింపకున్నవి. పైపెచ్చు జీవికానిర్వహణ ములో గల సంకటములు మానవులను పెడదారులను బట్టించు చున్నవి. కాబట్టి ధర్మమును నిత్యవ్యవహారములలో చూడ దలచువారు, శాస్త్రానుసారము మానవుల జీవనము పవిత్ర మొనర్ప నెంచువారు, భగవద్భక్తి ద్వారా మనస్సున సుఖ శాంతుల నెలకొల్ప దలచువారును మొదట నత్యాచారులయిన ధనిక వ్యక్తులనుండియు, రాజ్యాధికారుల నుండియు, శ్రామికు లయు, నుపభోక్తలయు సంపత్తులను హరించు సాధనములను స్వాధీనము చేసికొనవలసి యుందురు. అట్లు చేయకున్న ధర్మరక్షణ జరుగుట యసంభవము. శాసకులు మాత్రమే యర్జనసాధనములకు నధికారులయిన వారు మూలపతు లకు మించి జనులను కష్టములపా లొనర్తురు. శాసకుల నిరంకుశాధికారము ప్రజలవాణినే కాదు, జీవనమును కూడ స్వాధీనము చేసికొనును.

ఈ యర్థ ధర్మ మీమాంసకు ఫల మేమన : అన్యాయ రహితమగు నర్థవ్యవస్థ నేర్పరచుటకు శ్రామికుల కుచితవేతన మిచ్చుటయే కాక, జ్ఞానులకు నుచిత జీవికాప్రబంధము చేయవలసి యుండును. శాసనమునకు సంబంధించిన ప్రతి కార్యమునందును జనులకు ప్రభావ యుక్తాధికారము నీయ వలసి యుండును. అందువలన శాసకులు స్వేచ్ఛాచారమును

మానుదురు. ప్రతివారును నన్నపానములకు చెందిన చింతలు లేనివారై సుఖముగా నుందురు. గృహధర్మము మంగళమయ మగును.

పురుషుల యఖండ పత్నీవ్రతము, స్త్రీల పవిత్ర పాతివ్రత్యము మానవ సమాజమున వర్ధిల్లఁగలుగును. భౌతిక సుఖము పరాకాష్ఠ నందింపవచ్చును. ఇందులకై క్రొత్త యార్థిక వ్యవస్థ నేర్పరుపవలెను. శ్రామికుని శ్రమయే కాదు, విచారశీలుడగు విద్వాంసుని జ్ఞానముకూడ బహుమూల్యమగును. శ్రామికులయు, శాసకులయు మాత్రమే కాక యుపభోక్తలయు నధికారము ప్రపంచమున సుస్థిరము కావలయును.

"కాలే వర్షతు పర్జన్యః
పృథివీ సస్యశాలినీ
దేశోఽయం క్షోభరహితః
బ్రాహ్మణాః సంతు నిర్భయాః"

# కఠినపదములు - వాని వివరణము

| పుట. | పంక్తి. | |
|---|---|---|
| 1 | 1 | అర్థము = సంపత్తి, ధనము. |
| ,, | ,, | ధర్మము = శాస్త్రముద్వారా చెప్పబడినకర్మ. |
| ,, | ,, | మీమాంస = విమర్శ. |
| 2 | 1 | అభ్యుదయము = ఇహపరలోకములలో కలుగు ఉన్నతి. |
| ,, | ,, | నిఃశ్రేయసము = మోక్షము. |
| ,, | 13 | ధర్మశాస్త్రములు = మను, యాజ్ఞవల్క్యాది స్మృతులు. |
| 4 | 6 | అపరిహార్యము = తప్పనిసరిగా జరుగునది, తొలగింప వీలు కానిది. |
| ,, | 8 | ఋతానృతము = సత్యాసత్యములతో కూడినది. |
| 6 | 8 | ఉపలబ్ధము = ప్రాప్తము. |
| 7 | 14 | ఆత్మవాదము = పరలోకమునకు వెళ్ళు ఆత్మ నంగీకరించు మతము. |
| ,, | 15 | అనాత్మవాదము = శరీరమునకు వేరుగ చేతనములేదను మతము. |
| 8 | 2 | భూతచేతనవాదము = భూమి, జలము, అగ్ని, వాయువు నను నాలుగు భూతముల రాసాయనిక మేళనమువలన చేతన ముత్పన్నమగునని యంగీకరించు మతము. |
| 10 | 4 | ఐతిహాసిక భౌతికవాదము = భూతములలో కలుగు పరస్పర విరుద్ధ పరిణామములవలన చైతన్యము కలుగునని యంగీకరించు మతము. (మార్క్స్మతము) |
| 11 | 13 | అకాల్పనిక్యము = ఎక్కడను నాచరణలో లేనిది. (Utopia) |
| ,, | | అకాల్పనిక్యవాది = ఎక్కడను నాచరణలో లేనిదాని నంగీకరించువాడు. (Utopian) |

11 17 అకార్యాచిత్క సామ్యవాదము = ప్రపంచమున నాచరణలోలేక యాలోచనా రూపమున నుండు సామ్యము నంగీకరించు మతము.

13 18 దర్శనము = తత్త్వశాస్త్రము.

,, 20 కథాపద్ధతి = మొదట వాదము, తరవాత ప్రతివాదము, మరల వాని సమన్వయము నను రీతితో నాలోచించు పద్ధతి.

14. 3 అతిభూతవాదీయము = మొదట పరీక్షింపకయే యొక వస్తువును గ్రహించి దానిని తర్కనియమములతో పరీక్షించుట.

,, 18 అవాంతరరూపములు = మధ్యలో నేర్పడు రూపములు. (సూక్ష్మ రూపములు).

16 1 అతిభూతవాది = అతిభూతవాదము నంగీకరించువాడు.

17 9 పరమాణువు = పృథివి, జలము, అగ్ని, వాయువు ననువాని యత్యంత సూక్ష్మభాగము.

19. 7 జ్ఞానవాది = ప్రపంచ పదార్థము లన్నియు జ్ఞానమునకు ప్రతిబింబములని యంగీకరించువాడు.

20 8 ప్రకృతివాదము = జడములు, చేతనములు రెండును ప్రకృతి పరిణామములని యంగీకరించుట.

,, 13 ప్రకృతి = ప్రపంచమునకు మూలకారణమైన జడవస్తువు.

25 48 ప్రాతిస్వికము = ప్రతివ్యక్తికి సంబంధించినది.

27 2 జీవుడు = సుఖదుఃఖములు, జ్ఞానము, కోరిక, ప్రయత్నము మున్నగు గుణముల కాశ్రయమైన యభౌతిక పదార్థము.

,, ,, ఈశ్వరుడు = సృష్టికర్తయైన చేతన పదార్థము.

28 8 ధార్మిక విచారములు = ధర్మమునకు చెందిన ఆలోచనలు.

30 20 ఆధ్యాత్మికమద్యము = సారాయము విచారశక్తిని నష్టపరచినట్లు ధర్మముకూడా విచారశక్తి నడ్డగించును; కావున నది యాధ్యాత్మిక మద్య మనబడును.

31 12 విచార స్వాతంత్ర్యము = యుక్తులద్వారా సిద్ధమగునది శాస్త్ర విరుద్ధమైనను నంగీకరించుట.

,, 17 నిత్యము = ఉత్పత్తివినాశములు లేక యెల్లప్పుడు నుండునది.

32 8 స్వాభావిక సంబంధము = అన్యవస్తు నిమిత్తము లేకయే రెండు వస్తువులలో నుండు సంబంధము. ధూమాగ్నుల సంబంధము.

,, 14 నైమిత్తిక సంబంధము = నిమిత్తముద్వారా కలుగు సంబంధము. త్రాటికి కడవకు గల సంబంధము.

,, 18 కార్యము = ఉత్పన్నమై నశించునది.

,, 19 కారణము = కార్యము నుత్పన్నము చేయునది.

33 12 అతిరిక్తమూల్యము = మూలధనముద్వారా లభించు లాభము. (Surplus Value).

33 16 కార్యకారణభావము = కార్యమున్నచోట కారణము తప్పక యుండుట; కారణము లేకున్న కార్యము లేకుండుట; అను నిట్టి సంబంధము.

34 17 అవిచ్ఛేద్యము = వేరుచేయ వీలులేనిది.

36 4 సాపేక్షమూల్యము = అన్యాపేక్షతో నేర్పడు మూల్యము. (Relative Value).

36 ,, నిరపేక్ష మూల్యము = అపేక్షింపని మూల్యము (Absolute Value).

38 1 స్వత్వము = ఒక వస్తువుమీద నొకనికుండు నధికారము.

,, 2 పణ్యము = అమ్మదగిన వస్తువు.

39 13 శాస్త్రైకగమ్యము = శాస్త్రముద్వారా తెలియదగినదై అనుమానముద్వారా తెలియని వస్తువు.

41 5 ఆహవనీయము = యజ్ఞమునకు సంబంధించిన నొక విశేషాగ్ని.

46 6 మనోవేద్యము = మనస్సుద్వారా తెలియదగినది.

49 17 జనకము = కారణము; ఉత్పన్నము చేయునది.

49 19 జన్యము = ఉత్పన్నమగు వస్తువు.
50 16 లోకసిద్ధము = జనుల వ్యవహారముద్వారా నిశ్చితము.
51 శబ్దైకగమ్యము = శబ్దముచేతనే తెలిసికొనదగినది.
53 9 శాస్త్రసిద్ధము = శాస్త్రముద్వారా నిశ్చయింపబడినది.
54 4 జాతి = సామాన్యము, = అనేక వ్యక్తులలో నుండునది; గోత్వము, మనుష్యత్వము మున్నగునవి. వ్యక్తి నశించినను అది నశింపదు.
59 1 మూల్యము = వస్తువును కొన నుపయోగించు సాధనము.
,, 9 వినిమయము = వస్తువుల మారకము.
,, 18 ఉపయోగిత = ప్రయోజనమును సిద్ధింపజేయగలుగుట. సుఖము కలిగించుటకు, దుఃఖము తొలగించుటకు తగియుండుట.
60 13 ఘనీభూతశ్రమ = ఒకచో పిండరూపమున చేర్పడిన శ్రమ.
61 12 అనుయోగి = ఉపమేయము. ముఖము చంద్రునితో సమానమనినపుడు ముఖము అనుయోగి.
,, 13 ప్రతియోగి = ఉపమానము. ముఖము చంద్రునితో సమాన మనినపుడు చంద్రుడు ప్రతియోగి.
65 20 మూర్తశ్రమ = రూపొందిన శ్రమ. శ్రమకు మూర్తి యుండదు. శ్రమచే చేర్పడిన వస్తువులో దాని స్థిరరూపము కనబడుచున్నట్లెంచి మూర్తిమంతముగా నెంచబడినది.
69 19 ధాతుమయమూల్యము = బంగారు, వెండి, రాగి నాణెములు.
71 20 భోగ్యము = అనుభవింపదగిన వస్తువు. అది అమ్మబడదు.
87 3 బీజము = అంకురము నుత్పన్నముచేయు మూలద్రవ్యము.
90 23 విపర్యయము = విరుద్ధరూపము. తలక్రిందు.
96 18 యోని = జాతి.
97 24 ఉపాదాన కారణము = కార్యరూపమును ధరించు కారణము. మట్టి కుండకు ఉపాదాన కారణము.

98 3 నిమిత్తకారణము = కార్యరూపమున మారక కార్యము నుత్పన్నము చేయునది; కుమ్మరి.

,, 7 ప్రయత్నము = క్రియ నుత్పన్నముచేయు నాత్మగుణము.
సాధారణ కారణము = ముఖ్యకారణములకు సహాయకమగు కారణము.

99 3 మూర్తద్రవ్యము = పరిచ్ఛిన్న పరిమాణముగల ద్రవ్యము. పృథివి, జలము మున్నగు వానివలన నేర్పడు వస్తువులు.

103 21 అమూర్తము = మూర్తముకానిది, అపరిచ్ఛిన్నము.

106 22 అద్వైతవాదము = చేతనబ్రహ్మ యొక్కటే సత్యమని చెప్పు మతము.

107 1 మిథ్యా = సత్యముకానిది.

,, 9 పరమార్థము = వాస్తవమున నుండునది.

108 3 త్రైతవాదము = జీవుడు, ఈశ్వరుడు, ప్రకృతి మూడును ప్రపంచమునకు మూలములను మతము.

110 3 ప్రయోజనము = దేనికొరకు మనుజుడు ప్రవృత్తుడగునో ఆ వస్తువు. సుఖదుఃఖములు ముఖ్యప్రయోజనము. ఇతర వస్తువులు సామాన్యప్రయోజనము.

114 3 ద్రవ్యము = గుణములు గల పదార్థము.

,, ,, గుణము = ద్రవ్యములో నుండును. అది కర్మకంటె భిన్నమగు పదార్థము.

,, 18 కర్మ = ద్రవ్యములోనుండి సంయోగ విభాగముల నుత్పన్నము చేయు పదార్థము.

129 16 మహార్ఘత = ప్రియము, ఎక్కువ విలువ.

136 17 ఆరంభకము = వస్తూత్పత్తికి కారణమగు ద్రవ్యము.

143 4 సంస్కారము = కర్మ, జ్ఞానము నను వానివలన నేర్పడిన సూక్ష్మపదార్థము.

| | | |
|---|---|---|
| 145 | 5 | స్వాభావిక సామర్థ్యము = సహజశక్తి. |
| 155 | 3 | సాధ్యము = సాధింపతగినది. |
| ,, | 6 | సాధనము = కొండొక వస్తువును సిద్ధముచేయునది. |
| 167 | 19 | అకృష్టభూమి = దున్నని భూమి. |
| 169 | 9 | సంప్రదానము = ఎవని కొక వస్తువు నిత్తుమో యతడు. |
| 174 | 18 | ఔపచారికము = గౌణము, ముఖ్యముకానిది. |
| 179 | 24 | ఉత్కర్ష = ఆధిక్యము. |
| 185 | 7 | వికారము = మార్పు. |
| 196 | 6 | ధనాంకురము } మూలధనముద్వారా లభించు లాభము. |
| ,, | | అంకురధనము } మూలధనముద్వారా లభించు లాభము. |
| ,, | 10 | వడ్డీవ్యాపారి = వృద్ధిజీవి. |
| 201 | 1 | ముద్రలు = నాణెములు. |
| 209 | 14 | ఉత్తమర్ణుడు = అప్పునిచ్చువాడు. |
| 212 | 8 | అంకుశము = అడ్డు. |
| 213 | 7 | భృతి = కూలి, వేతనము. |
| 218 | 12 | శ్రమసంభూయకరణము = అనేకులు కలిసిచేసిన పరిశ్రమ. |
| ,, | 18 | సముదితశ్రమ = సామూహికరూపమున నేర్పడు శ్రమ. |
| 228 | 2 | రూపాంతరము = మరియొక రూపము. |
| 229 | 15 | పణ్యాంతరము = మరియొక పణ్యము. |
| 233 | 16 | శరీరాంతరము = మరియొక శరీరము. |
| 239 | 24 | సంచితము = కూడబెట్టినది. |
| 243 | 1 | దృష్టము = ప్రత్యక్షముగా కనబడునది. |
| ,, | 2 | అదృష్టము = ప్రత్యక్షముగా కనబడనిది. |
| 265 | 22 | గణము = కలసి వస్తువుల నుత్పన్నముచేసి యనుభవించు స్త్రీపురుషుల సమూహము. |

281 17 అధ్యాత్మవాది - అర్థశాస్త్రము = ఆత్మను, పరలోకమును నంగీకరించి యర్థమును నిరూపించునది.

282 8 గ్రామతక్షుడు = గ్రామాధీనముననుండి పనిచేయు వడ్రంగి

,, 9 కౌటతక్షుడు = స్వతంత్రుడై తనయింటియందుండి పనిచేయు వడ్రంగి.

284 16 చలసంపద = చరాస్తి.

291 4 అసాధారణాధికారము = ఒక వస్తువుమీద నొకనికేయుండు నధికారము.

,, 12 సాధారణాధికారము = ఒకవస్తువుమీద ననేకుల కధికార ముండుట.

293 20 భూమిక = అంతస్థు (Storey)

297 15 సజీవసృష్టి = పశుపక్షి మనుష్యాదుల సృష్టి.

309 19 గమ్యాగమ్యాలు = శాస్త్రము ననుసరించి సంబంధము చేసికొనెడి స్త్రీలు గమ్యాలు, ఇతరులు అగమ్యాలు.

310 4 ప్రాగైతిహాసిక కాలము = చరిత్ర లభింపని పూర్వకాలము.

313 24 అయోనిజులు = మాతాపితల సంబంధములేక జనించువారు.

315 9 అనియంత్రిత యౌనసంబంధము = అన్నాచెల్లెండ్రను అను విచక్షణ లేకయే సంతానార్థము స్త్రీ పురుషుల కలయిక.

319 18 అర్థవాదము = విహితములను స్తుతి, నింద చేయు వాక్యములు.

328 21 పరిహారము = ఉత్తరము - సమాధానము.

330 9 సగోత్ర వివాహము = ఒకేగోత్రమువారు పరస్పరము చేసికొను వివాహము.

,, 10 సపిండ వివాహము = రక్తసంబంధము కలవారు చేసికొను వివాహము.

,, 21 వన్యులు = ఆటవికులు.

336 17 ఉత్సర్పిణి = కాలవిశేషమునకు నామము.

336 18 అవసర్పిణి = జైనగ్రంథములలో చెప్పబడిన కాలవిశేషము.
,, 19 అర = ఆంశికకాలము.
337 1 ఏకాంత సుషమము = కాలవిశేషము.
,, 14 గవ్యూతి = రెండు క్రోసులు.
,, 23 హ్రాసము = తగ్గిపోవుట.
340 16 ధిక్కారము = నిందావాక్యము.
341 15 రూక్షము = చమురులేని.
,, 15 స్నేహము = చమురు.
342 16 వికాసవాదము = ప్రపంచమునకు మూలవస్తువు జడము - దానినుండియే జడచేతనములైన పదార్థములు జనించినవి అను మతము.
348 17 యూథ వివాహము = ఒక సముదాయములోని స్త్రీ పురుషులు అన్యసముదాయములోని స్త్రీ పురుషులను వివాహ మాడుట.
354 15 సామంతుడు = పెద్దరాజులకు లోబడియుండు చిన్నరాజు.
,, 10 ఏకనిష్ఠ వివాహము = ఒక పురుషుడు ఒకే స్త్రీని వివాహ మాడుట.
356 7 సామ్యసంఘము = వికాసవాదము ననుసరించి యాదికాలమున మానవు లజ్ఞానులై సమూహములుగా నుండి వస్తువుల నుత్పన్నము చేసెడివారు - వస్తువులపై నందరకు నధికారముండెడిది. అట్టి సంఘము.
,, 20 సత్రము = యజ్ఞవిశేషము.
358 3 పృష్ఠశమనీయము = ఇష్టి విశేషము.
368 7 నిషేధనియమము = మొదట నొక వస్తువుండును; తరువాత దానికి విరోధికార్య మేర్పడును. మరల నా విరోధికి విరోధి యేర్పడును. ఇట్టి నియమము.

368 22 ప్రాచీన భూతచేతనా వాదము = పృథివి, జలము, అగ్ని, వాయువు నను భూతముల కలయికవలన జ్ఞాన ముత్పన్న మగు నను వాదము. చార్వాక మతము.

369 18 ఆధునిక భూతచేతనా వాదము = ఆధునికులైన పశ్చిమదేశపు విద్వాంసులు చెప్పు వాదము - వారును భూతముల కలయికచే జ్ఞాన ముత్పన్న మగు నందురు.

379 16 సమాజము = నియమముల ననుసరించి వ్యవస్థితమై యుండు మానవ సముదాయము.

393 10 సమజము = పశుసమూహము.

# 'అంబా దర్శన గ్రంథమాల'

## ప్రకాశిత గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1. | వైశేషిక దర్శనము - (అప్రాప్యము) | | |
| 2. | న్యాయదర్శనము | .... | రు. 4—0—0 |
| 3. | యోగదర్శనము | .... | రు. 2—8—0 |
| 4. | సాంఖ్యదర్శనము | .... | రు. 3—0—0 |
| 5. | ఆస్తికవాదము | .... | రు. 4—0—0 |
| 6. | శ్రీమద్దయానంద జీవితము | | రు. 1—12—0 |
| 7. | పంచమహాయజ్ఞ విధి | .... | రు. 0—4—0 |
| 8. | అపశూద్రాధికరణము | .... | రు. 0—3—0 |
| 9. | అర్థ ధర్మ మీమాంస (హింది) | | రు. 3—0—0 |

ప్రాప్యస్థలము :

పుస్తకాధ్యక్షుడు

ఆర్యసమాజము

కూచిపూడి

గుంటూరుజిల్లా

ఆంధ్ర ప్రదేశము